## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000511,2020120004177

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నారాయణపండిత రచిత

# హితోపదేశము

## ప్రథమభాగము

## (మిత్రలాభము, సుహృద్భేదము)

## 1




ఆంధ్రానువాదకులు

శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి



ప్రకాశకులు :

సంస్కృత భాషా ప్రచార సమితి

హైదరాబాదు-500 001.

# తొలిపలుకు

అతిప్రాచీనమైన పంచతంత్రాన్ని అనుకరిస్తూ బయలుదేరిన అనేక నీతి బోధక కథాసంగ్రహ గ్రంథాలలో హితోపదేశం చాలా ప్రధానమైనది. దీన్ని రచించిన నారాయణపండితుడు వంగదేశీయుడు. దీని రచన క్రీ.శ. 1000–1300 సంవత్సరాల మధ్య జరిగి ఉంటుందని విమర్శకుల అభిప్రాయం. చాలా వరకు పంచతంత్రాన్ని అనుకరించినా నారాయణపండితుడు కొన్ని మార్పులు కూడా చేశాడు. పంచతంత్రంలో మిత్రభేదం, మిత్రప్రాప్తికం, కాకోలూకీయం, లబ్ధప్రణాశం, అపరీక్షితకారకం అనే ఐదు విభాగాలుంటే హితోపదేశంలో మిత్ర లాభం, సుహృద్భేదం, విగ్రహం, సంధి అనే నాలుగు విభాగాలున్నాయి. పంచ తంత్రంలోని కొన్ని కథలు విడిచివేసి కొన్ని కొత్త కథలు చేర్చడం జరిగింది. శ్లోకాలు కూడా ఎక్కువ ఉన్నాయి. కామందకనీతిశాస్త్రంనుండి చాలా శ్లోకాలు చేర్చబడ్డాయి. పంచతంత్రం వలెనే ఇది కూడా అతిసులభమైన శైలిలో వ్రాయ బడడంచేత బహుళప్రచారాన్ని పొందినది.

సంస్కృతభాషాప్రచారసమితి ద్వారా 1988-89 సంవత్సరాలలో పంచ తంత్రం ఉత్తమసంస్కృతవిద్వాంసులు శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డిగారి తెలుగు అనువాదంతో ప్రచురించబడింది. ఇప్పుడు వారే రచించిన అనువాదంతో హితోప దేశం మొదటి సంపుటాన్ని ప్రచురిస్తున్నాము. రెండవ సంపుటం కూడా అనతి కాలంలో వెలువడగలదు. ఈ పుస్తకాన్ని ప్రచురించడానికి దయతో ఆర్థిక సాహాయ్యం అందజేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాధికారులకు సమితి పక్షాన కృతజ్ఞత తెలుపుచున్నాను. ఈ సమితికోరికను మన్నించి అనువాదాన్ని అంద జేసిన శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డిగారికి కృతజ్ఞత తెలుపుతూ ఆంధ్రానువాదసహిత మైన ఈ హితోపదేశం తెలుగునాట ఇంటింట నైతికజ్ఞానజ్యోతిని ప్రసరింపచేయ గలదని ఆశిస్తున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు
కులపతి
సంస్కృత భాషా ప్రచారసమితి

హైదరాబాదు,
24-7-1993

# హితోపదేశము

## విషయసూచిక

# హితోపదేశము - మిత్రలాభము

## కథాముఖము

### 1. మఙ్గలాచరణము

శ్లో. సిద్ధిః సాధ్యే సతామస్తు ప్రసాదాత్తస్య ధూర్జటేః,
జాహ్నవీఫేనలేఖేవ యన్మూర్ధ్ని శశినః కలా. 1

తా. శిరమున గంగాతరంగాల నురుగువలె ఉండే చంద్రకళచే శోభిల్లే పరమేశ్వరుని కరుణచే సజ్జనులకు అభీష్టసిద్ధి గల్గుగాక.

### 2. గ్రన్థప్రాశస్త్యము

శ్లో. శ్రుతో హితోపదేశోఽయం పాటవం సంస్కృతోక్తిషు,
వాచాం సర్వత్ర వైచిత్ర్యం నీతి విద్యాం దదాతి చ. 2

తా. ఈ "హితోపదేశం" అనే గ్రంథాన్ని చదివినచో సంస్కృతభాషా సూక్తులందు నేర్పు, అన్నియెడల వాక్కులలోని వైచిత్ర్యం, నీతిజ్ఞానం అలవడును.

[శ్రుతః = అధీతః, గురుముఖతః శ్రావణ ప్రత్యక్షవిషయీకృత ఇతి భావః]

### 3. విద్యాప్రశంస

శ్లో. అజరామరవత్ ప్రాజ్ఞో విద్యామర్థఞ్చ సాధయేత్,
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్. 3

తా. బుద్ధిమంతుడు "ముసలితనం చావు తనకు లేవు" అని తలంచి

ధనాన్ని విద్యను సంపాదించవలెను. ఇక మృత్యువుచే జుట్టుపట్టుబడిన వాడువలె ధర్మమును ఆచరించవలయును.

శ్లో. సర్వద్రవ్యేషు విద్యైవ ద్రవ్యమాహురనుత్తమమ్,
అహార్యత్వాదనర్ఘత్వా దక్షయత్వాచ్చ సర్వదా. 4

తా. అన్ని పదార్థాలలో విద్యయే సాటిలేని ధనం అని విజ్ఞులు అందురు. ఏలననగా- అది అపహరింపబడదు. గృహాదికం వలె అమ్మబడదు. నిత్యం ఇతరులకు ఇచ్చుచుండిననూ తగ్గిపోదు.

శ్లో. సంయోజయతి విద్యైవ నీచగాఽపి నరం సరిత్,
సముద్రమివ దుర్ధర్షం నృపం భాగ్యమతఃపరమ్. 5

తా. పల్లమునకు ప్రవహించే నది, గడ్డి మొదలైన తుచ్ఛ వస్తు సముదాయాన్ని చేరరాని సముద్రమునకు చేర్చునట్లు, కులాదిహీనుని చేరిన విద్యయూ అతనికి దుర్లభ రాజసన్నిధిని చేర్చును. ఆ పైన భాగ్యాన్నిబట్టి ఫలం లభిస్తుంది.

[నీచగా = 1. నీచకులీనుని చేరినది; 2. పల్లానికి ప్రవహించేది]

శ్లో. విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్.
పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మం తతః సుఖమ్. 6

తా. విద్య వినయాన్ని గల్గించును, వినయంచే యోగ్యత నందును, యోగ్యతచే ధనాన్ని పొందును. ధనంచే ధర్మకార్యాలు చేయును. అందుచే ఉభయలోకాలలో సుఖాలు పొందును.

శ్లో. విద్యా శస్త్రస్య శాస్త్రస్య ద్వే విద్యే ప్రతిపత్తయే,
ఆద్యా హాస్యాయ వృద్ధత్వే ద్వితీయాఽఽద్రియతే సదా. 7

తా. శస్త్రవిద్య అని శాస్త్రవిద్య అని రెండు విద్యలు అభీష్టసాధకాలుగా ప్రసిద్ధాలు. ఇందులో మొదటిదైన శస్త్రవిద్య ముసలితనంలో హాస్యకారణంఅగును. శాస్త్రవిద్య మాత్రం సర్వదా ఆదరింపబడును.

శ్లో. యన్నవే భాజనే లగ్నః సంస్కారో నాఽన్యథా భవేత్,
కథాచ్ఛలేన బాలానాం నీతిస్తదిహ కథ్యతే. 8

తా. క్రొత్త పాత్రపైపడిన రేఖాధికం స్థిరంగా ఉండునట్లు నిర్మలచిత్తులైన బాలురు శాశ్వతంగా తమ మనస్సులందు నిలుపుకొనేందుకై కథలు అనే నెపంతో ఇచ్చట నీతి బోధింపబడుచున్నది.

శ్లో. మిత్రలాభః సుహృద్భేదో విగ్రహః సన్ధిరేవ చ,
పఞ్చతన్త్రాత్ తథాఽన్యస్మాద్ గ్రన్థాదాకృష్య లిఖ్యతే. 9

తా. నేను పంచతంత్రంనుండియూ ఇతర గ్రంథాలనుండియు నీతిబోధక కథలను సేకరించి మిత్రలాభం, సుహృద్భేదం మిత్రభేదం విగ్రహం (యుద్ధం) సంధి అనే నాల్గు ప్రకరణములతో కూడిన హితోపదేశం అనే గ్రంథం వ్రాయు చున్నాము.

## 4. కథాముఖము (కథాప్రస్తావన)

గద్య. అస్తి భాగీరథీతీరే పాటలిపుత్రనామధేయం నగరమ్. తత్ర సర్వ స్వామిగుణోపేతః సుదర్శనో నామ నరపతి రాసీత్. స భూపతిరేకదా కేనాపి పఠ్యమానం శ్లోకద్వయం శుశ్రావ-

శ్లో. అనేకసంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శకమ్,
సర్వస్య లోచనం శాస్త్రం యస్య నాస్త్యన్ధ ఏవ సః. 10

శ్లో. యౌవనం ధనసమ్పత్తిః ప్రభుత్వమవివేకితా,
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్. 11

అను. భాగీరథీ తీరమున పాటలిపుత్రం అనే నగరం ఉంది. అందు సుదర్శనుడు అనే రాజు గలడు. అతనికి రాజులకు ఉండదగిన సుగుణాలు అన్నీ గలవు. అతడు ఒకనాడు ఎవడో చదువుచుండగా ఈ క్రింది రెండు శ్లోకాలు విన్నాడు. వాటి భావం-

శాస్త్రం అందరికీ మఱియొక కన్ను వంటిది. ఇది బహువిధ సంశయాలను తొలగిస్తుంది. ఇంద్రియాలకు కనబడనిదానిని కనబడునట్లు చేస్తుంది. ఇది లేనివాడు గ్రుడ్డివాడే. 10

యౌవనం ధనవైభవం రాజ్యాధికారం అవివేకం- అనే ఈ నాల్గింటిలో ఒక్కొక్కటియే ఎంతో అనర్థం గల్గిస్తాయి. ఇక నాలుగు ఉన్నచో ఏమనగలం.

గ. ఇత్యాకర్ణ్యాఽఽత్మనః పుత్రాణా మనధిగతశాస్త్రాణాం నిత్యమున్మార్గగామినాం శాస్త్రాఽననుష్ఠానేనోద్విగ్నమనాః స రాజా చిన్తయామాస-

అను. ఆ రాజా ఇది విన్నాడు- తన పుత్రులు శాస్త్రాన్ని నేర్వకపోవడం నిత్యం చెడుదారిని పయనించడం తలంచాడు. వారి శాస్త్రవిరుద్ధ ప్రవర్తనకు దుఃఖితుడై ఇలా విచారింపసాగాడు-

శ్లో. కోఽర్థః పుత్రేణ జాతేన యో న విద్వాన్ న ధార్మికః,
కాణేన చక్షుషా కిం వా చక్షుఃపీడైవ కేవలమ్. 12

అను. విద్వాంసుడు ధర్మవర్తనుడు కాని పుత్రుడిచే ఏమి ఉపయోగం గలదు? గ్రుడ్డికంటిచే కంటిబాధ తప్ప ఇతర ప్రయోజనము లేదు గదా!

శ్లో. అజాతమృతమూర్ఖాణాం వరమాద్యౌ న చాన్తిమః,
సకృద్దుఃఖకరావాద్యావన్తిమస్తు పదే పదే. 13

అను. పుట్టనివాడు, పుట్టి చచ్చినవాడు, పుట్టి మూర్ఖుడైనవాడు- అనే ముగ్గురు పుత్రులలో మొదటివారు ఇరువురూ కొంతమేలు. ఏలనన- వారు ఒక్కసారియే దుఃఖము గల్గిస్తారు. మూర్ఖపుత్రుడు యావజ్జీవితం అడుగడుగునా దుఃఖం గల్గిస్తాడు.

కిఞ్చ-

శ్లో. వరం గర్భస్రావో వరమపి చ నైవాభిగమనం
వరం జాతః ప్రేతో వరమపి చ కన్యాఽవజనితా,
వరం వన్ధ్యా భార్యా వరమపి చ గర్భేషు వసతిః
న వాఽవిద్వాన్ రూపద్రవిణగణయుక్తోఽపి తనయః 14

అను. మరియూ గర్భస్రావం గల్గడం, ఋతుకాలంలో భార్యను కలియక పోవడం, ఏదోవిధంగా సంతానం గల్గినా అది పుట్టుకతోనే చావడం, కన్యయే పుట్టడం, భార్య గొడ్డురాలు కావడం, సంతానం గర్భంలోనే ఉండడం, ఇవి కొంత మంచివి. రూపధనాది యుక్తుడైనా విద్వాంసుడు కాని పుత్రుడు జనించడం మాత్రం మంచిది కాదు.

శ్లో. స జాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్,
పరివర్తిని సంసారే మృతః కోవా న జాయతే. 15

అను. ఎవని జన్మచే వంశం కీర్తిచే సమున్నతి నందునో వాని జన్మయే ధన్యం. నిత్యం మార్పునొందే ఈ ప్రపంచంలో చచ్చినవారంతా పుట్టుచునే ఉన్నారు.

అన్యచ్చ-

శ్లో. గుణిగణగణనారమ్భే న పతతి కఠినీ ససమ్భ్రమా యస్య,
తేనాఽమ్బా యది సుతినీ వద వన్ధ్యా కీదృశీ భవతి. 16

అను. మరియూ- గుణవంతుల సంఘాన్ని లెక్కింప మొదలుపెట్టినచో, ఎవని పేరు చెప్పగానే చిటికెనవ్రేలు వెంటనే వంగదో- అలాంటి పుత్రుడు ఉన్న తల్లి సైతం పుత్రవతి అయితే లోకంలో గొడ్డురాలు ఎవరు?

అపి చ-

శ్లో. దానే తపసి శౌర్యే చ యస్య న ప్రథితం మనః,
విద్యాయా మర్థలాభే చ మాతురుచ్చార ఏవ సః. 17

అను. ఇంకనూ- ఎవని మనస్సు దానకర్మయందూ, తపశ్చర్యయందూ, పరాక్రమ కార్యమందూ, విద్యను ధనాన్ని సంపాదించుటయందూ, ఉత్సాహయుక్తంగా ఉండదో వాడి జన్మ తల్లివదలిన మలంతో సమానం.

అపరఞ్చ-

శ్లో. వరమేకో గుణీ పుత్రో న చ మూర్ఖశతైరపి,
ఏకశ్చన్ద్రస్తమో హన్తి న చ తారాగణైరపి. 18

అను. మరియూ- గుణవంతుడైన పుత్రుడు ఒక్కడైననూ శ్రేష్ఠం. మూర్ఖులు వందలకొలది ఉండిననూ నిరుపయోగం. చంద్రుడు ఒక్కడే చీకటిని తొలగిస్తున్నాడు. నక్షత్రాలు ఎన్ని ఉండినా ఉపయోగం ఏమీ లేదు.

శ్లో. పుణ్యతీర్థే కృతం యేన తపః క్వాఽప్యతిదుష్కరమ్,
తస్య పుత్రో భవేద్వశ్యః సమృద్ధో ధార్మికః సుధీః. 19

అను. పుణ్యతీర్థమున నెచ్చటనైన కఠోరమైన తపస్సు చేసిన సుకృత చరిత్రునకే విధేయుడూ, ఐశ్వర్యసమృద్ధుడూ, ధర్మవర్తనుడూ, బుద్ధిమంతుడూ అయిన పుత్రుడు జన్మిస్తాడు.

తథా చోక్తమ్-

శ్లో. అర్థాగమో నిత్యమరోగితా చ
ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ,
వశ్యశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా
షడ్ జీవలోకేషు సుఖాని రాజన్. 20

అను. విజ్ఞులు ఇలా అన్నారు-

ఓ రాజా! ఈ ప్రాణిలోకంలో యావజ్జీవితం తగినంత ధనం సమకూరుచుండడం, 2. ఆరోగ్యం 3. ప్రియురాలూ, 4. మధురభాషిణీ అయిన భార్యా, 5. విధేయుడైన పుత్రుడూ, 6. పురుషార్థసాధకమైన విద్య- అనే ఈ ఆరు సుఖదాయకములు.

శ్లో. కో ధన్యో బహుభిః పుత్రైః కుశూలాఽఽపూరణాఽఽఢకైః,
వరమేకః కులాఽఽలమ్బీ యత్ర విశ్రూయతే పితా. 21

అను. పొట్టుచే నింపబడిన ఆఢకములవంటి (ఆఢకం= ముంత తవ్వ వంటి కొలతపాత్ర) పెక్కుురు పుత్రులచే ఏ తండ్రి ధన్యుడైనాడు? వంశాభ్యున్నతికి కారకుడూ తండ్రికి కీర్తిని కల్గించేవాడూ అయిన పుత్రుడు ఒక్కడే శ్రేష్ఠం. (కుశూలం = పొట్టు)

శ్లో. ఋణకర్తా పితా శత్రుః మాతా చ వ్యభిచారిణీ,
భార్యా రూపవతీ శత్రుః పుత్రః శత్రురపణ్డితః. 22

అను. అప్పులు చేసే తండ్రి, జారిణి అయిన తల్లి, బాహ్యసౌందర్య మాత్రమే ఉండే భార్య, విద్వాంసుడు కాని పుత్రుడు ఈ నల్గురు శత్రుసమానులు

శ్లో. యస్య కస్య ప్రసూతోఽపి గుణవాన్ పూజ్యతే నరః,
ధనుర్వంశవిశుద్ధోఽపి నిర్గుణం కిం కరిష్యతి. 23

అను. ఎచ్చట పుట్టినా గుణవంతుడైన మానవుడు గౌరవింపబడును. వంశ విశుద్ధమైనా నిర్గుణమైన ధనుస్సు ఏమీ చేయలేదు.

గుణం = అల్లెత్రాడు, సౌశీల్యం. వంశం = వెదురు, కులం. అలంకారము వ్యతిరేకవిధిని, దృష్టాంతము.

శ్లో. హా హా పుత్రక! నాఽధీతం గతాస్వేతాసు రాత్రిషు,
తేన త్వం విదుషాం మధ్యే పఙ్కే గౌరివ సీదసి. 24

అను. అయ్యో! అయ్యో! ఓ పుత్రా, నీవు గడచిన రాత్రులందు (గడచిన కాలమందు) చదువవైతివి. అందుచే బురదలో దిగబడిన గోవువలె, విద్వాంసుల సభలో చిక్కుపడి విషాద మందుచున్నావు.

గ. తత్ కథ మిదానీమేతే మమ పుత్రా గుణవన్తః క్రియన్తామ్?

శ్లో. ఆహారనిద్రాభయమైథునఞ్చ
సమానమేతత్ పశుభిర్నరాణామ్,
ధర్మో హి తేషా మధికో విశేషో
ధర్మేణ హీనాః పశుభిః సమానాః. 25

అను. అందువలన ఇప్పుడు నా యీ పుత్రులను గుణవంతులుగా ఎలా చేయగలను? ఏలనన-

తినడం, నిద్రించడం, భయపడడం, మైథునం చేయడం అనే ఈ నాలుగు మానవులకూ పశువులకూ సమానగుణాలు. ధర్మమొక్కటియే మానవులలో అధిక గుణం. ధర్మరహితులు పశుతుల్యులు.

యతః

శ్లో. ధర్మార్థకామమోక్షాణాం యస్యైకోఽపి న విద్యతే,
అజాగలస్తనస్యేవ తస్య జన్మ నిరర్థకమ్. 26

అను. ఏలనన- ధర్మం అర్థం కామం మోక్షం - అనే నాల్గుపురుషార్థాలలో ఏ ఒక్కటియూ లేనివాని జన్మ మేకమెడలో వ్రేలాడే చన్నువలె నిష్ఫలం.

యచ్చోచ్యతే-

శ్లో. ఆయుః కర్మ చ విత్తఞ్చ విద్యా నిధనమేవ చ,
పఞ్చైతాన్యపి సృజ్యన్తే గర్భస్థస్యైవ జన్తునః. 27

కిఞ్చ-

శ్లో. అవశ్యంభావినో భావా భవన్తి మహతామపి,
నగ్నత్వం నీలకణ్ఠస్య మహాహిశయనం హరేః. 28

అన్యచ్చ-

శ్లో. యదభావి న తద్భావి భావిచేన్న తదన్యథా,
ఇతి చిన్తావిషఘ్నోఽయమగదః కిం న పీయతే. 29

ఏతత్ కార్యాఽక్షమాణం కేషాఞ్చిదాలస్యవచనమ్.

అను. కొందరు ఇలా అందురు -

ఆయువు, కర్మ, ధనం, విద్య, మరణం అనే ఈ అయిదు గర్భంలో ఉండగానే ప్రాణికి నిశ్చితములు. (27) మరియు - ఎంతటి మహాత్ములకైనా అవశ్యం సంభవింపదగిన సుఖదుఃఖాలు తప్పక సంభవిస్తాయి. పరమేశ్వరుడి దిగంబరత లక్ష్మీనాథుడి సర్పశయనం - ఇందుకు దృష్టాంతాలు. (28)

ఇంకా - ఏది భాగ్యమున లేదో అది సంభవింపదు. ఏది కలదో అది వేఱుగా గాదు - అనే చింతానివారకం అయిన ఈ ఔషధం ఎందుకు పానం చేయరు ? (29)

ఇది (ఇలా పల్కడం) కార్యాన్ని సాధింపజాలని సోమరులు కొందరు నుడివే వాక్కు.

శ్లో. యథా హ్యేకేన చక్రేణ న రథస్య గతిర్భవేత్,
తథా పురుషకారేణ వినా దైవం న సిద్ధ్యతి. 30

అను. ఒక్క చక్రంచే రథం పయనించజాలదు. అలాగే ఎంతటి అదృష్ట యోగం ఉండినన్నూ పురుషప్రయత్నం లేనిచో అది ఫలింపదు.

తథా చ-

శ్లో. పూర్వజన్మకృతం కర్మ తద్దైవమితి కథ్యతే,
తస్మాత్ పురుషకారేణ యత్నం కుర్యాదతన్ద్రితః. 31

అను. అటులనే- పూర్వజన్మలో చేసిన శుభాశుభరూపమైన కర్మయే దైవం లేక అదృష్టం అనబడును. అందుచే సోమరితనం వీడి ఉత్సాహంగా పురుష ప్రయత్నం చేయవలయును.

శ్లో. న దైవమితి సఞ్చిన్త్య త్యజేదుద్యోగమాత్మనః,
అనుద్యోగేన తైలాని తిలేభ్యో నాప్తుమర్హతి. 32

అను. దైవం అని తలంచి తన ప్రయత్నం విడువరాదు. ప్రయత్నం చేయనిచో తిలలనుండి తైలం లభింపదు.

అన్యచ్చ-

శ్లో. ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః
దైవేన దేయమితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః. 33

అను. మరియూ - ప్రయత్నశీలుడైన పురుషశ్రేష్ఠున్ని సంపద స్వయంగా వరిస్తుంది. సోమరులైనవారు (కాపురుషులు) దైవంచే - అదృష్టంచే లభిస్తుంది - అని అందురు. కాని దైవం (భాగ్యం) అనే మాటను లక్ష్యంచేయక యథాశక్తి యత్నింపుము. ప్రయత్నించినా కార్యసిద్ధి గల్గనిచో అందు నీ దోషం ఏముంది.

శ్లో. యథా మృత్పిణ్డతః కర్తా కురుతే యద్యదిచ్ఛతి,
ఏవమాత్మకృతం కర్మ మానవః ప్రతిపద్యతే. 34

అను. ఎలా కుమ్మరివాడు మట్టిముద్దవలన కోరిన వస్తువును తయారు చేయగల్గుచున్నాడో అలాగే మానవుడు ప్రయత్నానురూపంగా ఫలితం పొందును.

అపరఞ్చ-

శ్లో. కాకతాలీయవత్ ప్రాప్తం దృష్ట్వాఽపి నిధిమగ్రతః,
న స్వయం దైవమాదత్తే పురుషార్థమపేక్షతే. 35

అను. మరియూ - కాకతాలీయంగా ధననిధి ఎదురుగా కనబడిననూ పురుషప్రయత్నం లేనిచో దైవం (అదృష్టం) తెచ్చి స్వయంగా చేతిలో ఉంచదు.

**గమనిక :-** కాకి తాటిచెట్టుపై వ్రాలినది. ఆ క్షణమందే తాటిపండు పడినది. ఈ రెండు పనులు యాదృచ్ఛికంగా జరిగినవి. ఇలా అతర్కితోపనతములందు కాకతాలీయం - అజాకృపాణీయం ఇత్యాదిన్యాయములను శాస్త్రజ్ఞులు వాడుదురు.

శ్లో. ఉద్యమేన హి సిద్ధ్యన్తి కార్యాణి న మనోరథైః,
న హి సుప్తస్య సింహస్య ప్రవిశన్తి ముఖే మృగాః. 36

అను. ప్రయత్నంచే పనులు సిద్ధిస్తాయి. కోరికలచే గాదు. నిద్రించే సింహంయొక్క నోటిలోనికి మృగాలు స్వయంగావచ్చి చొరబడవు.

తథా చోక్తమ్-

శ్లో. మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః,
న శోభతే సభామధ్యే హంసమధ్యే బకో యథా. 37

అను. అటులనే విజ్ఞులచే తెలుపబడినది - బాలుని చదివించని తల్లిదండ్రులు శత్రువులు అనబడుదురు. ఆ బాలుడు హంసలనడుమ కొంగవలె పండితసభయందు విరాజిల్లడు.

శ్లో. రూపయౌవనసమ్పన్నా విశాలకులసమ్భవాః,
విద్యాహీనా న శోభన్తే నిర్గన్ధా ఇవ కింశుకాః. 38

అను. సౌందర్యం, యవ్వనం, సత్కులీనత గల్గిఉండిననూ విద్యలేనివారు పరిమళం లేని మోదుగుపూలవలె ఆదరింపబడరు.

అపరఞ్చ-

శ్లో. పుస్తకేషు చ నాఽధీతం నాఽధీతం గురుసన్నిధౌ,
న శోభతే సభామధ్యే జారగర్భ ఇవ స్త్రియాః.

అను. యథాశక్తి స్వయంగా గానీ లేక గురుసన్నిధిని గానీ శాస్త్రాధ్య యనం చేయనివాడు తరుణియొక్క జారగర్భంవలె సభాస్థలిని గౌరవం పొందడు. [జారగర్భః = జారాత్ సంజాతః గర్భః - మధ్యమపదలోపిసమాసః]

గ. ఎతచ్చిన్తయిత్వా రాజా పణ్డితసభాం కారితవాన్. రాజోవాచ-"భో భోః పణ్డితాః శ్రూయతాం మమ వచనమ్ - అస్తి కశ్చిదేవమ్భూతో విద్వాన్, యో మమ పుత్రాణాం నిత్యమున్మార్గగామినాం అనధిగత శాస్త్రాణాం ఇదానీం నీతి శాస్త్రోపదేశేన పునర్జన్మ కారయితుం సమర్థః.

అను. ఇలా తలంచి సుదర్శనుడు అనే ఆ ప్రభువు పండితులను సమా వేశ పరచాడు. ఇలా విన్నవించాడు- ఓ పండితులారా ! నా విన్నపం వినండి. నా పుత్రులు శాస్త్రజ్ఞానం లేనందున నిత్యం చెడుదారిని చరిస్తున్నారు. ఇప్పుడు వీరికి నీతిశాస్త్రాన్ని ఉపదేశించి పునర్జన్మ గల్గించే సమర్థుడైన పండితుడు ఎవ రైనా ఉన్నారా.

యతః-

శ్లో. కాచః కాఞ్చనసంసర్గాద్ ధత్తే మారకతీర్ద్యుతీః,
తథా సత్సన్నిధానేన మూర్ఖో యాతి ప్రవీణతామ్. 40

ఉక్తఞ్చ-

శ్లో. హీయతే హి మతిస్తాత హీనైః సహ సమాగమాత్,
సమైశ్చ సమతామేతి విశిష్టైశ్చ విశిష్టతామ్. 41

అను. ఏలనన- గాజుముక్క బంగారంతో సంబంధంచే మరకతమణి కాంతిని పొందుచున్నది. అలాగే మూర్ఖుడు సజ్జనస్నేహంచే నేర్పరి అగును. విజ్ఞులు ఇలా అన్నారు-

"ఓ తండ్రీ, నీచస్నేహంచే బుద్ధి నీచగుణాలను, సమానుల స్నేహంచే సమానగుణాలను- శ్రేష్ఠులస్నేహంచే శ్రేష్ఠమైన గుణాలను పొందుచున్నది."

గ. అత్రాన్తరే విష్ణుశర్మా నామ మహాపణ్డితః సకలనీతిశాస్త్రతత్త్వజ్ఞో బృహ స్పతిరివాఽబ్రవీత్- 'దేవ ! మహాకులసమ్భూతా ఏతే రాజపుత్రాః తన్మయా నీతిం గ్రాహయితుం శక్యన్తే.

యతః-

శ్లో. నాఽద్రవ్యే నిహితా కాచిత్ క్రియా ఫలవతీ భవేత్,
న వ్యాపారశతేనాఽపి శుకవత్ పాఠ్యతే బకః. 42

అను. ఏలననగా- అయోగ్యవస్తువుయెడ చేసిన క్రియ ఎంత ప్రయత్నవంతమైననూ ఫలవంతం గానేరదు. ఎన్ని ప్రయత్నాలు చేసిననూ కొంగను చిలుకవలె పలికింప వీలుగాదు గదా.

అన్యచ్చ -

శ్లో. అస్మింస్తు నిర్గుణం గోత్రే నాఽపత్యముపజాయతే,
ఆకరే పద్మరాగాణాం జన్మ కాచమణేః కుతః. 43

అను. మరియూ- ఈ రాజవంశమున గుణహీనమైన సంతానం జనింపదు. పద్మరాగమణులగనిలో గాజుముక్కలు ఏల పుట్టును?

గ. అతోఽహం షణ్మాసాఽభ్యన్తరే భవత్పుత్రాన్ నీతిశాస్త్రాఽభిజ్ఞాన్ కరిష్యామి. రాజా సవినయం పునరువాచ-

శ్లో. కీటోఽపి సుమనఃసఙ్గాదారోహతి సతాం శిరః,
అశ్మాఽపి యాతి దేవత్వం మహద్భిః సుప్రతిష్ఠితః. 44

అను. కనుక నేను ఆరునెలలలోగా తమ పుత్రులను నీతిశాస్త్రంలో విద్వాంసులను చేసెదను.

ఆది విని సుదర్శనమహారాజు మరల వినయంగా ఇలా పల్కాడు-

పురుగుసైతం పుష్పసంబంధంవల్ల సజ్జనుల శిరస్సును ఆరోహించుచున్నది. ఱాయియూ మహాత్ములచే ప్రతిష్ఠితమై దేవత్వం పొందుచున్నది.

అన్యచ్చ -

శ్లో యథోదయగిరేర్ద్రవ్యం సన్నికర్షేణ దీప్యతే,
తథా సత్సన్నిధానేన హీనవర్ణోఽపి దీప్యతే.

అను. మరియూ- స్వయంగా కాంతిహీనములైన శిలలు మొదలైన వస్తువులు ఉదయపర్వతసంబంధంచే ప్రకాశించునట్లు గుణహీనుడు అయినవాడుసైతం సజ్జనసన్నిధానంచే విరాజిల్లును.

శ్లో. గుణా గుణజ్ఞేషు గుణా భవన్తి
తే నిర్గుణం ప్రాప్య భవన్తి దోషాః,
ఆస్వాద్యతోయాః ప్రవహన్తి నద్యః
సముద్రమాసాద్య భవన్త్యపేయాః. 46

గ. తదేతేషామస్మత్పుత్రాణాం నీతిశాస్త్రోపదేశాయ భవన్తః ప్రమాణమ్- ఇత్యుక్త్వా తస్య విష్ణుశర్మణః కరే బహుమాన పురస్సరం పుత్రాన్ సమర్పితవాన్.

అను. సత్యాదిసద్గుణాలు గుణజ్ఞులయందే సద్గుణాలై భాసిల్లును. గుణహీనుడియెడ అవి దోషములు అగుచున్నవి. ఎట్లనగా తియ్యని నీటితో ప్రవహించే నదులు సముద్రాన్ని చేరగనే త్రాగడానికి పనికిరాని నీరుగలవి అగుచున్నాయి.

కనుక ఈ నా పుత్రులకు నీతిశాస్త్రం ఉపదేశించడానికి తామే సమర్థులు. ఇలా పల్కి- ఆ విష్ణుశర్మచేతికి పుత్రులను బహుమానపూర్వకంగా సమర్పించాడు.

## అథ మిత్రలాభప్రస్తావః

గ. అథ ప్రాసాదపృష్ఠే సుఖోపవిష్టానాం రాజపుత్రాణాం పురస్తాత్ ప్రస్తావక్రమేణ స పణ్డితోఽబ్రవీత్- 'భో రాజపుత్రాః శృణుత-

శ్లో. కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతామ్,
వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన చ. 1

గ. తద్భవతాం వినోదాయ కాకకూర్మాదీనాం విచిత్రాం కథాం కథయిష్యామి

అను. అంత ఒకనాడు రాజభవనానికి పైభాగమున సుఖంగా రాజపుత్రుల యెదుట సందర్భవశమున ఆ పండితుడు ఇలా అన్నాడు- 'ఓ రాజపుత్రులారా ! వినుడు-

బుద్ధిమంతులు కావ్యాలను శాస్త్రాలను చర్చించడం అనే వినోదంచే కాలాన్ని గడుపుదురు- మూర్ఖులు నిద్రతో తగవులాడడంతో మద్యపానాదివ్యసనంతో గడుపుదురు. 1

అందుచే ఆనందం గల్గించేందుకై కాకి తాబేలు మొదలైన వాటియొక్క విచిత్రమైన కథను దెల్పెదను.

గ. రాజపుత్రైరుక్తమ్- 'ఆర్య! కథ్యతామ్'ఇతి. విష్ణుశర్మోవాచ-' శృణుత యూయమ్, సమ్ప్రతి మిత్రలాభః ప్రస్తూయతే, యస్యాఽయమాద్యః శ్లోకః-

శ్లో. అసాధనా విత్తహీనా బుద్ధిమన్తః సుహృత్తమాః,
సాధయన్త్యాశు కార్యాణి కాకకూర్మమృగాఽఽఖువత్. 2

అను. రాజపుత్రులు అన్నారు- 'ఆర్యా ! తెలుపండి' విష్ణుశర్మ ఇలా చెప్పాడు- మీరు వినండి. ఇప్పుడు మిత్రలాభం ఆరంభిస్తున్నాను. దానికి ఇది మొదటి శ్లోకం.

సాధనశూన్యులు ధనహీనులు అయినవారైనా బుద్ధిబలం గలవారై మైత్రితో ప్రవర్తిస్తే, కాకి, తాబేలు, జింక, ఎలుక అనే నాల్గింటివలె కార్యాలను శీఘ్రంగా సాధిస్తారు.

గ. రాజపుత్రా ఊచుః- 'కథమేతత్' సోఽబ్రవీత్-

అను. రాజపుత్రులు అడిగారు- ఆ కథను తెలుపండి. అతడు (విష్ణుశర్మ) ఇలా చెప్ప నారంభించాడు.

## 1. చిత్రగ్రీవవృత్తాన్తః

గ. అస్తి గోదావరీతీరే విశాలః శాల్మలీతరుః. తత్ర నానాదిగ్దేశాదాగత్య రాత్రౌ పక్షిణో నివసన్తి ! అథ కదాచిద్ అవసన్నాయాం రాత్రావస్తాఽచలచూడా ఽవలమ్బిని భగవతి కుముదినీనాయకే చన్ద్రమసి లఘుపతనకనామా వాయసః ప్రబుద్ధః కృతాన్తమివ ద్వితీయమటన్తం పాశహస్తం వ్యాధమపశ్యత్. తమాలోక్యాఽచిన్తయత్- 'అద్య ప్రాతరేవాఽనిష్టదర్శనం జాతమ్ । న జానే కిమనభిమతం దర్శయిష్యతి' ఇత్యుక్త్వా తదనుసరణ క్రమేణ వ్యాకులశ్చలితః.

అను. గోదావరీతీరమున పెద్ద బూరుగుబెట్టు కలదు. నలుదిక్కులనుండి పక్షులు వచ్చి ఆ చెట్టుపై రాత్రివేళ నివసించేవి. అంత తెల్లవారుచున్నది. భగవానుడూ కలువలఱేడూ అయిన చంద్రుడు పడమటికొండను చేరాడు. అప్పుడు లఘుపతనకుడు అనే కాకి నిద్రనుండి మేల్కొనింది. ఒక వేటకానిని చూచింది. వాడిచేతిలో వల ఉంది. మఱియొక యముడో అనునట్లు అచ్చట తిరుగాడుచున్నాడు. వాడిని చూచి లఘుపతనకుడు ఇలా తలంచాడు- 'నేడు వేకువనే అప్రియదర్శనం సంభవించింది. ఏ కీడును చూపునో ఎరుగజాలను'. ఇలా తలంచి విచారంతో ఆ వేటకాణ్ణి వెంబడిస్తూ పోయాడు.

యతః -

శ్లో. శోకస్థానసహస్రాణి భయస్థానశతాని చ,
దివసే దివసే మూఢమావిశన్తి న పణ్డితమ్. 3

గ. అన్యచ్చ; విషయిణా మిదమవశ్యం కర్తవ్యమ్.

శ్లో. ఉత్థాయోత్థాయ బోద్ధవ్యం మహద్భయముపస్థితమ్,
మరణ-వ్యాధి-శోకానాం కిమద్య నిపతిష్యతి. 4

అను. ఏలనన- మూర్ఖునికి ప్రతిదినం వేలకొలది దుఃఖాలు వందలకొలది భయాలు గల్గుచుండును. పండితుడికి గల్గవు. (3) మరియూ - విషయలంపటులు

దీన్ని తప్పక చేయాలి. ఏమన- వేకువన నిద్ర లేవగనే, మరణం-వ్యాధి-దుఃఖం అనే ఈ మూడింటిలో ఏ మహాభయం నేడు దాపురించి మీదపడునో అనేది గ్రహించాలి. (నివారణమార్గం అన్వేషించాలి).

గ. అథ తేన వ్యాధేన తణ్డులకణాన్ వికీర్య జాలం విస్తీర్ణమ్. స చ తత్ర ప్రచ్ఛన్నో భూత్వా స్థితః. అస్మిన్నేవ కాలే చిత్రగ్రీవనామా కపోతరాజః సపరివారో వియతి విసర్పంస్తాం స్తణ్డులకణానాలోకయామాస. తతః కపోతరాజ స్తణ్డులకణలుబ్ధాన్ కపోతాన్ ప్రాహ - కుతోఽత్ర నిర్జనే వనే తణ్డులకణానాం సమ్భవః? తన్నిరూప్యతాం తావత్. భద్రమిదం న పశ్యామి, ప్రాయేణాఽనేన తణ్డుల కణలోభేనాఽస్మాభిరపి తథా భవితవ్యమ్.

శ్లో. కఙ్కణస్య తు లోభేన మగ్నః పఙ్కే సుదుస్తరే,
వృద్ధవ్యాఘ్రేణ సమ్ప్రాప్తః పథికః స మృతో యథా. 5

గ. కపోతా ఊచుః - కథమేతత్ ? సోఽబ్రవీత్

అను. పిమ్మట ఆవేటకాడు బియ్యపునూకలు చల్లాడు. వాటిపై వలను పఱిచాడు. దాపున ఒకచోట దాగి కూర్చున్నాడు. అంతలో చిత్రగ్రీవుడు అనే పావురముల ఱేడు పరివారసమేతంగా ఆకసమున పోవుచూ ఆ బియ్యపునూకలను చూచాడు. ఆ నూకలపై ఆశగొన్న తోటి పావురములను గాంచాడు. వాటితో ఇలా అన్నాడు. 'ఈ జనశూన్యమైన అడవిలో ఈ తండులకణాలు ఎలా సంభవిస్తాయి. వీటిని తినగోరడం శుభంగా తలంపను. ఈ తండులకణలోభంచే సామాన్యంగా మనమును అలా [కంకణలోభంచే మృతుడైన పాంథునివలె] అగుదుము.

'ఒక బాటసారి సువర్ణకంకణంమీది ఆశచే సుదుస్తరమైన చిక్కులోపడ్డాడు. ముసలిపులిచే ఆక్రాంతుడై మరణించాడు", పావురాలు అడిగాయి-అది ఎట్లు? చిత్రగ్రీవుడు ఆ కథను ఇలా వక్కాణించాడు.

## 2 కఙ్కణలుబ్ధపాన్థకథా

గ. అహమేకదా దక్షిణాఽరణ్యే చరన్నపశ్యమ్. ఏకో వృద్ధో వ్యాఘ్రః స్నాతః కుశహస్తః సరస్తీరే బ్రూతే - 'భోః భోః పాన్థాః ఇదం సువర్ణకఙ్కణం గృహ్యతాం

తామ్ ఇతి. తతో లోభాఽఽవిష్టేన కేనచిత్ పాన్థేన ఆలోచితమ్- "భాగ్యేనై తత్ సమ్భవతి. కి న్త్వస్మిన్నాత్మసన్దేహే ప్రవృత్తిర్న విధేయా.

యతః-

శ్లో. అనిష్టాదిష్టలాభేఽపి న గతిర్జాయతే శుభా,
యత్రాఽఽస్తే విషసంసర్గోఽమృతం తదపి మృత్యవే." 6

# 2. కంకణలుబ్ధుడైన బాటసారి కథ

(ముసలిపులి - బాటసారి కథ)

అను. నేను ఒకప్పుడు దక్షిణారణ్యమున (దండకారణ్యంలో) ఒక చెఱువు ఒడ్డున ఒక ముసలి పెద్దపులిని చూచాను. అది స్నానం చేసి చేతిలో దర్భలు పట్టుకొని ఉంది. బాటసారులతో ఇలా చెప్పసాగింది- 'ఓ ఓ బాటసారులారా ! ఈ బంగారుకంకణం గ్రహించండి.' ఆ మాటలు ఒక బాటసారి విన్నాడు. ఆశచే ఆకర్షితుడు అయ్యాడు. ఇలా తలంచాడు- 'అదృష్టంచే ఇది సంభవించింది. అయినా ప్రాణాపాయ కరమైన ఇలాంటి కార్యంలో సాహసప్రవృత్తి చేయరాదు. ఏలనన-

అనిష్టపదార్థంవలన ఇష్టవస్తువు లభించేటట్లు ఉండిననూ దానికై ప్రవర్తించడం శుభంగాదు- అమృతం విషసంబంధంగలది అయినచో మరణహేతువు అగును గదా!

గ. కిన్తు సర్వత్రాఽర్థాఽర్జనప్రవృత్తౌ సన్దేహ ఏవ తథా చోక్తమ్-

శ్లో. న సంశయమనారుహ్య నరో భద్రాణి పశ్యతి,
సంశయం పునరారుహ్య యది జీవతి పశ్యతి. 7

తన్నిరూపయామి తావత్. ప్రకాశం బ్రూతే- 'కుత్ర తవ కఙ్కణమ్?' ఇతి. వ్యాఘ్రో హస్తం ప్రసార్య దర్శయతి. పాన్థోఽవదత్- 'కథం మారాత్మకే త్వయి విశ్వాసః' ఇతి-

అను. కాని అంతటా ధనసంపాదనప్రయత్నంలో అశుభమైన సందేహం గల్గుచూనే ఉండును. విజ్ఞులు ఇలా అన్నారు-

"మానవుడు కార్యప్రవృత్తిలో సంశయం పొందక శుభములను గాంచలేడు. ఆత్మనాశకమైన సంశయం పొంది దాన్ని తొలగించుకొని జీవించినచో కార్యసిద్ధి అనే శుభం చూడగలడు." 7

అందుచే మొదట కంకణం ఉన్నదీ లేనిదీ నిర్ణయం చేస్తాను. ఇలా తలంచి పులితో ఇలా అన్నాడు-"ఓయీ! నీ కంకణం ఎచ్చట?"(దాన్ని చూపుము). అంత పులి చేతిని చాపి కంకణం చూపింది. అంత బాటసారి ఇలా పల్కాడు- మృత్యురూపమైన నిన్ను నమ్మడం ఎట్లు?

గ. వ్యాఘ్ర ఉవాచ- "శృణు రే పాన్థ! ప్రాగేవ యౌవనదశాయాం మహమతీవ దుర్వృత్త ఆసమ్। అనేకగోమానుషాణాం వధాన్మే పుత్రా మృతా దారాశ్చ. వంశహీనశ్చాహమ్। తతః కేనచిద్ధార్మికేణాఽహముపదిష్టః-"దానధర్మాదికం చరతు భవాన్" ఇతి. తదుపదేశాదిదానీమహం స్నానశీలో దాతా వృద్ధో గలిత-నఖ-దన్తో న కథం విశ్వాసభూమిః.

అను. పెద్దపులి ఇలా అంది- "ఓయీ! బాటసారీ! వినుము. నేను మొదట యవ్వనంలో మిక్కిలి దుష్టతను. గోవులను మనుష్యులను అధికంగా వధించాను. (ఆ పాపఫలంగా) భార్యయు పుత్రులూ మరణించారు. కులనాశంచే మోడుగా మిగిలాను. అంత ఒకానొక ధర్మవర్తనుడు నాకు ఇలా ఉపదేశించాడు- 'ఓయీ! దానధర్మాదులైన సత్కార్యాలు ఆచరింపుము. అతడి ఉపదేశాన్ని అనుసరించి నేను ప్రస్తుతం వేకువనే స్నానసంధ్యాదులు నిర్వహిస్తాను. ఉన్నంతలో ఏదో ఒకటి దానం చేస్తాను. ముసలివాడను అయ్యాను, గోళ్లు ఊడిపోయాయి. పండ్లు రాలిపోయాయి. ఇట్టి నన్ను ఎందుకు నమ్మరాదు?

గ. ఉక్తఞ్చ-

శ్లో. ఇజ్యాఽధ్యయనదానాని తపః సత్యం ధృతిః క్షమా,
అలోభ ఇతి మార్గోఽయం ధర్మస్యాఽష్టవిధః స్మృతః. 8

శ్లో. తత్ర పూర్వచతుర్వర్గో దమ్భార్థమపి సేవ్యతే,
ఉత్తరస్తు చతుర్వర్గో మహాత్మన్యేవ తిష్ఠతి. 9

అను. శాస్త్రములందు ఇలా చెప్పబడినది- "1) యజ్ఞం 2) వేదాదులఅధ్యయనం, 3) దానం, 4) తపస్సు, 5) సత్యం, 6) ధృతి (ఇంద్రియనిగ్రహం) 7) సహనం, 8) లోభరాహిత్యం- ఇట్లు ధర్మం ఎనిమిది విధాలుగా ఉంది." (8)

"వీటిలో మొదటి నాల్గింటిని, అనగా- యజ్ఞం, అధ్యయనం, దానం, తపస్సు అనేవాటిని కొందరు కీర్తిప్రతిష్ఠాదులను ఆశించి డాంబికంగా చేస్తారు. రెండవ భాగంలోని నాల్గింటిని అనగా- సత్యం, ఇంద్రియనిగ్రహం, శాంతి, అలోభం అనే వాటిని మహాత్ములు మాత్రమే ఆచరింపగలరు." 9

గ. మమ చైతావాన్ లోభవిరహః, యేన స్వహస్తస్థమపి సువర్ణ కఙ్కణం యస్మైకస్మైచి ద్దాతుమిచ్ఛామి. తథాపి "వ్యాఘ్రో మానుషం ఖాదతి"- ఇతి లోకాఽపవాదో దుర్నివారః యతః-

శ్లో. గతానుగతికో లోకః కుట్టనీముపదేశినీమ్,
ప్రమాణయతి నో ధర్మే యథా గోఘ్నమపి ద్విజమ్. 10

అను. నేను ఎంత లోభశూన్యుడనో గుర్తింపుము. చేతిలో ఉండే బంగారు కంకణాన్ని సైతం ఎవరికో ఒకరికి దానం చేయదలచాను. అయినా- 'పులి మనుష్యున్ని భక్షిస్తుంది'- అనే లోకనింద మాత్రం నివారింపరానిదై ఉంది. ఏలననగా-

"లోకులు ఒకరు పోయినదారినే పోదురు. (స్వయంగా ఆలోచింపరు). ఒకప్పుడు తార్పుడుకత్తె(కుట్టని) అయినది ప్రస్తుతం గుణం మార్చుకొని ధర్మబోధ చేయుచుండిననూ-అలాగే ఒకప్పుడు గోహత్యచేసిన బ్రాహ్మణుడు ప్రస్తుతం ఎంత పవిత్రవర్తనుడైననూ ఈ ఇరువురినీ లోకంలో ఎవరూ నమ్మరు."

గ. మయా చ ధర్మశాస్త్రాణి పఠితాని శృణు-

శ్లో. మరుస్థల్యాం యథా వృష్టిః క్షుధార్తే భోజనం తథా,
దరిద్రే దీయతే దానం సఫలం పాణ్డునన్దన. 11

శ్లో. ప్రాణా యథాఽఽత్మనోఽభీష్టా భూతానామపి తే తథా,
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వన్తి సాధవః. 12

అను. నేనుసైతం ధర్మశాస్త్రాలు పఠించాను వినుము-

"ఓ పాండుతనయా! ఎడారిలో కురిసిన వర్షం, ఆకలిగొన్న వానికి పెట్టిన భోజనం ఎలా సఫలములో అలాగే దరిద్రుడికి ఇచ్చిన దానం సఫలం అగును"11

"ఎలా తన ప్రాణాలు ప్రియంగా ఉండునో అలాగే అన్నిప్రాణులకు వాటి ప్రాణాలు ప్రియంగా ఉండును. అందుచే సజ్జనులు ఆత్మతుల్యముగా భావించి అన్నిప్రాణులయెడ దయ వహింతురు." 12

గ. అపరఞ్చ-

శ్లో. ప్రత్యాఖ్యానే చ దానే చ సుఖదుఃఖే ప్రియాఽప్రియే,
ఆత్మౌపమ్యేన పురుషః ప్రమాణమధిగచ్ఛతి. 13

అన్యచ్చ-

శ్లో. మాతృవత్పరదారేషు పరద్రవ్యేషు లోష్ఠవత్,
ఆత్మవత్సర్వభూతేషు యః పశ్యతి స పణ్డితః. 14

అను. మరియు- "జ్ఞానియైన పురుషుడు-అవమానం(తిరస్కారం), దానం, సుఖం, దుఃఖం-ప్రియం, అప్రియం ఇత్యాదులు సంభవిస్తే తనకు గల్గే అనుభూతిని ప్రమాణంగా గ్రహిస్తాడు. తనవలెనే ఇతరులకు అని నిశ్చయిస్తాడు." 13

ఇంకనూ-"పరస్త్రీలను తల్లులవలెను, పరధనాన్ని మట్టిముద్దవలెను, సర్వప్రాణులను తనవలెను ఎవడు భావించునో అతడే పండితుడు అనబడును." 14

గ. త్వఞ్చాఽతీవ దుర్గతః. తేన తత్తుభ్యం దాతుం సయత్నోఽహమ్. తథా చోక్తమ్-

శ్లో. దరిద్రాన్ భర కౌన్తేయ। మా ప్రయచ్ఛేశ్వరే ధనమ్,
వ్యాధితస్యౌషధం పథ్యం నీరుజస్య కిమౌషధైః. 15

అన్యచ్చ—

శ్లో. దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం విదుః. 16

తదత్ర సరసి స్నాత్వా సువర్ణకఙ్కణం గృహాణ ఇతి.

అను. నీవు మిక్కిలి బీదవాడవు. అందుచే నేను దానిని నీకు ఇవ్వ యత్నించితిని. విజ్ఞులు ఇలా అన్నారు-

"ఓ ధర్మరాజా: దరిద్రులను పోషింపుము. ఐశ్వర్యసమృద్ధుడికి ధనం ఇవ్వ వద్దు. రోగికి ఇచ్చిన ఔషధం సఫలం అగును. రోగహీనుడికి ఔషధాలతోడి ఉప యోగం ఏమి గలదు?" 15

మరియూ-"ప్రతిఫలం ఆశింపక దానం చేయడం తన కర్తవ్యంగా భావించి దేశాన్ని కాలాన్ని గుర్తించి, ఉపకారం చేయనివానికినీ దానం చేయాలి- అదియే సాత్త్వికదానం అని విజ్ఞులు అందురు." 16

కనుక ఈ సరస్సులో స్నానం చేసి ఈ బంగారుకంకణం తీసికొనుము".

గ. తతో యావదసౌ తద్వచఃప్రతీతో లోభాత్ సరః స్నాతుం ప్రవిష్టః, తావన్మహాపఙ్కే నిమగ్నః పలాయితుమక్షమః. తం పఙ్కే పతితం దృష్ట్వా వ్యాఘ్రోఽవదత్- "అహహ మహాపఙ్కే పతితోఽసిః అతస్త్వామహముత్థాపయామి". ఇత్యుక్త్వా శనైః శనైరుపగమ్య తేన వ్యాఘ్రేణ ధృతః స పాన్థోఽచిన్తయత్—

అను. అంత ఆ బాటసారి ఆ పులిమాటను నమ్మాడు. వెంటనే కంకణం మీది ఆశచే స్నానం చేసేందుకై చెఱువులోనికి పూర్తిగా దిగాడో లేదో గొప్ప బురదలో కూరుకొని పోయాడు- పాఱిపోవుటకు శక్తిహీనుడు అయ్యాడు. అలా బురదలో చిక్కుపడిన అతన్ని చూచి పెద్దపులి ఇలా అది- 'అయ్యయ్యో! గొప్ప బురదలో పడిపోయావే, నేను వచ్చి నిన్ను పైకితీసెదను' ఇట్లు పలికి

మెల్లమెల్లగా సమీపించింది. అతన్ని పట్టుకొంది (ఆక్రమించింది). అప్పుడు ఆ బాటసారి ఇలా విచారించాడు-

శ్లో. న ధర్మశాస్త్రం పఠతీతి కారణం
న చాపి వేదాఽధ్యయనం దురాత్మనః,
స్వభావ ఏవాత్ర తథాఽతిరిచ్యతే
యథా ప్రకృత్యా మధురం గవాం పయః. 17

కిఞ్చ-

శ్లో. అవశేన్ద్రియచిత్తానాం హస్తిస్నానమివ క్రియా,
దుర్భగాఽఽభరణప్రాయో జ్ఞానం భారః క్రియాం వినా. 18

అను. "సహజగుణం అన్నిటికంటె బలవత్తమమైంది. దుర్జనుడు ఎన్ని ధర్మశాస్త్రాలు చదివినా, ఎంతగా వేదాధ్యయనం చేసినా చెడుబుద్ధిని వీడలేదు. అలాగే సజ్జనుడునూ ఎట్టి పరిస్థితులలోను సద్గుణం వీడడు. గోవులు ఎచ్చట ఉండినా, ఏమి తినినా తియ్యని పాలనే ఇచ్చును." 17

మరియూ-"చపలచిత్తుల వేదశాస్త్రాదిజ్ఞానం అంతా ఆచరణశూన్యం అగుటచే గజస్నానం వలె నిరుపయోగం. మరియూ భారహేతువైన విధవరాలి ఆభరణ సమూహంమాదిరి శోభావిహీనం అగుచున్నది." 18

గ. తన్మయా భద్రం న కృతమ్ యదత్ర మారాఽఽత్మకే విశ్వాసః కృతః. తథా చోక్తమ్-

శ్లో. నదీనాం శస్త్రపాణీనాం నఖినాం శృఙ్గిణాం తథా,
విశ్వాసో నైవ కర్తవ్యః స్త్రీషు రాజకులేషు చ. 19

అను. కనుక నేను చేసింది శుభమైనది గాదు. మృత్యురూపమైన ఈ పెద్దపులిని నమ్మాను. విజ్ఞులు ఇలా అన్నారు-

"ప్రవహించే నదులను- ఆయుధాలు ధరించినవారిని- గోళ్ల ఆయుధాలు

ఉండే పులి, సింహం మొదలైనవాటిని- కొమ్ములు ఆయుధాలుగా ఉండే ఎద్దు, దున్న మొదలైనవాటిని- స్త్రీలను- రాజులను నమ్మరాదు. 19

గ. అపరఞ్చ-

శ్లో. సర్వస్య హి పరీక్ష్యన్తే స్వభావా నేతరే గుణాః,
అతీత్య హి గుణాన్ సర్వాన్ స్వభావో మూర్ధ్ని వర్తతే. 20

అన్యచ్చ–

శ్లో. స హి గగనవిహారీ కల్మషధ్వంసకారీ
దశశతకరధారీ జ్యోతిషాం మధ్యచారీ,
విధురపి విధియోగాద్ గ్రస్యతే రాహుణాఽసౌ
లిఖితమపి లలాటే ప్రోజ్ఝితుం కః సమర్థః. 21

గ. ఇతి చిన్తయన్నేవాఽసౌ వ్యాఘ్రేణ ధృత్వా వ్యాపాదితః ఖాదితశ్చ.

అను. మరియు- "విజ్ఞులైనవారు అన్ని ప్రాణులయెడనూ వాటియొక్క సహజగుణాలనే పరీక్షిస్తారు. ఇతరములైన ఆగంతుకగుణాలను తలంవరు. ఏల నన- అన్నిగుణాలను మించి సహజగుణమే శిరోభూషణమై ఉంటుంది''. 20

ఇంకనూ-"ఆకాశసంచారియూ అందరిపాపాలను హరించేవాడూ, వెయ్యికిర ణాలు (చేతులు) గలవాడూ అయిన ఆ సూర్యభగవానుడూ అటులనే జోతిర్మయా లైన గ్రహనక్షత్రాల మధ్యన సంచరించేవాడు అయిన చంద్రుడూ- ఈ ఇరువురూ దైవయోగంచే రాహువుచే కబలింపబడుచున్నారు. నొసటివ్రాతను తప్పింప సమ ర్థుడు ఎవడు గలడు''. 21

ఇలా ఆ బాటసారి తలంచుచుండగనే ఆ పెద్దపులి తన పంజాతో ఆక్ర మించింది. చంపి తినివేసింది కూడ.

గ. అతోఽహం బ్రవీమి- 'కఙ్కణస్య తు లోభేన' ఇత్యాది. అత ఏవ సర్వథాఽవిచారితం కర్మ న కర్తవ్యమితి ।

యతః–

శ్లో. సుజీర్ణమన్నం సువిచక్షణః సుతః
సుశాసితా స్త్రీ నృపతిః సుసేవితః,
సుచిన్త్య చోక్తం సువిచార్య యత్కృతం
సుదీర్ఘకాలేఽపి న యాతి విక్రియామ్. 22

అను. అందువల్ల నేను (చిత్రగ్రీవుడు-అనే నేను) చెప్పుచున్నాను- 'కంకణ లోభంచే' ఇత్యాది. కనుక అన్ని విధాలుగా ఆలోచన చేయక ఏ పనినీ చేయరాదు. ఏల ననగా-

సుజీర్ణమైన ఆహారం- సువివేకి (సువిద్వాంసుడు)అయిన పుత్రుడు- సుశాసిత ఆయిన భార్య- సుసేవితుడైన ప్రభువు- సుచింతితమై పలుకబడిన వాక్కు-సువిచారితమైన కార్యం, సుదీర్ఘకాలానికినీ వికృతి నందవు. 22

గ. ఏతద్వచనం శ్రుత్వా కశ్చిత్ కపోతః సదర్ప మాహ- 'అః కిమేవ ముచ్యతే'।

శ్లో. వృద్ధస్య వచనం గ్రాహ్యమాపత్కాలే హ్యుపస్థితే,
సర్వత్రైవం విచారే చ భోజనేఽపి ప్రవర్తనమ్. 23

అను. ఈ మాటను విని ఒకానొక పావురం గర్వంతో ఇలా అంది- ఆః ఎందుకు ఇట్లు అనుచున్నారు. "ఆపద వచ్చినచో వృద్ధుల వాక్కును అనుసరించాలి. అంతేగాని ప్రతి చిన్న విషయానికి ఇలా విచారణ చేస్తూ ఉంటే ఆహారం సైతం గ్రహింపలేము". 23

గ. యతః—

శ్లో. శఙ్కాభిః సర్వమాక్రాన్తమన్నం పానఞ్చ భూతలే,
ప్రవృత్తిః కుత్ర కర్తవ్యా జీవితవ్యం కథం ను వా. 24

అథా చోక్తమ్—

శ్లో. ఈర్ష్యీ ఘృణీ త్వసన్తుష్టః క్రోధనో నిత్యశఙ్కితః,
పరభాగ్యోపజీవీ చ షడేతే దుఃఖభాగినః. 25

అను. ఈ ప్రపంచంలో ఆహారపానీయాది సమస్తం సంశయగ్రస్తమై ఉంది. అట్టి యెడ ఏ పనిని చేయాలి. ఎలా జీవించాలి? 24

విజ్ఞులు ఆటులనే అన్నారు-

ఈర్ష్య (అసూయ) గలవాడు, ఘృణా(తృష్ణా) వంతుడు, సంతోషరహితుడు- నిత్యశంకితుడు- పరుల సంపదచే జీవించేవాడు- అనే ఈ ఆరుగురు దుఃఖభాగులు అనబడుదురు. 25

గ. ఏతచ్ఛ్రుత్వా తణ్డులకణలోభేన నభోమణ్డలాదవతీర్య సర్వే కపోతాస్తత్రోపవిష్టాః. యతః-

శ్లో. సుమహాన్త్యపి శాస్త్రాణి ధారయన్తో బహుశ్రుతాః,
చేత్తారః సంశయానాఞ్చ క్లిశ్యన్తే లోభమోహితాః. 26

అను. ఇది వినగానే పావురములకు అన్నిటికి తండులకణాలపై లోభం కల్గింది. ఆకాశంనుండి దిగాయి. ధానపుగింజలపై వ్రాలాయి. ఏలనన-

"పెక్కు శాస్త్రాలను అధ్యయనం చేసినవారూ-అధికశాస్త్రజ్ఞాన సంపన్నులూ ఇతరుల సంశయాలను తొలగించేవారూ అయిన పండితులు సైతం లోభంచే మోహితులై ఆపదలను పొందుదురు." 26

గ. అన్యచ్చ-

శ్లో. లోభాత్ క్రోధః ప్రభవతి లోభాత్ కామః ప్రజాయతే,
లోభాన్మోహశ్చ నాశశ్చ లోభః పాపస్య కారణమ్. 27

గ. అన్యచ్చ-

శ్లో. అసమ్భవం హేమమృగస్య జన్మ
తథాఽపి రామో లులుభే మృగాయ,
ప్రాయః సమాసన్నవిపత్తికాలే,
ధియోఽపి పుంసాం మలినీభవన్తి. 28

అను. మరియూ- "లోభం వలన (కోరిన వస్తువును లభింపనట్లుచేసిన

వారిపై) క్రోధం జనిస్తుంది. లోభంవల్లనే విషయవాసనారూపమైన కామం సంభవిస్తుంది. లోభంవల్లనే ధర్మ-అధర్మవివేకం నశించడంతో అజ్ఞానభ్రాంతి,తద్వారా సర్వనాశం సంభవిస్తాయి." 27

ఇంకనూ- "బంగారులేడి జనించడం అసంభవం. అయినా శ్రీరాముడు దానికై లోభం చెందాడు. సామాన్యంగా చెడుకాలం దాపురించినప్పుడు మహాత్ముల బుద్ధులు సైతం మలినాలు అగును." 28

గ. అనన్తరం తే సర్వే జాలనిబద్ధా బభూవుః. తతో యస్య వచనాత్ తత్రావలమ్బితాస్తం సర్వే తిరస్కుర్వన్తి స్మ.

యతః—

శ్లో. న గణస్యాఽగ్రతో గచ్ఛేత్ సిద్ధే కార్యే సమం ఫలమ్,
యది కార్యవిపత్తిః స్యాన్ముఖరగస్తత్ర హన్యతే. 29

అను. పిమ్మట అవి అన్నీ వలలో బంధింపబడినాయి. అంత అందుకు ప్రోత్సహించిన పావురమును తక్కిన పావురములు అన్నీ నిందింపసాగాయి. ఏలననగా-

"ఏ పని చేయునప్పుడైనా సంఘానికి ముందు పోరాదు పని నెఱవేరినచో అందరితోపాటుగనే ఫలం లభిస్తుంది. పని చెడిపోయినచో అందరితో చీవాట్లు తప్పవు." 29

గ. తస్య తిరస్కారం శ్రుత్వా చిత్రగ్రీవ ఉవాచ-నాఽయమస్య దోషః.

యతః—

శ్లో. ఆపదామాపతన్తీనాం హితోఽప్యాయాతి హేతుతామ్,
మాతృజఙ్ఘా హి వత్సస్య స్తమ్భీభవతి బన్ధనే. 30

అన్యచ్చ—

శ్లో. స బన్ధుర్యో విపన్నానామాపదుద్ధరణక్షమః,
న తు భీతపరిత్రాణవస్తూపాలంభపణ్డితః. 31

అను. అతన్ని నిందించడం విని చిత్రగ్రీవుడు ఇలా అన్నాడు- 'ఇది ఇతని దోషం గాదు. ఏలననగా-

"ఆపదలు తప్పక రావలసినట్లు ఉండినచో హితకర్తలు సైతం కారణం అయ్యేదరు. పరనుహితకారియైన తల్లి తొడయు ఒకప్పుడు శిశువునకు బంధనోపకరణమైన స్తంభం అగుచుండును."

మరియూ-"ఆపద గల్గినప్పుడు రక్షించేవాడే బంధువు. ఇక ఆపదలు గల్గినప్పుడు రక్షించడానికి బదులు ఎత్తిపొడుపు మాటలతో వేధించడంలో నేర్పరియైనవాడు బంధువు గాదు. (భీతానాం పరిత్రాణాత్మకం యద్వస్తు-కార్యం తస్మిన్. ఉపాలంభే-తిరస్కారే పణ్డితః. ఆపన్నానాం తిరస్కర్తా ఇతి భావః)".

గ. విపత్కాలే విస్మయ ఏవ కాపురుషలక్షణమ్. తదత్ర ధైర్యమవలమ్బ్య ప్రతీకారశ్చిన్త్యతామ్. యతః

శ్లో. విపది ధైర్య మథాఽభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,

యశసి (రతి) చాభిరుచిర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్. 32

అను. ఆపద గల్గినచో కలత చెందడం అల్పచిత్తుల (కుపురుషుల) లక్షణం. కనుక ఈ విషయంలో ధైర్యం తెచ్చుకొని ప్రతిక్రియను ఆలోచించాలి. ఏలననగా.

"ఆపదయందు ధైర్యం- సంపదయందు ఓర్పు - సభయందు వాక్చాతుర్యం యుద్ధమునందు పరాక్రమం - కీర్తియెడ ఆసక్తి శాస్త్రాధ్యయనమందు మిక్కిలి పట్టుదల- ఇత్యాదులు మహాత్ములకు పుట్టుకతో వచ్చిన సుగుణాలు." (32)

శ్లో. 'సమ్పది యస్య న హర్షో విపది విషాదో రణే చ భీరుత్వమ్,
తం భువనత్రయతిలకం జనయతి జననీ సుతం విరలమ్.

అన్యచ్చ -

శ్లో. షడ్దోషాః పురుషేణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా,
నిద్రా తన్ద్రా భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా. 34

అను. "సంపద గల్గినచో హర్షం - ఆపద గల్గినచో దుఃఖం - యుద్ధంలో పిరికితనం లేనట్టి త్రిలోకదీపమైన పురుషునికి ఏ తల్లియో అరుదుగా జన్మను ఇస్తుంది."

మరియూ - ఈ ప్రపంచంలో అభివృద్ధిని కోరే పురుషుడు నిద్ర - జడత (అశ్రద్ధ) భయం - క్రోధం - ఆలస్యం [సోమరితనం] - దీర్ఘసూత్రత [బహువిధ విపరీతభావనలతో ఆలోచించడం] అనే ఈ ఆరు దోషాలను పరిత్యజించాలి.

గ. ఇదానీమప్యేవం క్రియతామ్ - సర్వైరేకచిత్తీభూయ జాలమాదాయోడ్డీయతామ్.

శ్లో. అల్పానామపి వస్తూనాం సంహతిః కార్యసాధికా,
తృణై ర్గుణత్వ మాపన్నై ర్బధ్యన్తే మత్తదన్తినః. 35

శ్లో. సంహతిః శ్రేయసీ పుంసాం స్వకులైరల్పకైరపి,
తుషేణాఽపి పరిత్యక్తా న ప్రరోహన్తి తణ్డులాః. 36

అను. ఇప్పుడైనా అందరం కలిసి ఐకమత్యంగా వలను ఎత్తుకొని ఎగిరిపోవడం సముచితం.

"దుర్బలములైన వస్తువులు సైతం సంఘంగా చేరినచో కార్యాన్ని సాధిస్తాయి. గడ్డిపరకలును పురి పెట్టబడి త్రాడుగా తయారైనచో మదగజాలను బంధిస్తున్నాయి." (35)

"తనవారిని అల్పులైనవారిని సైతం దూరం చేసికొనరాదు. అందరు ఐకమత్యంగా వర్తిల్లిననే శ్రేయస్సు గల్గును. పైపొట్టు పోయినను వడ్లగింజలు మొలక లెత్తవు." (36)

గ. ఇతి విచిన్త్య పక్షిణః సర్వే జాలమాదాయోత్పతితాః. అనన్తరం వ్యాధః సుదూరాజ్జాలాఽపహారకాంస్తానవలోక్య పశ్చాద్ధావితోఽచిన్తయత్.

శ్లో. సంహతాస్తు హరన్త్యేతే మమ జాలం విహఙ్గమాః,
యదా తు నిపతిష్యన్తి వశమేష్యన్తి మే తదా. 37

అను. ఇలా తలంచి ఆ పావురములు అన్నీ ఐకమత్యంగా వలను ఎత్తు

కొని ఎగిరాయి. అప్పుడు వేటకాడు దూరంనుండి వలను అపహరించుకొని పోయే ఆ పక్షులను చూచాడు. వాటివెనుక కొంత దూరం పరుగెత్తాడు. ఇలా తలంచాడు-

"ఈ పక్షులు ఐకమత్యంతో నా వలను ఎత్తుకొని పోవుచూ ఉన్నాయి. కాని ఎప్పుడు నేలపై పడునో అప్పుడు నేను పట్టుకొందును." (37)

గ. తతస్తేషు చక్షుర్విషయ మతిక్రాన్తేషు పక్షిషు స వ్యాధో నివృత్తః. అథ లుబ్ధకం నివృత్తం దృష్ట్వా కపోతా ఊచుః "స్వామిన్.? కిమిదానీం కర్తు ముచితమ్?'' చిత్రగ్రీవ ఉవాచ.

శ్లో. మాతా మిత్రం పితా చేతి స్వభావాత్ త్రితయం హితమ్,
కార్యకారణతశ్చాన్యే భవన్తి హితబుద్ధయః. 38

అను. అంత ఆ పక్షులు కన్నులకు కనబడనంతదూరం పోగానే ఆ వేటకాడు వెనుదిరిగాడు. వాడు మరలుటను గుర్తించి పక్షులు [చిత్రగ్రీవునితో] ఇలా అన్నాయి - 'ప్రభూ ! ఇప్పుడు ఏమి చేయడం మంచిది?' చిత్రగ్రీవుడు ఇట్లు బదులు పల్కాడు 'తల్లి, మిత్రుడు, తండ్రి - ఈ ముగ్గురు స్వభావంగా మేలు కోరుదురు, ఇక తక్కినవారు అవసరం కొద్దీ మేలు కోరుదురు. (38)

గ. "తన్మే మిత్రం హిరణ్యకో నామ మూషికరాజో గణ్డకీతీరే చిత్రవనే నివసతి. సోఽస్మాకం పాశాంశ్ఛేత్స్యతి'- ఇత్యాలోచ్య సర్వే తే హిరణ్యక-వివర సమీపం గతాః. హిరణ్యకశ్చ సర్వదాఽపాయశఙ్కయా శతద్వారం వివరం కృత్వా నివసతి.

అను. అందువల్ల నా మిత్రుడైన హిరణ్యకుడు అనే ఎలుకలరాజు దగ్గరకు పోవుదము. అతడు గండకీ నదీతీరమున చిత్రవనంలో గలడు. మన వల త్రాళ్లను ఛేదించగలడు.

ఇలా తలంచి అవి అన్నీ హిరణ్యకుడి బొరియసమీపంలో వ్రాలాయి. హిరణ్యకుడును నిత్యం అపాయాన్ని శంకిస్తూ నూరుద్వారాలు గల తొఱ్ఱలో నివసిస్తూ ఉన్నాడు.

గ. తతో హిరణ్యకః కపోతాఽవపాతభయాచ్చకితస్తూష్ణీం స్థితః. చిత్ర గ్రీవ ఉవాచ - 'సఖే హిరణ్యక కథమస్మాన్న సమ్భాషయసే తతో హిరణ్యక

స్తద్వచనం ప్రత్యభిజ్ఞాయ ససంభ్రమం బహిఃనిఃసృత్యాఽబ్రవీత్ - 'అః పుణ్యవానస్మి. ప్రియసుహృన్మే చిత్రగ్రీవః సమాయాతః-

శ్లో. యస్య మిత్రేణ సమ్భాషో యస్య మిత్రేణ సంస్థితిః,
యస్య మిత్రేణ సంలాపస్తతో నాస్తీహ పుణ్యవాన్. 39

అను. అంత హిరణ్యకుడు రెక్కలు ఆడిస్తూ పావురములు వేగంగా వ్రాలిన శబ్దం విన్నాడు. భయంచే కంగారు నొందాడు. నిశ్చలంగా తొఱ్ఱలో ఉన్నాడు. భోరియను సమీపించి చిత్రగ్రీవుడు బిగ్గరగా ఇలా పల్కాడు - మిత్రమాః హిరణ్యకా ఎందుకు నాతో ప్రేమతో మాట్లాడవు ? అప్పుడు హిరణ్యకుడు చిత్రగ్రీవుడి కంఠధ్వనిని గుర్తించాడు. తొట్రుపాటుతో తొఱ్ఱనుండి వెలుపలికి వచ్చాడు - ఆదరంగా ఇలా అన్నాడు 'ఆహా పుణ్యవంతుడను. నా ప్రియ మిత్రుడు చిత్రగ్రీవుడు వచ్చాడు. "ఎవనికి మిత్రుడితోడి సంభాషణయూ కలిసి వసించడమూ - రహస్యగోష్ఠీరూపమైన సంలాపమూ ఉండునో వానితో సమానమైన పుణ్యాత్ముడు ఈ లోకంలో లేడు". (39)

గ. అథ పాశబద్ధాంశ్చైతాన్ దృష్ట్వా సవిస్మయః క్షణం స్థిత్వా ఉవాచ; 'సఖే కిమేతత్' చిత్రగ్రీవ ఉవాచ- 'సఖేః అస్మాకం ప్రాక్తనజన్మకర్మణః ఫలమేతత్.

శ్లో. యస్మాచ్చ యేన చ యథా చ యదా చ యచ్చ
యావచ్చ యత్ర చ శుభాశుభమాత్మకర్మ,
తస్మాచ్చ తేన చ తథా చ తదా చ తచ్చ
తావచ్చ తత్ర చ విధాతృవశాదుపైతి. 40

అను. పిమ్మట వలలో చిక్కువడిన (బద్ధములైన) పావురములను చూచాడు. ఆశ్చర్యంచే క్షణకాలం నిశ్చలత నొందాడు. తర్వాత ఇలా అడిగాడు - 'మిత్రమా ఇది ఏమి ?' చిత్రగ్రీవుడు ఇలా సమాధానం చెప్పాడు - 'మిత్రమా ఇది మా పూర్వజన్మపాప కర్మకు ఫలం.

ఏ కారణం వలన - ఏ సాధనంచే - ఏ విధంగా - ఏ కాలంలో ఏది ఏ పరిమాణంలో ఏ ప్రదేశంలో తాను చేసికొన్న పుణ్యఫలంగాని పాపఫలంగాని

అనుభవింపవలసి ఉండునో, ఆ కారణంవలన - ఆ సాధనంచే - ఆ విధంగా - ఆ కాలంలో - అది - ఆ పరిమాణంలో - ఆ ప్రదేశంలో పరిణతమై విధాతృ వశమున అనుభవానికి వచ్చును. (40)

శ్లో. రోగ - శోక - పరీతాప - బన్ధన - వ్యసనాని చ,
ఆత్మాఽపరాధవృక్షాణాం ఫలాన్యేతాని దేహినామ్. 41

అను. రోగం - శోకం - బాధ - బంధనం - వ్యసనం మొదలైన ఆపదలు అన్నీ తాను చేసిన పాపం అనే వృక్షముయొక్క ఫలములు అని మానవుడు గ్రహింపవలయును. (41)

గ. ఏతచ్ఛ్రుత్వా హిరణ్యకః (స మూషికః) చిత్రగ్రీవస్య బన్ధనం ఛేత్తుం సత్వర ముపసర్పతి. తత్ర చిత్రగ్రీవ ఉవాచ- 'మిత్ర! మా మైవం కురు. (కిన్తు) ప్రథమమస్మదాశ్రితానామేతేషాం తావత్ పాశాంశ్ఛిన్ధి. మమ పాశాన్ పశ్చాచ్ఛేత్స్యసి'. హిరణ్యకోఽప్యాహ- 'అహమల్పశక్తిః దన్తాశ్చ మే కోమలాః. తదేతేషాం పాశాంశ్ఛేత్తుల కథం సమర్థో భవామి. తద్యావన్మే దన్తా న త్రుట్యన్తి తావ త్తవ పాశం ఛినద్మి! తదనన్తరమప్యేతేషాం బన్ధనం యావచ్ఛక్యం ఛేత్స్యామి' ఇతి. చిత్రగ్రీవ ఉవాచ- 'అస్త్వేవం, తథాపి యథాశక్తి బన్ధనమేతేషాం ఖణ్డయ'ఇతి. హిరణ్యకేనోక్తమ్- 'ఆత్మపరిత్యాగేన యదాశ్రితానాం పరిరక్షణం తన్న నీతి వేదినాం సమ్మతమ్.

యతః-

శ్లో. ఆపదర్థే ధనం రక్షేద్దారాన్ రక్షేద్ధనైరపి,
ఆత్మానం సతతం రక్షేద్దారైరపి ధనైరపి. 42

అన్యచ్చ-

శ్లో. ధర్మార్థ-కామ-మోక్షాణాం ప్రాణాః సంస్థితిహేతవః,
తాన్నిఘ్నతా కిన్న హతం రక్షతా కిం న రక్షితమ్. 43

అను. ఇది విని హిరణ్యకుడు చిత్రగ్రీపుని బంధనాలను ఛేదించడానికై వేగంగా సమీపించాడు. అప్పుడు చిత్రగ్రీవుడు ఇలా అన్నాడు- 'మిత్రమా ఇలా

చేయవద్దు. (మరేమనగా) ముందుగా నన్ను ఆశ్రయించి ఉండే వీరి బంధాలను చేదింపుము. తర్వాత నా బంధాలు చేదింపవచ్చును. అందులకు హిరణ్యకుడు అన్నాడు- 'నేను అల్పబలుడను, నా దంతములునూ కోమలములై నవి. అట్టి యెడ వీరి బంధాలను ఎలా చేదింపగలను, కనుక నా దంతాలు విరుగకముందే నీ బంధనములను చేదిస్తాను. ఆ మీదట యథాశక్తి వీరి బంధాలను సైతం చేదిస్తాను. అంత చిత్రగ్రీవుడు అన్నాడు- 'అలాగే శక్తిఉన్నంతవరకు మొదట వీరి బంధాలనే కొఱికివేయుము.' అందులకు హిరణ్యకుడు ఇలా పల్కాడు-'తన్ను విడి ఆశ్రితులను రక్షించడం అనేది నీతిశాస్త్రవేత్తలకు సమ్మతం గాదు. ఏలనన-

''ఆపద వచ్చినప్పుడు ఉపయోగపడేందుకై ధనాన్ని సేకరించి రక్షించాలి. ధనం కంటె కూడ(విశేషించి) భార్యను రక్షించుకొనాలి. ధనంకంటె భార్యకంటె కూడా (విశేషించి) తన్నురక్షించుకొనాలి". 42

మరియూ- "ప్రాణములే ధర్మార్థ-కామ-మోక్షాలు అనే పురుషార్థాలు నాల్గింటికినీ కారణములు. అందుచే వాటిని పోగొట్టుకొన్నచో అన్నీ పోగొట్టుకొన్నట్లే. వాటిని రక్షించుకొన్నచో అన్నిటినీ రక్షించుకొన్నట్లే". 43

గ. చిత్రగ్రీవ ఉవాచ- 'సఖే, నీతిస్తావదీదృశ్యేవ. కిన్త్వహమస్మదాశ్రితానాం దుఃఖం సోఢుం సర్వథాఽసమర్థస్తేనేదం బ్రవీమి.

యతః—

శ్లో. ధనాని జీవితఞ్చైవ పరార్థే ప్రాజ్ఞ ఉత్సృజేత్,
సన్నిమిత్తే వరం త్యాగో వినాశే నియతే సతి. 44

అయమపరశ్చాఽసాధారణో హేతుః—

శ్లో. జాతి-ద్రవ్య-బలానాఞ్చ సామ్యమేషాం మయా సహ,
మత్ప్రభుత్వఫలం బ్రూహి కదా కిం తద్భవిష్యతి. 45

అను. అందులకు చిత్రగ్రీవుడు ఇలా సమాధానం పల్కాడు- "మిత్రమా! రాజనీతి అయితే ఇలాగే ఉంటుంది. కాని నేను ఎట్టి పరిస్థితులలోనూ నన్ను ఆశ్రయించినవారి దుఃఖాన్ని సహింపజాలను. అందుచే ఇలా చెప్పుచున్నాను. ఏలననగా-

"బుద్ధిమంతుడైనవాడు తన ధనాన్నీ జీవితాన్నీ పరుల మేలుకై ఉపయోగిం
లి. ధనజీవితాల వినాశం అవశ్యం సంభవించేదియై ఉన్నప్పుడు మంచిపనికై
టిని ఉపయోగించడం ఎంతయూ ప్రశస్తం." 44

ఇక ఈ చెప్పబోవునదియూ మరియొక ముఖ్యకారణం ఏమన- వీరికి జాతి,
నం, కులం- అనే ఈ మూడుగుణాలు నాతో సమానంగా ఉన్నాయి. ఇప్పుడు
క్షింపనిచో నా ప్రభుత్వంవల్ల వీరికి ఎప్పుడేని గల్గే ఉపయోగం ఏమిటో (అది)
ల్పుము. 45

గ. అన్యచ్చ-

శ్లో. వినా వర్తనమేవైతే న త్యజన్తి మమాన్తికమ్,
తన్మే ప్రాణవ్యయేనాఽపి జీవయైతాన్ మమాశ్రితాన్. 46

ఇ్చ-

శ్లో. మాంస-మూత్ర-పురీషాస్థి-పూరితేఽత్ర కలేబరే,
వినశ్వరే విహాయాఽఽస్థాం యశః పాలయ మిత్ర మే. 47

అను. ఇంకనూ-"వీరు జీతం ఏమీ లేకయే నన్ను విడువక సేవిస్తూన్నారు.
ందుచే నా ప్రాణాలకు బదులుగా నా ఆశ్రితులను రక్షింపుము". 46

మరియూ- "ఈ శరీరం మలమూత్రాలతో అస్థిమాంసాలతో నిండినది.
వశ్యం నశించేది. ఇట్టి ఈ శరీరంపై మమకారం వదులుము. ఓ మిత్రమా
శాశ్వతమైన) నా కీర్తిని పాలింపుము". 47

గ. అపరఞ్చ పశ్య-

శ్లో. యది నిత్యమనిత్యేన నిర్మలం మలవాహినా,
యశః కాయేన లభ్యేత తన్న లబ్ధం భవేన్ను కిమ్. 48

యతః-

శ్లో. శరీరస్య గుణానాఞ్చ దూరమత్యన్తమన్తరమ్,
శరీరం క్షణవిధ్వంసి కల్పాన్తస్థాయినో గుణాః. 49

3)

అను. మరియు (ఆలోచించి) చూడుము-"అనిత్యం, అపరిశుద్ధం (మల మూత్రాదిభరితం) అయిన శరీరంచే నిత్యం, నిర్మలం అయిన కీర్తి లభించినచో ఇక లభించనిది ఏమున్నది''? 48

ఏల ననగా-"శరీరానికీ గుణాలకు ఎంతో మహత్తరమైన భేదం గలదు. అదేమన- శరీరం క్షణికం అయింది. ధర్మాదిగుణాలు కల్పాంతస్థిరములు''. 49

గ. ఇత్యాకర్ణ్య హిరణ్యకః ప్రహృష్టమనాః పులకితః సన్న బ్రవీత్– "మిత్ర! అనేనాఽఽశ్రితవాత్సల్యేన త్రైలోక్యస్యాఽపి ప్రభుత్వం త్వయి యుజ్యతే"- ఏవముక్త్వా తేన సర్వేషాం కపోతానాం బన్ధనాని ఛిన్నాని.తతో హిరణ్యకః సర్వాన్ సాదరం సమ్పూజ్య ఆహ-'సఖే చిత్రగ్రీవ! సర్వథాఽత్ర జాలబన్ధనవిధౌ సతి దోషమాశఙ్క్యాఽఽత్మన్యవజ్ఞా న కర్తవ్యా.

యతః-

శ్లో. యోఽధికాద్యోజనశతాత్ పశ్యతీహాఽఽమిషం ఖగః,
స ఏవ ప్రాప్తకాలస్తు పాశబన్ధం న పశ్యతి. 50

అను. అది విని హిరణ్యకుడు మిక్కిలి సంతుష్టుడు అయ్యాడు- గగుర్పాటు నొందుచూ ఇలా పల్కాడు- "మిత్రమా ! ఈ ఆశ్రితవాత్సల్యంచే మూడు లోకాలకూ ప్రభువు అగుటకు తగియున్నావు." ఇలా పల్కి పావురాలకు అన్నింటికి బంధనాలను అతడు ఛేదించాడు. తరువాత ఆ పావురాలను అన్నింటినీ సగౌరవంగా ఆదరించి హిరణ్యకుడు ఇలా అన్నాడు- "మిత్రమా చిత్రగ్రీవా! అనాలోచితంగా ఈ వలలో చిక్కుపడిన దోషాన్ని గూర్చి విచారిస్తూ నిన్ను నీవు చులకనగా భావింపకుము. ఏల ననగా-

''ఈ ప్రపంచంలో డేగ నూరామడల దూరంనుండియే తన ఆహారమైన మాంసాన్ని చూడగలదు. కాని అంతటి శక్తివంతమైన ఆ పక్షియూ పోయేకాలం దాపురించినప్పుడు దాపున ఉండే వలను సైతం చూడలేదు''. 50

గ. అపరఞ్చ-

శ్లో॥ శశిదివాకరయో ర్గ్రహపీడనం
గజభుజఙ్గమయోరపి బన్ధనమ్,
మతిమతాఞ్చ విలోక్య దరిద్రతాం
విధిరహో బలవానితి మే మతిః. 51

అను. మరియూ- "సూర్యచంద్రులకు గ్రహబాధ- ఏనుగునకు, పామునకు బంధనయోగం, విద్వాంసులకు దారిద్ర్యబాధ-ఇత్యాదికం విచారించినచో ప్రారబ్ధం బలవంతం అని నాకు తోస్తూ ఉంది."

గ. అన్యచ్చ-

శ్లో॥ వ్యోమైకాన్తవిహారిణోఽపి విహగాః సమ్ప్రాప్నువన్త్యాపదం
బధ్యన్తే నిపుణైరగాధసలిలాన్మత్స్యాః సముద్రాదపి,
దుర్ణీతం కిమిహాస్తి కిం సుచరితం కః స్థానలాభే గుణః
కాలో హి వ్యసనప్రసారితకరో గృహ్ణాతి దూరాదపి. 52

అను. ఇంకనూ-"కేవలం ఆకాశంలో తిరుగునవి అయిననూ పక్షులు ఆపదలను పొందుతూ ఉన్నాయి. అగాధసముద్రంలో ఉండిననూ చేపలు నిపుణులైన బెస్తలచే పట్టుకొనబడుతున్నాయి. ఈ ప్రపంచంలో 'ఇది మంచిది; ఇది చెడ్డది'- అనిఎవరు నిర్ణయింపగలరు. సురక్షితస్థానలాభంవల్లనూ అంతగా ఉపయోగం కనబడదు. మృత్యువు వ్యసనాసక్తి అనే చేతిని చాపి, అనగా ఏదో ఒక వ్యసనంలో ప్రాణిని లగ్నం చేసి, దూరంనుండికూడా కబలిస్తుంది''. 52

గ. ఇతి ప్రబోధ్య ఆతిథ్యం కృత్వాఽఽలిఙ్గ్య చ తేన సమ్ప్రేషిత శ్చిత్రగ్రీవోఽపి సపరివారో యథేష్టదేశాన్ యయౌ. హిరణ్యకోఽపి స్వవివరం ప్రవిష్టః.

శ్లో. యాని కాని చ మిత్రాణి కర్తవ్యాని శతాని చ,
పశ్య మూషికమిత్రేణ కపోతా ముక్తబంధనాః. 53

అను. ఇట్లు పల్కి హిరణ్యకుడు వాటికి ఆతిథ్యం ఇచ్చాడు. ప్రేమతో

కౌగలించుకున్నాడు. పిమ్మట వీడ్కోలు ఒసగి సాగనంపాడు. పిమ్మట చిత్రగ్రీవుడు సపరివారంగా యథేష్టప్రదేశాలకు వెళ్లాడు. హిరణ్యకుడునూ తన బొఱియలో చొఱబడ్డాడు.

''(మానవుడు) ఎలాంటివారినైనా మిత్రులను పెక్కండ్రను సంపాదించుకొనవలయును. చూడుము- మిత్రమైన ఎలుకచే పావురాలు బంధవిముక్తిని పొందాయి.'' 53

గ. అథ లఘుపతనకనామా కాకః సర్వవృత్తాన్తదర్శీ సాశ్చర్య మిదమాహ- "అహో హిరణ్యక శ్లాఘ్యోఽసి. అతోఽహమపి త్వయా సహ మైత్రీం కర్తు మిచ్ఛామి. అత స్త్వం మైత్రేణాఽనుగ్రహీతు మర్హసి" ఇతి. ఏతచ్ఛ్రుత్వా హిరణ్యకోఽపి వివరాభ్యన్తరాదాహ- "క స్త్వమ్?" స బ్రూతే-"లఘుపతనకనామా వాయసోఽహమ్" ఇతి. హిరణ్యకో విహస్యాఽఽహ- "కా త్వయా సహ మైత్రీ"?

యతః-

శ్లో. యద్యేన యుజ్యతే లోకే బుధ స్తత్తేన యోజయేత్,
అహమన్నం భవాన్ భోక్తా కథం ప్రీతిర్భవిష్యతి. 54

అను. అంత లఘుపతనకం అనే కాకి ఇదంతా చూచింది. మిక్కిలి ఆశ్చర్యం పొందింది. హిరణ్యకుడి బొఱియను సమీపించింది సగౌరవంగా ఇలా పల్కింది. ''ఆహా హిరణ్యకా ! ప్రశంసనీయుడవు. అందువల్ల నేనూ నీతోడి స్నేహం చేయదలచాను. కనుక నన్ను స్నేహితునిగా స్వీకరించి అనుగ్రహింపుము". అది విన్నాడు హిరణ్యకుడు. తన బొఱియలోపలినుండియే యిలా అడిగాడు- 'నీవు ఎవరు?' లఘుపతనకుడు-'నేను కాకిని. నా పేరు లఘుపతనకుడు'. హిరణ్యకుడు (నవ్వుచూ) 'నీతో మైత్రి ఎట్లు పొసగును?

ఏల ననగా- "ఈ ప్రపంచంలో బుద్ధిమంతులైనవారు తమకు యోగ్యులైనవారితోనే స్నేహం చేయాలి. నేను ఆహారం- నీవు భోక్తవు. ఇట్టియెడ మనకు స్నేహం ఎట్లు యుక్తంగా ఉండును''? 54

గ. అపరఞ్చ-

శ్లో. భక్ష్యభక్షకయోః ప్రీతిర్విపత్తేః కారణం మతమ్,
శృగాలాత్ పాశబద్ధోఽసౌ మృగః కాకేన రక్షితః. 55

గ. వాయసోఽబ్రవీత్- 'కథమేతత్'? హిరణ్యకః కథయతి-

అను. మరియూ-

"భక్ష్య-భక్షకులమైత్రి ఆపదకు కారణం అగును. నక్కచే వలలో చిక్కు వడిన లేడి కాకిచే రక్షింపబడింది.'' 55

అంత కాకి(లఘుపతనకం) అడిగింది-'అది ఎట్లు?' హిరణ్యకుడు ఆ కథను ఇలా చెప్ప నారంభించాడు.

# 3 చిత్రాఙ్గ (మృగ) కథా

గ. అస్తి మగధదేశే చమ్పకవతీ నామాఽరణ్యానీ. తస్యాం చిరాత్ మహతా స్నేహేన మృగకాకౌ నివసతః. స చ మృగః స్వేచ్ఛయా భ్రామ్యన్ హృష్ట-పుష్టాఙ్గః కేనచిచ్ఛృగాలేనాఽవలోకితః. తం దృష్ట్వా శృగాలోఽచిన్తయత్- ఆః కథమేతన్మాంసం సులలితం భక్షయామి? భవతు, విశ్వాసం తావదుత్పాదయామి" ఇత్యాలోచ్యోపసృత్యాఽబ్రవీత్- "మిత్ర, కుశలం తే"? ఇతి. మృగేణోక్తమ్-"కస్త్వమ్?"ఇతి. స బ్రూతే- క్షుద్రబుద్ధి నామా జమ్బుకోఽహమ్. అత్రారణ్యే బన్ధుహీనో మృతవదేకాకీ నివసామి. ఇదానీం త్వాం మిత్రమాసాద్య పునః సబన్ధుర్జీవలోకం ప్రవిష్టోఽస్మి.అధునా తవాఽనుచరేణ మయా భవితవ్యమ్' ఇతి. మృగేణోక్తమ్- 'ఏవమస్తు' ఇతి.

అను. మగధదేశమున చంపకవతి అనే గొప్ప అడవి ఉంది. ఆ అడవిలో

ఒక లేడి, ఒక కాకి చాలకాలంగా మిక్కిలి మైత్రితో నివసిస్తూ ఉండేవి. లేడి అచ్చట స్వేచ్ఛగా తిరుగుచూ పచ్చిక మేస్తూ బలిసి చాలా అందంగా కనబడేది. దానిని ఒకనాడు ఒకానొక నక్క చూచింది. ఇలా తలంచింది- 'ఆహా! మిక్కిలి రుచిగా ఉండే దీని మాంసం ఎలా తినగలను? కానిమ్ము, మొదట దీనికి నమ్మకం గల్గేటట్లు చేస్తాను'- ఇలా తలంచి ఆ జింకవద్దకు పోయింది. ప్రేమతో ఇలా అడిగింది- 'మిత్రమా! కుశలంగా ఉన్నావా?

లేడి(జింక)- 'ఎవరు నీవు?'

నక్క- 'నేనొక నక్కను. నాపేరు క్షుద్రబుద్ధి. ఈ అరణ్యంలో బంధువులు ఎవరూ లేక శవంవలె ఒంటరిగా నివసిస్తున్నాను. ఇప్పుడు నిన్ను చేరాను. మరల బంధుసహితుడను అయినాను. ప్రాణిలోకంలో ప్రవేశించాను. నేటినుండి నిత్యం నీకు అనుచరుడను(వెంటనుండేవాడు) కాదలంచాను.

జింక- 'అటులనే కానిమ్ము'.

గ. తతః పశ్చాదస్తంగతే సవితరి భగవతి మరీచిమాలిని తౌ మృగస్య వాసభూమిం గతౌ. తత్ర చమ్పకవృక్షశాఖాయాం సుబుద్ధి నామా కాకో మృగస్య చిరమిత్రం నివసతి. తౌ దృష్ట్వా కాకోఽవదత్ 'సఖే, చిత్రాఙ్గ కోఽయం ద్వితీయః'? మృగో బ్రూతే- "జమ్బుకోఽయమస్మత్సఖ్య మిచ్ఛన్నాగతః". కాకో బ్రూతే- "మిత్ర ! అకస్మాదాగన్తునా సహ మైత్రీ న యుక్తా. తన్న భద్రమాచరితమ్.తథా చోక్తమ్"-

శ్లో. అజ్ఞాతకులశీలస్య వాసో దేయో న కస్యచిత్,
మార్జారస్య హి దోషేణ హతో గృధ్రో జరద్గవః. 56

తావాహతుః- 'కథమేతత్' ఇతి.

కాకః కథయతి-

అను. పిమ్మట భగవానుడూ కిరణమాలాలిరాజమానుడూ అయిన సూర్యుడు అస్తమింపగానే జింక, నక్క రెండూ కలిసి జింకనివాసానికి పోయాయి. అచ్చట చంపకవృక్షంయొక్క కొమ్మమీద సుబుద్ధి అనే కాకి నివసిస్తూ ఉంది. అది జింకకు చిరకాలమిత్రం. ఆ కాకి ఈ ఇరువురిని చూచింది- ఇలా జింకను

అడిగింది- 'మిత్రమా, చిత్రాంగా! ఈ రెండవవాడు ఎవడు?

జింక ఇలా బదులు పల్కింది- 'ఇతడు నక్క. మన స్నేహం కోరి వచ్చాడు'. మరల కాకి ఇలా అంది- 'మిత్రమా, అకస్మాత్తుగా క్రొత్తగా వచ్చిన వాడితో స్నేహం సముచితం గాదు. అందువల్ల నీవు చేసినది యుక్తంగా లేదు. విజ్ఞులు ఇలా అన్నారు-

"కులం-స్వభావం తెలిసికొనక ఎవరికినీ ఆశ్రయం ఇవ్వరాదు. ఏలనన-అలా ఆశ్రయం ఇచ్చి జరద్గవం అనే గ్రద్ద పిల్లి చేసిన తప్పిదానికి బలియైంది".

అవి (మృగం-నక్క) అడిగాయి- 'అది ఎట్లు? ఆ కథ తెలుపుము'. కాకి ఇలా చెప్పసాగింది.

## 4. జరద్గవ-దీర్ఘకర్ణయోః కథా

గ. అస్తి భాగీరథీతీరే గృధ్రకూటనామ్ని పర్వతే మహాన్ పర్కటీవృక్షః. తస్య కోటరే దైవదుర్విపాకాద్ గలితనఖ-నయనో జరద్గవనామా గృధ్రః ప్రతివసతి. అథ కృపయా తజ్జీవనాయ తద్వృక్షవాసినః పక్షిణః స్వాఽఽహారాత్ కిఞ్చిత్ కిఞ్చిదుద్ధృత్య తస్మై దదతి, తేనాఽసౌ జీవతి; తేషాం శాబకరక్షాఞ్చ కరోతి. అథ కదాచిద్దీర్ఘకర్ణనామా మార్జారః పక్షిశాబకాన్ భక్షయితుం తత్రాఽఽగతః. తతస్తమాయాన్తం దృష్ట్వా పక్షిశాబకైర్భయార్తైః కోలాహలః కృతః. తచ్ఛ్రుత్వా జరద్గవేనోక్తమ్- 'కోఽయమాయాతి'ఇతి. దీర్ఘకర్ణో గృధ్రమవలోక్య సభయమాహ- "హా! హతోఽస్మి". యతోఽయం మాం వ్యాపాదయిష్యతి.

అను. గంగాతీరమున గృధ్రకూటం అనే పర్వతం గలదు. ఆ పర్వతమున ఒక పెద్ద జువ్విచెట్టు ఉంది. ఆ చెట్టున ఉండే ఒకానొక తొఱ్ఱలో జరద్గవం

అనే ముదుసలి అయిన గ్రద్ధ నివసిస్తూ ఉంది. దౌర్భాగ్యంవలన దానికి గోళ్లు ఊడిపోయాయి. కన్నులు సరిగా కనబడవు. అయినా ఆ చెట్టుమీద నివసించే తక్కిన పక్షులు దాన్ని దయతో చూచేవి. తాము సంపాదించిన ఆహారంలో ప్రతి పక్షి ఏదో కొంత దానికి ఇచ్చేవి. ఆ ఆహారంతో ఆ ముసలిగ్రద్ధ జీవించేది. ఆ పక్షుల పిల్లలను (పక్షులు వేటకు పోయినప్పుడు) కాపాడుతూ ఉండేవి. అంతే ఒకనాడు దీర్ఘకర్ణుడు అనే పిల్లి ఆ పక్షుల పిల్లలను భక్షించేందుకై ఆ చెట్టుమీదికి వచ్చింది. అలా వచ్చే పిల్లిని పక్షుల పిల్లలు చూచాయి. భయంతో అఱచుటకు ఆరంభించాయి. జరద్గవం ఆ గోలను వినింది- 'ఎవరు (ఇచ్చటకి)వచ్చుచున్నారు' అని బిగ్గరగా అడిగింది. దీర్ఘకర్ణుడు జరద్గవాన్ని చూచాడు- భయంతో గడగడ వణకిపోయాడు. ఇలా తలంచాడు- 'అయ్యో! చచ్చాను. ఇతడు చంపివేస్తాడు.''

గ. అథవా-

శ్లో. తావద్భయస్య భేతవ్యం యావద్భయమనాగతమ్,
ఆగతం తు భయం వీక్ష్య నరః కుర్యాద్యథోచితమ్. 57

అధునాఽతిసన్నిధానే పలాయితు మక్షమః. తద్యథా భవితవ్యం తథా భవతు; తావద్విశ్వాసముద్పాద్యాఽస్య సమీప ముపగచ్ఛామి''- ఇత్యాలోచ్య తముపసృత్యాఽబ్రవీత్-

అను. అట్లుగానిచో-"భయకారణం దూరంగా ఉంటే భయం చెందాలి. భయహేతువు మిక్కిలి దగ్గరగా ఉన్నచో భయపడి లాభం లేదు. తగిన ప్రతీకారాన్ని ఏదో ఒకదాన్ని మానవుడు ఆలోచించాలి''. 57

ఇప్పుడు ఈ గ్రద్దకు మిక్కిలి దగ్గరలో ఉన్నాను. అందువలన పాఱిపోవ డానికినీ సాధ్యం గాదు. ఏది జరుగాలో అది జరుగును. అయినా దీనికి నమ్మకం గల్గించి సమీపిస్తాను. ఇలా తలంచి గ్రద్దకు దగ్గరగా పోయింది- ఇలా పల్కింది-

గ. 'ఆర్య! త్వా మభివన్దే' గృధ్రోఽవదత్-'కస్త్వమ్'? సోఽవదత్- 'మార్జారోఽహమ్'. గృధ్రో బ్రూతే- 'దూరమపసర. నో చేత్ హన్తవ్యోఽసి మయా'. మార్జారోఽవదత్- "శ్రూయతాం తావన్మద్వచనమ్. తతో యద్యహం వధ్యస్తదా హన్తవ్యః".

అను. దీర్ఘకర్ణుడు(పిల్లి)-"అయ్యా! నమస్కారం."

జరద్గవుడు (గ్రద్ద)- 'ఎవరు నీవు'?

దీర్ఘకర్ణుడు- 'నేను పిల్లిని'.

జరద్గవుడు- 'దూరంగా తొలగిపొమ్ము. లేనిచో చంపివేస్తాను'.

దీర్ఘకర్ణుడు-''నా మాట వినండి. ఆమీదట నేను వధార్హుడనైనచో చంపి వేయండి".

గ. యతః-

శ్లో. జాతిమాత్రేణ కిం కశ్చిద్ వధ్యతే పూజ్యతే క్వచిత్,
వ్యవహారం పరిజ్ఞాయ వధ్యః పూజ్యోఽథవా భవేత్. 58

అను. ఏల ననగా - ''కేవలం జాతిమాత్రంచే ఎచ్చటనూ ఎవడూ పూజార్హుడు గాని వధార్హుడు గాని కాజాలడు. నడవడికవల్లనే వధ్యుడో పూజ్యుడో అగును.''

గ. గృధ్రో బ్రూతే- 'బ్రూహి కిమర్థమాగతోఽసి?" సోఽవదత్- "అహమత్ర గఙ్గాతీరే నిత్యస్నాయీ నిరామిషాశీ బ్రహ్మచారీ చాన్ద్రాయణ వ్రతమాచరం స్తిష్ఠామి। యుష్మాన్- 'ధర్మజ్ఞానరతాః ప్రేమవిశ్వాస భూమయః'- ఇతి పక్షిణః సర్వే సర్వదా మమాఽగ్రే ప్రస్తువన్తి. అతో భవద్భ్యో విద్యావయోవృద్ధేభ్యో ధర్మం శ్రోతుమిహాగతః. కిన్తు భవన్త శ్చైతాదృశా ధర్మజ్ఞాః, యన్మామతిథిం హన్తుముద్యతాః. గృహస్థ ధర్మశ్చైషః-

శ్లో. అరావప్యుచితం కార్యమాతిథ్యం గృహమాగతే,
ఛేత్తుః పార్శ్వగతాం ఛాయాం నోపసంహరతే ద్రుమః. 59

అను. అది విని గ్రద్ద (జరద్గవం) అడిగింది- "ఎందుకు వచ్చావో తెలుపుము"? అతడు (పిల్లి) చెప్పసాగాడు- "నేను ఇచ్చట గంగాతీరంలో నివసిస్తున్నాను. గంగలో త్రిసంధ్యల స్నానం చేస్తాను. మాంసభక్షణ మానివేశాను. బ్రహ్మచర్యం పాటిస్తూ చాంద్రాయణవ్రతం ఆచరిస్తూ ఉన్నాను. ఇచ్చటి పక్షులు

అన్నీ నాయెదుట తమ్ముగూర్చి నిత్యం- ధర్మజ్ఞానతత్పరులు అనియూ, ప్రేమ విశ్వాసనివాసు లనియూ పొగడుతూ ఉంటాయి. అందుచే- విద్యచే జ్ఞానంచే వృద్ధులు అయిన తమవలన ధర్మాన్ని వినదలచి ఇచ్చటికి వచ్చాను. కాని తాము ఇంటికి వచ్చిన నన్ను- 'అతిథి' అనియూ తలంపక చంపడానికి యత్నించే ధర్మజ్ఞులై ఉన్నారు. విజ్ఞులు గృహస్థధర్మాన్నిగూర్చి ఇలా తెల్పారు-

"శత్రువు అయినా తన యింటికి వచ్చినచో ఆతిథ్యం ఇవ్వవలయును. వృక్షం తనను ఛేదించేందుకై ప్రక్కన చేరినవానినుండి తన నీడను ఉపసంహరింపదు". 59

గ. కిఞ్చ యద్యన్నం నాస్తి తదా సుప్రీతేనాఽపి వచసా తావదతిథిః పూజ్య ఏవ. తథా చోక్తమ్-

శ్లో. తృణాని భూమిరుదకం వాక్ చతుర్థీ చ సూనృతా,
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యన్తే కదాచన. 60

అన్యచ్చ-

శ్లో. బాలో వా యది వా వృద్ధో యువా వా గృహమాగతః,
తస్య పూజా విధాతవ్యా సర్వస్యాఽభ్యాగతో గురుః. 61

అను. మరియూ "ఆహారం లేనియెడల ప్రేమపూర్వకమైన వాక్కుతోనైనా అతిథిని గౌరవించాలి. పెద్దలు ఇలా పల్కారు- దర్భలతో అల్లిన చాప- విశుద్ధ ప్రదేశం, నిర్మలమైన నీరు, సత్యప్రియమైన వాక్కు- అనే ఈ నాలుగు సజ్జనుల ఇంటిని వదలిపోవు". 60

ఇంకనూ-"బాలుడైనా, వృద్ధుడైనా, యువకుడైనా తన యింటికి వచ్చినచో ఆదరించాలి. అందరికి అతిథి అయినవాడు గురుతుల్యంగా పూజనీయుడు." 61

గ. అపరఞ్చ-

శ్లో. నిర్గుణేష్వపి సత్త్వేషు దయాం కుర్వన్తి సాధవః,
న హి సంహరతే జ్యోత్స్నాం చన్ద్రశ్చాణ్డాలవేశ్మనః. 62

అన్యచ్చ-

శ్లో. అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే,
స తస్మై దుష్కృతం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి. 63

అను. "సజ్జనులు గుణహీనులు అయిన ప్రాణులయెడను దయతో ప్రవర్తిస్తారు. చంద్రుడు చండాలగృహంనుండియు తన వెన్నెలను ఉపసంహరింపడు".

అన్యవిధంగానూ- "ఏవని ఇంటినుండి అతిథి విఫలమనోరథుడై మరలి పోవునో- ఆ యింటియజమానునికి తన పాపం ఇచ్చి అతని పుణ్యం తీసికొని పోవుచున్నాడు." 63

గ. అన్యచ్చ-

శ్లో. ఉత్తమస్యాఽపి వర్ణస్య నీచోఽపి గృహమాగతః,
పూజనీయో యథాయోగ్యం సర్వదేవమయోఽతిథిః. 64

అను. ఇంకనూ- 'ఉత్తమజాతివాడైననూ తన యింటికి వచ్చిన నీచకులం వానిని సైతం తగినట్లు ఆదరించాలి. ఏలనన- అతిథి సర్వదేవతాస్వరూపుడు'. 64

గ. గృధ్రోఽవదత్- 'మార్జారో హి మాంసరుచిః. పక్షిశాబకాశ్చాత్ర నివసన్తి. తేనాఽహమేవం బ్రవీమి'. తచ్ఛ్రుత్వా మార్జారో భూమిం స్పృష్ట్వా కర్ణౌ స్పృశతి. బ్రూతే చ- 'మయా ధర్మశాస్త్రం శ్రుత్వా వీతరాగేణేదం దుష్కరం వ్రతం చాన్ద్రాయణమధ్యవసితమ్. యతః పరస్పరం వివదమానానామపి ధర్మశాస్త్రాణామ్-'అహింసా పరమో ధర్మః'- ఇత్యత్రైకమత్యమ్.

యతః-

శ్లో. సర్వహింసానివృత్తా యే నరాః సర్వసహాశ్చ యే,
సర్వస్యాఽఽశ్రయభూతాశ్చ తే నరాః స్వర్గగామినః. 65

అను. గ్రద్ద ఇలా అన్నది- 'పిల్లికి మాంసం ఇష్టంగా ఉంటుంది. ఇచ్చట పక్షుల పిల్లలు నివసిస్తూన్నాయి. అందుచే నేను అలా అన్నాను'.

అది విని పిల్లి భూమిని తగిలి చెవులను తాకింది. పిమ్మట ఇట్లు పల్కింది- "నేను ధర్మశాస్త్రాలు విన్నాను. అందుచే కోరికలు అన్నీ వదలివేశాను. ఇప్పుడు ఈ కఠోరమైన (దుష్కరం అయిన) చాంద్రాయణవ్రతం ఆచరిస్తున్నాను. పరస్పరం భేదభావాలతో ఉండే ధర్మశాస్త్రాలు సైతం 'అహింస పరమధర్మం' అని ఏకకంఠంతో అంగీకరిస్తున్నాయి. ఏల ననగా—'ఏ మానవులు, ఏవిధమైన హింసలను చేయరో, సర్వసుఖదుఃఖాది ద్వంద్వాలను సహిస్తారో- అన్నిప్రాణులకు ఆశ్రయదాతలో, వారు స్వర్గసుఖం పొందెదరు'. 65

గ. అన్యచ్చ-

శ్లో. ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యత్తు గచ్ఛతి. 66

కిఞ్చ—

శ్లో. యోఽత్తి యస్య యదా మాంసముభయోః పశ్యతాన్తరమ్,
ఏకస్య క్షణికా ప్రీతిరన్యః ప్రాణైర్వియుచ్యతే. 67

అను. మరియూ- 'మైత్రీధర్మం అనేది ఒక్కటియే మరణమునందునూ వెంబడించును. తక్కిన పుత్రాదిసంబంధాలు అన్నీ శరీరంతోపాటు నశిస్తాయి'. 66

ఇంకనూ- 'ఎవడైనా ఎవని మాంసాన్నైనా తిన్నచో ఈ ఇరువురికీ భేదం చూడుము- ఒకనికి క్షణికమైన తృప్తి గల్గగా వేఱొకడు ప్రాణాలు పోగొట్టుకొనుచున్నాడు'. 67

గ. అపిచ-

శ్లో. మర్తవ్యమితి యద్దుఃఖం పురుషస్యోపజాయతే.
శక్యస్తేనానుమానేన పరోఽపి పరిరక్షితుమ్. 68

శృణు పునః-

శ్లో. స్వచ్ఛన్దవనజాతేన శాకేనాఽపి ప్రపూర్యతే,
అస్య దగ్ధోదరస్యాఽర్థే కః కుర్యాత్ పాతకం మహత్. 69

అను. మరియూ- 'మానవుడు తనకు మరణం దాపురిస్తే ఎలా దుఃఖిస్తాడో ఇతరుడునూ అలాగే దుఃఖిస్తాడు-అని భావించి ఇతరున్ని రక్షించాలి'. 68

ఇంకనూ వినుము- 'అడవిలో తమంతగా పుట్టిన ఫల మూల పత్రాదుల వల్లనూ జీవింపవచ్చును. అట్టియెడ ఈ పాడుపొట్టకై హింసాదికమైన పాపకార్యాన్ని ఎందుకు చేయాలి'? 69

గ. ఏవం విశ్వాస్య స మార్జార స్తరుకోటరే స్థితః. తతో దినేషు గచ్ఛత్సు అసౌ పక్షిశాబకానాక్రమ్య స్వకోటరమానీయ ఖాదతి. అథ యేషామపత్యాని ఖాదితాని, తైః శోకాఽఽర్తై ర్విలపద్భి రిత స్తతో జిజ్ఞాసా సమారబ్ధా. తత్పరిజ్ఞాయ మార్జారః కోటరాన్నిస్సృత్య బహిః పలాయితః. పశ్చాత్ పక్షిభిరిత స్తతో నిరూపయద్భి స్తత్ర తరుకోటరే శాబకాః ఖాదితా ఇతి (సర్వైః పక్షిభిః)నిశ్చిత్య స గృధ్రో వ్యాపాదితః. అతోఽహం బ్రవీమి– 'అజ్ఞాతకులశీలస్య , ఇత్యాది.

అను. ఇలా నమ్మకం గల్గించి ఆ చెట్టుతొఱ్ఱలోనే నివసింపసాగింది. ఇట్లు కొన్ని దినాలు గడిచాయి. తర్వాత అది పక్షుల పిల్లలను పట్టుకొనేది. తన తొఱ్ఱకు తెచ్చుకొని తినివేసేది. పిల్లలను పోగొట్టుకొనిన పక్షులు దుఃఖంతో అటు ఇటు వెదక నారంభించాయి. ఆ పిల్లి, అలా పక్షులు వెదకడం గమనించింది- తొఱ్ఱనుండి జాగ్రత్తగా వెలుపలికి వచ్చింది. పక్షుల కన్ను గప్పి పాఱిపోయింది. పిమ్మట తమ పిల్లలకై వెదకే పక్షులు పిల్లి వదలిన చెట్టుతొఱ్ఱను చేరాయి. అందులో తమ పిల్లల ఈకలు మొదలైనవాటిని గుర్తించాయి. ఆ ముసలిగ్రద్దయే (జరద్గవమే)తమ పిల్లలను తినివేసింది అని నిశ్చయించాయి. వెంటనే ఆ గ్రద్దను చంపివేసాయి. అందుచే నేను చెప్పుచున్నాను- 'కులశీలాలు తెలియక చోటు ఇవ్వరాదు'- ఇత్యాదిగా.

గ. ఇత్యాకర్ణ్య స జమ్బుకః సకోప మిద మాహ- "మృగస్య ప్రథమదర్శనదినే భవానపి అజ్ఞాతకులశీల ఏవాసీత్. తత్కథం భవతా సహైతస్య స్నేహానువృత్తిరుత్తరోత్తరం వర్ధతే?"

అథవా-

శ్లో. యత్ర విద్వజ్జనో నాఽస్తి శ్లాఘ్య స్తత్రాఽల్పధీరపి,
నిరస్తపాదపే దేశే ఏరణ్డోఽపి ద్రుమాయతే. 70

అను. ఇది విని నక్క కోపంతో ఇలా అంది- 'ఈ లేడిని చూచిన మొదటిదినాన తాము గూడ అజ్ఞాతకులశీలురుగానే ఉంటిరి. అలాంటప్పుడు తమతో ఇతనికి మైత్రి దినదినానికి ఎట్లు వర్ధిల్లుతూ వచ్చింది?

మరియూ-'ఎచ్చట విద్వాంసులు లేరో అచ్చట అల్పబుద్ధులు సైతం కొనియాడబడుదురు. చెట్లు లేనిచోట ఆముదముచెట్టే గొప్ప వృక్షంగా విరాజిల్లుతుంది'.

గ. అన్యచ్చ-

శ్లో. అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్,
ఉదారచరితానాన్తు వసుధైవ కుటుమ్బకమ్. 71

గ. యథా చాయం మృగో మమ బన్ధుస్తథా భవానపి. మృగోఽబ్రవీత్- 'కిమనేనోత్తరోత్తరేణ. సర్వైరేకత్ర విశ్రమ్భాలాపైః సుఖమనుభవద్భిః స్థీయతామ్'.

యతః-

శ్లో. న కశ్చిత్ కస్యచిన్మిత్రం న కశ్చిత్ కస్యచిద్రిపుః,
వ్యవహారేణ మిత్రాణి జాయన్తే రిపవస్తథా. 72

అను. 'వీడు నావాడు లేక పరాయివాడు అనే భావం అల్పబుద్ధులకే ఉంటుంది. ఉదారచిత్తులకు లోకం అంతా తమ కుటుంబంగానే ఉండును'. 71

ఈ లేడి నాకు ఎలా బంధువో అలాగే నీవును". లేడి ఇలా అంది-"ఇట్లు మాటకు మాట పెంచుకొనడంవలన ఉపయోగం ఏముంది? అందరం ఒకచోట చేరి సార్థకమైన గోష్ఠిసుఖం అనుభవించుదము. ఏలననగా.

'ఎవడు ఎవనికీ మిత్రుడుగాని శత్రువుగానీ (సహజంగా)గాడు. నడవడికచే మిత్రులుగాని శత్రువులుగాని అగుచుందురు'. 72

గ. కాకేనోక్తమ్- 'ఏవమస్తు'. అథ ప్రాతః సర్వే యథాఽభిమతదేశం గతాః. ఏకదా నిభృతం శృగాలో బ్రూతే- 'సఖే మృగ। ఏతస్మిన్నేవ వనైకదేశే సస్యపూర్ణం క్షేత్రమస్తి. తదహం త్వాం తత్ర

నీత్వా దర్శయామి' ఇతి. తథా కృతే సతి మృగః ప్రత్యహం తత్ర గత్వా ఖాదతి. తతో దినకతిపయేన క్షేత్రపతినా తద్దృష్ట్వా పాశాస్తత్ర యోజితాః. అనన్తరం పునరాగతో మృగస్తత్ర చరన్ పాశబద్ధోఽచిన్తయత్-'కో మామితః కాలపాశాదివ వ్యాధపాశాత్ త్రాతుం మిత్రాదన్యః సమర్థః' ఇతి. అత్రాన్తరే జమ్బుకస్తత్రాఽఽగత్యోపస్థితోఽచిన్తయత్-'ఫలితస్తావదస్మాకం కపటప్రబన్ధః, మనోరథ-సిద్ధిరపి బాహుల్యాన్మే భవిష్యతి. యత ఏతస్యోత్కృత్యమానస్య మాంసాఽసృగ్లిప్తాన్యస్థీని మయాఽవశ్యం ప్రాప్తవ్యాని. తాని చ బాహుల్యేన మమ భోజనాని భవిష్యన్తి-

అను. కాకి చెప్పింది- 'అలాగే కానిమ్ము'. పిమ్మట వేకువన అవి అన్నీ (మూడూ) తమకు నచ్చిన ప్రదేశాలకు వెళ్ళినాయి. ఒకనాడు ఒంటరిగా నక్క జింకతో ఇలా అంది- ''ఈ అడవిలోనే ఒకచోట పైరుతో నిండిన సుక్షేత్రం ఉంది. దానిని నీకు చూపెదను.' నక్క అలాగే చేసింది. జింక ప్రతిదినం అచ్చటికి పోయి మేయసాగింది. అంత కొన్ని దినాలకు క్షేత్రస్వామి ఇది గ్రహించాడు. జింక వచ్చేదారిలో ఉచ్చులు(వలత్రాళ్ళు) పన్నినాడు. మరుదినం జింక వచ్చింది. మేస్తూ పోయి ఉచ్చుల్లో చిక్కుపడింది- ఇలా విచారింపదొడగింది- 'మృత్యు పాశాలవంటి ఈ వేటకాడి ఉచ్చుత్రాళ్లనుండి మిత్రునికంటె ఇతరు డెవడు నన్ను రక్షింపగలడు'. ఇంతలో నక్క ఆ పొలంవద్దకు వచ్చింది- జింక ఉచ్చులలో చిక్కుపడడం తెలుసుకొంది- సంతోషంతో ఇలా ఆలోచన చేయసాగింది-''నా కపటవ్యూహం ఫలించింది. కోరికయూ సంపూర్ణంగా సిద్ధిస్తుంది. ఏలనన- దీనిని ముక్కలుముక్కలుగా నఱుకునప్పుడు నెత్తురుతో పూయబడినవీ, మాంసశేషం గలవీ అయిన ఎముకలు నాకు తప్పక లభిస్తాయి. అవి నాకు వలసినంత భోజన పదార్థాలు అగును.

గ. స చ మృగస్తం దృష్ట్వోల్లాసితో బ్రూతే- "సఖే! ఛిన్ధి తావన్మమ బన్ధనమ్. సత్వరం త్రాయస్వ మామ్.

యతః-

శ్లో. ఆపత్సు మిత్రం జానీయాద్యుద్ధే శూరమృణే శుచిమ్,
భార్యాం క్షీణేషు విత్తేషు వ్యసనేషు చ బాన్ధవాన్. 73

అపరఞ్చ-

శ్లో. ఉత్సవే వ్యసనే చైవ దుర్భిక్షే రాష్ట్రవిప్లవే,
రాజద్వారే శ్మశానే చ యస్తిష్ఠతి స బాన్ధవః. 74

అను. ఆ జింకయూ ఆ నక్కను చూచింది. మిక్కిలి ఆనందం పొందింది. ఇలా పల్కింది- "మిత్రమా, నా బంధనాన్ని ఛేదింపుము. వేగంగా నన్ను రక్షింపుము. ఏలననగా-

'ఆపదలందు మిత్రుడూ- యుద్ధంలో వీరుడూ- అప్పులబాధలో పరిశుద్ధ వర్తనుడూ- ధనహీనదశలందు భార్యా- కష్టదశలందు బంధువులను తెలిసికొన వలయును. 73

మరియూ- 'ఆనందంలో, దుఃఖంలో, కఱువులో, దేశబాధలో, రాజద్వారంలో, శ్మశానంలో తోడుగా ఉండేవాడే బంధువు అనబడును'. 79

గ. జమ్బుకః పాశం ముహుర్ముహుర్విలోక్యాఽచిన్తయత్- 'దృఢస్తావదయం బన్ధః'. బ్రూతే చ- 'సఖే! స్నాయు నిర్మితాః పాశాః। తదద్య భట్టారకవాసరే కథమేతాన్ దన్తైః స్పృశామి? మిత్ర। యది చిత్తే నాఽన్యథా మన్యసే తదా ప్రభాతే యత్త్వయా వక్తవ్యం తత్ కర్తవ్యమ్' ఇతి. అనన్తరం స కాకః ప్రదోషకాలే మృగమనాగతమవలోక్య ఇతస్తతోఽన్విష్యన్ తథావిధం తం దృష్ట్వోవాచ- "సఖే ! కిమేతత్" ఇతి. మృగేణోక్తమ్- "అవధీరితసుహృద్వాక్యస్య ఫలమేతత్.

తథా చోక్తమ్-

శ్లో. సుహృదాం హితకామానాం యః శృణోతి న భాషితమ్,
విపత్సన్నిహితా తస్య స నరః శత్రునన్దనః. 75

అను. అప్పుడు నక్క వలను మాటిమాటికి చూచి ఇలా తలంచింది- 'ఈ బంధం చాల గట్టిది'. ఇట్లు తలంచి జింకతో ఇలా అంది-"ఈ ఉచ్చుత్రాళ్ళు నరాలతో చేసినట్టివి. నేడు రవివాసరం(ఆదివారం). కనుక దంతాలతో ఎట్లు తాకగలను? నీవు మనస్సులో వేఱుగా దలంపనిచో నేను చెప్పేది వినుము. రేపు వేకువ వస్తాను- అప్పుడు నేను చేయదగినది ఏదియో తెలుపుము" అని నక్క వెళ్ళిపోయింది. పిమ్మట కాకి సాయంకాలమున మిత్రుడు రాకపోవడం గుర్తించింది. ఇటు అటు వెదకుచూ తిరిగింది. పొలంలో అలా పాశబద్ధుడైన మిత్రుణ్ణి చూచింది. ఇలా అడిగింది- 'మిత్రమా! ఇది ఏమి? జింక సమాధానం చెప్పింది- 'ఇది మిత్రుడి మాటను తిరస్కరించినందులకు లభించిన ఫలం. విజ్ఞులు అన్నారు-

'మేలు కోరే మిత్రుల మాటలను విననివానికి ఆపదలు వెంటనే దాపురిస్తాయి. వాన్ని చూచి శత్రువులు సంతోషపడెదరు'. 75

గ. కాకో బ్రూతే- 'స వఞ్చకః క్వాఽఽస్తే?' మృగేణోక్తమ్- 'మన్మాంసార్థీ తిష్ఠత్యత్రైవ'. కాకో బ్రూతే- మిత్ర! ఉక్తమేవ మయా పూర్వమ్-

శ్లో. అపరాధో న మేఽస్తీతి నైతద్విశ్వాసకారణమ్,
విద్యతే హి నృశంసేభ్యో భయం గుణవతామపి. 76

అను. కాకి అడిగింది- 'ఆ వంచకుడు ఎచ్చట ఉన్నాడు?'

జింక చెప్పింది- 'నా మాంసం తినగోరి ఇచ్చటనే (ఒకచోట) దాగి ఉన్నాడు'.

కాకి మరలా ఇలా అంది- "మిత్రమా! నేను మొదటనే చెప్పాను". 'నా యందు దోషం లేదు. నాకు ఎవరివలననూ భయం లేదు'-అని విశ్వాసంతో ఉండడం సముచితం గాదు. ఎంతవారికైనా దుష్టులవల్ల అపాయభయం ఉండుట ప్రసిద్ధం.' 76

శ్లో. దీపనిర్వాణగన్ధఞ్చ సుహృద్వాక్యమరున్ధతీమ్,
న జిఘ్రన్తి న శృణ్వన్తి న పశ్యన్తి గతాయుషః. 77

శ్లో. పరోక్షే కార్యహన్తారం ప్రత్యక్షే ప్రియవాదినమ్,
వర్జయేత్తాదృశం మిత్రం విషకుమ్భం పయోముఖమ్. 78

అను. ఆయువు మూడినవారు, దీపం ఆరిపోయినప్పుడు వచ్చే వాసనను గ్రహింపలేరు. మిత్రవాక్యాన్ని వినరు. అరుంధతీనక్షత్రాన్ని చూడలేరు. 77

పరోక్షంలో (అగుపడకుండా) కీడు చేసేవాడూ - ప్రత్యక్షంగా మధురవాక్కులు వల్కేవాడూ అయిన మిత్రుడు పయోముఖవిషకుంభంతో సమానం-అట్టివాడి మైత్రిని చేయరాదు. దూరంగా ఉండాలి'. 78

గ. తతః కాకో దీర్ఘం నిశ్వస్య పునరువాచ- 'అరే వఞ్చక, కిం త్వయా పాపకర్మణా కృతమ్.

యతః-

శ్లో. సంలాపితానాం మధురైర్వచోభిః
మిథ్యోపచారైశ్చ వశీకృతానామ్,
ఆశావతాం శ్రద్దధతాఞ్చ లోకే
కిమర్థినాం వఞ్చయితవ్యమస్తి. 79

అను. ఇలా అని దీర్ఘంగా నిట్టూర్పు విడిచి కాకి మరల ఇలా అంది-"ఓరీ వంచకుడా! పాపకర్ముడవైన నీవు ఎందుకు ఈ కీడును చేశావు? ఏలనన-

ఈ లోకంలో తియ్యని మాటలచే సంలాపితులూ (=మాట్లాడింపబడినవారూ)-కపటోపచారాలచే లోబఱచుకొనబడినవారూ- అందువల్లనే నమ్మినవారూ- లేనిపోని కోర్కెల నొందింపబడినవారూ అయినవారిని వంచించడం మంచిది గాదు.'

గ. అన్యచ్చ-

శ్లో. ఉపకారిణి విశ్రబ్ధే శుద్ధమతౌ యః సమాచరతి పాపమ్,
తం జనమసత్యసన్ధం భగవతి వసుధే! కథం వహసి. 80

అను. మరియూ-'ఓ భగవతీ, భూమాతా! ఉపకారం చేసినవాడూ, నమ్మిన

వాడూ, నిర్మలచిత్తుడూ అయిన మానవుని విషయంలో పాపంగా ప్రవర్తించే (=కీడు చేసే) అసత్యదీక్షితున్ని ఎలా మోయుచున్నావు?' 80

శ్లో. దుర్జనేన సమం సఖ్యం వైరఞ్చాఽపి న కారయేత్,
ఉష్ణో దహతి చాఽఙ్గారః శీతః కృష్ణాయతే కరమ్. 81

అను. దుష్టునితో స్నేహంగానీ విరోధంగాని చేయరాదు. నిప్పు వేడిగా ఉన్నచో కాల్చును. చల్లారినచో చేతిని నల్లగా చేయును. 81

గ. అథవా స్థితిరియం దుర్జనానామ్-

శ్లో. ప్రాక్ పాదయోః పతతి ఖాదతి పృష్ఠమాంసం
కర్ణే కలం కిమపి రౌతి శనైర్విచిత్రమ్,
ఛిద్రం నిరూప్య సహసా ప్రవిశత్యశఙ్కః
సర్వం ఖలస్య చరితం మశకః కరోతి. 82

అను. దోమ దుర్జనుడి చరిత్రను పూర్తిగా అనుకరిస్తూ ఉంది. మొదట కాళ్లపై పడును (ప్రాలును). వీపున మాంసం తినును. చెవిని చేరి మధురంగా ఏదో మెల్లగా భాషించును. ఛిద్రం (లోపం-రంధ్రం) గమనించి వెంటనే నిశ్శంకగా లోనికి ప్రవేశించును. (కీడుచేయును).

గ. తథా చ-

శ్లో. దుర్జనః ప్రియవాదీ చ నైతద్విశ్వాసకారణమ్,
మధు తిష్ఠతి జిహ్వాగ్రే హృది హాలాహలం విషమ్. 83

అను. అటులనే-"దుర్జనుడు మధురంగా మాట్లాడవచ్చును. అయినా ఆమాత్రంచే విశ్వసింపరాదు. వానికి నాలుకచివరన తేనెయూ మనస్సులో హాలాహల విషం ఉండును." 38

గ. తతః ప్రభాతే స క్షేత్రపతి ర్లగుడహస్త స్తం ప్రదేశమాగచ్ఛన్ కాకేనాఽవలోకితః. తమవలోక్య కాకేనోక్తమ్-"సఖే మృగ! త్వమాత్మానం మృతవత్ సందర్శ్య వాతేనోదరం పూరయిత్వా పాదాన్

స్తబ్ధీకృత్య తిష్ఠ। అహం తవ చక్షుషీ కిమపి విలిఖామి. యదాఽహం శబ్దం కరోమి తదా త్వముత్థాయ సత్వరం పలాయిష్యసే" ఇతి. మృగ స్తథైవ కాకవచనేన స్థితః. తతః క్షేత్రపతినా హర్షోత్ఫుల్లలోచనేన తథావిధో మృగ ఆలోకితః. అథాఽసౌ "ఆః స్వయం మృతోఽసి"-ఇత్యుక్త్వా మృగం బన్ధనాన్మోచయిత్వా పాశాన్ సంవరీతుం (సఙ్గ్రహీతుం) సత్వరో (సయత్నో) బభూవ. తతః కియద్దూరేఽన్తరితే క్షేత్రపతౌ స మృగః కాకస్య శబ్దం శ్రుత్వా సత్వరముత్థాయ పలాయితః. తముద్దిశ్య తేన క్షేత్రపతినా ప్రకోపాత్ క్షిప్తేన లగుడేన శృగాలో వ్యాపాదితః.

అను. అంత ప్రాతఃకాలమున కాకి కఱ్ఱను చేత ధరించి వచ్చే పొలం యజమానిని చూచింది. వెంటనే జింకతో ఇలా అంది-"మిత్రమా ! మృగమా ! నీవు చచ్చినట్లు గాలిచే పొట్ట ఉబ్బించి కాళ్లను బిగువుగా నిగుడచాచి కదలకుండ పడుండుము. నేను నీ తలపై వ్రాలి కన్నులను గీకుచున్నట్లు నటిస్తాను-సమయం గుర్తించి నేను అరుస్తాను. వెంటనే నీవు లేచి పరుగెత్తుము." జింక అటులనే (కాకి చెప్పినట్లు) చేసింది. పిమ్మట పొలం యజమాని వచ్చాడు. అలా పడిఉండే జింకను చూచాడు. ఆనందంచే అతడి కన్నులు వికసించాయి. 'ఆహా! స్వయంగానే చచ్చినావే'- అని జింకనుగూర్చి అతడు అన్నాడు. జింకబంధనాలను అన్నింటిని విప్పాడు. ఆ త్రాళ్లను అన్నింటినీ సక్రమంగా చుట్టుకొనే త్వరలో అలా కొంత దూరం పోయాడు. వెంటనే కాకి అరచింది. అది విని జింక పరుగెత్తింది. క్షేత్ర స్వామి అది గాంచి కోపోద్రిక్తుడు అయ్యాడు. తన చేతిలోని కఱ్ఱను జింకపైకి విసరి వేశాడు. ఆ కఱ్ఱ జింకకు బదులు (దగ్గరలో పొంచి ఉండే) నక్కకు తగిలింది. ఆ వ్రేటుతో నక్క చచ్చింది.

తథా చోక్తమ్-

శ్లో. త్రిభిర్వర్షై స్త్రిభిర్మాసై స్త్రిభిః పక్షై స్త్రిభి ర్దినైః,
అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే. 84

అతోఽహం బ్రవీమి- భక్ష్యభక్షకయోః ప్రీతిః' ఇత్యాది.

అను. అందుచే విజ్ఞులు ఇలా అన్నారు-

'అత్యధికముతైన పుణ్యపాపాలచే ఇచ్చటనే మూడు సంవత్సరాలలో గానీ- మూడు నెలలలో గానీ- మూడు పక్షాలలో గానీ- మూడుదినాలలో గానీ ఫలం పొందును.' 84

అందుచే నేను (హిరణ్యకుడు అనే ఎలుకను) చెప్పుచున్నాను-'భక్ష్య-భక్షకులకు ప్రీతి'- ఇత్యాదిగా.

ఇది- మృగ-కాక-శృంగాలములకథ

గ. కాకః పునరాహ-

శ్లో. భక్షితేనాఽపి భవతా నాఽఽహారో మమ పుష్కలః,
త్వయి జీవతి జీవామి చిత్రగ్రీవ ఇవాఽనఘ. 85

అన్యచ్చ-

శ్లో. తిరశ్చామపి విశ్వాసో దృష్టః పుణ్యైకకర్మణామ్,
సతాం హి సాధుశీలత్వాత్ స్వభావో న నివర్తతే. 86

అను. అది విని లఘుపతనకుడు (కాకి) ఇలా మరల అన్నాడు- 'ఓ పాపరహితుడా! నిన్ను తిన్నంతమాత్రాన నాకు ఆహారం పరిపూర్ణం గాజాలదు. నీవు జీవిస్తే చిత్రగ్రీవుడివలె సంతోషంగా జీవిస్తాను. 85

మరియూ- పుణ్యకర్మపరాయణులైన పశుపక్ష్యాదులందును నమ్మదగినవి గలవు. సజ్జనులు సాధుస్వభావులు గనుక వారి గుణం మార్పును పొందదు. 86

గ. కిఞ్చ-

శ్లో. సాధోః ప్రకోపితస్యాఽపి మనో నాయాతి విక్రియామ్,
న హి తాపయితుం శక్యం సాగరామ్భ స్తృణోల్కయా. 87

అను. మరియూ ప్రకోపితుడు (రెచ్చగొట్టబడినవాడు) అయినా సజ్జనుడు మానసికంగా మార్పును పొందడు. గడ్డిపరకల అగ్నిచే సముద్రజలం వేడిమిని పొందదు గదా! 87

గ. హిరణ్యకో బ్రూతే- "చపలస్త్వమ్ చపలేన సహ స్నేహః సర్వథా న కర్తవ్యః.

తథా చోక్తమ్—

శ్లో. మార్జారో మహిషో మేషః కాకః కాపురుషస్తథా,
విశ్వాసాత్ ప్రభవన్త్యేతే విశ్వాసస్తత్ర నో హితః. 88

అను. హిరణ్యకుడు ఇలా అన్నాడు- 'నీవు చపలుడవు. చపలుడితో స్నేహం ఎట్టి పరిస్థితులలోనూ చేయరాదు. విజ్ఞులు అన్నారు.'

పిల్లి, దున్నపోతు, మేకపోతు, కాకి, దుర్జనుడు- ఈ అయిదుగురిని నమ్మరాదు. అలా నమ్మడంవల్లనే వీరు కీడు చేయడంలో సమర్థులు అగుచున్నారు. 88

గ. కిఞ్చాన్యత్- శత్రుపక్షో భవానస్మాకమ్. శత్రుణా సన్ధిర్న విధేయః.

ఉక్తఞ్చైతత్—

శ్లో. శత్రుణా న హి సన్దధ్యాత్ సంశ్లిష్టేనాఽపి సన్ధినా,
సుతప్తమపి పానీయం శమయత్యేవ పావకమ్. 89

అను. మరియూ ఇంకొక విషయం. నీవు మాకు శత్రుపక్షంవాడవు. శత్రువుతో సంధిని చేసికొనరాదు. విజ్ఞులు ఇలా అన్నారు-

"ఎట్టి దృఢమైన సంధిని అయినా శత్రువుతో చేసికొనరాదు. ఏలనన- ఎంతగా కాగిన నీరైననూ అగ్నిని ఆర్పుచునే ఉంది." 89

శ్లో. దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽలఙ్కృతోఽపి సన్,
మణినా భూషితః సర్పః కిమసౌ న భయఙ్కరః. 90

శ్లో. యదశక్యం న తచ్ఛక్యం యచ్ఛక్యం శక్యమేవ తత్,
నోదకే శకటం యాతి న చ నౌర్గచ్ఛతి స్థలే. 91

అను. దుర్జనుడు విద్యచే విరాజిల్లుచూ ఉండిననూ అతణ్ణి వదలిపెట్టవల యును. తలమీద మణిచే భాసిల్లుచుండిననూ పాము భయంకరమైనదియే గదా! 90

ఏది అసంభావ్యమో అది సంభవం గాదు. అలాగే ఏది సాధ్యమో అది సాధ్యమే అగును. నీటిపై బండి(రథం) పోలేదు: అలాగే నేలపై నౌక పయనింప జాలదు. 91

అపరఞ్చ-

శ్లో. మహతాఽప్యర్థసారేణ యో విశ్వసితి శత్రుషు.
భార్యాసు చ విరక్తాసు తదన్తం తస్య జీవితమ్. 92

అను. మరియూ- మహత్తరమైన ప్రయోజనాన్ని రక్షించి అయినా శత్రువును గాని అటులనే ప్రేమలేని భార్యలను గాని నమ్మి ఎవడైనా ప్రవర్తిల్లినచో వాడి జీవితం అంతటితోనే ముగిసినట్లు తలంచాలి.

గ. లఘుపతనకో బ్రూతే- "శ్రుతం మయా సర్వమ్. తథాపి మమైతావానేవ సఙ్కల్పః, యత్త్వయా సహ సౌహృద మవశ్యం కరణీయమితి. అన్యథాఽనాహారేణాఽఽత్మానం తవ ద్వారి వ్యాపాదయిష్యామీతి. తథాహి-

శ్లో. మృద్ఘటవత్ సుఖభేద్యో దుఃసన్ధానశ్చ దుర్జనో భవతి,
సుజనస్తు కనకఘటవద్ దుర్భేద్యశ్చాశు సన్ధేయః. 93

అను. అంత లఘుపతనకుడు ఇలా అనుచున్నాడు-'నేను తమ వాక్కును అంతా విన్నాను. అయినా నా సంకల్పం ఇదియే.' ఏమన-మీతో తప్పక మైత్రి చేయాలి. అలా కానిచో తమ ఇంటి ద్వారంవద్ద నిరాహారదీక్షచే మరణించాలి. అదియే తగిన పని.

దుర్జనుల స్నేహం మట్టికడవవలె తేలికగా పగిలిపోవును. దాన్ని అతికించడం సైతం చాలా కష్టం. ఇక సజ్జనస్నేహం బంగారుకడవవంటిది. అది తేలికగా పగిలిపోదు. ఒకవేళ పగిలినా అతికించడం సులభం. 93

కిఞ్చ –

శ్లో. ద్రవత్వాత్ సర్వలోహానాం నిమిత్తాన్మృగపక్షిణామ్,
భయాల్లోభాచ్చ మూర్ఖాణాం సఙ్గతం దర్శనాత్ సతామ్. 94

అను. కరిగిస్తే లోహాలు అన్నీ కలుస్తాయి. మృగాలూ పక్షులు ఆహారాది కారణంగా పొలాలు మొదలైనచోట్ల చేరుతాయి. మూర్ఖులు భయంవల్లగానీ దురాశ వల్లగాని స్నేహితులు అగుదురు. ఇక సజ్జనులుమాత్రం కేవలం సందర్శన భాగ్యంవల్లనే మిత్రులు అయ్యేదరు. 94

కిఞ్చ–

శ్లో. నారికేలసమాకారా దృశ్యన్తే హి సుహృజ్జనాః,
అన్యే బదరికాఽఽకారా బహిరేవ మనోహరాః. 95

అత ఏవ సతాం సఙ్గతిరిష్యతే. అన్యచ్చ–

శ్లో. స్నేహచ్ఛేదేఽపి సాధూనాం గుణా నాయాన్తి విక్రియామ్,
భఙ్గేఽపి హి మృణాలానా మనుబధ్నన్తి తన్తవః. 96

అను. ఇంకనూ- "శుభహృదయులైన సజ్జనులు టెంకాయ వంటివారు. దుర్జనులు పైకి అందంగా కనబడే రేగుపండ్లవంటివారు." 95

అందువల్లనే సజ్జనస్నేహాన్ని కోరుదురు.

మరియునూ- "సజ్జనులతో స్నేహం చెడినా వారిలో గుణాలు మార్పునొందవు. (సజ్జనులు కీడు చేయరు- అని భావం) తామరకాడ తెగిపోయిననూ లోపలి దారాలు తెగినకాడను వదలిపెట్టవు." 96

గ. అన్యచ్చ-

శ్లో. శుచిత్వం త్యాగితా శౌర్యం సామాన్యం సుఖదుఃఖయోః,
దాక్షిణ్యఞ్చానురక్తిశ్చ సత్యతా చ సుహృద్గుణాః. 97

'ఏతైర్గుణైరుపేతో భవదన్యో మయా కః సుహృత్ ప్రాప్తవ్యః'?

అను. ఇంకనూ పరిశుద్ధత-త్యాగం-సుఖదుఃఖాదులందు సమభావం- పక్షపాతరాహిత్యం, అనురాగం, సత్యభాషణం-అనే ఈ ఏడింటిని మిత్రగుణాలు అందురు. 97

ఈ గుణాలు నీయందు గలవు. ఇటువంటి నిన్ను వదలి వేరే మరియొక మిత్రుణ్ణి ఎవరిని పొందాలి!

గ. ఇత్యాది తద్వచనమాకర్ణ్య హిరణ్యకో బహిరాగత్యాఽఽహ- 'ఆప్యాయితోఽహం భవతామేతేన వచనాఽమృతేన. తథా చోక్తమ్-

శ్లో. ఘర్మార్తం న తథా సుశీతలజలైః స్నానం న ముక్తావలీ
న శ్రీఖణ్డవిలేపనం సుఖయతి ప్రత్యఙ్గమప్యర్పితమ్,
ప్రీత్యై సజ్జనభాషితం ప్రభవతి ప్రాయో యథా చేతసః
సద్యుక్త్యా చ పరిష్కృతం సుకృతినా మాకృష్టిమన్త్రోపమమ్.

అను. ఈమొదలైన అతని (లఘుపతనకుని) మాటను విని హిరణ్యకుడు తన బొఱియనుండి వెలుపలికి వచ్చాడు. ఇలా అన్నాడు- మీ వాక్యామృతం చేత సంతృప్తి చెందాను. ఇట్లు చెప్పుదురు:-

"శుభములైన నీతికథలచే అలంకృతమూ, వశీకరణమంత్రతుల్యమూ అయిన పుణ్యచరితుల సద్భాషితం ఎంతగా మనస్సునకు ప్రీతిదాయకం అగునో-అంతగా ఎండచే పీడితునికి శుభశీతలజలస్నానంగానీ ముత్యాలహారాలుగానీ సర్వాంగలిప్తమైన చందనంగానీ సుఖాన్ని గల్గింపవు.''

అన్యచ్చ–

శ్లో. రహస్యభేదో యాచ్నా చ నైష్ఠుర్యం చలచిత్తతా,
క్రోధో నిస్సత్యతా ద్యూతమేతన్మిత్రస్య దూషణమ్. 99

అనేన వచనక్రమేణ తదేకమపి దూషణం త్వయి న లక్ష్యతే.

అను. మరియూ- రహస్యవిషయాన్ని వెల్లడిచేయడం, యాచించడం, కాఠిన్యం, చపలచిత్తత, క్రోధం, అసత్యభాషణం-అనే ఈ ఆరు మిత్రదూషణాలు అనబడును. 99

ఈ వాక్కులను అనుసరించి విచారిస్తే ఈ దూషణగుణాలలో ఒక్కటియూ నీయందు కనబడడం లేదు.

యతః-

శ్లో. పటుత్వం సత్యవాదిత్వం కథాయోగేన బుధ్యతే,
అస్తబ్ధత్వ మచాపల్యం ప్రత్యక్షేణాఽవగమ్యతే. 100

గ. అపరఞ్చ-

శ్లో. అన్యథైవ హి సౌహార్దం భవేత్ స్వచ్ఛాన్తరాత్మనః,
ప్రవర్తతేఽన్యథా వాణీ శాఠ్యోపహతచేతసః. 101

శ్లో మనస్యన్యద్ వచస్యన్యత్ కర్మణ్యన్య ద్దురాత్మనామ్,
మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్. 102

"తద్భవతు భవతోఽభిమతమేవ"-ఇత్యుక్త్వా హిరణ్యకో మైత్రీం విధాయ భోజనవిశేషైర్వాయసం సన్తోష్య స్వవివరం ప్రవిష్టః. వాయసోఽపి స్వస్థానం గతః.

అను. ఏలనన- దక్షత, సత్యభాషణం అనే రెండు సుగుణాలు నీయందు గలవు. అని నీ సంభాషణచే తెలియుచున్నవి. ఇక జడతా రాహిత్యం చాపల్యశూన్యత్వం-అనే రెండుగుణాలు నీయందు ప్రత్యక్షంగా చూచుచున్నాను. 100

మరియూ- నిర్మలచిత్తుడి మైత్రి వేఱువిధంగా-అనగా ఉత్తమభావయుతమై ఉంటుంది. ఇక శఠ(వంచక) హృదయుని వాక్కు ఇందుకు భిన్నముగా ప్రవర్తిలును. 101

దురాత్ములకు మనస్సుతో తలంచేది- నోటితోచెప్పేది- శరీరంతోచేసేది- ఈ మూడు భిన్నభిన్నంగా ఉంటాయి. మహాత్ములు మనస్సులో తలంచినదానినే వాక్కుతో తెలుపుదురు. అట్టిదానినే శరీరంతో ఆచరిస్తారు.

'అటులనే నీ ఇష్టప్రకారమే అగుగాక'- అని హిరణ్యకుడు ఆతనితోడి (లఘుపతనకుడితోడి) స్నేహం అంగీకరించాడు. విశిష్టభోజనపదార్థములతో

అతనికి సంతోషం గల్గించాడు. పిమ్మట తన బొరియలో ప్రవేశించాడు. కాకియు తన గూడు చేరింది.

గ. తతః ప్రభృతి తయో రన్యోన్యాఽఽహార ప్రదానేన కుశల ప్రశ్నైః విశ్రమ్భాఽఽలాపైశ్చ కియత్కాలోఽతివర్తతే. ఏకదా లఘు పతనకో హిరణ్యక మాహ-"సఖే! వాయసస్య కష్టతర-లభ్యాఽఽహార మిదం స్థానమ్! తదేతత్ పరిత్యజ్య స్థానాన్తరం గన్తు మిచ్ఛామి" ఇతి హిరణ్యకో బ్రూతే-

శ్లో. స్థానభ్రష్టా న శోభన్తే దన్తాః కేశా నఖా నరాః,
ఇతి విజ్ఞాయ మతిమాన్ స్వస్థానం న పరిత్యజేత్. 103

అను. అదిమొదలు ఆ మూషిక- వాయసములు రెండూ పరస్పరం విందులు చేసికొనడం- కుశలవార్తలు అడుగడం- విశ్వాసంతో ఎన్నో విషయాలను చర్చించడం- ఇత్యాదిగా కొంతకాలం గడిపాయి. అంత ఒకనాడు లఘుపతనకుడు హిరణ్యకుడితో ఇలా అన్నాడు- 'మిత్రమా! ఇచ్చట కాకులకు ఆహారం సులభంగా లభింపదు. అందుచే ఇచ్చటినుండి వేఱే చోటుకు పోదలంచాను'. అందుకు హిరణ్యకుడు ఇలా అన్నాడు-

'మిత్రమా! దంతములు, శిరోజాలు(తలవెండ్రుకలు), నఖములు(గోళ్లు), మానవులు స్వస్థానమును వదలినచో విరాజిల్లరు. ఇది గుర్తించి బుద్ధిమంతుడైన వాడు స్వస్థానాన్ని వదలిపెట్టరాదు.' 103

గ. కాకో బ్రూతే-'మిత్ర! కాపురుషస్య వచనమేతత్.'

యతః-

శ్లో. స్థానముత్సృజ్య గచ్ఛన్తి సింహాః సత్పురుషా గజాః,
తత్రైవ నిధనం యాన్తి కాకాః కాపురుషా మృగాః. 104

అను. కాకి ఇలా అంది- మిత్రమా! అది కాపురుష (బుద్ధిహీన) లక్షణం. ఏలననగా- సింహాలు, సజ్జనులు, ఏనుగులు- జన్మభూమిని వదలి జీవనం సాగిస్తూ ఉన్నారు. కాకులు, మందబుద్ధులు, క్షుద్రజన్తువులు జీవితాధారం లేకపోయిననూ జన్మభూమిని వదలలేక అచ్చటనే మరణిస్తూ ఉన్నాయి. 104

గ. అన్యచ్చ-

శ్లో. కో ధీరస్య మనస్వినః స్వవిషయః కో వా విదేశః స్మృతః
యం దేశం శ్రయతే తమేవ కురుతే బాహుప్రతాపాఽఽర్జితమ్,
యద్దంష్ట్రా-నఖ-లాఙ్గూల-ప్రహరణః సింహో వనం గాహతే
తస్మిన్నేవ హతద్విపేన్ద్ర-రుధిరైః తృష్ణాం ఛినత్త్యాత్మనః. 105

అను. విజ్ఞానియూ, సమర్థుడూ అయినవానికి ఇది స్వదేశం, ఇది విదేశం అనేది ఏమీ లేదు, పోయిన ప్రదేశాన్నే తన బలపరాక్రమాలచే సొంతం చేసుకుంటాడు. సింహం, తన కోరలు-గోళ్లు-తోక అనే ఈ మూడింటినీ ఆయుధాలుగా ఉపయోగించి తాను ప్రవేశించిన అడవిలో ఉండే మదపుటేనుగులను చంపి వాటి రక్తంచే తన దాహం తీర్చుకుంటుంది. 105

గ. హిరణ్యకో బ్రూతే - మిత్ర క్వ గన్తవ్యమ్ ? తథా చోక్తమ్

శ్లో. చలత్యేకేన పాదేన తిష్ఠత్యేకేన బుద్ధిమాన్,
నాఽసమీక్ష్య పరం స్థానం పూర్వమాయతనం త్యజేత్. 106

అను. హిరణ్యకుడు అడిగాడు - 'మిత్రమా, ఎచ్చటికేగెదవు ? విజ్ఞులు ఇలా అన్నారు - 'బుద్ధిమంతుడైనవాడు ఒక పాదమును పూర్తిగా నేలపై మోపిన తర్వాతనే రెండవపాదం ఎత్తును. అంతేగాని క్రొత్తచోటును సమగ్రంగా పరీక్షింపక పూర్వస్థానం విడువడు.'

గ. వాయసో బ్రూతే 'మిత్ర అస్తి సునిరూపితం స్థానమ్. హిరణ్యకోఽవదత్ - 'కిం తత్?' వాయసః కథయతి -'అస్తి దణ్డకారణ్యే కర్పూరగౌరాభిధానం సరః. తత్ర చిరకాలోపార్జితః ప్రియసుహృన్మే మన్థరాఽభిధానః కూర్మః సహజధార్మికః ప్రతివసతి. పశ్య మిత్ర-

శ్లో. పరోపదేశే పాణ్డిత్యం సర్వేషాం సుకరం నృణామ్,
ధర్మే స్వీయమనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః. 107

స చ భోజన విశేషైర్మాం సంవర్ధయిష్యతి ఇతి.

అను. కాకి - 'మిత్రమా ! చక్కగా విచారించినచోటు ఒకటి ఉంది !'
హిరణ్యకుడు - 'ఆ స్థలం ఎచ్చట ? ఏది ?'

లఘుపతనకుడు (కాకి) - 'దండకారణ్యంలో కర్పూరగౌరం అనే ఒక చెఱువు ఉంది. అచ్చట నాకు చిరకాలం క్రిందట సంపాదించుకొనిన ప్రియమిత్ర మైన ఒక తాబేలు గలదు. పేరు మంథరుడు. సహజంగానే ధర్మవర్తనుడు. చూడుము మిత్రమా ! "మానవులకు అందరకు ఇతరులకు బోధించడానికి పాండిత్యం తేలికగా అలవడుతుంది. స్వయంగా ధర్మమును ఆచరించడం ఒకానొక మహాత్ముడికి మాత్రమే సాధ్యం అగును." (107)

అందుచే ఆ [మహాత్ముడైన] మంథరుడు విందువంటకములచే నన్ను పోషింపగలడు".

గ. హిరణ్యకోఽప్యాహ - 'కిమత్రాఽఽస్థాయ మయా కర్తవ్యమ్? యతః.

శ్లో. యస్మిన్ దేశే న సమ్మానో న వృత్తిర్న చ బాన్ధవః,
న చ విద్యాఽఽగమః కశ్చిత్తం దేశం పరివర్జయేత్. 108

అపరఞ్చ

శ్లో. ధనికః శ్రోత్రియో రాజా నదీ వైద్యస్తు పఞ్చమః,
పఞ్చ యత్ర న విద్యన్తే న కుర్యాత్ తత్ర సంస్థితిమ్. 109

అను. హిరణ్యకుడు ఇలా అన్నాడు - 'మిత్రమా ! నేను మాత్రం ఇచ్చట ఉండి ఏమి చేయాలి ! ఏలనన.

"ఏ దేశంలో గౌరవం - జీవనాధారం - బంధుజనం - ఏ విధమైన విద్యా ప్రాప్తి ఉండవో - ఆ దేశాన్ని విడువవలయును." (108)

మరియూ - "ధనికుడు - వేదవేత్త - ప్రభువు - నది - వైద్యుడు - అనే ఈ అయిదు పదార్థాలు లేనిచోట నివాసం చేయరాదు." (109)

అపరఞ్చ

శ్లో. లోకయాత్రా భయం లజ్జా దాక్షిణ్యం త్యాగశీలతా,
పఞ్చ యత్ర న విద్యన్తే తత్ర వాసం న కారయేత్. 110

అన్యచ్చ—

శ్లో. తత్ర మిత్ర ! న వస్తవ్యం యత్ర నాస్తి చతుష్టయమ్,
ఋణదాతా చ వైద్యశ్చ శ్రోత్రియః సుజలా నదీ. 111

అను. మరియూ - జీవనవృత్తి - రాజశాసనభయం - పాపకార్యలజ్జా - సమబుద్ధి - దాతృత్వం - అనే ఈ ఐదుగుణాలు లేనిచోట నివసింపరాదు. (110)
ఇంకనూ - ఋణదాత - వైద్యుడు - వేదవేత్త - శుభజల అయిన నది - అనే ఈ నాలుగు లేనిచోట నివాసం చేయరాదు. (111)

గ. అతో మామపి తత్ర నయ. వాయసోఽవదత్ - 'ఏవమస్తు' ఇతి. అథ వాయసస్తేన మిత్రేణ సహ విచిత్రాఽఽలాపసుఖేన తస్య సరసః సమీపం యయౌ. తతో మన్థరో దూరాదేవ లఘుపతనక మవలోక్య ఉత్థాయ యథోచిత మాతిథ్యం విధాయ మూషికస్యాఽప్యతిథి-సత్కారం చకార.

అను. అందువలన నన్నుకూడా తీసికొని పొమ్ము. ఇది విని కాకి -'సరే, అటులనే కానిమ్ము' అనెను. పిమ్మట కాకి తన మిత్రమైన ఎలుకను నోట జాగ్రత్తగా పట్టుకొనింది. మధ్యమధ్యన ఆగుచూ విచిత్రసరసగోష్ఠులు చేస్తూ క్రమంగా ఆ సరస్సును చేరింది. అచ్చట నుండే మంథరకుడు (తాబేలు) దూరంనుండియే లఘుపతనకుడిని చూచాడు. లేచి గౌరవపూర్వకంగా ఎదురు వచ్చాడు-స్వాగతం పల్కాడు. ఇరువురికి తగినవిధంగా అతిథిసత్కారం చేశాడు.

యతః-

శ్లో. బాలో వా యది వా వృద్ధో యువా వా గృహమాగతః,
తస్య పూజా విధాతవ్యా సర్వత్రాఽభ్యాగతో గురుః. 112

తథా—

శ్లో. గురు రగ్ని ర్ద్విజాతీనాం వర్ణానాం బ్రాహ్మణో గురుః,
పతి రేకో గురుః స్త్రీణాం సర్వత్రాఽభ్యాగతో గురుః. 113

గ. అపరఞ్చ-

శ్లో. ఉత్తమస్యాపి వర్ణస్య నీచోఽపి గృహమాగతః,
పూజనీయో యథాయోగ్యం సర్వదేవమయోఽతిథిః. 114

అను. ఏలనన- తన యింటికి వచ్చిన అతిథి అయినవాడు బాలుడుగానీ వృద్ధుడుగానీ యువకుడుగానీ అతన్ని యథాశక్తి ఆతిథ్యాదులతో సత్కరించాలి. అన్ని ఆశ్రమములవారికి అతిథి గురుతుల్యుడు. అలాగే- బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు అనే ద్విజాతులవారికి అగ్ని గురువు. నాలుగువర్ణములవారికి బ్రాహ్మణుడు గురువు. స్త్రీలకు భర్త గురువు- ఇక అతిథి అన్నచో అందరికిని గురువు.

మరియూ- అగ్రజాతివాని ఇంటికి నీచజాతివాడు అతిథిగా వచ్చిననూ వానిని తగినవిధంగా సత్కరించాలి. అతిథి సర్వదేవతారూపుడు. 114

గ. వాయసోఽవదత్- "సఖే, మన్థర! సవిశేషపూజా మస్మై విధేహి. యతోఽయం పుణ్యకర్మణాం ధురీణః, కారుణ్యరత్నాకరో హిరణ్యకనామా మూషికరాజః. ఏతస్య గుణస్తుతిం జిహ్వాసహస్రద్వయేనాఽపి యదిసర్పరాజః కదాచిత్ కర్తుంసమర్థఃస్యాత్!- ఇత్యుక్త్వా చిత్రగ్రీవోపాఖ్యానం వర్ణితవాన్. తతో మన్థరః సాదరం హిరణ్యకం సమ్పూజ్యాఽఽహ- "భద్ర! ఆత్మనో నిర్జన వనాఽఽగమనకారణ మాఖ్యాతు మర్హసి"ఇతి. హిరణ్యకోఽవదత్- కథయామి శ్రూయతామ్-

అను. కాకి ఇలా చెప్పింది- 'మిత్రమా మంథరా? ఈ మూషికరాజును (నాకంటె) అధికంగా సత్కరింపుము. ఇతని పేరు హిరణ్యకుడు. పుణ్యాత్ములలో మొదట గణింపదగినవాడు. దయాగుణంలో సముద్రం వంటివాడు. ఇతని సద్గుణాలను వర్ణించడానికి తన రెండువేల నాల్కలతో ఆదిశేషుడు సమర్థుడు అగునేమో.' ఇట్లు పల్కి చిత్రగ్రీవచరిత్రను విశదంగా వర్ణించి తెల్పాడు. పిమ్మట మంథరుడు హిరణ్యకుడిని ఆదరించి ఇలా అడిగాడు- 'ఓ శుభమూర్తీ? తాము ఈ నిర్జనమైన అడవికి ఎందుకు వచ్చితిరో తెలుపండి. అంత హిరణ్యకుడు ఇలా అన్నాడు- 'చెప్పెదను వినుడు'-

# 5. హిరణ్యక పూర్వవృత్తాన్తః

గ. అస్తి చమ్పకాభిధానాయాం నగర్యాం పరివ్రాజకాఽఽవసథః. తత్ర చూడాకర్ణో నామ పరివ్రాజకః ప్రతివసతి. సచ భోజనాఽవశిష్ట- భిక్షాఽన్నసహితం భిక్షాపాత్రం నాగదన్తకేఽవస్థాప్య స్వపితి. అహఞ్చ తదన్న ముత్ప్లుత్యోత్ప్లుత్య ప్రత్యహం భక్షయామి. అనన్తరం తస్య ప్రియసుహృద్ వీణాకర్ణో నామ పరివ్రాజకః సమాయాతః. తేన సహ నానాకథాప్రసఙ్గాఽవస్థితో మమ త్రాసార్థం జర్జరవంశఖణ్డేన చూడాకర్ణో భూమి మతాడయత్. తం తథావిధం దృష్ట్వా వీణాకర్ణ ఉవాచ-"సఖే కిమితి మమ కథావిరక్తోఽన్యాసక్తో భవాన్?"

అను. చంపక- అనే నగరంలో సంన్యాసులమఠం ఒకటి ఉంది. అందు చూడాకర్ణుడు అనే సంన్యాసి నివసించేవాడు. అతడు భుజించిన తర్వాత మిగిలిన భిక్షాన్నమును, భిక్షాపాత్రలో ఉంచి చిలుకకొయ్యకు తగిల్చి(రాత్రివేళ) నిద్రించేవాడు. పిమ్మట నేను ఎగిరెగిరి ఆ చిలుకకొయ్యను చేరి ఆ ఆహారం ప్రతిదినం భక్షించేవాడను. అంత ఒకనాడు అతని ప్రియమిత్రుడైన వీణాకర్ణుడు అనే సంన్యాసి అచ్చటికి వచ్చాడు. అతనితో నానాకథాంశాలను చర్చిస్తూనే మధ్యమధ్యన నన్ను భయపెట్టేందుకై చీలిన పాతవెదురుకఱ్ఱను నేలపై తట్టుచూ చూడాకర్ణుడు శబ్దం చేసేవాడు. అలా చేసే చూడాకర్ణుని చూచి వీణాకర్ణుడు అడిగాడు- "మిత్రమా! నేను చెప్పే కథాంశాల యెడ విరక్తుడవై పరధ్యానంగా ఉన్నావు.''

యతః-

శ్లో. ముఖం ప్రసన్నం విమలా చ దృష్టిః
కథాఽనురాగో మధురా చ వాణీ,
స్నేహోఽధికః సమ్భ్రమదర్శనఞ్చ
సదాఽనురక్తస్య జనస్య లక్ష్మ.

శ్లో. అదృష్టిదానం కృతపూర్వనాశనం
అమాననం దుశ్చరితాఽనుకీర్తనమ్,
కథాప్రసజ్గేన చ నామవిస్మృతిః
విరక్తభావస్య జనస్య లక్షణమ్. 116

అను. ఏలననగా- ప్రసన్నమైన ముఖం, నిర్మలం అయిన చూపు- కథా శ్రవణంలో ఆసక్తి, మధురమైన వాక్కు, అధికమైన స్నేహం ఉత్సాహయుతంగా కనబడడం- అనే ఈ ఆరు గుణాలు ప్రేమయుక్తునికి లక్షణాలు అందురు. 115

చూడకపోవడం- పూర్వం చేసిన మేలును మఱువడం, గౌరవం చేయకుండడం, చెడునడవడికలను కీర్తించడం, కథాగోష్ఠులలోని నామములను విస్మరించడం- అనే ఈ అయిదింటిని విరక్తుని లక్షణములు అందురు.'' 116

గ. చూడాకర్ణే నోక్తమ్- "భద్ర ! నాఽహం విరక్తః కింతు పశ్యాఽయం మూషికో మమాఽపకారీ సదా పాత్రస్థం భిక్షాన్న ముత్ప్లుత్య భక్షయతి". వీణాకర్ణో నాగదన్త మవలోక్యాఽఽహ- 'కథమయం మూషికః స్వల్పబలోఽప్యేతావద్దూర ముత్పతతి. తదత్ర కేనాఽపి కారణేన భవితవ్యమ్ . క్షణం విచిన్త్య పరివ్రాజకేనోక్తమ్- 'కారణఞ్చాఽత్ర ధనబాహుల్యమేవ ప్రతిభాతి. యతః-

శ్లో. ధనవాన్ బలవాన్ లోకే సర్వః సర్వత్ర సర్వదా,
ప్రభుత్వం ధనమూలం హి రాజ్ఞామప్యుపజాయతే. 117

అను. అందుకు చూడాకర్ణుడు ఇలా చెప్పాడు- 'శుభమూర్తీ ! నేను విరక్తుడను గాను. కాని ఇటు చూడుము- ఈ ఎలుక ఎగిరి నిత్యం పాత్రలోని భిక్షాన్నం తింటూ నాకు కీడుచేస్తూ ఉంది'. అది విని వీణాకర్ణుడు చిలుకకొయ్యను (ఉట్టివంటిది) చూచి ఇట్లు పల్కాడు- 'కొంచెం బలం గలది అయిన ఈ ఎలుక ఇంత ఎత్తు ఎలా ఎగురగల్గుచున్నది? ఇందుకు ఏదేని కారణం తప్పక ఉండును'. ఇలా అని క్షణకాలం ఆలోచించి ఆ సంన్యాసి ఇట్లు చెప్పాడు-

"ఇందుకు కారణం అధికసంపద అనియే తోస్తూ ఉంది. ఏల ననగా-

'ధనం గల్గిన ప్రతివ్యక్తియూ అంతటా అన్నివేళలా బలవంతుడు అగును. రాజులకు సైతం అధికారం ధనప్రభావంవల్లనే లభిస్తుంది". 117

గ. తతః ఖనిత్ర మాదాయ తేన పరివ్రాజకేన వివరం ఖనిత్వా చిరసఞ్చితం మమ ధనం గృహీతమ్. తతఃప్రభృతి నిజశక్తి హీనః సత్త్వోత్సాహరహితః స్వాఽఽహారమ ప్యుత్పాదయితు మక్షమః సత్రాసం మన్దం మన్ద ముపసర్పన్ చూడాకర్ణేనాఽఽవలోకితః. తతస్తేనోక్తమ్-

శ్లో. ధనేన బలవాం ల్లోకో ధనాద్భవతి పణ్డితః,
పశ్యైనం మూషికం పాపం స్వజాతిసమతాంగతమ్. 118

అను. అంతట ఆ సంన్యాసి(వీణాకర్ణుడు) త్రవ్వుకోలను తెప్పించాడు. నా బొఱియను త్రవ్వాడు. చిరకాలంగా నేను సంపాదించిన ధనాన్ని అంతా గ్రహించాడు. అదిమొదలు నేను నా బలం అంతా పోగొట్టుకున్నాను. తెలివీ, ఉత్సాహం నశించాయి. కేవలం నా పొట్టకు సైతం ఆహారం సంపాదన చేయలేకపోయాను. ఒకనాడు భయంచే మెల్లమెల్లగా తిరుగుచుండగా ఆ సంన్యాసి నన్ను చూచాడు. ఇలా అన్నాడు- "ధనం గలవాడే బలవంతుడు, పండితుడు అనబడును. ఈ ఎలుకను చూడుము- ఈ పాపాత్ముడు తన సంపదనంతా పోగొట్టుకొని సామాన్యమైన ఎలుక అయ్యాడు." 118

కిఞ్చ-

శ్లో. అర్థేన తు విహీనస్య పురుషస్యాఽల్పమేధసః,
క్రియాః సర్వా వినశ్యన్తి గ్రీష్మే కుసరితో యథా. 119

గ. అపరఞ్చ-

శ్లో. యస్యార్థాస్తస్య మిత్రాణి యస్యార్థా స్తస్య బాన్ధవాః,
యస్యార్థాః స పుమాంల్లోకే యస్యార్థాః స హి పణ్డితః. 120

గ. అపరఞ్చ-

శ్లో. అపుత్రస్య గృహం శూన్యం సన్మిత్రరహితస్య చ,
మూర్ఖస్య చ దిశః శూన్యా సర్వశూన్యా దరిద్రతా. 112

అను. ఇంకనూ- ధనశూన్యుడైన అల్పబుద్ధి చేసే పనులు అన్నియూ ఎండ కాలంలోని చిన్నవాగులవలె నశించిపోవును. 119

మరియూ- ఈ ప్రపంచంలో ధనం గలవానికే మిత్రులూ బంధువులూ అధికంగా ఉందురు. అతడే ఉత్తమపురుషుడు అనబడును. అతడే పండితుడుగానూ గణింపబడును. 120

మరియూ- పుత్రహీనుని గృహం శూన్యంగా ఉండును. మంచి మిత్రులు లేని మూర్ఖునికి నాల్గుదిక్కులు శూన్యములై ఉండును. ఇక దరిద్రునికి అన్నచో సమస్తం శూన్యంగానే ఉండును. 121

గ. అపరఞ్చ-

శ్లో. దారిద్ర్యాన్మరణాద్వాఽపి ధారిద్ర్యమవరం స్మృతమ్,
అల్పక్లేశేన మరణం దారిద్ర్య మతిదుఃసహమ్. 122

అన్యచ్చ -

శ్లో. తానీన్ద్రియా ణ్యవికలాని తదేవ నామ
సా బుద్ధి రప్రతిహతా వచనం తదేవ,
అర్థోష్మణా విరహితః పురుషః స ఏవ
అన్యః క్షణేన భవతీతి విచిత్ర మేతత్. 123

అను. మరియూ- "దరిద్రత, మరణం- ఈ రెండింటిలో హెచ్చుతగ్గులు పరిశీలించినచో దారిద్ర్యమే గొప్పదిగా తోచును. ఏలనన- మరణం కొంతకాలం మాత్రమే దుఃఖం కల్గిస్తుంది. ఇక దారిద్ర్యం చిరకాలం సహింపరాని దుఃఖాన్ని గల్గిస్తుంది.'' 122

మరియూ-"ధనం ఉండేటప్పుడు ఏ ఇంద్రియాలూ, ఏ పేరూ, ఏ చురుకైన బుద్ధీ, ఏ వాక్కు ఉండేవో, అవియే ఉండిననూ ధనం అనే వేడిమి తొలగగానే క్షణంలో మానవుడు వేఱేవాడు(క్రొత్తవాడు) అగుచున్నాడు. ఇది చిత్రమైన విషయం." 123

గ. ఏతత్సర్వ్వ మాకర్ణ్య మయాఽఽలోచితమ్- "మమాఽ

త్రాఽవస్థాన మయుక్త మిదానీమ్" తథా చోక్తమ్-

శ్లో. అత్యన్తవిముఖే దైవే వ్యర్థే యత్నే చ పౌరుషే,
మనస్వినో దరిద్రస్య వనాదన్యత్ కుతః సుఖమ్. 124

గ. అన్యచ్చ-

శ్లో. మనస్వీ మ్రియతే కామం కార్పణ్యం న తు గచ్ఛతి,
అపి నిర్వాణ మాయాతి నాఽనలో యాతి శీతతామ్. 125

అను. ఇది అంతా విని నేను ఇలా ఆలోచించాను- 'ఇక ఇప్పుడు ఇచ్చట నేను ఉండడం సముచితం గాదు. విజ్ఞులు అన్నారు—

"దైవం ప్రతికూలం అగుటచే పురుషప్రయత్నం విఫలమైపోయినచో అభిమానియైన దరిద్రునకు అడవిలో దప్ప మఱియొకచోట సుఖం లభింపదు." 124

మరియూ- అభిమానవంతుడు మరణాన్ని అయినా తృప్తిగా స్వీకరిస్తాడు గాని దీనతను అంగీకరింపడు. అగ్ని(నీటిచే) ఆరిపోవడానికి సిద్ధపడును గాని చల్లదనాన్ని మాత్రం పొందదు. 125

కిఞ్చ-

శ్లో. కుసుమస్తబకస్యేవ ద్వే వృత్తీ తు మనస్వినః,
సర్వేషాం మూర్ధ్ని వా తిష్ఠే ద్విశీర్యేత వనేఽథవా. 126

యచ్చాఽన్యస్మై ఏతద్వృత్తాన్తకథనం తదప్యనుచితమ్. యతః-

శ్లో. అర్థనాశం మనస్తాపం గృహే దుశ్చరితాని చ,
వఞ్చన ఞ్చాపమానఞ్చ మతిమా న్న ప్రకాశయేత్. 127

అను. మరియూ-"పూలగుత్తికి వలె అభిమానవంతునికి రెండు ప్రవృత్తులు మాత్రమే గలవు. ఒకటి అందరి తలపై ఉండడం, రెండు అడవిలో శిథిలమై పోవడం."

ఇక ఇతరునికి ఈ వృత్తాన్తం చెప్పడంసైతం ఉచితం గాదు. ఏలనన-

ధననష్టం, మనస్తాపం, ఇంటిలోనివారి దుష్టవర్తనలు, మోసం పొందడం, అవమానితుడు అవడం- అనే ఈ అయిదింటిని బుద్ధిమంతుడు ప్రకటింపరాదు." 127

గ. యచ్చాత్రైవ యాచ్ఞయా జీవనం తదప్యతీవ గర్హితమ్. యతః-

శ్లో. వరం విభవహీనేన ప్రాణైః సన్తర్పితోఽనలః,
నోపచారపరిభ్రష్టః కృపణః ప్రార్థ్యతే జనః. 128

అను. ఇచ్చటనే యాచనావృత్తిచే జీవించడం అనుటయు మిక్కిలి నింద్యం. ఏల ననగా-"ధనహీనుడైనవాడు అగ్నిలో బడి ప్రాణాలు అర్పించడం ఉత్తమం. అంతేగాని ధర్మభ్రష్టుడైన లోభిని అర్థించడం మాత్రం సముచితం గాదు." 128

అన్యచ్చ-

శ్లో. దారిద్ర్యా ద్ధ్రియమేతి హ్రీపరిగతః సత్త్వాత్ పరిభ్రశ్యతే
నిస్సత్త్వః పరిభూయతే పరిభవా న్నిర్వేద మాపద్యతే,
నిర్విణ్ణః శుచ మేతి శోకపిహితో బుద్ధ్యా పరిత్యజ్యతే
నిర్బుద్ధిః క్షయ మే త్యహో నిధనతా సర్వాపదా మాస్పదమ్.

అను. మరియూ-"దారిద్ర్యంవలన సిగ్గును, సిగ్గుచే బలహీనతను, బలహీనతచే అవమానం, అవమానంచే కార్యవైముఖ్యం, అందుచే దుఃఖం, దుఃఖంచే బుద్ధిభ్రష్టత, బుద్ధిభ్రష్టతచే వినాశం సంభవిస్తూన్నాయి. అయ్యో! దారిద్ర్యం అన్ని ఆపదలకు స్థానం అయింది.'' 129

కిఞ్చ-

శ్లో. వరం మౌనం కార్యం న చ వచనముక్తం యదనృతం
వరం క్లైబ్యం పుంసాం న చ పరకలత్రాఽభిగమనమ్,
వరం ప్రాణత్యాగో న చ పిశునవాక్యే ష్వభిరుచిః
వరం భిక్షాశిత్వం న చ పరధనాఽఽస్వాదనసుఖమ్. 130

అను. మరియూ-"అసత్యం పల్కుటకంటె మౌనంగా ఉండుటయూ, పర స్త్రీలతో వ్యభిచరించడంకంటె నపుంసకుడై ఉండుటయూ, లోభివాక్కులందు (నీచవాక్కులందు) ఆసక్తినందుటకంటె ప్రాణాలు వీడుటయూ, పరుల ధనాన్ని అపహరించి సుఖాన్ని అనుభవించడంకంటె భిక్షాన్నాన్ని భుజించడము శ్రేష్ఠము లైనవి." 130

శ్లో. వరం శూన్యా శాలా న చ ఖలు వరో దుష్టవృషభః
వరం వేశ్యా పత్నీ న పునరవినీతా కులవధూః,
వరం వాసోఽరణ్యే న పునరవివేకాఽధిపపురే
వరం ప్రాణత్యాగో న పున రధమానా ముపగమః. 131

అను. "మదించిన ఎద్దు ఉండడంకంటె గోశాల శూన్యంగా ఉండడం, క్రూరురాలూ నీతిహీనురాలూ అయిన కులవధువుకంటె వేశ్యను భార్యగా చేసికొనడం, అవివేకి అయిన ప్రభువుయొక్క నగరంలో ఉండడంకంటె అరణ్యంలో నివసించడం, నీచులతో కలిసిఉండడంకంటె ప్రాణాలు వీడడం శ్రేష్ఠమైనవి."

గ. అపిచ-

శ్లో. సేవేవ మాన మఖిలం జ్యోత్స్నేవ తమో జరేవ లావణ్యమ్,
హరిహరకథేవ దురితం గుణశతమ ప్యర్థితా హరతి. 132

తత్కిమహం పరపిణ్డేనాఽఽత్మానం పోషయామి? కష్టం భోః. తదపి ద్వితీయం మృత్యుద్వారమ్. అన్యచ్చ-

శ్లో. రోగీ చిరప్రవాసీ పరాన్నభోజీ పరాఽఽవసథశాయీ,
యజ్జీవతి తన్మరణం యన్మరణం సోఽస్య విశ్రామః. 133

ఇత్యాలోచ్యాఽపి లోభాత్ పునరపి తదీయమన్నం గ్రహీతుం గ్రహ మకరవమ్! తథా చోక్తమ్-

శ్లో. లోభేన బుద్ధి శ్చలతి లోభో జనయతే తృషామ్,
తృషార్తో దుఃఖ మాప్నోతి పరత్రేహ చ మానవః. 134

అను. మరియూ-"సమస్తగౌరవాన్ని సేవావృత్తి వలె, చీకటిని వెన్నెల వలె- సౌందర్యాన్ని ముసలితనం వలె, సర్వపాపసంతతిని హరిహరుల గుణ కీర్తన వలె, సకలసద్గుణాలను యాచనావృత్తి నాశం చేస్తుంది." 132

నేను పరాన్నభుక్తిచే జీవయాత్ర సాగించవలయునా? అది మిక్కిలి కష్టం. మఱియొక మృత్యుద్వారంతో సమానం.

ఇలా తలంచియూ లోభానికి లోబడి మరలా అతడి అన్నం గ్రహించేందుకై మొండియత్నం చేసాను.

"రోగి, చిరకాలం దూరదేశాలలో ఉండేవాడు, పరాన్నంతినేవాడు, పరుల ఇంట్లో ఉండేవాడు, జీవించి ఉండడం మరణమే. మరణించడం వీడికి విశ్రాంతి.

విజ్ఞులు ఇలా చెప్పారు-

"లోభంచే బుద్ధి చలిస్తుంది-లోభం ధనాదికంపై ఆశను పుట్టిస్తుంది. ఆశా పీడితుడు ఈ లోకంలోనూ పరలోకంలోనూ దుఃఖం పొందును." 134

గ. తతోఽహం మన్దం మన్ద ముపసర్పం స్తేన వీణాకర్ణేన జర్జర వంశఖణ్డేన తాడిత శ్చాఽచిన్తయమ్-'లుబ్ధో హ్యసన్తుష్టో నియత మాత్మ ద్రోహీ భవతి! తథా చ-

శ్లో. ధనలుబ్ధో హ్యసన్తుష్టోఽనియతాత్మాఽజితేన్ద్రియః,
సర్వా ఏవాఽఽపద స్తస్య యస్య తుష్టం న మానసమ్. 135

అను. అంతట నేను మెల్లమెల్లగా ఆ భిక్షాపాత్రను సమీపించేందుకై ఎగుర బోయాను- అది గమనించి వీణాకర్ణుడు ఆ పాతవెదురుకఱ్ఱతో కొట్టాడు-ఆ దెబ్బ తిని పాఱిపోతూ ఇలా తలంచాను- 'లోభియు అసంతుష్టుడూ అగుట తప్పక ఆత్మద్రోహమే అగును. విజ్ఞులు అన్నారు-ధనలుబ్ధుడు, అసంతుష్టుడు, సంయమ శూన్యుడు, అజితేంద్రియుడు అయినవానికి ఆపదలు అన్నీ సంభవిస్తాయి.' 135

శ్లో. సర్వాః సమ్పత్తయ స్తస్య సన్తుష్టం యస్య మానసమ్,
ఉపానద్గూఢపాదస్య నను చర్మావృతేవ భూః. 136

అపరఞ్చ-

శ్లో. సన్తోషామృతతృప్తానాం యత్సుఖం శాన్తచేతసామ్,
కుత స్తద్ధనలుబ్ధానా మితశ్చేతశ్చ ధావతామ్. 137

అను. "ఎవని మనస్సు సంతోషం గలదై ఉండునో వానికి అన్ని సంపదలు లభించినట్లే. ఏలనన చెప్పులచే పాదములు కప్పబడినచో భూతలం అంతా చర్మంచే ఆవృతమైనట్లుగా ఉండును గదా." 136

మరియూ-"సంతోషం అనే అమృతపానంచే సంతృప్తమైన వారును, అందువల్లనే శాంతహృదయులూ అయిన మహాత్ములకు ఉండే సుఖం ధనాశచే పరుగెత్తే మనస్సుగలవారికి ఎక్కడిది?" 137

కిఞ్చ—

శ్లో. తేనాఽధీతం శ్రుతం తేన తేన సర్వ మనుష్ఠితమ్,
యేనాఽఽశాః పృష్ఠతః కృత్వా నైరాశ్య మవలమ్బితమ్. 138

అపిచ—

శ్లో. అసేవితేశ్వరద్వార మదృష్టవిరహవ్యథమ్,
అనుక్తక్లీబవచనం ధన్యం కస్యాఽపి జీవనమ్. 139

అను. "ఎవడు ఆశలను వెనుకకు నెట్టి నైరాశ్యం (వైరాగ్యం) అవలంబించునో అతడు సర్వం చదివినవాడూ విన్నవాడూ మరియూ సర్వం అనుష్ఠించినవాడూ అగును." 138

ఇంకనూ-"ప్రభువుల ద్వారమును సేవించనివాడూ, విరహవ్యథను అనుభవించనివాడూ దీనవాక్కులు పలుకనివాడూ అయిన పురుషుని జీవనమే ధన్యమైనది." 139

యతః—

శ్లో. న యోజనశతం దూరం వాహ్యమానస్య తృష్ణయా,
సన్తుష్టస్య కరప్రాప్తేఽప్యర్థే భవతి నాఽదరః. 140

తదత్రాఽవస్థోచిత-కార్య-పరిచ్ఛేదః శ్రేయాన్.

శ్లో. కోధర్మో? భూతదయా కిం సౌఖ్య మరోగితా జగతి జన్తోః,
కః స్నేహః? సద్భావః కిం పాణ్డిత్యం పరిచ్ఛేదః. 141

అను. ఏల ననగా-"ఆశాపీడితుడికి నూరు ఆమడలు (శతయోజనాలు) సైతం దూరం గాదు. సంతుష్టుడు అరచేతితోని వస్తువును సైతం ఆదరంగా చూడడు." 140

అందువలన ఇప్పుడు నా శక్తికి దగిన కార్యాన్ని చేయడానికి తగిన నిశ్చయం చేయాలి. (విజ్ఞులు ఇలా అన్నారు)-

| ప్రశ్న | — | సమాధానం |
|---|---|---|
| ఏది ధర్మం? | — | భూతదయ. |
| ఏది సుఖం? | — | నిత్యం ఆరోగ్యంతో ఉండడం. |
| ఏది స్నేహం? | — | సద్భావం. |
| ఎట్టిది పాండిత్యం అనబడును? | — | కర్తవ్యాన్ని అకర్తవ్యాన్ని నిశ్చయించడం. 141 |

తథాచ-

శ్లో. పరిచ్ఛేదో హి పాణ్డిత్యం యదాపన్నా విపత్తయః,
అపరిచ్ఛేదకర్తౄణాం విపదః స్యుః పదే పదే. 142

తథాహి-

శ్లో. త్యజేదేకం కులస్యాఽర్థే గ్రామస్యాఽర్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే ఆత్మాఽర్థే పృథివీం త్యజేత్. 143

అపరఞ్చ-

శ్లో. పానీయం వా నిరాయాసం స్వాద్వన్నం వా భయోత్తరమ్,
విచార్య ఖలు పశ్యామి తత్ సుఖం యత్ర నిర్వృతిః. 144

ఇత్యాలోచ్యాఽహం నిర్జనవన మాగతః.

అను. అలాగే-"కర్తవ్య అకర్తవ్యనిర్ణయరూపమైన పరిచ్ఛేదజ్ఞానాన్నే పాండిత్యం అందురు. సంభవించిన ఆపదలు అట్టి జ్ఞానంవల్లనే నశిస్తాయి. అట్టి పరిచ్ఛేదం అనే విచారజ్ఞానం లేనివారికి అడుగడుగునా ఆపదలు గల్గును.'' 142

(యదాపన్నాః యస్మాత్ ఆపదం ప్రాప్తాః=అపన్నాః, వినష్టా ఇతి భావః).

అది సముచితమే. వంశ (కుటుంబ) రక్షణకై ఒక వ్యక్తినీ, గ్రామానికై, ఒక (కుటుంబాన్ని) కులాన్నీ- దేశంకొరకై గ్రామాన్నీ-ఆత్మరక్షణకై దేశాన్నీ (నివాసభూమినీ) త్యజించాలి. 143

మరియూ-"నిరాయాసంగా(భయరహితంగా) లభించే నీరూ-భయదాయక మైన మృష్టాన్నం- ఈ రెండింటిలో విచారిస్తే దేనియందు శాంతి లభిస్తుందో అదియే సుఖమైంది." అనగా భయదాయకస్వాద్వన్నం కంటె, భయశూన్యమైన జలం మేలు అని భావం. 144

ఇలా తలంచి నేను (హిరణ్యకుడను) ఈ జనశూన్యమైన అడవిని చేరాను.

యతః_

శ్లో. వరం వనం వ్యాఘ్రగజేన్ద్రసేవితం
ద్రుమాలయః పత్రఫలామ్బుభక్షణమ్,
తృణాని శయ్యా వసనఞ్చ వల్కలం
న బన్ధుమధ్యే ధనహీనజీవనమ్. 145

తతోఽస్మత్పుణ్యోదయా దనేన మిత్రేణాఽహం స్నేహాఽను వృత్త్యాఽనుగృహీతః. అధునా చ పుణ్యపరమ్పరయా భవదాశ్రయః స్వర్గ ఏవ మయా ప్రాప్తః.

అను. ఏలనన విజ్ఞులు ఇలా అన్నారు- "ధనహీనుడై బంధువుల మధ్యన జీవించడంకంటె అడవిలో నివసించడం ఉత్తమం. అచ్చట పులులూ ఏనుగులూ ఉండుగాక, చెట్లనీడయే ఇల్లు అగుగాక. ఆకులు, పండ్లు, నీరు, ఇత్యాదికమే ఆహారం అగుగాక. గడ్డియే పాన్పుగాను నారగుడ్డలే వస్త్రములుగాను అగుగాక."

అడవిని చేరిన మీదట నా పుణ్యఫలం ఈ లఘుపతనకున్ని నాకు మిత్రుని గా అనుగ్రహించింది. నేడు పుణ్యపరంపరచే నీ ఆశ్రయం అనే స్వర్గమే నాకు లభించింది.

యతః-

శ్లో. సంసారవిషవృక్షస్య ద్వే హ్యేవ రసవత్ఫలే,
కావ్యాఽమృతరసాఽఽస్వాదః సఙ్గమః సజ్జనైః సహ. 146

అపరఞ్చ-

శ్లో. సత్సఙ్గః కేశవే భక్తిః గఙ్గాఽమ్భసి నిమజ్జనమ్,
అసారే ఖలు సంసారే త్రీణి సారాణి భావయేత్. 147

అను. ఇందువలననే పెద్దలు అన్నారు-"సంసారం అనే విషవృక్షమునకు రసవత్తరములైన ఫలాలు రెండు. ఒకటి కావ్యరూపమైన అమృతరసాన్ని ఆస్వాదించడం. రెండవది సజ్జనులతోడి స్నేహం."

మరియూ-"సజ్జనస్నేహం, విష్ణుదేవునిపై నిశ్చలభక్తి గంగాజలస్నానం-అనే ఈ మూడు సారములేని ఈ సంసారంలో సారవంతములు."

మన్థర ఉవాచ-

శ్లో. అర్థాః పాదరజోపమా గిరినదీవేగోపమం యౌవనమ్
ఆయుష్యం హిమబిన్దులోలచపలం ఫేనోపమం జీవనమ్,
ధర్మం యో న కరోతి నిశ్చలమతిః స్వర్గాఽర్గలోద్ఘాటనం
పశ్చాత్తాపహతో జరాపరిణతః శోకాగ్నినా దహ్యతే. 148

అను. (అది విని) మంథరుడు ఇలా అన్నాడు- "సంపదలు పాదాలకు అంటుకొనిన ధూలితో సమానాలు. యౌవనం కొండవాగువంటిది. ఆయువు మంచు గడ్డయొక్క నీటిబొట్టుతో తుల్యమైంది. జీవితం నీటిబుగ్గ (నురుగు)వలె క్షణికం. ఇట్టిస్థితిలో ప్రతిమానవుడు తప్పక నిశ్చలచిత్తంతో స్వర్గద్వారాలను తెఱపించే ధర్మాన్ని ఆచరించాలి. అలా చేయనివాడు వార్ధక్యం రాగానే (జీవితం వ్యర్థమాయెనని) దుఃఖాగ్నిచే తపిస్తాడు."

యుష్మాభి రతిసఞ్చయః కృతః. తస్యాఽయం దోషః. శృణు-

శ్లో. ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవ హి రక్షణమ్,
తటాకోదరసంస్థానాం పరీవాహ ఇవాఽమ్భసామ్. 149

అన్యచ్చ-

శ్లో. యదధోఽధః క్షితౌ విత్తం నిచఖాన మితమ్పచః,
తదధోనిలయం గన్తుం చక్రే పన్థాన మగ్రతః. 150

అను. "మీరు ధనాన్ని అధికంగా కూడబెట్టారు. దాని ఫలమే ఇది. వినండి. చెఱువులో పొంగిపొరలే నీటికి అలుగువలె, సంపాదించిన సంపదలకు ధర్మమే రక్షణ ఇస్తుంది.'' 149

మరియు-"ధనికుడై ఉండియూ పరిమితంగా వండుకొని భుజిస్తూ ధనాన్ని భూమిలో మిక్కిలిలోతున దాచునో- ఆ మిక్కిలిలోతైన గుంత, వాడు అధోలోకానికి అనగా- నరకానికి పోవుటకు ముందుగానే త్రవ్వుకొన్న మార్గం వంటిది."

యతః-

శ్లో. నిజసౌఖ్యం నిరున్ధానో యో ధనార్జన మిచ్ఛతి,
పరార్థభారవాహీవ స క్లేశస్యైవ భాజనమ్. 151

తథా చోక్తమ్-

శ్లో. దానోపభోగహీనేన ధనేన ధనినో యది,
భవామః కిం న తేనైవ ధనేన ధనినో వయమ్. 152

అను. ఏలనన-"తాను సుఖింపక ధనాన్ని సంపాదించేవాడు ఇతరుల బరువును మోసే గాడిద మొదలైన జంతువువలె కేవలం దుఃఖాన్నే పొందును." 151

విజ్ఞులు ఇలా చెప్పారు-

"దానం చేయడంగానీ-తాను అనుభవించడంగానీ, లేని ధనంచే ఎవరైనా ధనవంతులు అయినచో మేముమాత్రం (ఇతరులవద్ద ఉండే ధనంచే) ఎందులకు ధనవంతులం గాము ?" 152

గ. యతః-

శ్లో. ధనేన కిం యో న దదాతి నాఽశ్నుతే
బలేన కిం యశ్చ రిపూన్ న బాధతే,

శ్రుతేన కిం యో న చ ధర్మ మాచరేత్
కిమాత్మనా యో న జితేన్ద్రియో భవేత్. 153

అన్యచ్చ-

శ్లో. అనమ్భోగేన సామాన్యం కృపణస్య ధనం పరైః,
అస్యేదమితి సమ్బన్ధో హానౌ దుఃఖేన గమ్యతే. 154

అను. "దానం చేయడానికీ అనుభవించడానికి ఉపయుక్తం గాని (లోభి వాని) ధనం- శత్రువులను బాధించని బలం- ధర్మాచరణలేని పాండిత్యం- ఇంద్రియనిగ్రహంలేని జీవితం నిష్ఫలములు.'' 153

మరియూ-''అనుభవింపబడనందున లోభివాని ధనం ధనహీనుడి దరిద్రంతో సమనమే. అయితే దొంగలు మొదలగువారిచే ఆ ధనం నష్టమైనప్పుడు- "ఇది ఇతనిది"అని దుఃఖంచే తెలియబడుచున్నది'' అనగా లోభిధనం దుఃఖదాయకం అని భావం. 154

అపిచ-

శ్లో. న దేవాయ న విప్రాయ న బన్ధుభ్యో న చాత్మనే,
కృపణస్య ధనం యాతి వహ్ని-తస్కర-పార్థివైః. 155

అను. మరియూ- లోభివాని ధనం అగ్నికి కాలిపోవును. లేక దొంగల గాని ప్రభువుచే గాని అపహరింపబడును. అంతేగాని అతనిచే అనుభవింపబడ దేవతాకార్యాలకు గాని విప్రబంధువులకు దానంచేయడానికి గాని ఉప పడదు.

తథా చోక్తమ్-

శ్లో. దానం ప్రియవాక్యహితం
జ్ఞాన మగర్వం క్షమాఽన్వితం శౌర్యమ్,
త్యాగసహితఞ్చ విత్తం
దుర్లభమేత చ్చతుర్భద్రమ్.

ఉక్తఞ్చ-

శ్లో. కర్తవ్యః సఞ్చయో నిత్యం కర్తవ్యో నాతిసఞ్చయః,
పశ్య సఞ్చయశీలోఽసౌ ధనుషా జమ్బుకో హతః. 157

తా వాహతుః- 'కథ మేతత్' మన్థరః కథయతి—

అను. విజ్ఞులు ఇలా అన్నారు- "ప్రియవాక్కులతోడి దానం, గర్వంలేని జ్ఞానం, ఓర్పుగల్గిన శౌర్యం, త్యాగయుక్తమైన ధనం అనే ఈ నాలుగు శుభవస్తువులు అరుదుగా లభిస్తాయి." 156

మరియూ- "ధనాన్ని కూడబెట్టవలసినదే కాని అతిగా కూడబెట్టరాదు. చూడుము అతిగా కూడబెట్టే స్వభావం గల నక్క (అల్లెత్రాటినిగొరికి) విల్లుచే చంపబడింది." ఆ రెండు (లఘుపతనక హిరణ్యకులు) అడిగినవి-'అది యెట్లు'?

మంథరకుడు ఇలా చెప్పసాగాడు-

# 6. లుబ్ధ-శృగాల కథా

గ. ఆసీత్ కల్యాణకటకవాస్తవ్యో భైరవో నామ వ్యాధః. స చైకదా మాంసలుబ్ధో ధనురాదాయ మృగ మన్విష్యన్ విన్ధ్యాటవీమధ్యం గతః. తత్ర తేన మృగ ఏకో వ్యాపాదితః. తతో మృగమాదాయ గచ్ఛతా తేన ఘోరాకృతిః సూకరో దృష్టః. తతస్తేన మృగం భూమౌ నిధాయ సూకరః శరేణ హతః. సూకరేణాఽప్యాగత్య ప్రలయఘన ఘోరగర్జనం కుర్వాణేన స వ్యాధో ముష్కదేశే హతః ఛిన్న ద్రుమ ఇవ పపాత.

అను. కల్యాణకటకం అనే దేశమున భైరవుడు అనే వేటకాడు నివసించేవాడు. వానికి ఒకనాడు మాంసం తినవలయును అని కోరిక కల్గింది. విల్లు తీసి

కొని జంతువును వెదకుచూ వింధ్యపర్వతం చేరాడు. వాడు అచ్చట ఒక లేడిని చూచాడు దాన్ని చంపాడు. అలా చంపినలేడిని భుజంపై వేసికొని పోసాగాడు. అలా పోతూ భయంకరమైన అడవిపందిని చూచాడు. వెంటనే జింకను నేలపై ఉంచి, ఆ పందిని బాణంతో గొట్టాడు. అది బాణందెబ్బకు విలవిలలాడుచూ ప్రలయమేఘంవలె గర్జిస్తూ వచ్చి వేటకాడిని వృషణప్రదేశమున ఢీకొట్టింది. ఆ దెబ్బతో మొదలు నఱికిన చెట్టు వలె వేటకాడు నేలకూలాడు (ప్రాణం వీడాడు). బాణందెబ్బకు పందియు చచ్చింది.

తథా చోక్తమ్-

శ్లో. జల మగ్ని ర్విషం శస్త్రం క్షుద్వ్యాధిః పతనం గిరేః,
నిమిత్తం కిఞ్చిదాసాద్య దేహీ ప్రాణై ర్విముచ్యతే. 158

అథతయోః పాదాఽఽస్ఫాలనేన త్వేకః సర్పోఽపి మృతః.

అను. విజ్ఞులు అందువలననే అన్నారు- "నీరు, అగ్ని, విషం, ఆయుధం, ఆకలి, రోగం, పర్వతమునుండి పడడం- మొదలైన ఏదో ఒక కారణంద్వారా జీవధారి ప్రాణాలు పోగొట్టుకొనుచుండును."

పిమ్మట వేటకానియొక్కయు పందియొక్కయు కాళ్ల త్రొక్కిడులచే ఒక పాముసైతం చచ్చింది.

గ. అత్రాన్తరే దీర్ఘరావో నామ జమ్బుకః పరిభ్రమ న్నాహారార్థీ తాన్ మృతాన్ మృగ-వ్యాధ-సర్ప-సూకరా నపశ్యత్. ఆలోక్యాఽచిన్తయచ్చ- 'అహో భాగ్యమ్? అద్య మహద్భోజ్యం మే సముపస్థితమ్. అథవా-

శ్లో. అచిన్తితాని దుఃఖాని యథైవాఽఽయాన్తి దేహినామ్,
సుఖాన్యపి తథా మన్యే దైవ మత్రాఽతిరిచ్యతే. 159

అను. ఇంతలో దీర్ఘరావం అనే నక్క ఆహారంకొఱకై వెదకుతూ అచ్చటికి వచ్చింది. చచ్చి ఉండే జింకను వేటకాడిని పామును పందిని చూచింది. సంతోషంతో ఇలా తలంచింది-'ఆహా! ఏమి భాగ్యం! నేడు నాకు గొప్ప ఆహారం

లభించింది. పెద్దలు ఇలా అన్నారు- "అచిన్తితములై ఎలా దుఃఖాలు వచ్చునో సుఖాలు సైతం అలాగే వస్తాయి. అందు దైవం(అదృష్టం) ముఖ్యకారణం."

గ. భవతు, ఏషాం మాంసైర్మాసత్రయం సమధికం భోజనం మే భవిష్యతి.

శ్లో. మాస మేకం నరో యాతి ద్వౌ మాసౌ మృగసూకరౌ,
అహి రేకం దినం యాతి హ్యద్య భక్ష్యో ధనుర్గుణః. 160

తతః ప్రథమబుభుక్షాయా మిదం నిఃస్వాదు కోదణ్డలగ్నం స్నాయు బన్ధనం ఖాదామి- 'ఇత్యుక్త్వా తథాఽకరోత్। తతశ్ఛిన్నే స్నాయుబన్ధనే ద్రుత ముత్పతితేన ధనుషా హృది నిర్భిన్నః స దీర్ఘరావః పఞ్చత్వం గతః. అతోఽహం బ్రవీమి- కర్తవ్యః సఞ్చయో నిత్యమ్' (155 శ్లోక) ఇత్యాది.

అను. కానిమ్ము, వీటి మాంసంతో నాకు మూడు నెలలు సంపూర్ణంగా ఆహారం లభిస్తుంది. (ఎట్లన)?

"ఈ మానవుడు ఒక నెల, లేడి ఒక నెల, పంది ఒక నెల. పాము ఒకదినం ఆహారం అగును. ఈ పూటకు ఈ అల్లెత్రాడు ఆహారం అగును." 160

ఇప్పటి మొదటి ఆకలికై రుచిలేని ఈ వింటినారిని భక్షిస్తాను. ఇలా తలంచి ఆ నక్క అలా గే చేసింది. అల్లెతాడు తెగగానే వింటికొమ్ము వేగంగా విచ్చుకొని ఆ నక్కరొమ్ముకు బలంగా తగిలింది. నక్క గుండె పగిలి చచ్చింది. అందుచే నేను (మంథరుడను) చెప్పుచున్నాను- 'కర్తవ్యః సఞ్చయో నిత్యమ్' ఇత్యాది.

గ. తథాచ-

శ్లో. యద్దదాతి యదశ్నాతి తదేవ ధనినో ధనమ్,
అన్యే మృతస్య క్రీడన్తి దారైరపి ధనైరపి. 161

కిఞ్చ-

శ్లో. యద్దదాసి విశిష్టేభ్యో యచ్చాశ్నాసి దినే దినే,
తత్తే విత్తమహం మన్యే శేషం కస్యాఽపి రక్షసి. 162

అను. దానం చేయడం, తాను అనుభవించడం అనే ఈ రెండే ధనికుడి ధనానికి ఉపయోగాలు, వాడు మరణిస్తే వాడి ధనంతో మరియూ భార్యతో ఇతరులు సుఖాన్ని అనుభవిస్తారు. (161)

మరియూ - "నీవు యోగ్యులకు దానం చేసేదీ-నీవు అనుభవించేదీ మాత్రమే నీ ధనం. ఇక మిగిలిన ధనం అంతా ఇతరులదే, దానికి నీవు రక్షకుడవు అని నేను తలంతును." (162)

గ. యాతు, కిమిదానీ మతిక్రాన్తోపవర్ణనేన. యతః

శ్లో. నాఽప్రాప్య మభివాఞ్ఛన్తి నష్టం నేచ్ఛన్తి శోచితుమ్,
ఆపత్స్వపి న ముహ్యన్తి నరాః పణ్డితబుద్ధయః. 163

తత్ సఖే సర్వదా త్వయా సోత్సాహేన భవితవ్యమ్. యతః

శ్లో. శాస్త్రాణ్యధీత్యాఽపి భవన్తి మూర్ఖా
యస్తు క్రియావాన్ పురుషః స విద్వాన్,
సుచిన్తితఞ్చౌషధ మాతురాణాం
న నామమాత్రేణ కరోత్యరోగమ్. 164

అను. సరే, అది పోనిమ్ము. ఇప్పుడు గతించినదాన్ని తలంచడంవలన లాభం ఏముంది ? ఏలనన

"పండితులైన మానవులు లభించనిదానికై ఆసక్తులు గారు. నష్టమైన వస్తువనకై విచారింపరు. ఆపదలు సంభవించినచో భ్రాంతులు గారు." (163)

కనుక మిత్రమా ? నీవు నిత్యం ఉత్సాహంగా ఉండవలయును. ఏలననగా "కొందరు శాస్త్రాలు అధ్యయనం చక్కగా చేసియూ (ఆచరణం లేనివారై)

మూర్ఖులై ఉన్నారు. ఎవరు ధర్మాన్ని ఆచరిస్తారో వారే విద్వాంసులు అనబడు దురు, ఔషధనామాన్ని నిత్యం స్మరించడంచే రోగం శాంతింపదు గదా ?"(164)

అన్యచ్చ

శ్లో. న స్వల్పమ ప్యధ్యవసాయభీరోః
కరోతి విజ్ఞానవిధి ర్గుణం హి,
అన్ధస్య కిం హ స్తతలస్థితోఽపి
ప్రకాశయ త్యర్థమిహ ప్రదీపః. 165

తదత్ర సఖే దశాఽతిశేషేణ శా న్తిః కరణీయా. ఏతదప్యతికష్టం త్వయా న మ న్తవ్యమ్.

అను. ఇంకనూ "ఆచరణహీనుడికి విజ్ఞానవిధానం (శాస్త్రాధ్యయనం లేక శాస్త్రబోధ) ఏమాత్రమునూ ఉపయోగం గల్గింపదు. గ్రుడ్డివాడు చేతిలో దీపం ఉండిననూ ఏవస్తువునూ చూడలేడు గదా.''

అందుచే ఇచ్చట శేషజీవితాన్ని ప్రశాంతిగా గడుపండి. దీనిని తాము కష్టంగా తలంపవద్దు.

శ్లో. సుఖ మాపతితం సేవ్యం దుఃఖమాపతితం తథా,
చక్రవత్ పరివర్తన్తే దుఃఖాని చ సుఖాని చ. 166

అపరఞ్చ-

శ్లో. నిపానమివ మణ్డూకాః సరఃపూర్ణ మివాణ్డజాః,
సోద్యోగం నర మాయాన్తి వివశాః సర్వసమ్పదః. 167

అను. సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా సహించాలి. సుఖదుఃఖాలు చక్రం మాదిరి తిరుగుతూ ఉంటాయి.

మరియూ - ''కప్పలు అల్పజలం గల కూపాదికమునువలె; పక్షులు సమృద్ధజలమైన తటాకమును వలె - ప్రయత్నశీలుడైన మానవుణ్ణి సంపదలు వివశములై చేరును.''

అపి చ

శ్లో. ఉత్సాహసమ్పన్న మదీర్ఘసూత్రం
క్రియావిధిజ్ఞం వ్యసనే ష్వసక్తమ్,
శూరం కృతజ్ఞం దృఢసౌహృదఞ్చ
లక్ష్మీః స్వయం యాతి నివాసహేతోః. 168

అను. మరియూ - "ఉత్సాహవంతుడూ దీర్ఘసూత్రరహితుడూ [శీఘ్రకార్య కర్తయూ] కర్తవ్యాకర్తవ్య వివేకీ - వ్యసనశూన్యుడూ - శూరుడూ - కృతజ్ఞుడూ దృఢమిత్రయుతుడూ అయిన పురుషుడి వద్దకు లక్ష్మి స్వయంగా నివసించేందుకై వస్తుంది."

విశేషతశ్చ

శ్లో. వినాఽప్యర్థై ర్ధీరః స్పృశతి బహుమానోన్నతిపదం
సమాయుక్తోఽప్యర్థైః పరిభవపదం యాతి కృపణః,
స్వభావా దుద్భూతాం గుణసముదయావా ప్తివిషయాం
ద్యుతిం సైంహీం శ్వా కిం ధృతకనకమాలోఽపి లభతే.

అను. విశేషించి - "ధీరుడు సంపదలు లేకపోయినా గౌరవయుక్తంగా ఉన్నతపదవిని పొందును. కృపణుడు (అల్పుడు-దైవబలశూన్యుడు) ఎన్ని సంపదలు గలవాడైనా అవమానాన్నే పొందును. ఎట్లనగా - ఎన్ని బంగారు హారాలు ధరించినా కుక్కకు సహజమై మహోన్నతగుణసముదయలబ్ధమై విలసిల్లే సింహ-శోభ రాదు గదా?"

కిఞ్చ

శ్లో. ధనవానితి మదస్తే కిం గతవిభవో విషాద ముపయాసి,
కర-నిహత-కన్దుక-సమాః పాతోత్పాతా మనుష్యాణామ్.

అన్యచ్చ

శ్లో. వృత్త్యర్థం నాతిచేష్టేత సా హి ధాత్రైవ నిర్మితా,
గర్భా దుత్పతితే జన్తౌ మాతుః ప్రస్రవతః స్తనౌ. 171

అను. ఇంకనూ-''నేను ధనవంతుడను'-అని నీకు అహంకారం ఉన్నచో ధనం పోగానే ఎందుకు దుఃఖిస్తావు ? మానవులకు ఉన్నతియూ అవనతియూ చేతితో కొట్టిన బంతి వంటివి."
(170)

మరియూ-"జీవనవృత్తికై అతిగా శ్రమింపకుము. దాన్ని బ్రహ్మయే ఏర్పాటుచేసినాడు. గర్భంనుండి శిశువు బయటికి రాగానే తల్లికి స్తనాలనుండి పాలు స్రవిస్తున్నాయి."

అపిచ సఖే శృణు

శ్లో. యేన శుక్లీకృతా హంసాః శుకాశ్చ హరితీకృతాః,
మయూరా శ్చిత్రితా యేన స తే వృత్తిం విధాస్యతి. 172

అపరఞ్చ సతాం రహస్యం శృణు, మిత్ర!

శ్లో. జనయన్త్యార్జనే దుఃఖం తాపయన్తి విపత్తిషు,
మోహయన్తి చ సమ్పత్తౌ కథమర్థాః సుఖాఽఽవహాః. 173

అను. మరియూ మిత్రమా! వినుము - "హంసలను తెల్లగాను-చిలుకలను ఆకుపచ్చరంగుగాను-(హరితవర్ణంగాను) నెమళ్లను చిత్రవర్ణం గాను పుట్టించిన బ్రహ్మయే నీకు జీవనాధారం కల్పిస్తాడు." (172) ఇంకను మిత్రమా, సజ్జనుల రహస్యం వినుము.

"ఈ సంపదలను సంపాదనచేయడంలో దుఃఖం ఉంది-చోరాదులచే నశించినా దుఃఖం ఉంది. ఇక ఈ సంపదలు సమృద్ధిగా ఉన్నా మోహం (అజ్ఞానం) గల్గిస్తాయి. అట్టియెడ సంపదలు సుఖకరములు ఎట్లు అగును ?''
(173)

అపరఞ్చ

శ్లో. ధర్మార్థే యస్య విత్తేహా వరం తస్య నిరీహతా,
ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరా దస్పర్శనం వరమ్.

యతః

శ్లో. యథా హ్యామిష మాకాశే పక్షిభిః శ్వాపదైర్భువి,
భక్ష్యతే సలిలే మత్స్యై స్తథా సర్వత్ర విత్తవాన్. 175

అన్యచ్చ

శ్లో. రాజతః సలిలా దగ్నే శ్చోరతః స్వజనాదపి,
భయ మర్థవతాం నిత్యం మృత్యోః ప్రాణభృతా మివ.

అను. ఇంకనూ-"ధర్మం చేసేందుకై ధనకాంక్ష అందుమా, దానికంటె ధనకాంక్ష లేకుండడమే ఉత్తమం-బురదను త్రొక్కి పాదం కడుగుకొనడంకంటె బురదకు దూరంగా ఉండడం శుభం." (174)

ఏలనన-"మాంసాన్ని ఆకాశంలో పక్షులూ-భూమిపై చండాలాదులు-నీటిలో చేపలు మొదలైనవి ఎలా భక్షిస్తాయో అలాగే ధనవంతున్ని అందరు అంతటా భక్షిస్తారు." (175)

ఇంకనూ-"ప్రాణికోటికి మరణభయంవలె - ధనవంతుడికి ప్రభువువలన-నీటివలన-అగ్నివలన-దొంగలవలన-బంధుజనంవలన నిత్యం భయం ఉండును."

యథాహి

శ్లో. జన్మని క్లేశబహులే కిన్ను దుఃఖమతః పరమ్,
ఇచ్ఛా సమ్పద్యతో నాస్తి యచ్చేచ్ఛా న నివర్తతే. 177

అన్యచ్చ భ్రాతః శృణు

శ్లో. ధనం తావదసులభం లబ్దం కృచ్ఛ్రేణ పాల్యతే
లబ్ధనాశో యథా మృత్యు స్తస్మాదేతన్న చిన్తయేత్. 178

శ్లో. సా తృష్ణా చేత్ పరిత్యక్తా కో దరిద్రః క ఈశ్వరః,
తస్యాశ్చేత్ ప్రసరో దత్తో దాస్యఞ్చ శిరసి స్థితమ్. 179

అను. ఎట్లనగా - "దుఃఖబహులం అయిన ఈ సంసారంలో (జన్మలో) కోరికకు దగినట్లు సంపద లభింపదు. ఇక కోరికయు నివర్తిల్లదు. ఇంతకంటె దుఃఖమైన విషయం ఏమి గలదు." (177)

సోదరా, మరియూ వినుము

"ధనాన్ని సంపాదన చేయడం మొదటి కష్టం. సంపాదించిన దాన్ని రక్షించడం మిక్కిలి కష్టం. ఇక లభించిన ధనం నశించినచో మరణతుల్యదుఃఖం సంభవిస్తుంది. అందుచే ధనచింతన చేయరాదు.'' (178)

"ధనాశను వీడినచో దరిద్రుడు లేడు ధనవంతుడు లేడు. ధనాశకు అవకాశం ఇచ్చినచో దాస్యం నెత్తిన ఉన్నట్లే అగును." 

అపరఞ్చ

శ్లో. యద్యదేవ హి వాఞ్ఛేత తతో వాఞ్ఛా ప్రవర్తతే,
ప్రాప్త ఏవార్థతః సోఽర్థో యతో వాఞ్ఛా నివర్తతే. 180

కిం బహునా, విశ్రమ్భాఽఽలాపైః మయైవ సహాఽత్ర కాలో నీయతామ్.

యతః

శ్లో. ఆమరణాన్తాః ప్రణయాః కోపా స్తత్క్షణభఙ్గురాః,
పరిత్యాగాశ్చ నిఃసఙ్గా భవన్తి హి మహాత్మనామ్. 181

అను. మరియూ-''ఏ యే వస్తువునుగూర్చి చింతిస్తామో, ఆ యా వస్తువును గూర్చి కోరిక వృద్ధి అగును. దేనినుండి మనస్సు మరలునో-ఆ వస్తువు వస్తుతః లభించినదియే.'' (180)

ఇక అధికంగా భాషించడం దేనికి ! విశ్వాసయుక్తములైన సంభాషణలు చేస్తూ నాతో ఇచ్చట కాలం గడుపుము. ఏలనన "మహాత్ముల స్నేహాలు మరణ పర్యంతాలు-కోపాలు క్షణభంగురాలు. దానాదికములు ప్రతిఫలాపేక్షలేనివి అయి ఉండును." (181)

గ. ఇతి శ్రుత్వా లఘుపతనకో బ్రూతే-'ధన్యోఽసి, మన్థర ! సర్వథాఽఽశ్రయణీయోఽసి. యతః

శ్లో. సన్త ఏవ సతాం నిత్య మాపదుద్ధరణక్షమాః,
గజానాం పఙ్కమగ్నానాం గజా ఏవ ధురన్ధరాః. 182

అను. ఇది విని లఘుపతనకుడు ఇలా అన్నాడు 'ఓ మన్థరా నీవు ధన్యుడవు. నీవు అన్నివిధాల ఆశ్రయింపదగినవాడవు. ఏల ననగా "సజ్జనులే సజ్జనులను ఆపదలనుండి ఉద్ధరించడానికి నిత్యం సమర్థులుగా ఉందురు. బురదలో మునిగిన ఏనుగులను ఏనుగులే ఉద్ధరింపగలవు." (182)

అపరఇచ్చ

శ్లో. శ్లాఘ్యః స ఏకో భువి మానవానాం
స ఉత్తమః సత్పురుషః స ధన్యః,
యస్యాఽర్థినో వా శరణాఽఽగతా వా
నాఽఽశావిభఙ్గా విముఖాః ప్రయాన్తి. 183

అను. మరియూ-ఈ ప్రపంచంలో ఎవడివద్దకు వచ్చిన యాచకులు గానీ శరణార్థులు గాని నిరాశచే విముఖులై మరలిపోరో, అతడు మాత్రమే మానవులలో ప్రశంసనీయుడు ఉత్తముడు సత్పురుషుడు ధన్యుడు అనబడును.

గ. తదేవం తే స్వేచ్ఛాఽఽహార-విహారం కుర్వాణాః సన్తుష్టాః సుఖం నివసన్తి స్మ. అథ కదాచి చ్చిత్రాఙ్గనామా మృగః కేనాఽపి త్రాసిత స్తత్రాఽఽగత్య మిలితః. తత్పశ్చాదాయాన్తం భయహేతుం సమ్భావ్య మన్థరో జలం ప్రవిష్టః. మూషికశ్చ వివరం గతః. కాకోఽప్యుడ్డీయ వృక్షాఽగ్ర మారూఢః. తతో లఘుపతనకేన సుదూరం నిరూప్య భయహేతు ర్న కోఽప్యవలమ్బితః. పశ్చాత్ తద్వచనా దాగత్య పునః సర్వే మిలిత్వా తత్రైవోపవిష్టాః. మన్థరే ణోక్తమ్ 'భద్ర మృగ కుశలం తే స్వేచ్ఛయా చోదకా ద్యాఽఽహారోఽనుభూయతామ్. అత్రాఽవస్థానేన వన మిదం సనాథీక్రియతామ్ ఇతి.

అను. ఇలా లఘుపతనక-హిరణ్యక-మంథరులు మువ్వురూ యథేచ్ఛగా ఆహారవిహారాదులు చేస్తూ సంతుష్టులై సుఖంగా నివసింపసాగారు. అంత ఒకనాడు చిత్రాంగుడు అనే జింక ఎవడో వేటకాడు వెంటపడగా భయపడి పరుగెత్తి వచ్చింది-వాటితోచేరింది. ఆ లేడి వెనుక ఏదో భయకారణం గలదు-అని అవి ఊహించాయి. అందువల్ల మంథరుడు నీటిలోనికి దూకాడు- హిరణ్యకుడు బొరి

యలో చొరబడ్డాడు. కాకి ఎగిరి ఎత్తైన చెట్టుకొమ్మపై కూర్చుంది. పిమ్మట లఘుపతనకుడు చాల దూరం పరిశీలనగా చూచాడు. భయకారణం ఏమీ కనపడ లేదు. అంత అతడి మాటచే అందరు మరల వచ్చి చేరారు. అచ్చటనే కూర్చు న్నారు, అప్పుడు మంథరకుడు ఇలా అన్నాడు - 'శుభమూర్తీ, హరిణమా, నీకు కుశలమా? యథేచ్ఛగా ఆహారపానీయాలు గ్రహింపుము. ఇచ్చటనే ఉండి ఈ అడవిని పవిత్రం చేయుము.

గ. చిత్రాఙ్గో బ్రూతే-'లుబ్ధకత్రాసితోఽహం భవతాం శరణమాగతః, తతశ్చ భవద్భిః సహ మిత్రత్వమిచ్ఛామి. భవన్తశ్చాఽనుకమ్పయన్తు మైత్ర్యేణ'. యతః-

శ్లో. లోభాద్వాఽథ భయాద్వాఽపి యస్త్యజేచ్ఛరణాఽఽగతమ్,
బ్రహ్మహత్యాసమం తస్య పాపమాహుర్మనీషిణః. 184

అను. అప్పుడు చిత్రాంగుడు (జింక) ఇలా చెప్పాడు- 'వేటకాడిచే భయ పెట్టబడినవాడనై మీ శరణం చొచ్చాను. అందువల్ల మీ మైత్రిని కోరుచున్నాను. మైత్రిని అనుగ్రహించండి. ఏల ననగా-

"లోభంవలనగానీ భయంవలనగానీ శరణాగతుణ్ణి ఎవడు రక్షింపడో, వాడికి బ్రహ్మహత్యా-తుల్యం అయిన పాపం వచ్చును- అని విజ్ఞులు అందురు."

గ. హిరణ్యకోఽప్యవదత్- 'మిత్రత్వం తావదస్మాభిః సహాఽ యత్నేన నిష్పన్నం భవతః. యతః-

శ్లో. ఔరసం కృతసమ్బన్ధం తథా వంశక్రమాఽఽగతమ్,
రక్షకం వ్యసనేభ్యశ్చ మిత్రం జ్ఞేయం చతుర్విధమ్. 185

తదత్ర భవతా స్వగృహనిర్విశేషేణ స్థీయతామ్, ఇతి.

అను. అది విని హిరణ్యకుడు ఇలా అన్నాడు- 'మాతో స్నేహం అయితే తమకు అప్రయత్నంగానే సిద్ధించింది. ఏలననగా- మైత్రి నాల్గు విధాలు- ఒకటి పుత్రపౌత్రాది రక్తసంబంధమైంది. రెండు వివాహాదికం ద్వారా ఏర్పడేది. మూడు- వంశక్రమంగా సంభవించేది. నాల్గు ఆపదలనుండి రక్షించడం ద్వారా సిద్ధించేది.
185

'కనుక తాము ఇచ్చట సొంతఇల్లుగా భావించి ఉండవచ్చును'

గ. తచ్ఛ్రుత్వా మృగః సానన్దో భూత్వా కృతస్వేచ్ఛాఽఽహారః పానీయం పీత్వా జలాఽఽసన్న- వటతరుచ్ఛాయాయాముపవిష్టః.

అను. మృగం(జింక) అది విని ఆనందం పొందింది. తృప్తిగా(ఆహారం) పచ్చిక మేసింది. నీరు త్రాగింది. తటాకతీరాన ఉండే మఱ్ఱిచెట్టునీడన విశ్రాంతిగా శయనించింది.

గ. అథ మన్థరో బ్రూతే- 'సఖే మృగ! కేన త్రాసితోఽసి? అస్మిన్నిర్జనే వనే కదాచిత్ కిం వ్యాధాః సఞ్చరన్తి'? ఇతి. మృగేణోక్తమ్- "అస్తి కలిఙ్గవిషయే రుక్మాఙ్గదో నామ నృపతిః. స చ దిగ్విజయ వ్యాపారక్రమేణాఽఽగత్య చన్ద్రభాగానదీతీరే సమావేశితకటకో వర్తతే. ప్రాతశ్చ తేనాఽత్రాఽఽగత్య కర్పూరసరఃసమీపే భవితవ్యమ్. వ్యాధానాం ముఖాత్ కింవదన్తీ శ్రూయతే. తదత్రాఽపి ప్రాతరవస్థానం భయ హేతుకమిత్యాలోచ్య యథాకార్యం తథాఽఽరభ్యతామ్'. తచ్ఛ్రుత్వా కూర్మః సభయమాహ- 'మిత్ర! జలాశయాన్తరం గచ్ఛామి'. కాకమృగావపి ఉక్తవన్తౌ- 'మిత్ర! ఏవమస్తు'. హిరణ్యకో విమృశ్యాఽబ్రవీత్-"పునర్జలాశయే ప్రాప్తే మన్థరస్య కుశలమ్." స్థలే గచ్ఛతోఽస్య కా విధా? యతః-

శ్లో. అమ్బాంసి జలజన్తూనాం దుర్గం దుర్గనివాసినామ్,
స్వభూమిః శ్వాపదాదీనాం రాజ్ఞాం సైన్యం పరం బలమ్. 186

అను. అంత మంథరుడు ఇలా అడిగాడు- 'మిత్రమా చిత్రాంగా! ఎందుకు భయపడినావు? జనశూన్యం అయిన ఈ అడవిలో ఎన్నడేని వేటకాండ్రు సంచరిస్తారా? చిత్రాంగుడు (జింక)ఇలా బదులు పల్కాడు- కలింగదేశమున రుక్మాంగదుడు అనే రాజు గలడు- అతడు దిగ్విజయయాత్ర చేస్తూ చంద్రభాగానదీతీరం చేరాడు. అచ్చట గుడారాలు వేసి ప్రస్తుతం బసచేశాడు. రేపు వేకువన ఇచ్చటకి వచ్చి ఈ కర్పూరసరోవరం సమీపాన విడిది చేయును- అని వేటకాండ్రు అను

కొనుచూ ఉండగా విన్నాను. అందువల్ల రేపు వేకువన ఇచ్చట ఉండడం అపాయ కరంగా భావిస్తున్నాను. ఈ విషయం ఆలోచన చేసి ఏది మంచిదో అలా చేయడం శుభం'. అది విని తాబేలు భయపడి ఇలా అంది-'మిత్రమా! మఱియొక సరస్సునకు పోయెదను'. అందుకు కాకి జింక ఇలా అన్నాయి- 'మిత్రమా, అలాగే చేయుము. ఆ మాటను హిరణ్యకుడు విమర్శించి ఇలా పల్కాడు- 'వేఱొక కొలను చేరితే మంథరుడు సుఖంగానే ఉంటాడు- కాని నేలపై పోయేటప్పుడు (మధ్యలో) ఇతడి గతి ఏమగునో గదా? ఏలననగా-

జలచరాలకు జలం, కోటలో ఉండేవారికి కోట, పులులు మొదలైన హింసక (శ్వాపద) జంతువులకు అడవీ, రాజులకు సైన్యం బలదాయకములు.

గ. అథాఽప్యుపాయశ్చిన్త్యతామ్. తథా చోక్తమ్-

శ్లో. ఉపాయేన హి యచ్ఛక్యం న తచ్ఛక్యం పరాక్రమైః,
శృగాలేన హతో హస్తీ గచ్ఛతా పఙ్కవర్త్మనా. 187

తద్యథా—

అను. అయినా ఉపాయం ఆలోచించండి. విజ్ఞులు ఇలా అన్నారు-

"ఏది ఉపాయంచే సాధ్యమగునో అది పరాక్రమాలచే సాధ్యం గాదు.. బురదదారిలో పయనిస్తూ నక్క ఏనుగును చంపింది. అదెట్లనగా-

## 7. కర్పూరతిలకహస్తికథా

(కర్పూరతిలకం అనే ఏనుగు కథ)

గ. అస్తి బ్రహ్మారణ్యే కర్పూరతిలకో నామ హస్తీ. తమవలోక్య సర్వే శృగాలాశ్చిన్తయన్తి స్మ-"యద్యయం కేనాఽప్యుపాయేన మ్రియతే తదాఽస్మాకమేతేన దేహేన మాసచతుష్టయస్య స్వేచ్ఛాభోజనం భవేత్'

ఇతి. తత స్తన్మధ్యాదేకేన వృద్ధశృగాలేన ప్రతిజ్ఞా కృతా- మయా బుద్ధి ప్రభావాదస్య మరణం సాధయితవ్యమ్." అనన్తరం స వఞ్చకః కర్పూర తిలకసమీపం గత్వా సాష్టాఙ్గపాతం ప్రణమ్యోవాచ-"దేవ! దృష్టిప్రసాదం కురు" ఇతి. హస్తీ బ్రూతే- 'క స్త్వమ్? కుతః సమాయాతః'. సోఽవదత్- 'జమ్బుకోఽహం స ర్వైర్వనవాసిభిః పశుభిర్మిలిత్వా భవత్సకాశం ప్రస్థాపితః, యద్వినా రాజ్ఞా స్థాతుం న యుక్తమ్. తదత్రాఽటవీరాజ్యేఽభిషేక్తుం భవాన్ సర్వస్వామి గుణోపేతో నిరూపితః. యతః-

శ్లో. కులాఽఽచారజనాఽఽచారై రతిశుద్ధః ప్రతాపవాన్,
ధార్మికో నీతికుశలో స స్వామీ యుజ్యతే భువి. 188

అను. బ్రహ్మారణ్యంలో కర్పూరతిలకం అనే ఏనుగు ఉంది. నక్కలు అన్నీ దాన్ని చూచాయి. ఇలా తలంచాయి- 'దీన్ని ఏదేని ఉపాయంచే చంపితి మేని దీన్ని దేహాన్ని నాల్గునెలలు హాయిగా విందుభోజనంగా తినవచ్చును'. అంత వాటిలో ఒక ముసలినక్క ముందుకు వచ్చి ఇలా ప్రతిజ్ఞ చేసింది- 'నేను నా బుద్ధిబలంచే దీన్ని చంపెదను.' పిమ్మట ఆ మోసకారి అయిన నక్క కర్పూర తిలకంవద్దకు పోయింది- సాష్టాంగపాతంగా ప్రణమిల్లింది. ఇలా విన్నవించింది- "దేవా! దయాదృష్టిని అనుగ్రహింపుడు". ఏనుగు ఇలా అంది- 'ఎవరు నీవు? ఎందుకు వచ్చావు?' నక్క ఇలా సమాధానం పల్కింది- 'నేను నక్కను. అడవి లోని జంతువులు అన్నీ సభ చేశాయి.' నన్ను తమవద్దకు పంపాయి. వాటి సందేశం ఇది- 'ప్రభువు లేకుండా ఉండడం సముచితంగా లేదు. అందువల్ల ఈ అరణ్యరాజ్యానికి తమ్ము ప్రభువులనుగా అభిషేకింపదలచాము. తమ యందు ప్రభువునకు యోగ్యాలైన గుణాలు అన్నీ ఉన్నాయి. ఏలననగా—

'కులాచారంచేతనూ లోకాచారంచేతనూ పవిత్రుడూ, ప్రతాపవంతుడూ, ధార్మికుడూ, నీతినిపుణుడూ, అయినవాడే ప్రభువు అగుటకు తగినవాడు. 188

అపరఞ్చ పశ్య—

శ్లో. రాజానం ప్రథమం విన్దేత్ తతో భార్యాం తతో ధనమ్,
రాజన్యసతి లోకేఽస్మిన్ కుతో భార్యా కుతో ధనమ్. 189

గ. అన్యచ్చ-

శ్లో. పర్జన్య ఇవ భూతానామాధారః పృథివీపతిః,
వికలేఽపి హి పర్జన్యే జీవ్యతే న తు భూపతౌ. 190

అను. మరియు (వినుము) చూడుము-

"మొదట ప్రభువును ఆశ్రయించాలి. పిమ్మట భార్యను గ్రహించాలి. ఆ మీదట ధనం ఆర్జించాలి. ఈ ప్రపంచంలో ప్రభువు లేనిచో భార్య ఎక్కడిది? ధనం ఎక్కడిది?" 189

మరియూ-"మేఘంవలె ప్రాణికోటికి అంతకూ ప్రభువే ఆధారం. ఒకప్పుడు మేఘం వర్షింపకపోయినా ఏదోవిధంగా జీవించవచ్చును గాని ప్రభువు లేనిచో జీవింప సాధ్యంగాదు." 190

కిఞ్చ-

శ్లో. నియతవిషయవర్తీ ప్రాయశో దణ్డయోగా
జ్జగతి పరవశేఽస్మిన్ దుర్లభః సాధువృత్తః,
కృశమపి వికలం వా వ్యాధితం వాఽధనం వా
పతిమపి కులనారీ దణ్డభీత్యాఽభ్యుపైతి.

అను. "ఈ పరాధీనమైన ప్రపంచంలో మానవుడు సాధారణంగా 'దండిస్తారు' అనే భయంవల్లనే నియత (నీతిబద్ధ) వర్తనుడై ఉన్నాడు. సహజసాధు వర్తనుడు దుర్లభం. కులకాంత సైతం దండిస్తారు అనే భయంవల్లనే భర్త (శోకాదికంచే) కృశించినవాడైనా, వికలాంగుడైన, రోగి అయినా, ధనహీనుడైనా సేవిస్తూ ఉంది."

గ. తద్యథా లగ్నవేలా న చలతి తథా కృత్వా సత్వరమాగమ్యతాం దేవేన" -ఇత్యేవముక్త్వా స ఉత్థాయ చలితః. తతోసౌ రాజ్యలోభాఽఽకృష్టః కర్పూరతిలకః శృగాలదర్శితవర్త్మనా ధావన్ మహాపఙ్కే నిమగ్నః. హస్తినోక్తమ్- 'సఖే! శృగాల! కిమధునా విధేయమ్? మహాపఙ్కే పతితోఽహం మ్రియే. పరావృత్య పశ్య" శృగాలేన విహస్యోక్తమ్- 'దేవ! మమ పుచ్ఛాగ్రే హస్తం దత్త్వా ఉత్తిష్ఠ. యస్మాన్మ

ద్విధస్య వచసి త్వయా విశ్వాసః కృతః. తస్య ఫలమేతత్. తదను భూయతామశరణం దుఃఖమ్.

అను. అందుచే రాజ్యాభిషేకలగ్న వేల అతిక్రమింపకముందే ప్రభువులు దయచేయండి'. ఇలా అని ఆ నక్క అచ్చటినుండి లేచిపోసాగింది. అప్పుడు కర్పూరతిలకం అనే ఈ ఏనుగు రాజ్యపీఠంపై ఆశచే ఆకర్షితమై నక్కవెంట పరుగెత్తుచూ పెద్ద బురదలో చిక్కుపడించి. కదలజాలక నక్కతో ఇలా అంది- 'మిత్రమా! నక్కా! ఇప్పుడు ఏమి చేయాలి- గొప్ప బురదలో మునిగి మరణిస్తున్నాను'. నక్క నవ్వుతూ ఇలా పల్కింది- "ప్రభూ! నా తోక కొనను తొండములో పట్టుకొని పైకి రండి. నావంటివాడి మాటను నమ్మినందులకు లభించిన ఫలం ఇది. అందుచే దిక్కులేని దుఃఖం అనుభవింపుము".

తథా చోక్తమ్-

శ్లో. యదాఽసత్సఙ్గరహితో భవిష్యసి భవిష్యసి,
యదాఽసజ్జనగోష్ఠీషు పతిష్యసి పతిష్యసి. 192

తతో మహాపఙ్కే నిమగ్నో హస్తీ శృగాలైర్భక్షితః, అతోఽహం బ్రవీమి- 'ఉపాయేన తు యచ్ఛక్యమ్ ఇత్యాది.

అను. విజ్ఞులు ఇలా అన్నారు- "ఎప్పుడు దుర్జనస్నేహరహితుడవై ఉండెదవో అప్పుడు ఉండెదవు (జీవితుడవై ఉండెదవు). ఎప్పుడు దుర్జనగోష్ఠులతో (స్నేహంలో) పడెదవో అప్పుడు పడిపోయెదవు (మరణిస్తావు)". 192

తర్వాత బురదలో చిక్కుపడిన ఏనుగు మరణించింది. నక్కలు అన్నీ దాన్ని భక్షించాయి. అందుచే నేను (హిరణ్యకుడను) తెల్పుచున్నాను- 'ఉపాయేన తు యచ్ఛక్యం'- ఇత్యాదిగ.

గ. తత స్తద్ధితవచనమవధీర్య మహతా భయేన విముగ్ధ ఇవ మన్థర స్తజ్జలాఽఽశయముత్సృజ్య ప్రచలితః: తేఽపి హిరణ్యకాదయః స్నేహాదనిష్టం శఙ్కమానా స్తమనుజగ్ముః. తత స్తలే గచ్ఛన్ కేనాఽపి వ్యాధేన వనే పర్యటతా స మన్థరః ప్రాప్తః. స చ తం గృహీత్వోత్థాయ

ధనుషి బద్ధ్వా 'ధన్యోఽస్మి' త్యభిధాయ భ్రమణక్లేశాత్ క్షుత్పిపాసాఽఽకులః స్వగృహాఽభిముఖం ప్రయాతః.

అను. అంత మంథరుడు (తాబేలు) హిరణ్యకుడి హితవాక్యాలను లక్ష్యం చేయలేదు. భయంచే భ్రాంతుడయ్యాడు- ఆ సరస్సును విడిచి పోసాగాడు. అప్పుడు హిరణ్యకుడు మొదలైనవారు అతనికి కీడును శంకించారు. అతడికి వెనుకనే(ప్రచ్ఛన్నంగా) కదిలారు. ఇంతలో అడవిలో తిరిగే ఒకానొక వేటకాడు నేలపై పయనించే మంథరుడిని చూచాడు. వెంటనే పట్టుకొన్నాడు. వింటికొమ్మున బంధించాడు. అనాయాసలాభంచే తనను అదృష్టవంతుడిగా భావించాడు. అడవిలో తిరిగిన బడలికచే ఆకలిదప్పులచే కలత నందినవాడై ఇంటిదారి పట్టాడు.

గ. అథ తే మృగవాయసమూషికాః పరం విషాదముపగతాః తమనుగచ్ఛన్తి స్మ. తతస్తు హిరణ్యకో విలపతి-

శ్లో. ఏకస్య దుఃఖస్య న యావదన్తం
గచ్ఛామ్యహం పారమివార్ణవస్య,
తావద్ద్వితీయం సముపస్థితం మే
ఛిద్రేష్వనర్థా బహులీభవన్తి. 193

అను. ఇది చూచి జింక- కాకి- ఎలుక ఈ మూడూ మిక్కిలి దుఃఖం పొందాయి. వేటకాణ్ణి అనుసరించాయి. అప్పుడు హిర్యణ్యకుడు ఇలా విలపించాడు-

"సముద్రంయొక్క వేరొకతీరంవలె ఒక దుఃఖంయొక్క అంతాన్ని పొందకముందే నాకు మఱియొక దుఃఖం దాపురించింది. ఆపదలందే ఆపదలు అధికంగా వచ్చిపడును." 193

శ్లో. స్వభావజం తు యన్మిత్రం భాగ్యేనైవాఽభిజాయతే,
తదకృత్రిమసౌహార్దమాపత్స్వపి న ముఞ్చతి. 194

అపి చ-

శ్లో. న మాతరి న దారేషు న సోదర్యే న చాత్మజే,
విశ్వాసస్తాదృశః పుంసాం యాదృఙ్మిత్రే స్వభావజే. 195

అను. సహజమిత్రుడు భాగ్యంచేతనే లభిస్తాడు. అట్టివాడి సహజస్నేహం ఆపదలందునూ తొలగిపోదు. 194

మరియూ- "మానవులకు సహజమిత్రుడియందు ఎంత నమ్మకం ఉండునో, అంత నమ్మకం తల్లియందూ, భార్యయందూ, సోదరుడియందూ, పుత్రుడియందూ ఉండదు." 195

గ. ఇతి ముహుర్విచిన్త్య ప్రాహ- 'అహో, మే దుర్దైవమ్. యతః-

శ్లో. స్వకర్మసన్తానవిచేష్టితాని
కాలాన్తరాఽఽవర్తిశుభాఽశుభాని,
ఇహైవ దృష్టాని మయైవ తాని
జన్మాన్తరాణీవ దశాన్తరాణి. 196

అథవా- 'ఇత్థమేవైతత్'—

శ్లో. కాయః సన్నిహితాఽపాయః సమ్పదః పదమాపదామ్,
సమాగమాః సాఽపగమాః సర్వముత్పాది భఙ్గురమ్. 197

అను. ఇట్లు పలుమారులు విచారించి ఇలా అన్నాడు- 'అయ్యో! నా దురదృష్టం (ఏమందును). ఏలననగా-

"పూర్వకర్మసమూహ సంప్రాప్యములూ కాలాంతరభోగ్యశుభాఽశుభరూపాలు అయిన దశలు అన్నీ నేను ఈజన్మలోనే అనుభవించాను." 196

ఇది ఇంతే. "శరీరం క్షణభంగురం. సంపదలు ఆపదలకు నిలయాలు. మిత్రాదిసమాగమాలు అన్నీ వియోగకలితాలు. పుట్టునది అంతా గిట్టునదియే."

గ. పునర్విమృశ్యాఽఽహ-

శ్లో. శోకాఽరాతిభయత్రాణం ప్రీతివిశ్రమ్భభాజనమ్,
కేన రత్నమిదం సృష్టం మిత్రమిత్యక్షరద్వయమ్. 198

శ్లో. మిత్రం ప్రీతిరసాయనం నయనయోరానన్దనం చేతసః
పాత్రం యత్ సుఖదుఃఖయోః సమమిదం పుణ్యాత్మనా లభ్యతే,
యేచాఽన్యే సుహృదః సమృద్ధిసమయే ద్రవ్యాఽభిలాషాఽఽకులాః
తే సర్వత్ర మిలన్తి తత్త్వనికషగ్రావా తు తేషాం విపత్. 199

అను. మరలా విచారించి ఇలా పల్కాడు-

"దుఃఖంనుండియూ శత్రువునుండియూ భయంనుండియూ రక్షించున దియూ, స్నేహానికీ నమ్మకానికీ స్థానం అయినదే అయిన 'మిత్రం' అనే రెండు అక్షరాలను ఏ మహాత్ముడు పుట్టించాడో." 198

మరియూ- 'కన్నులకు ప్రేమ అనే రసాయనం (సిద్ధౌషధం) వంటివాడూ, మనస్సునకు ఆనందదాయకుడూ, సుఖదుఃఖాలలో సమాన భాగస్వామియూ అయిన మిత్రుడు పుణ్యాత్మునకే లభిస్తాడు. ఇక ఐశ్వర్యసమృద్ధి ఉన్నప్పుడు ధనాశచే పీడితులై చేరే మిత్రులు అంతటా లభిస్తారు. అపదయే అట్టివారికి పరీక్షయైన ఒఱపిడిరాయి.' 199

గ. ఇతి బహు విలప్య హిరణ్యకశ్చిత్రాఙ్గ- లఘుపతనకావాహ- "యావదయం వ్యాధో వనాన్న నిఃసరతి తావన్మన్థరం మోచయితుం యత్నః క్రియతామ్"। తావూచతుః- "సత్వరం యథాకార్యముపదిశ" హిరణ్యకో బ్రూతే- 'చిత్రాఙ్గో జలసమీపం గత్వా మృతమివాఽఽత్మానం నిశ్చేష్టం దర్శయతు. కాకశ్చ తస్యోపరి స్థిత్వా చఞ్చ్వా కిమపి విలిఖతు. తదా నూనమేనేన లుబ్ధకేన మృగమాంసార్థినా తత్ర కచ్ఛపం పరిత్యజ్య సత్వరం గన్తవ్యమ్. తతోఽహం మన్థరస్యబన్ధనం ఛేత్స్యామి. సన్నిహితే లుబ్ధకే భవద్భ్యాం పలాయితవ్యమ్."

అను. ఇలా హిరణ్యకుడు పెక్కువిధాల విలపించాడు. పిమ్మట లఘుపతనకుడిని చిత్రాంగుడిని చూచి ఇట్లు చెప్పాడు 'ఈ వేటకాడు ఈ అడవిని దాటి పోకముందే మంథరుణ్ణి విడిపించటానికి ఏదేని ప్రయత్నం చేయాలి' వారిరువురూ అడిగారు 'నీవే కర్తవ్యాన్ని వెంటనే బోధింపుము. అంత హిరణ్యకుడు

ఇట్లు తెల్పాడు "ఇతడు పోయే దారిలో ఏదేని మడుగువద్దకు చిత్రాంగుడు ముందుగా వెళ్లాలి. నీటికి దగ్గరగా చచ్చినట్లు ఏమాత్రం కదలకుండా పరుండాలి. అతడిపైన లఘుపతనకుడు వ్రాలి ముక్కుతో ఏదో గీకుతూ ఉండాలి. అది వేటగాడు చూడగనే మంథరుణ్ణి నేలపై ఉంచును. లేడిమాంసంపై ఆశతో వెంటనే చిత్రాంగుని సమీపింప నెంచును. అతడు అచ్చటినుండి కదలగానే నేను మంథరుని బంధాలను కొరికివేస్తాను. వాడు మీదగ్గరికి వచ్చునంతలో మీరు ఇరువురూ పారిపొండు''.

గ. తతశ్చిత్రాఙ్గ లఘుపతనాభ్యాం శీఘ్రం గత్వా తథాఽనుష్ఠితే సతి స వ్యాధః పరిశ్రాన్తః పానీయం పీత్వా తరోరధస్తాదుపవిష్టః సన్ తథావిధం మృగమపశ్యత్. తతః కచ్ఛపం జలసమీపే నిధాయ కర్తరికామాదాయ ప్రహృష్టమనా మృగాన్తికం చలితః. అత్రాన్తరే హిరణ్యకేన ఆగత్య మన్థరస్య బన్ధం ఛిన్నమ్. ఛిన్నబన్ధనః కూర్మః సత్వరం జలాశయం ప్రవిష్టః. స చ మృగః ఆసన్నం తం వ్యాధం విలోక్యోత్థాయ పలాయితః. ప్రత్యావృత్య లుబ్ధకో యావత్తరుతల మాయాతి తావత్కూర్మ మపశ్యన్నచిన్తయత్ 'ఉచితమేవైతన్మమాఽ సమీక్ష్య కారిణః యతః.

శ్లో. యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువాణి నిషేవతే,
ధ్రువాణి తస్య నశ్యన్తి అధ్రువం నష్టమేవ హి. 200

అను. పిమ్మట చిత్రాంగ లఘుపతనకులు అలాగే చేశారు. అలసిన వేటకాడు మడుగులో నీరు త్రాగాడు. తీరాన ఉండే చెట్టుక్రింద కూర్చున్నాడు. ఎదురుగా అలా ఉండే లేడిని చూచాడు వెంటనే తాబేలును (పెంటికొమ్మున గట్టుకొన్నదానిని) ఆ నీటిదగ్గరనే భూమిపై ఉంచాడు. కత్తి తీసికొని సంతోషంతో లేడి ఉండే చోటుకు కదిలాడు. ఇంతలో హిరణ్యకుడు (ఎలుక) వచ్చాడు. మంథరుడి బంధాలను కొఱికివేశాడు. తోడనే మంథరుడు మడుగులో చొరబడ్డాడు. జింకయు కాకియూ వేటకాడు సమీపించడాన్ని గమనించాయి. జింక పరుగెత్తింది. కాకి ఎగిరిపోయింది. వేటకాడు ఇది గుర్తించాడు. వెనుకకు మరలి

చెట్టువద్దకు వచ్చాడు. తాబేలు లేకపోవడం గ్రహించి ఇలా విచారించాడు.
'ఆలోచనాశూన్యంగా పనిచేసిన నాకు ఇది జరుగడం సముచితమే. ఏలననగా

"ఎవడు (సంప్రాప్త) స్థిరవస్తువును వదలి అప్రాప్తవస్తువునకై ఆశపడి పోవునో - అట్టివాడికి (లబ్ధ) ప్రాప్తవస్తువు చేజారిపోవును. ఇక అప్రాప్తవస్తువు లేనే లేదు గదా." (200)

గ. తతోఽసౌ స్వకర్మవశాన్నిరాశః కటకం ప్రవిష్టః. మన్థరాదయశ్చ సర్వే ముక్తాఽఽపదః స్వస్థానం గత్వా యథాసుఖమాస్థితాః.

అను. అంత వేటకాడు తన కర్మను నిందించుకుంటూ నిరాశతో ఇల్లు చేరాడు. ఇక మంథరుడు మొదలైన మిత్రులు నల్గురు ఆపదను తప్పించుకొన్నవారై తమ నెలవులు చేరారు - సుఖంగా నివసింపదొడగారు.

గ. అథ రాజపుత్రైః సానన్దముక్తమ్ - 'సర్వే శ్రుతవన్తః సుఖినో వయమ్ సిద్ధం నః సమీహితమ్. విష్ణుశర్మోవాచ "ఏతద్భవతామభిలషితమపి సమ్పన్నమ్. అపరమతి ఇదమస్తు.

శ్లో. మిత్రం యాన్తు చ సజ్జనా జనపదై ర్లక్ష్మీః సమాలభ్యతాం
భూపాలాః పరిపాలయన్తు వసుధాం శశ్వత్ స్వధర్మే స్థితాః,
ఆస్తాం మానసతుష్టయే సుకృతినాం నీతిర్నవోఢేవ వః
కల్యాణం కురుతాం జనస్య భగవాంశ్చన్ద్రార్ధచూడామణిః.

ఇతి శ్రీమన్నారాయణ పణ్డిత సఙ్గృహీతః హితోపదేశే మిత్రలాభః సమాప్తః.

అను. అంత రాజపుత్రులు ఆనందమంది ఇలా అన్నారు - 'అందరం ఈ మిత్రలాభకథలు విన్నాము. సుఖం పొందాము. మా కోరిక సిద్ధించింది.' విష్ణుశర్మ ఇట్లు పల్కాడు - 'మీరు అభిలషించిన విధంగానే ఈ మిత్రలాభం తెలుపబడింది. మరియు ఈ క్రింది శుభం సిద్ధించుగాక.

సజ్జనులు మంచిమిత్రులను పొందుదురుగాక. దేశములు (దేశవాసులు)

లక్ష్మీసంపన్నత నొందును గాక. ప్రభువులు నిత్యం స్వధర్మనిరతులై భూమిని పాలింతురుగాక. ఈ నీతి నవవధువువలె సజ్జనులకు సంతోషం గల్గించుగాక చంద్ర - కలా శిరోమణియైన భగవానుడు శివుడు మానవులకు శుభములను అనుగ్రహించుగాక.

ఇది శ్రీమన్నారాయణ పండిత సంగృహీతమైన హితోపదేశ మిత్రలాభమునకు శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి రచించిన ఆంధ్రానువాదం సమాప్తం.

శుభం

ఓం

# హితోపదేశః - సుహృద్భేదః

## హితోపదేశం - సుహృద్భేదం

గ. అథ రాజపుత్రా ఊచుః - 'ఆర్య మిత్రలాభః శ్రుతస్తావ దస్మాభిః. ఇదానీం సుహృద్భేదం శ్రోతుమిచ్ఛామః". విష్ణుశర్మోవాచ- 'సుహృద్భేదం తావచ్ఛృణుత యస్యాయ మాద్యః శ్లోకః.

శ్లో. వర్ధమానో మహాన్ స్నేహో మృగేన్ద్రవృషయోర్వనే,
పిశునేనాతిలుబ్ధేన జమ్బుకేన వినాశితః. 1

అను. అంత రాజపుత్రులు ఇలా అడిగారు - 'ఆర్యా ! మిత్రలాభం విన్నాం. ప్రస్తుతం మిత్రభేదాన్ని వినదలచాము'. విష్ణుశర్మ ఇట్లు చెప్పాడు - 'మిత్రభేదం వినుడు.

దాని మొదటిశ్లోకం ఇది. (శ్లోకభావం.)

"ఒక అడవిలో సింహానికి వృషభానికి మైత్రి ప్రవర్ధమానంగా ఉంది. చాడీకోరూ దురాశాయుక్తం అయిన ఒక నక్క వాటి మైత్రిని నాశం చేసింది".

గ. రాజపుత్రైరుక్తమ్ - 'కథమేతత్' ? విష్ణుశర్మా కథయతి- "అస్తి దక్షిణాపథే సువర్ణవతీ నామ నగరీ. తత్ర వర్ధమానో నామ వణిక్నివసతి తస్య ప్రచురేఽపి విత్తేఽపరాన్ బన్ధూ నతిసమృద్ధాన్ సమీక్ష్య పునరర్థవృద్ధిః కరణీయా ఇతి మతిర్బభూవ. యతః.

శ్లో. అధోఽధః పశ్యతః కస్య మహిమా నోపచీయతే,
ఉపర్యుపరి పశ్యన్తః సర్వ ఏవ దరిద్రతి. 2

అను. రాజపుత్రులు అన్నారు "ఇది ఎట్లు?" విష్ణుశర్మ ఇలా చెప్ప సాగాడు.

దక్షిణదేశంలో సువర్ణవతి అనే నగరం ఉంది. అందు వర్ధమానుడు అనే వైశ్యుడు నివసిస్తున్నాడు. అతనివద్ద అధికంగా ధనం ఉంది. అయినా తనకంటె ధనవంతులైన బంధువులను చూచి ఇంకా అధికంగా ధనం సంపాదించాలి - అనే కోరిక గల్గింది. ఏలనన తనకంటె క్రిందివారిని చూచేవాడు ఎవడు వృద్ధిలో ఉండడు. అనగా వారికంటె ఇతడు తనను గొప్పగా తలంచును అని భావం. అలాగే తమకంటే ఎక్కువవారిని చూచేవారు అందరూ దరిద్రులే. అనగా ఎక్కువ తక్కువ అనే భావాలు సాపేక్షములు అని సారాంశం. (2)

అపరఞ్చ

శ్లో. బ్రహ్మహాఽపి నరః పూజ్యో యస్యాఽస్తి విపులం ధనమ్,
శశినస్తుల్యవంశోఽపి నిర్ధనః పరిభూయతే. 3

అన్యచ్చ -

శ్లో. అవ్యవసాయినమలసం దైవపరం సాహసాచ్చ పరిహీనమ్,
ప్రమదేవ హి వృద్ధపతిం నేచ్ఛత్యుపగూహితుం లక్ష్మీః. 4

అను. ఇంకనూ "అధికంగా ధనం ఉండేవాడు బ్రహ్మహత్య చేసినవాడైనా పూజనీయుడు అగును. ధనహీనుడు చంద్రునితో సమానమైన వంశంలో పుట్టినా అవమానం పొందును." (3)

మరియూ - "లక్ష్మి సాహసహీనుడై అంతా దైవం అదృష్టం అనుచూ, ఎలాటి ప్రయత్నం చేయక, సోమరిగా ఉండేవానిని - యువతి ముసలిమగడిని వలె కౌగలింపదలంపదు." (4)

కిఞ్చ

శ్లో. ఆలస్యం, స్త్రీసేవా సరోగతా జన్మభూమివాత్సల్యమ్,
సన్తోషో భీరుత్వం షడ్ వ్యాఘాతా మహత్త్వస్య. 5

యతః

శ్లో. సమ్పదా సుస్థిరమ్మన్యో భవతి స్వల్పయాఽపి యః,
కృతకృత్యో విధిర్మన్యే న వర్ధయతి తస్య తామ్. 6

అను. మరియూ- "సోమరితనం, స్త్రీవ్యసనం, అనారోగ్యం, జన్మభూమిపై ప్రేమ, (=జన్మభూమిని వదలలేకపోవడం) సంతోషం, భయం, అనే ఈ ఆరూ అభివృద్ధికి ఆటంకాలు." 5

ఏలనన- "ఎవడు అల్పసంపదచేతనే తనను సుస్థిరసంపద గలవాడినిగా తలంచునో అట్టివాడి భాగ్యం అంతటితో అగుతుంది- ఇక వాణ్ణి వృద్ధి నొందింపదు." 6

గ. అపరఞ్చ-

శ్లో. నిరుత్సాహం నిరానన్దం నిర్వీర్యమరినన్దనమ్,
మా స్మ సీమన్తినీ కాచిజ్జనయేత్ పుత్రమీదృశమ్. 7

తథా చోక్తమ్-

శ్లో. అలబ్ధం చైవ లిప్సేత లబ్ధం రక్షేదవక్షయాత్,
రక్షితం వర్ధయేత్ సమ్యగ్ వృద్ధం తీర్థేషు నిక్షిపేత్. 8

అను. "ఉత్సాహం ఆనందం పరాక్రమం మొదలైన సుగుణాలు లేనివాడూ, అందువలననే శత్రువులకు ఆనందం గల్గించేవాడూ అయిన పుత్రుణ్ణి ఏ యువతియు ప్రసవించకుండుగాక." 7

అందువలననే విజ్ఞులు ఇలా అన్నారు-

"లభించనిదాన్నే కోరవలెను-లభించినదాన్ని(చోరాది) హాని నుండి రక్షించాలి. రక్షించినదాన్ని అభివృద్ధి నొందించాలి. అలా అభివృద్ధమైన సంపదను పుణ్యకార్యాలకు వినియోగించాలి."

గ. యతోఽలబ్ధమిచ్ఛతోఽర్థయోగాదర్థస్య ప్రాప్తిరేవ. లబ్ధస్యాప్యరక్షితస్య నిధేరపి స్వయం వినాశః. అపి చాఽవర్ధమానశ్చాఽర్థః

కాలే స్వల్పవ్యయేఽప్యఞ్జనవత్ క్షయమేతి. అనుపభుజ్యమానశ్చ నిష్ప్రయోజన ఏవ సః. తథా చోక్తమ్-

శ్లో. ధనేన కిం యో న దదాతి నాఽశ్నుతే
బలేన కిం యశ్చ రిపూన్నబాధతే,
శ్రుతేన కిం యో నచ ధర్మమాచరేత్
కిమాత్మనా యో న జితేన్ద్రియో భవేత్. 9

అను. ఏలనన- లభించని ధనాన్ని కోరేవాడికి (తగిన యత్నం వలన) ధనప్రాప్తియే గలదు. లబ్ధం అయినది నిధియైనా అరక్షితం అయినచో స్వయంగానే (ఖర్చు చేయకున్నా) చోరాదులవలన నశిస్తుంది. ఇక వృద్ధి నొందింపక అలాగే ఉంచినచో చిన్న చిన్న ఖర్చులవల్లనూ కాటుకవలె (క్రమంగా) తగ్గిపోతుంది. అలా క్షయం అగును అని తలంచి అనుభవించక ఉంచినచో ఆ ధనం నిరర్థకమే అగును. పెద్దలు ఇలా చెప్పారు-

"దానం చేయడానికి తాను అనుభవించడానికి ఉపయోగపడని ధనం ఎందులకు? శత్రువులను బాధించనివాని బలం ఎందులకు? ధర్మాచరణ లేని శాస్త్రజ్ఞానం ఎందులకు? ఇంద్రియనిగ్రహం లేనివాని ఆత్మజ్ఞానం ఎందులకు?'' 9

యతః-

శ్లో. జలబిన్దునిపాతేన క్రమశః పూర్యతే ఘటః,
స హేతుః సర్వవిద్యానాం ధర్మస్య చ ధనస్య చ. 10

శ్లో. దానోపభోగరహితా దివసా యస్య యాన్తి వై,
స కర్మకారభస్త్రేవ శ్వసన్నపి న జీవతి. 11

అను. ఏలననగా- "క్రమంగా నీరు బొట్టుబొట్టుగా పడడంచే కడవ నిండుతూ ఉంది. అలాగే సర్వవిద్యలనూ, ధర్మాన్ని, ధనాన్ని క్రమపద్ధతిలో అభివృద్ధి నొందించాలి." 10

ఎవని దినాలు- ''దానం, ఉపభోగం (ధనానుభవం) లేనివై గడుస్తాయో, అట్టివాడు కమ్మరివాడి తోలుతిత్తివలె ఊపిరి (గాలి) పీల్చుచున్ననూ- చచ్చినవాడితో సమానం.'' 11

గ. ఇతి సఞ్చిన్త్య నందక- సఞ్జీవకనామానౌ వృషభౌ ధురి నియోజ్య శకటం నానావిధద్రవ్యపూర్ణం కృత్వా వాణిజ్యేన గతః కాశ్మీరం ప్రతి. అన్యచ్చ-

శ్లో. అఞ్జనస్య క్షయం దృష్ట్వా వల్మీకస్య చ సఞ్చయమ్,
అవన్ధ్యం దివసం కుర్యాద్దానాధ్యయనకర్మసు. 12

యతః-

శ్లో. కోఽతిభారః సమర్థానాం కిం దూరం వ్యవసాయినామ్,
కో విదేశః సవిద్యానాం కః పరః ప్రియవాదినామ్. 13

అను. ఇలా ఆ వైశ్యుడు (వర్ధమానుడు) తలంచాడు- (అచ్చట లభించే) పలురకాలైన వస్తువులచే బండిని నింపాడు. బండిని లాగుటకు నందక-సంజీవకములు అనే ఎద్దులను కట్టాడు. వ్యాపారార్థియై కాశ్మీరదేశదిశగా పయనం సాగించాడు. 12

మరియూ- "అల్పంగా వాడబడినా కాటుక దినదినానికి తగ్గిపోవడం, అలాగే పుట్ట అల్పంగానైనా దినదినానికి వృద్ధిపొందడం గమనించి మానవుడు విద్యాభ్యాసం, దానం అనే కర్మలచే ప్రతిదినాన్ని సఫలం చేయాలి."

ఏలనన- "సమర్థుడైనవాడికి ఏ పనీ భారంగా ఉండదు. పరిశ్రమించేవారికి దూరదేశం ఏదీ కాదు. విద్వాంసులకు ఏదీ విదేశం గాదు. మృదుమధురంగా మాట్లాడేవారికి ఎవరూ శత్రువులు (పరాయివారు) గారు." 13

గ. అథ గచ్ఛతస్తస్య సుదుర్గనామ్ని మహారణ్యే సఞ్జీవకో భగ్నజానుర్నిపతితః. తమాలోక్య వర్ధమానోఽచిన్తయత్-

శ్లో. కరోతు నామ నీతిజ్ఞో వ్యవసాయమితస్తతః,
ఫలం పునస్తదేవాఽస్య యద్విధేర్మనసి స్థితమ్. 14

కిన్తు-

శ్లో. విస్మయః సర్వథా హేయః ప్రత్యూహః సర్వకర్మణామ్,
తస్మాద్విస్మయముత్సృజ్య సాధ్యే సిద్ధిర్విధీయతామ్. 15

అను. అలా పోవుచుండగా సుదుర్గం అనే పెద్ద అడవి వచ్చింది. అచ్చట సంజీవకుడు మోకాలు విఱగడంతో క్రిందబడినాడు. అతణ్ణి గాంచి వర్ధమానుడు ఇలా విచారించాడు-

"మానవుడు నీతిచతురుడై ఇటు నటు తన ప్రయత్నం (ఎంతయినా)చేయు గాక. కానీ విధాత మనస్సులో ఉండే ఫలమే అతడికి లభిస్తుంది."

మరి ఏమన-''విస్మయం (ఆశ్చర్యం - తద్ద్వారా తొందరపాటు) పూర్తిగా విడిచిపెట్టాలి. అన్ని పనులకు విఘ్నం సాధారణం. అందువల్ల తొందరపాటును వీడి కార్యంలో సిద్ధిని పొందాలి."

గ. ఇతి సఞ్చిన్త్య సఞ్జీవకం తత్ర పరిత్యజ్య వర్ధమానః పునః స్వయం ధర్మపురం నామ నగరం గత్వా మహాకాయమన్యం వృషభ మేకం సమానీయ ధురి నియోజ్య చలితః. తతః సఞ్జీవకోఽపి కథం కథమపి ఖురత్రయే భరం కృత్వోత్థితః. 

యతః- 

శ్లో. నిమగ్నస్య పయోరాశౌ పర్వతాత్ పతితస్య చ,
తక్షకేణాఽపి దష్టస్య ఆయుర్మర్మాణి రక్షతి. 16



అను. ఇలా అతడు(వర్ధమానుడు) విచారించాడు. సంజీవకుణ్ణి అచ్చటనే వదిలాడు. స్వయంగా (దాపున ఉండే) ధర్మపురం అనే నగరానికి పోయాడు. అచ్చట బలిసిన మఱియొక ఎద్దును ఖరీదుచేసి తెచ్చాడు. దానిని కాడికి కట్టాడు. మరల ప్రయాణం సాగించాడు. పిమ్మట సంజీవకుడు సైతం ఎంతో కష్టంమీద మూడు కాళ్ళపై బరువు మోపి లేచాడు. ఏలనన-

''సముద్రంలో మునిగినా, పర్వతశిఖరంనుండి పడినా, తక్షకుడు కఱచినా ఆయువు ఉన్నచో ప్రాణములు రక్షింపబడును. (బ్రతుకును).''

శ్లో. నాఽకాలే మ్రియతే జన్తుర్విద్ధః శరశతైరపి,
కుశాఽగ్రేణైవ సంస్పృష్టః ప్రాప్తకాలో న జీవతి. 17

శ్లో. అరక్షితం తిష్ఠతి దైవరక్షితం
సురక్షితం దైవహతం వినశ్యతి,
జీవత్యనాథోఽపి వనే విసర్జితః
కృతప్రయత్నోఽపి గృహే న జీవతి. 18

అను. "నూరు బాణాలచే కొట్టబడినా కాలం రానిచో ఏ ప్రాణీ చావదు. పోగాలం దాపురిస్తే దర్భముల్లు గ్రుచ్చుకొన్నా బ్రతుకడు." 17

"(మానవాదులు) రక్షింపకపోయినా దైవరక్షితం జీవిస్తుంది. ఎంతగా సురక్షితం అయినా దైవహతం నశిస్తుంది. అడవిలో విడువబడిన దిక్కులేని ప్రాణియూ బ్రతుకుతుంది. జాగ్రత్తగా ఇంటిలో ఉన్నవాడు సైతం జీవించడం లేదు.'' 18

గ. తతో దినేషు గచ్ఛత్సు సఞ్జీవకః స్వేచ్ఛాఽఽహారం కృత్వాఽరణ్యం భ్రామ్యన్ హృష్టపుష్టాఙ్గో బలవన్ననాద. తస్మిన్ వనే పిఙ్గలక నామా సింహః స్వభుజోపార్జితరాజ్యసుఖ మనుభవన్నివసతి.

తథా చోక్తమ్

శ్లో. నాఽభిషేకో న సంస్కారః సింహస్య క్రియతే మృగైః,
విక్రమార్జితరాజ్యస్య స్వయమేవ మృగేన్ద్రతా. 19

అను. అలా కొన్ని దినాలు గడిచాయి. సంజీవకుడు స్వేచ్ఛగా ఆహారం తింటూ అడవిలో తిరుగాడసాగాడు. క్రమంగా అతడి అవయవాలు బలం పుంజుకొన్నాయి. అందుచే బిగ్గరగా అంకెలు వేయసాగాడు. ఆ అడవిలో పింగలకుడు అనే సింహం నివసిస్తూంది. అది భుజబలంచే తక్కిన మృగాలను జయించి ఆ అడవికి ప్రభువై విరాజిల్లుతుంది.

విజ్ఞులు ఇలా అన్నారు-

"అడవిలోని జంతువులచే సింహానికి అభిషేకం గాని ఇతరసంస్కారం గాని చేయబడలేదు. అయినా అది పరాక్రమంవల్లనే మృగరాజు అయి రాజ్యం పాలిస్తూంది."

గ. స చైకదా పిపాసా౽౽కులితః పానీయం పాతుం యమునా కచ్ఛమగచ్ఛత్. తేన చ తత్ర సింహేనా౽ననుభూతపూర్వక మకాల ఘనగర్జితమివ సఞ్జీవకనాదితమశ్రావి. తచ్ఛ్రుత్వా పానీయమపీత్వా స చకితః పరివృత్య స్వస్థానమాగత్య కిమిదమిత్యాలోచయంస్తూష్ణీం స్థితః. స చ తథావిధః కరటక-దమనకాభ్యామస్య మన్త్రిపుత్రాభ్యాం దృష్టః. తం తథావిధం దృష్ట్వా దమనకః కరటకమాహ- 'సఖే కరటక! కిమిత్యయముదకార్థీ స్వామీ పానీయమపీత్వా సచకితో మన్దంమన్దమవ తిష్ఠతే'?

అను. ఆ పింగలకుడు (సింహం) మిక్కిలి దప్పికచే కలత నొందాడు. నీరు త్రాగడానికై యమునాతీరానికి వచ్చాడు. ఇంతకు ముందు ఎన్నడూ అనుభవంలో లేనిదీ అకాలమేఘగర్జనవంటిదీ అయిన సంజీవకుడి ఱంకెను విన్నాడు. వెంటనే చకితుడు అయ్యాడు- నీరు త్రాగకయే వెనుకకు మరలాడు. తన నివాసం చేరాడు- 'ఇది ఏమిటా'అని ఆలోచిస్తూ మౌనం వహించాడు. అలా ఉండే అతణ్ణి అతడి మంత్రిపుత్రులైన కరటకుడు దమనకుడు చూచారు. అప్పుడు దమనకుడు కరటకునితో ఇలా అన్నాడు-

'మిత్రమా ! కరటకా ! దాహం గొన్న ప్రభువు నీరు త్రాగకయే మెల్లి మెల్లగా భ్రాంతుడై వెనుకకు వచ్చి ఎందుకు కూర్చున్నాడు'.

గ. కరటకో బ్రూతే- 'మిత్ర దమనక ! అస్మన్మతేనా౽స్య సేవైవ న క్రియతే ! యది తథా భవతి తర్హి కిమనేన స్వామిచేష్టానిరూపణేనా౽స్మాకమ్. యతో౽నేన రాజ్ఞా వినా౽పరాధేన చిరమవధీరితాభ్యామావాభ్యాం మహద్దుఃఖమనుభూతమ్.

శ్లో. సేవయా ధనమిచ్ఛద్భిః సేవకైః పశ్య యత్కృతమ్,
స్వాతన్త్ర్యం యచ్ఛరీరస్య మూఢైస్తదపి హారితమ్. 20

అను. కరటకుడు ఇలా సమాధానం చెప్పాడు- 'మిత్రమా, దమనకా! నా అభిప్రాయం ప్రకారం మనం ఇప్పుడు అతని సేవలో లేము. అలాంటప్పుడు మనం అతడి ఆకారవికారాదులను గమనించడం దేనికి ? చాలకాలం క్రిందటనే

ఇతడు మనలను అపరాధం లేకయే అవమానించాడు. అందుచే గొప్ప దుఃఖం అనుభవించాము.

"ధనాశచే సేవావృత్తిలో ఉండే సేవకులు చేసేది చూడుము. ఆ మూర్ఖులు శరీరానికి ఉండే ఆ కొద్దిపాటి స్వేచ్ఛను సైతం పోగొట్టుకున్నారు." 20

శ్లో. శీతవాతాऽऽతపక్లేశాన్ సహన్తే యాన్ పరాశ్రితాః,
తదంశేనాऽపి మేధావీ తపస్తప్త్వా సుఖీ భవేత్. 21

అన్యచ్చ-

శ్లో. ఏతావజ్జన్మసాఫల్యం యదనాయత్తవృత్తితా,
యే పరాధీనతాం యాతాస్తేవై జీవన్తి కే మృతాః. 22

అను. "పరాధీనులైనవారు చలి గాలి ఎండ మొదలైన ఏ దుఃఖాలను అనుభవిస్తూన్నారో- వాటిలో అంశమాత్రమైనా సహించి మేధావి అయినవాడు తపస్సు చేస్తే పరమసుఖం పొందును." 21

మరియూ-"జీవనార్థం(భుక్తికై) పరాధీనుడు కాక ఉండుటయే ఈ జన్మకు సఫలత అనబడును. పరాధీనులను జీవించినట్లు తలంచినచో ఇక చచ్చినవారు ఎవరు?" 22

గ. అపరఞ్చ-

శ్లో. ఏహి గచ్ఛ పతోత్తిష్ఠ వద మౌనం సమాచర,
ఏవమాశాగ్రహగ్రస్తైః క్రీడన్తి ధనినోఽర్థిభిః. 23

కిఞ్చ-

శ్లో. అబుధైరర్థలాభాయ పణ్యస్త్రీభిరివ స్వయమ్,
ఆత్మా సంస్కృత్య సంస్కృత్య పరోపకరణీకృతః. 24

అను. "రమ్ము; పొమ్ము; కూర్చుండుము; లెమ్ము; మాట్లాడుము; మౌనంగా ఉండుము (నోరు మూసుకొనుము)- ఇత్యాదిగా ధనాశతో చేరిన సేవకులతో ధనికులు క్రీడిస్తారు." 23

మరియూ- "మూర్ఖులైనవారు వేశ్యవలె తమ్ము తాము స్వయంగా అలంక రించుకొని ఇతరులకు (ధనికులకు) ఉపయోగపడునట్లు చేస్తున్నారు."

కిఞ్చ-

శ్లో. యా ప్రకృత్యైవ చపలా నిపతత్యశుచావపి,
స్వామినో బహుమన్యన్తే దృష్టిం తామపి సేవకాః. 25

అను. ఇంకనూ- "చపలం, అపవిత్రవస్తువుపై పడునదీ అయిననూ ప్రభువుయొక్క దృష్టిని సేవకులు గొప్పగా తలుస్తారు." 25

అపరఞ్చ-

శ్లో. మౌనాన్మూర్ఖః ప్రవచనపటుర్వాతులో జల్పకో వా
క్షాన్త్యా భీరుర్యది న సహతే ప్రాయశో నాఽభిజాతః,
ధృష్టః పార్శ్వే వసతి నియతం దూరతశ్చాప్రగల్భః
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః. 26

అను. మరియూ- "సేవకుడు అయినవాడు మౌనంగా ఉన్నచో మూర్ఖుడు గాను, నేర్పుగా మాట్లాడేవాడు అయినచో వదరుపోతుగా గాని లేక అసందర్భ ప్రలాపిగా గానీ, సహనశీలుడు అయినచో పిఱికిపందగాను, సహనంలేనివాడు అయినచో నీచకులజాతుడుగాను, దగ్గరగా ఉన్నచో మర్యాదాహీనుడుగాను, దూరంగా ఉన్నచో సిగ్గరిగాను, యజమానుచే తలంపబడును. అందుచే సేవా ధర్మం గ్రహించడానికి అలవికానిది. యోగులకునూ అగమ్యమైంది." 26

గ. విశేషతశ్చ-

శ్లో. ప్రణమత్యున్నతిహేతోర్జీవితహేతోర్విముఞ్చతి ప్రాణాన్,
దుఃఖీయతి సుఖహేతోః కో మూఢః సేవకాదన్యః. 27

అను. విశేషించి "సేవకుడు యజమానుడి అభివృద్ధికై (తద్వారా తనకు ఉన్నతిని భావించి) ప్రణమిల్లుచున్నాడు. అతడి జీవితానికై (అతడు జీవిస్తే తనకు జీవనోపాధి ఉండుననే భావంతో) ప్రాణాలు అర్పిస్తున్నాడు. అతడి సుఖా నికై (అతడు సుఖంగా ఉంటే తనకు సుఖం లభిస్తుంది అనే భావంతో), తాను దుఃఖం అనుభవిస్తాడు. ఇతడికంటె మూర్ఖుడు ఎవడు ఉన్నాడు?"

గ. దమనకో బ్రూతే- 'మిత్ర! సర్వథా మనసాఽపి నైతత్కర్తవ్యమ్.

యథః

శ్లో. కథం నామ న సేవ్యన్తే యత్నతః పరమేశ్వరాః,
అచిరేణైవ యే తుష్టాః పూరయన్తి మనోరథాన్. 28

అన్యచ్చ పశ్య-

శ్లో. కుతః సేవావిహీనానాం చామరోద్ధూతసమ్పదః,
ఉద్దణ్డధవలచ్ఛత్రం వాజివారణవాహినీ. 29

అను. దమనకుడు ఇలా చెప్పాడు-'మిత్రమా! ఏవిధంగానైనా మనస్సులో నైతం ఇలాటి ఆలోచన చేయరాదు. ఏలనన-

"సంతుష్టులై స్వల్పకాలంలోనే అభిమతములను ఐశ్వర్యవంతులు (పరమేశ్వరులు) తీర్చెదరు. ఇట్టివారిని ఎలా సేవింపక ఉండాలి?" 28

మరియు చూడుము-"సేవచేయనివారికి, వింజామరలతోడి సంపదలు, ఎత్తైన కఱ్ఱగల తెల్లని గొడుగు, గుఱ్ఱాలు, ఏనుగులు గల సేన ఎలా లభిస్తాయి." 29

గ. కరటకో బ్రూతే- 'తథాపి కిమనేనాఽస్మాకం వ్యాపారేణ? యతోఽవ్యాపారేషు వ్యాపారః సర్వథా పరిహరణీయః; పశ్య-

శ్లో. అవ్యాపారేషు వ్యాపారం యో నరః కర్తుమిచ్ఛతి,
స భూమౌ నిహతః శేతే కీలోత్పాటీవ వానరః. 30

దమనకః పృచ్ఛతి- 'కథమేతత్'? కరటకో బ్రూతే-

అను. కరటకుడు అన్నాడు- 'అయినా మనకు ఇందులో జోక్యం ఎందులకు? జోలిమాలిన పనులు సర్వదా పరిత్యజించాలి. చూడుము- అక్కరలేని పనులందు తలదూర్చువాడు మేకును పెఱికిన కోతివలె గాయపడి మరణిస్తాడు.'

దమనకుడు అడిగాడు- "అది ఎట్లు?.... ఆ కథ తెలుపుము"?

కరటకుడు ఇలా చెప్పసాగాడు-

# 1. కీలోత్పాటి వానర కథా

(మేకును పెటికిన కోతికథ)

గ. అస్తి మగధదేశే ధర్మాఽరణ్యా సన్నిహితవసుధాయాం శుభదత్త నామ్నా కాయస్థేన విహారః కర్తుమారబ్ధః. తత్ర కరపత్ర దార్యమాణైక స్తమ్భస్య కియద్దూర స్ఫాటితస్య కాష్ఠఖణ్డ ద్వయమధ్యే కీలకః సూత్రధారేణ నిహితః. తత్ర బలవాన్ వానరయూథః క్రీడన్నాగతః. ఏకో వానరః కాలప్రేరిత ఇవ తం కీలకం హస్తాభ్యాం ధృత్వోపవిష్టః. తత్ర తస్య ముష్కద్వయం లమ్బమానం కాష్ఠఖణ్డద్వయాఽభ్యన్తరే ప్రవిష్టమ్. అనన్తరం స చ సహజ చపలతయా మహతా ప్రయత్నేన తం కీలక మాకృష్టవాన్. ఆకృష్టే చ కీలకే చూర్ణితాఽణ్డద్వయః పఞ్చత్వం గతః. అతోఽహం బ్రవీమి-'అవ్యాపారేషు వ్యాపార' మిత్యాది.

అను. మగధదేశంలో ధర్మారణ్యం ఉంది. దానికి సమీపప్రాంతమున శుభదత్తుడు అనే కాయస్థుడు బౌద్ధవిహారం కట్టించ నారంభించాడు. అందులకుగాను వడ్రంగులు ఒక స్తంభం కోయుచున్నారు. కొంతదూరం స్తంభాన్ని కోసినారు. [ఇంతలో మధ్యాహ్నభోజనసమయం అయింది] భోజనానికి పోతూ వడ్రంగి ఒకడు స్తంభంయొక్క చీలికలమధ్య ఒక మేకును ఉంచాడు. ఇంతలో అచ్చటికి పెద్ద కోతుల గుంపు గంతులు వేస్తూ వచ్చింది. వాటిలో ఆయువు మూడిన ఒక కోతి మేకు ఉంచిన స్తంభంవద్దకు వచ్చింది - స్తంభం చీలికల నడుమ అండములు పడునట్లుగా కూర్చుంది. సహజచాపల్యంచే మేకును రెండు చేతులతో పట్టుకొంది. దాన్ని ఊపుతూ బలంగా పైకి లాగింది. మేకు ఊడి రాగానే చీలికలనడుమ ఉండే దాని వృషణాలు నజ్జునజ్జు అయిపోయాయి. విలవిల తన్నుకుంటూ అది చచ్చింది. అందుచే అక్కరలేని పనులందు తల దూర్చరాదు' అని నేను చెప్పుతున్నాను.

గ. దమనకో బ్రూతే - 'తథాపి స్వామి చేష్టానిరూపణం సేవకేనాఽవశ్యం కర్తవ్యమ్.' కరటకో బ్రూతే -"సర్వస్మిన్నేవాఽధికారే

య ఏవ నియుక్తః ప్రధానమన్త్రీ స కరోతు. యతోఽనుజీవినా పరాధికార చర్చా సర్వథా న కర్తవ్యా. పశ్య.

శ్లో. పరాధికారచర్చాం యః కుర్యాత్ స్వామిహితేచ్ఛయా,
స విషీదతి చీత్కారాత్ గర్దభస్తాడితో యథా. 31

దమనకః పృచ్ఛతి-"కథమేతత్" కరటకో బ్రూతే-

అను. దమనకుడు ఇలా అన్నాడు -'అయినా సేవకుడు ప్రభువుయొక్క చేష్టలను తప్పక పరిశీలిస్తూ ఉండాలి' అందుకు కరటకుడు ఇలా చెప్పాడు 'అన్ని అధికారాలతో నియమింపబడిన ప్రధానమంత్రి ఉన్నాడు. అతడే ఆ పని చేస్తాడు. సేవకుడైనవాడు ఇతరుల అధికారాలనుగురించి ఎప్పుడూ చర్చింపరాదు. చూడుము.

"ప్రభుహితం గోరి సేవకుడెవడేని ఇతరుల అధికారంలో జోక్యం పెట్టుకొన్నచో ఓండ్రపెట్టిన గాడిదవలె చావుదెబ్బలు తిని చచ్చును."

దమనకుడు అడిగాడు -'అది ఎట్లు' కరటకుడు ఇలా చెప్పాడు.

## 2 చీత్కార కారి గర్దభకథా

### [ఓండ్రపెట్టిన గాడిద కథ]

గ. అస్తి వారాణస్యాం కర్పూరపటకో నామ రజకః. స రాత్రౌ గాఢనిద్రాయాం ప్రసుప్తః. తదనన్తరం తద్గృహద్రవ్యాణి హర్తుం చౌరః ప్రవిష్టః. తస్య ప్రాఙ్గణే గర్దభో బద్ధస్తిష్ఠతి. కుక్కురశ్చోపవిష్టోఽస్తి అథ గర్దభః శ్వానమాహ-"సఖే భవతస్తావదయం వ్యాపారః. తత్కిమితి త్వముచ్చైః శబ్దం కృత్వా స్వామినం న జాగరయసి?" కుక్కురో బ్రూతే. "భద్ర మమ నియోగస్య చర్చా త్వయా న

కర్తవ్యా. త్వమేవ కిం న జానాసి యథా తస్యాఽహర్నిశం గృహ రక్షాం కరోమి యతోఽయం చిరాన్నిర్వృతో మమోపయోగం న జానాతి. తేనాఽధునాఽపి మమాఽఽహారదానే మన్దాదరః. యతో వినా విధుర దర్శనం స్వామిన ఉపజీవిషు మన్దాదరా భవన్తి'.

అను. వారాణసిలో కర్పూరపటకుడు అనే చాకలి ఉన్నాడు. ఒకనాడు రాత్రి వాడు గాఢమైన నిద్రలో మునిగాడు. అప్పుడు ఒకానొక దొంగ అతని యింటిలోని వస్తువులను అపహరించడానికి వచ్చాడు. ఇంటిముంగిట గాడిద కట్టివేయబడి ఉంది. కుక్క కూర్చొని ఉంది. గాడిద కుక్కతో ఇలా అంది - 'మిత్రమా ! ఇది నీపనియే గదా ఎందుకు నీవు బిగ్గరగా మొఱిగి యజమానుని మేల్కొల్పవు ?' కుక్క ఇలా బదులు పల్కింది. 'శుభమూర్తీ నా అధికారాన్ని గుఱించి నీవు చర్చించరాదు. నీవు గమనిస్తూనే ఉన్నావు గదా ! నేను రేయి అనక పగలు అనక నిత్యం స్వామి ఇంటిని కాపాడుతూ ఉన్నాను. అందువల్ల స్వామి నిశ్చింతగా ఉన్నాడు. అయినా ఇతడు నా ఉపయోగం గుర్తించడం లేదు. ఇప్పుడు నాకు తిండి పెట్టడానికి సైతం శ్రద్ధ లేదు. కష్టం అనుభవించనిదే ప్రభువులు సేవకులయెడ అశ్రద్ధతో ఉంటారు.'

గ. గర్దభో బ్రూతే - శృణు రే బర్బర !

శ్లో. యాచతే కార్యకాలే యః స కిం భృత్యః స కిం సుహృత్?
శ్వా బ్రూతే
'భృత్యాన్ సమ్భావయేద్యస్తు కార్యకాలే స కిం ప్రభుః. 32

యతః

శ్లో. ఆశ్రితానాం భృతౌ స్వామిసేవాయాం ధర్మసేవనే,
పుత్రస్యోత్పాదనే చైవ న సన్తి ప్రతిహస్తకాః. 33

అను. గాడిద ఇలా అంది- 'ఓరీ నీచుడా వినుము. ఆపదలో ఉండే యజమానుని ఏవేని కోరే సేవకుడు మంచి సేవకుడు గాదు. అటులనే ఆపదలో ఉండే మిత్రుని కోరే మిత్రుడు మంచిమిత్రుడు గాదు." కుక్క చెప్పింది - 'అవసరం గల్గినప్పుడు (మాత్రం) సేవకులను ఆదరించేవాడు నీచుడైన ప్రభువు.

ఏలననగా "ఆశ్రితులను రక్షించడం, ప్రభువును సేవించడం, ధర్మాన్ని ఆచరించడం - సంతానాన్ని పుట్టించడం - అనే ఈ నాలుగు పనులు ఎవరికి వారు స్వయంగా చేయదగినవి. ప్రతినిధులద్వారా చేయింపదగినవి గాదు." (33)

గ. తతో గర్దభః సకోప మాహ-"అరే దుష్టమతే పాపీయాంస్త్వం యద్విపత్తౌ స్వామికార్యే ఉపేక్షాం కరోషి. భవతు తావత్. యథా స్వామీ జాగరిష్యతి, తన్మయా కర్తవ్యమ్ యతః -

శ్లో. పృష్ఠతః సేవయేదర్కం జఠరేణ హుతాశనమ్,
స్వామినం సర్వభావేన పరలోకమమాయయా". 34

ఇత్యుక్త్వాఽతీవ చీత్కారశబ్దమకరోత్.

అను. అంతట గాడిద కోపంతో ఇలా పల్కింది-'ఓరీ దుష్టబుద్ధీ : నీవు మిక్కిలి పాపాత్ముడవు. అందువల్లనే ఆపదలో స్వామికార్యాన్ని ఉపేక్షిస్తున్నావు. కానిమ్ము, స్వామి మేల్కొనునట్లు నేను చేస్తాను. ఏలననగా

"ఎండ వీపునకు తగులునట్లుగా సూర్యుణ్ణి సేవించాలి. పొట్టకు వేడి తగులునట్లు అగ్నిని సేవించాలి. యజమానుడిని సర్వవిధాల సేవించాలి. పరలోకాన్ని మాయ వదలి సేవించాలి." (34)

ఇలా పలికి ఆ గాడిద బిగ్గరగా ఓండ్ర పెట్టింది.

గ. తతః స రజకస్తేన చీత్కారేణ ప్రబుద్ధో నిద్రాభఙ్గకోపాదుత్థాయ గర్దభం లగుడేన తాడయామాస. తేనాఽసౌ పఞ్చత్వమగమత్. అతోఽహం బ్రవీమి - 'పరాధికారచర్చా' మిత్యాది. పశ్య. పశూనామన్వేషణ మస్మన్నియోగః. స్వనియోగచర్చా క్రియతామ్ ఇత్యుక్త్వా విమృశ్య పునరాహ - 'కిన్త్వద్య తయా చర్చయా న ప్రయోజనమ్. యత ఆవయోర్భక్షితశేషాహారః ప్రచురోఽస్తి ?

అను అప్పుడు ఆ చాకలి అది ఓండ్రగించడంతో మెలకువను పొందాడు. నిద్ర చెడినది అని మిక్కిలి క్రుద్ధుడు అయ్యాడు లేచి కఱ్ఱతో గాడిదను బాది వేశాడు. ఆ దెబ్బలతో గాడిద మరణించింది. అందువల్ల నేను (కరటకుడను)

చెప్పుచున్నాను - 'పరుల అధికారంలో జోక్యం'-ఇత్యాది. పశువులను వెదకడం మన పని. దాన్నిగూర్చి విచారణ చేయుదము'. ఇలా అని విమర్శించి మరలా (కరటకుడు) ఇలా చెప్పాడు - కాని ఇప్పుడు ఆ చర్చచే ఉపయోగం మనకు లేదు. ఏలనన - మనకు తినగా మిగిలిన ఆహారం కావలసినంత ఉంది."

గ. దమనకః సరోషమాహ - 'కథమాహారార్థీ భవాన్ కేవలం రాజానం సేవతే? ఏతదయుక్తముక్తం త్వయా. యతః.

శ్లో. సుహృదాముపకారకారణాద్
ద్విషతా మప్యపకార కారణాత్,
నృపసంశ్రయ ఇష్యతే బుధైః
జఠరం కో న బిభర్తి కేవలమ్. 35

అను. దమనకుడు రోషంతో ఇలా అన్నాడు - 'ఏమీ తాము కేవలం పొట్ట కూటికొఱకే రాజును సేవిస్తున్నారా ఇలా అనడం తమకు తగదు. ఏలననగా "బుద్ధిమంతులైనవారు మిత్రులకు మేలుచేయడానికి, అలాగే శత్రువులకు కీడు చేయడానికి రాజులను ఆశ్రయిస్తారు. కేవలం పొట్టను ఎవడూ నింపుకొనడం లేదు.'' (35)

శ్లో. జీవితే యస్య జీవన్తి విప్రా మిత్రాణి బాంధవాః,
సఫలం జీవితం తస్య ఆత్మార్థే కో న జీవతి. 36

అపిచ

శ్లో. యస్మిన్ జీవతి జీవన్తి బహవః స తు జీవతు,
కాకోఽపి కిం న కురుతే చఞ్చ్వా స్వోదరపూరణమ్. 37

అను. "ఎవడు జీవించడంచే బ్రాహ్మణులు, మిత్రులు బంధువులు జీవిస్తారో అతడి జీవితమే సఫలం. తనకై ప్రతివాడు జీవిస్తూనే ఉన్నాడు.''

మరియూ - ''ఎవడు జీవింపగా అనేకులు జీవిస్తున్నారో అతడే జీవించు గాక ; కాకియూ ముక్కుతో తన పొట్టను నింపుకొనుచున్నది గదా.''

పశ్య

శ్లో. పఞ్చభిర్యాతి దాసత్వం పురాణైః కోఽపి మానవః,
కోఽపి లక్షైః కృతీ కోఽపి లక్షైరపి న లభ్యతే. 38

అన్యచ్చ

శ్లో. మనుష్యజాతౌ తుల్యాయాం భృత్యత్వమతిగర్హితమ్,
ప్రథమో యో న తత్రాపి స కిం జీవత్సు గణ్యతే. 39

తథా చోక్తమ్

శ్లో. వాజివారణలోహానాం కాష్ఠపాషాణవాససామ్,
నారీపురుషతోయానామన్తరం మహదన్తరమ్. 40

అను. "ఒకానొకడు అయిదు పైసలకును (పురాణములు=పైసలు) దాసుడు అగును. మరియొకడు లక్షరూపాయలకు 'ధన్యుడను' అని భావించును. వేరొకడు లక్షలకును లభింపడు అనగా దాసత్వం స్వీకరింపడు." (38)

మరియూ - "మానవులంతా ఒకే జాతికి చెందుటచే సమానులు. అలాంటప్పుడు ఒకడు వేరొకడికి సేవకుడు అవడం నింద్యమైన విషయం. ఇక సేవకుడు అయిఉండియూ ప్రథముడు గానిచో అట్టివాడు బ్రతికినవారిలో గణింపబడునా?" (39)

విజ్ఞులు ఇలా అన్నారు "గుఱ్ఱం, ఏనుగు, లోహం (ఇనుము మొ"), కఱ్ఱ, ఱాయి, వస్త్రం, స్త్రీ, పురుషుడు, నీరు ఈ తొమ్మిదింటిలో మహాభేదాలు గలవు." (40)

గ. తథాహి; స్వల్ప మప్యతిరిచ్యతే.

శ్లో. స్వల్పస్నాయువసాఽవశేషమలినం నిర్మాంసమప్యస్థికం
శ్వా లబ్ధ్వా పరితోషమేతి న భవేత్తస్య క్షుధాశాన్తయే,
సింహో జమ్బుకమఙ్కమాగతమపి త్యక్త్వా నిహన్తి ద్విపం
సర్వః కృచ్ఛ్రగతోఽపి వాఞ్ఛతి జనః సత్త్వానురూపం ఫలమ్॥

అను. అలాగే కొలదిభేదం సైతం (కొన్నియెడల) అధికంగా కనబడు తుంది - "కుక్క, అల్పంగా నరాలు, క్రొవ్వు గలదీ, మాంసహీనం, మలినం అయిన ఎముకను పొందియూ సంతోషం పొందుతుంది - దానిచే దాని ఆకలియు తీరదు. సింహం తన తొడపై చేరిననూ నక్కను వదలి ఏనుగును సంహరిస్తుంది కనుక అందరూ ఎంత ఆపదలో ఉన్నా తమ యోగ్యతకు తగిన ఫలాన్నే కోరుదురు."

గ. అపరఞ్చ, సేవ్యసేవకయోరన్తరం పశ్య -

శ్లో. లాఙ్గూలచాలన మధశ్చరణావపాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనఞ్చ,
శ్వా పిణ్డదస్య కురుతే గజపుఙ్గవస్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుఙ్క్తే. 42

అను. మరియూ, ప్రభువునకూ సేవకునకూ ఉండే భేదం చూడుము. "కుక్క తనకు పిడికెడు అన్నపుముద్ద వేసే యజమానుని ఎదుట తోక ఆడిస్తుంది. అతడి కాళ్ళపై పడుతుంది. నేలపై బడితన నోటినీ పొట్టనూ చూపుతుంది. గజరాజు మాత్రం తన యజమానుని గంభీరంగా చూస్తుంది. ముఖస్తుతులను పొందుతూ భుజిస్తుంది."

కిఞ్చ—

శ్లో. యజ్జీవ్యతే క్షణమపి ప్రథితం మనుష్యైః
విజ్ఞానవిక్రమయశోభిరభజ్యమానమ్,
తన్నామ జీవితమిహ ప్రవదన్తి తజ్ఞాః
కాకోఽపి జీవతి చిరాయ బలిఞ్చ భుఙ్క్తే. 43

అపరమపి—

శ్లో. అహితహిత విచారశూన్యబుద్ధేః
శ్రుతిసమయైర్బహుభిస్తిరస్కృతస్య,
ఉదరభరణమాత్రకేవలేచ్ఛోః
పురుషపశోశ్చ పశోశ్చ కో విశేషః. 44

అను. మరియూ- ''మానవులు విజ్ఞానం, శౌర్యం, కీర్తి అనేవాటిచే పరిపూర్ణులై ప్రసిద్ధమైన జీవితం క్షణకాలం గడిపినా అదియే నిజమైన జీవితం అని పండితులు తెల్పుదురు. కాకియూ చిరకాలం జీవిస్తుంది. శ్రాద్ధాది పిండాలను భుజిస్తుంది." 44

ఇంకనూ- ''మంచిచెడ్డలను ఆలోచించే తెలివిలేనివాడునూ, వేదోక్తములైన ఆచారాల నన్నింటినీ విడిచినవాడూ, తన పొట్టను నింపుకొనడం మాత్రమే తలంచే వాడూ అయిన పురుషపశువునకూ పశువునకూ భేదం ఏమిగలదు ?'' 45

అపరఞ్చ

శ్లో. యో నాఽత్మజే న చ గురౌ న చ బన్ధువర్గే
దీనే దయాం న కురుతే న చ భృత్యవర్గే,
కిం తస్య జీవితఫలేన మనుష్యలోకే
కాకోఽపి జీవతి చిరాయ బలిఞ్చ భుఙ్క్తే. 45

అను. మరియూ- "ఏ మానవుడు- పుత్రునియెడ, గురుజనంపైన, బంధువర్గవిషయంలో, దీనులమీద, సేవకజనమందు దయను వహింపడో- వాడు జీవించడంవలన ఉపయోగం ఏముంది ? కాకీ జీవిస్తూంది. బలిపిండాలు భుజిస్తూంది.

గ. కరటకో బ్రూతే-'ఆవాం తావదప్రధానౌ. తథాఽప్యావయోః కిమనయా విచారణయా?' దమనకో బ్రూతే- 'కియతా కాలేనాఽమాత్యాః ప్రధానతామప్రధానతాం వా లభన్తే? యతః—

శ్లో. న కస్యచిత్ కశ్చిదిహ స్వభావాత్
భవత్యుదారోఽభిమతః ఖలో వా,
లోకే గురుత్వం విపరీతతాం వా
స్వచేష్టితాన్యేవ నరం నయన్తి. 46

అను. కరటకుడు ఇలా చెప్పాడు- 'మనం ప్రస్తుతం ఇతనికి ప్రధాన మంత్రులం గాదు గదా? అలాంటప్పుడు మనం దీనికి విమర్శించడం దేనికి?' (అది

విని) దమనకుడు ఇలా అన్నాడు- 'ఎంతకాలానికి మంత్రులు ప్రధానులుగానో, లేక అప్రధానులుగానో అగుదురు? ఏలననగా-

"ఈ లోకంలో ఎవడూ ఎవనికీ గొప్పవాడు (ఉదారుడు) గాని ఇష్టుడు గాని నీచుడు గాని సహజంగా కానేరడు. తన నడవడికవల్లనే మానవుడు గొప్పవాడు గాని, నీచుడు గాని అగుచుండును.'' 46

కిఞ్చ-

శ్లో. ఆరోప్యతే శిలా శైలే యత్నేన మహతా యథా,
నిపాత్యతే క్షణేనాధ స్తథాఽత్మా గుణదోషయోః. 47

శ్లో. యాత్యధోఽధో వ్రజత్యుచ్చైర్నరః స్వైరేవ కర్మభిః,
కూపస్య ఖనితా యద్వత్ ప్రాకారస్యేవ కారకః. 48

తద్భద్రమ్. స్వయత్నాఽఽయత్తో హ్యాత్మా సర్వస్య.

అను. "ఎట్లు పెద్ద చట్టుబండ కొండమీదికి మిక్కిలి ప్రయత్నంచే ఎక్కించబడునో, అదే క్రిందికి క్షణంలో దొర్లింపబడునో- అలాగే మానవుడు తన గుణాలచే ఉన్నతిని, దోషాలచే పతనాన్ని పొందును." 47

''బావిని త్రవ్వువాడు క్రిందికి, ప్రాకారాదికంయొక్క గోడ కట్టేవాడు పైకి ఎలా పోతూ ఉన్నారో అలాగే మానవుడు తన కర్మలను బట్టియే అవనతినిగానీ ఉన్నతినిగానీ పొందును." 48

కనుక మంచిది, ప్రతివానికి అదృష్టం (ఆత్మ–ఆత్మశ్రేయం)వాని ప్రయత్నాలపై ఆధారపడి ఉంది.

గ. కరటకో బ్రూతే- "అథ భవాన్ కిం బ్రవీతి!" స ఆహ- "అయం తావత్ స్వామీ పిఙ్గలకః కుతోఽపి కారణాత్ సచకితః పరివృత్త్యోపవిష్టః" కరటకో బ్రూతే- "కిం తత్త్వం జానాసి?" దమనకో బ్రూతే- "కిమత్రాఽవిదితమస్తి?" ఉక్తఞ్చ-

శ్లో. ఉదీరితోఽర్థః పశునాఽపి గృహ్యతే
హయాశ్చ నాగాశ్చ వహన్తి దేశితాః,
అనుక్తమప్యూహతి పణ్డితో జనః
పరేఙ్గితజ్ఞానఫలా హి బుద్ధయః. 49

అను. కరటకుడు అడిగాడు— 'శుభం, (అచ్చటికి పోయి) తాము ఏమి భాషిస్తారు?' అతడు అన్నాడు- 'ఇదిగో మన ప్రభువు చకితుడై వెనుకకు మరలి వచ్చి కూర్చున్నాడు.' కరటకుడు అన్నాడు- 'నీవు వాస్తవంగా గ్రహించావా!' దమనకుడు ఇలా చెప్పాడు- 'ఇందు తెలియరానిది ఏముంది? విజ్ఞులు అన్నారు-

"చెప్పిన విషయాన్ని పశువునైతం గ్రహిస్తుంది. గుఱ్ఱాలూ, ఏనుగులూ ఆజ్ఞానుసారం బరువును మోస్తూ ఉన్నాయి. పండితుడు చెప్పనిదానిని సైతం ఊహిస్తాడు. ఇంగితంద్వారా (ఆకారచేష్టాదికంచే) ఇతరులభావాన్ని గ్రహించడమే గదా బుద్ధికి ఫలం.

శ్లో. ఆకారైరిఙ్గితైర్గత్యా చేష్టయా భాషణేన చ,
నేత్రవక్త్రవికారేణ లక్ష్యతేఽన్తర్గతం మనః. 50

అత్ర భయప్రస్తావే ప్రజ్ఞాబలేనాఽహమేనం స్వామిన మాత్మీయం కరిష్యామి. యతః-

శ్లో. ప్రస్తావసదృశం వాక్యం సద్భావసదృశం ప్రియమ్,
ఆత్మశక్తిసమం కోపం యో జానాతి స పణ్డితః. 51

అను. "ఆకారంచే, సంకేతాలచే, నడకలచే, చేష్టచే, మాటలచే, నేత్రవికారాలచే, ముఖవికారాలచే మనస్సులోని భావం తెలియబడును." 50

ఇప్పుడు భయసమయాన్ని ఉపయోగించుకొని నేను ప్రజ్ఞాబలంచే ప్రభువును వశం చేసుకుంటాను. ఏలననగా-

"ఎవడు సందర్భోచితమైన వాక్యం, సద్భావానుగుణమైన ప్రేమ, బలానురూపం అయిన కోపం అనే ఈ మూడింటిని ఎరుంగునో, అతడే పండితుడు అనబడును." 51

గ. కరటకో బ్రూతే- "సఖే? త్వం సేవాఽనభిజ్ఞః. పశ్య-

శ్లో. అనాహూతో విశేద్ యస్తు చాఽపృష్టో బహుభాషతే,
ఆత్మానం మన్యతే ప్రీతం భూపాలస్య స దుర్మతిః." 52

అను. కరటకుడు ఇలా అన్నాడు- 'మిత్రమా! నీకు సేవాధర్మం తెలియదు చూడుము-

'ఎవడు ఆహ్వానం పొందకయే ప్రభువువద్దకు పోవునో, అడుగబడకయూ అతిగా మాట్లాడునో, స్వయంగా తనను ప్రభువునకు ప్రీతిపాత్రుడినిగా ఎంచునో, వాడు బుద్ధిహీనుడు." 52

గ. దమనకో బ్రూతే- "భద్ర! కథమహం సేవాఽనభిజ్ఞః? పశ్య-

శ్లో. కిమప్యస్తి స్వభావేన సున్దరం వాఽప్యసున్దరమ్,
యదేవ రోచతే యస్మై భవేత్ తత్తస్య సున్దరమ్. 53

యతః

శ్లో. యస్య యస్య హి యో భావస్తేన తేన హి తం నరమ్,
అనుప్రవిశ్య మేధావీ క్షిప్రమాత్మవశం నయేత్. 54

అను. దమనకుడు ఇలా బదులు చెప్పాడు- 'శుభమూర్తీ! సేవాధర్మం తెలియనివాడను నేను అని ఎలా అందువు? చూడుము-

"ఏ వస్తువూ స్వభావంగా అందం గలది గానీ, అందం లేనిది గానీ కాజాలదు. ఆ యా వ్యక్తికి ఇష్టం అయితే సుందరంగాను, ఇష్టం గానిదైనచో అసుందరంగాను అగును". 53

ఏలననగా- "మేధావి అయిన మానవుడు ఆ యా వ్యక్తియొక్క భావం గుర్తించాలి. అందుకు తగినట్లు ప్రవర్తించి అతడి సన్నిధిని చేరాలి. అతనిని వశం చేసుకొనాలి." 54

అన్యచ్చ-

శ్లో. కోఽత్రేత్యహమితి బ్రూయాత్ సమ్యగాదేశయేతి చ,
అజ్ఞామవితథం కుర్యాద్యథాశక్తి మహీపతేః. 55

అపరఞ్చ-

శ్లో. అల్పేచ్ఛుర్ధృతిమాన్ ప్రాజ్ఞః ఛాయేవానుగతః సదా,
ఆదిష్టో న వికల్పేత స రాజవసతౌ వసేత్. 56

అను. మరియూ- ''ప్రభువు, 'ఎవరు ఇక్కడ' అని అడుగగానే 'నేను ఉన్నాను; ఆజ్ఞాపించుడు'-అని పల్కాలి. ఆమీదట భూపాలుని ఆజ్ఞను యథా శక్తిని వ్యర్థంగానట్లు నిర్వహించాలి." 55

ఇంకనూ- ''అల్పవేతనం కోరేవాడూ, ధైర్యశాలీ, నీడవలె నిత్యం ప్రభువును అనుసరించేవాడూ, ప్రభుని ఆజ్ఞను ముందువెనుక చూడక చేసేవాడూ అయిన ప్రతిభాశాలియే రాజభవనంలో నివసింపగలడు." 56

గ. కరటకో బ్రూతే- 'కదాచిత్ త్వామనవసరప్రవేశా దవ మన్యతే స్వామీ'. స చాహ- అస్త్వేవమ్. తథాప్యనుజీవినా స్వామి సాన్నిధ్యమవశ్యం కరణీయమ్. యతః-

శ్లో. దోషభీతే రనారమ్భ స్తత్కాపురుషలక్షణమ్,
కైరజీర్ణభయాద్ భ్రాతర్భోజనం పరిహీయతే. 57

అను. కరటకుడు ఇలా అన్నాడు- 'ఒకవేళ అనవసరంగా ప్రవేశించి నాడవు' అని ప్రభువు నిన్ను అవమానిస్తే ఎలా?

దమనకుడు అందుకు ఇలా చెప్పాడు- 'కానిమ్ము; అయినా సేవకుడు ప్రభుసన్నిధికి తప్పక పోవాలి. ఏలనన-

''దోషభయంచే కార్యమును ఆరంభించకపోవడం అనేది పిరికివాడి (కాపురుష) లక్షణం. సోదరా? అజీర్ణభయంచే ఎవడూ ఆహారాన్ని విడువడు గదా!''

పశ్య—

శ్లో. ఆసన్నమేవ నృపతిర్భజతే మనుష్యం
విద్యావిహీనమకులీనమసజ్గతం వా,
ప్రాయేణ భూమిపతయః ప్రమదా లతాశ్చ
యః పార్శ్వతో భవతి తం పరివేష్టయన్తి. 58

అను. చూడుము

''దగ్గర ఉండేవాడినే ప్రభువు తలుస్తాడు. వాడు విద్యలేనివాడూ, కుల హీనుడూ, మూర్ఖుడూ అగుగాక. సామాన్యంగా ప్రభువులు, స్త్రీలు (యువతులు), తీగెలు దగ్గర ఉండేవారినే ఆత్మీయంగా భావిస్తారు."

గ. కరటకో బ్రూతే - "అథ తత్ర గత్వా కిం వక్ష్యతి భవాన్? స ఆహ - "శృణు కిమనురక్తో విరక్తో వా మయి స్వామీతి జ్ఞాస్యామి? కరటకో బ్రూతే - "కిం తద్‌జ్ఞాన లక్షణమ్"? దమనకో బ్రూతే. శృణు.

శ్లో. దూరాదవేక్షణం హాసః సంప్రశ్నేష్వాదరో భృశమ్,
పరోక్షేఽపి గుణశ్లాఘా స్మరణం ప్రియవస్తుషు. 59

అను. కరటకుడు అడిగాడు - "అయితే తాము అచ్చటికి పోయి ఏమి మాట్లాడెదరు?" అతడు (దమనకుడు) ఇలా బదులు చెప్పాడు "వినుము. మొదట నాయెడ ప్రభువు దయగా ఉన్నాడా, లేక విరక్తిగా ఉన్నాడా-అని గ్రహిస్తాను. కరటకుడు మరల అడిగాడు - "అది తెలిసికోడానికి లక్షణం (గుర్తు) ఏమి? అందుకు దమనకుడు ఇలా సమాధానం చెప్పాడు - వినుము "దూరంగా ఉండగానే నన్ను చూడడం, చిరునవ్వు చిందించడం, ప్రశ్నించేటప్పుడు అధికమైక ఆదరం చూపడం, పరోక్షంగా గుణాలను ప్రశంసించడం, ప్రియవస్తువులందు తలంచడం - ఇవి సంతుష్టుడైన ప్రభువు లక్షణాలు''.

శ్లో. అసేవకే చానురక్తిర్దానం సప్రియభాషణమ్,
అమరక్తస్య చిహ్నాని దోషేఽపి గుణసఙ్గ్రహః. 60

అను. సేవచేయనివానియెడను అనురాగం, ప్రియభాషణములతో ఏదేని

ఇవ్వడం, దోషంనందును గుణాన్ని గ్రహించడం, ఇత్యాదికం అనురాగయుక్తుడైన ప్రభువునకు గుర్తులు.

అన్యచ్చ

శ్లో. కాలయాపనమాశానాం వర్ధనం ఫలఖణ్డనమ్,
విరక్తేశ్వరచిహ్నాని జానీయాన్మతిమాన్నరః. 61.

ఏతద్ జ్ఞాత్వా యథా చాయం మమాఽఽయత్తో భవిష్యతి తథా వదిష్యామి. యతః.

శ్లో. అపాయసన్దర్శనజాం విపత్తి
ముపాయసన్దర్శనజాఞ్చ సిద్ధిమ్,
మేధావినో నీతివిధిప్రయుక్తాం
పురఃస్ఫుర న్తీమివ దర్శయ న్తి. 62

అను. మరియూ "(దర్శనాదికమునకు) కాలయాపనం చేయడం, వ్యర్థమైన ఆశలు పెంచడం, లభించవలసిన ఫలితాన్ని సైతం తొలగించడం - ఇత్యాదులను విరక్తుడైన ప్రభువునకు గుర్తులు అని బుద్ధిమంతుడు గ్రహించాలి".

ఇది గుర్తించి ఎలా చేస్తే ఇతడు నాకు ఆధీనుడు అగునో అలా సంభాషిస్తాను. ఏలనన.

"బుద్ధిమంతులు (మేధావులు) నీతిశాస్త్రవిధిని అనుసరించి అపాయాలచే గల్గే హానినీ - ఉపాయాలచే లభించే కార్యసిద్ధినీ ఎదురుగా ప్రకాశిస్తూ ఉన్నట్లు చూపగలరు." (62)

గ. కరటకో బ్రూతే - "తథాఽప్యప్రాప్తే ప్రస్తావే న వక్తుమర్హసి. యతః.

శ్లో. అప్రాప్తకాలవచనం బృహస్పతిరపి బ్రువన్,
ప్రాప్నుయాద్ బుద్ధ్యవజ్ఞానమపమానఞ్చ శాశ్వతమ్. 63

అను. కరటకుడు ఇలా అన్నాడు - "అయినా సందర్భం రానిదే మాట్లాడవద్దు. ఏలననగా-

"సందర్భం లేక మాట్లాడినచో బృహస్పతి సైతం తన బుద్ధికి నిరాదరణనూ శాశ్వతమైన అవమానాన్నీ పొందును".

గ. దమనకో బ్రూతే - 'మిత్ర ! మా భైషీః. నాఽహ. మప్రాప్తాఽవసరం వచనం వదిష్యామి యతః.

శ్లో. ఆపద్యున్మార్గగమనే కార్యకాలాఽత్యయేషు చ,
అపృష్టేనాఽపి వక్తవ్యం భృత్యేన హితమిచ్ఛతా. 64

యది చ ప్రాప్తాఽవసరేణాఽపి మయా మన్త్రో న వక్తవ్యః, తదా మన్త్రిత్వమేవ మమాఽనుపపన్నమ్. యతః.

దమనకుడు ఇలా అన్నాడు - "మిత్రమా భయపడకుము. నేను సందర్భరహితంగా ఏమీ మాట్లాడను. ఏలనన - "ఆపద నెత్తిన పడునట్లున్నా, చెడు దారిలో పయనిస్తున్నా, అవసరమైన కార్యానికి సమయం దాటునట్లున్నా, మేలు కోరే సేవకుడు ప్రభువు అడుగకపోయిననూ హితం చెప్పవలసి ఉండును."(64)

ఇలా అవసరం వచ్చిననూ తగిన సలహా ఇవ్వనిచో నాకు మంత్రిపదవియే తగదు. ఏలనన.

శ్లో. కల్పయతి యేన వృత్తిం యేన చ లోకే ప్రశస్యతే సద్భిః,
స గుణస్తేన చ గుణినా రక్ష్యః సంవర్ధనీయశ్చ. 65

తద్భద్ర ! అనుజానీహి మామ్, గచ్ఛామి, కరటకో బ్రూతే - "శుభమస్తు శివాస్తే పన్థానః; యథాఽభిలషితమనుష్ఠీయతామ్" ఇతి. తతో దమనకో విస్మిత ఇవ పిఙ్గలకసమీపం గతః.

అను. "జీవనాధారం కల్పించేదీ, సజ్జనుల ప్రశంసలను పొందేదీ అయిన గుణాన్ని గుణవంతుడు రక్షించుకొనాలి, వృద్ధినొందించాలి కూడ". 65

అందుచే ఓ శుభమూర్తీ నాకు అంగీకారం తెల్పుము. పోయివచ్చెద. అంత కరటకుడు ఇలా చెప్పాడు శుభం గల్గుగాక. నీ మార్గములు శివ (ఆనంద) మయములు అగుగాక. అభిమతం ఆచరింతువు గాక.

అప్పుడు దమనకుడు ఆశ్చర్యం పొందినవాడు వలె పింగలకుడివద్దకు వెళ్ళాడు.

గ. అథ దూరాదేవ సాదరం రాజ్ఞా ప్రవేశితః సాష్టాఙ్గప్రణిపాతం ప్రణిపత్యోపవిష్టః. రాజాఽఽహ-"చిరాద్ దృష్టోఽసి," దమనకో బ్రూతే-'యద్యపి మయా సేవకేన శ్రీమద్దేవపాదానాం న కిఞ్చిత్ ప్రయోజనమస్తి తథాపి ప్రాప్తకాల మనుజీవినా సాన్నిధ్యమవశ్యం కర్తవ్యమిత్యాగతోఽస్మి. కిఞ్చ -

శ్లో. దన్తస్య నిర్ఘర్షణకేన రాజన్
కర్ణస్య కణ్డూయనకేన వాపి,
తృణేన కార్యం భవతీశ్వరాణాం
కిమఙ్గ వాక్పాణిమతా నరేణ. 66

అంతదూరంనుండియే ప్రభువు (పింగలకుడు) ఇతణ్ణి చూచాడు. ఆదరంగా లోపలికి ఆహ్వానించాడు. దమనకుడు సాష్టాంగపాతంగా ప్రణమిల్లాడు. లేచి కూర్చున్నాడు. రాజు ఇలా అడిగాడు - "ఏమి చాలకాలానికి కనబడ్డావు? దమనకుడు ఇట్లు అన్నాడు - "ప్రభూ! ఈ సేవకుడిచే పూజ్యపాదులైన ప్రభువులకు ఉపయోగం ఏమీ లేదు. అయినా అవసరం వచ్చినప్పుడు సేవకుడు ప్రభు సన్నిధిని ఉండాలి అని వచ్చాను. మరియూ -

"ఓ రాజా! ప్రభువులకు సైతం దంతముల సందున గ్రుచ్చుకొనడానికీ, చెవిదురదకు గీరుకొనడానికి అల్పమైన గడ్డిపరకతో అవసరం గలదు. ఇక కాళ్ళు, చేతులు గల మనుష్యుడి ఉపయోగాన్ని ఏమనాలి." 66

గ. యద్యపి చిరేణాఽవధీరితస్య దేవపాదైర్మే బుద్ధినాశః శఙ్క్యతే, తదపి న శఙ్కనీయమ్. యతః -

శ్లో. కదర్థితస్యాఽపి చ ధైర్యవృత్తేః
బుద్ధేర్వినాశో న హి శఙ్కనీయః,
అధఃకృతస్యాఽపి తనూనపాతో
నాధః శిఖా యాతి కదాచిదేవ. 67

అను. "ఇతడు చాలకాలంగా తిరస్కృతుడు. అందుచే (రాజనీతి) బుద్ధి నశించి ఉండును" అని పూజ్యులైన ప్రభువులు శంకింతురేమో కానీ అలా సందేహం పొందకుడు. ఏలననగా

"అవమానితుడు అయినచో ధైర్యశాలి అయినవాని బుద్ధి నశిస్తుంది అని శంకింపరాదు. తలక్రిందుగా పట్టుకున్నా అగ్నిజ్వాల ఎప్పుడునూ క్రిందు మొగంగా ఉండదు గదా.'' (ఊర్ధ్వముఖంగానే ఉండును).

గ. దేవ ! తత్ సర్వథా విశేషజ్ఞేన స్వామినా భవితవ్యమ్.

యతః-

శ్లో. మణిర్లుఠతి పాదేషు కాచః శిరసి ధార్యతే,
యథైవాఽఽస్తే తథైవాఽఽస్తాం కాచః కాచో మణిర్మణిః 68

అన్యచ్చ-

శ్లో. నిర్విశేషో యదా రాజా సమం సర్వేషు వర్తతే,
తదోద్యమసమర్థానాముత్సాహః పరిహీయతే. 69

అను. అందుచే ఓ ప్రభూ! ప్రభువు సేవకుల ప్రతిభావిశేషాన్ని గుర్తించువాడై ఉండవలయును. ఏలనన-

''మణి, పాదాలపై దొర్లింపబడుగాక. గాజుముక్క, శిరస్సుపై ధరింపబడుగాక. ఎలా ఉండేది అలానే ఉండుగాక. అయినా గాజు గాజే, మణి మణియే అగును.'' (నీచుడు గొప్పవాడు గాజాలడు. ఉత్తముడు నీచుడు గాజాలడు). 68

మరియూ-"గుణతారతమ్యవిశేషాన్ని గుర్తించనివాడై ప్రభువు అందరియెడ సమానంగా ఉండినచో ప్రయత్నశీలురైన సేవకులకు ఉత్సాహం నశిస్తుంది."69

కిఞ్చ

శ్లో. త్రివిధాః పురుషా రాజన్నుత్తమాధమమధ్యమాః,
నియోజయేత్తథైవైతాం స్త్రివిధేష్వేవ కర్మసు. 70

యతః-

శ్లో. స్థాన ఏవ నియోజ్యన్తే భృత్యాశ్చాఽఽభరణాని చ,
న హి చూడామణిః పాదే నూపురం మూర్ధ్ని ధార్యతే. 71

అను. ఇంకనూ- "ఓ రాజా! మానవులు ఉత్తములు మధ్యములు అధములు అని మూడువిధాలుగా ఉంటారు. వారిని అలాగే మూడువిధాలైన పనులలో నియమించాలి.'' 70

ఏలననగా- సేవకులను, ఆభరణాలను ఆ యా యోగ్యస్థానాలయందే నియమించాలి. శిరోమణిని పాదమున, కాలిఅందెను శిరమున ధరింపరు గదా- 71

అపి చ-

శ్లో. కనకభూషణసఙ్గ్రహణోచితో
యది మణిస్త్రపుషి ప్రణిధీయతే,
న స విరౌతి న చాపి న శోభతే
భవతి యోజయితుర్వచనీయతా. 72

అను. మరియూ-''బంగారుభూషణాలలో పొదుగదగిన మణి సీసమునందు కూర్చబడినచో ఆ మణి ఏడ్వదు (శబ్దం చేయదు). ప్రకాశింపదు అనుట లేదు- కాని అలా పొదిగినవాడిని లోకం నిందిస్తారు. 72

అన్యచ్చ

శ్లో. ముకుటే రోపితః కాచశ్చరణాఽఽభరణే మణిః,
న హి దోషో మణేరస్తి కిన్తు సాధోరవిజ్ఞతా. 73

పశ్య-

శ్లో. బుద్ధిమాననురక్తోఽయమయం శూర ఇతో భయమ్,
ఇతి భృత్యవిచారజ్ఞో భృత్యైరాపూర్యతే నృపః. 74

అను. మరియూ- 'తలపైన గాజు- కాలికి అందెగా మణి ధరింపబడవచ్చు కానీ ఇందులో మణిదోషం లేదు. ధరించేవాని మూర్ఖత్వం ఉంది." 73

చూడుము- "ఈ సేవకుడు బుద్ధిమంతుడు. వీడు అనురక్తుడు. వీడు వీరుడు. వీనివలన (అపకారాది) భయం గలదు- అని ఇలా సేవకులవిషయం తెలిసిన ప్రభువు సేవకులచే పరిపూర్ణుడై ఉండును." 74

గ. తథాహి–

శ్లో. అశ్వః శస్త్రం శాస్త్రం వీణా వాణీ నరశ్చ నారీ చ,
పురుషవిశేషం ప్రాప్య హి భవన్తి యోగ్యా అయోగ్యాశ్చ. 75

అన్యచ్చ

శ్లో. కిం భక్తేనాఽసమర్థేన కిం శక్తేనాఽపకారిణా,
భక్తం శక్తఞ్చ మాం రాజన్నావజ్ఞాతుం త్వమర్హసి. 76

అను. అలాగే- "గుఱ్ఱం, ఆయుధం, శాస్త్రం, వీణ, వాక్కు, నరుడు, స్త్రీ- ఇవి అన్నీ యోగ్యపురుషుణ్ణి చేరినచో యోగ్యములు గానూ, అయోగ్యపురుషుని చేరినచో అయోగ్యములుగాను అగును." 75

మరియూ- "సేవకుడు భక్తుడై అసమర్థుడైనా, అలాగే సమర్థుడై అపకారి అయినా ప్రభువునకు ఉపయోగం లేదు. ఓ రాజా ! భక్తుడూ, శక్తుడూ అయిన నన్ను అవమానించడం సముచితం గాదు." 76

యతః–

శ్లో. అవజ్ఞానాద్ రాజ్ఞో భవతి మతిహీనః పరిజనః
తతస్తత్ప్రామాణ్యాద్భవతి న సమీపే బుధజనః,
బుధైస్త్యక్తే రాజ్యే న హి భవతి నీతిర్గుణవతీ
విపన్నాయాం నీతౌ సకలమవశం సీదతి జగత్. 77

అను. ఏలననగా- "ప్రభువు అవమానించినచో సేవకజనం బుద్ధిహీనం అగును. ఇక అది ప్రమాణంగా భావించి విద్వాంసులు దాపునకు రారు. విద్వాంసులు సమీపింపనిచో గుణసంపన్నమైన నీతి, రాజ్యంలో ఉండదు. నీతి నశిస్తే రాజ్యం అంతా విశృంఖలయై నశిస్తుంది." 77

గ. అపరఞ్చ-

శ్లో. జనం జనపదా నిత్యమర్చయన్తి నృపార్చితమ్,
నృపేణావమతో యస్తు స సర్వైరవమన్యతే. 78

కిఞ్చ

శ్లో. బాలాదపి గ్రహీతవ్యం యుక్తముక్తం మనీషిభిః,
రవేరవిషయే కిం న ప్రదీపస్య ప్రకాశనమ్. 79

అను. "ప్రభువు ఎవరిని గౌరవిస్తాడో అతన్ని (జనపదములు) దేశములు అనగా దేశవాసులు అందరూ గౌరవిస్తారు. ప్రభువు అవమానించినవానిని అందరూ అవమానిస్తారు." 78

మరియూ- "విద్వాంసులైనవారు నీతియుక్తమైన వాక్కును బాలుడు చెప్పినను గ్రహించాలి. సూర్యకాంతి ప్రసరించనిచోట దీపాన్ని వెల్గించడం లేదా ఏమి?" 79

గ. పిఙ్గలకోఽవదత్- "భద్ర దమనక కిమేతత్? త్వమస్మదీయ ప్రధానాఽమాత్యపుత్రః. ఇయన్తం కాలం యావత్కుతోఽపి ఖలవాక్యాన్నాఽఽగతోఽసి. ఇదానీం యథాఽభిమతం బ్రూహి". దమనకో బ్రూతే- "దేవ! పృచ్ఛామి కిఞ్చిత్. ఉచ్యతామ్. ఉదకార్థీ స్వామీ పానీయమపీత్వా కిమితి విస్మిత ఇవ తిష్ఠతి."

పిఙ్గలకోఽవదత్- "భద్రముక్తం త్వయా. కిన్త్వేతద్రహస్యం వక్తుం కాచిద్విశ్వాసభూమిర్నాస్తి తథాపి నిభృతం కృత్వా కథయామి, శృణు. సమ్ప్రతి వనమిదమపూర్వసత్త్వాఽధిష్ఠిత మతోఽస్మాకం త్యాజ్యమ్. అనేన హేతునా విస్మితోఽస్మి. తథా చ శ్రుతో మయాఽపి మహానపూర్వః శబ్దః. శబ్దాఽనురూపేణాఽస్య ప్రాణినో మహాబలేన భవితవ్యమ్".

అను. పింగలకుడు ఇలా అన్నాడు- "భద్ర, దమనకా! ఇది ఏమి? నీవు మా ప్రధానమంత్రిపుత్రుడవు. ఇంతకాలం ఎవడో దుష్టుని మాటవలన రాలేదు.

ఇప్పుడు నీయిష్టం ఏమిటో తెల్పుము''. అంత దమనకుడు ఇట్లు అడిగాడు-'ప్రభూ! ఒకానొకవిషయం అడిగెదను. తెల్పండి- ప్రభువులవారు నీటిని త్రాగుటకై పోయియూ త్రాగకయే చకితులైనట్లు ఎందుకు వెనుదిరిగి వచ్చి కూర్చున్నారు?" పింగలకుడు ఇలా చెప్పాడు- 'శుభమూర్తి! నీవు సరిగానే అడిగావు. కానీ ఈ రహస్యం తెలుపడానికి విశ్వాసపాత్రుడు ఎవడూ లభింపలేదు. అయినా ఏకాంతంగా(నిభృతంగా) చెప్పుచున్నాను, వినుము. ప్రస్తుతం ఈ అడవిలో ఒకానొక అపూర్వప్రాణి నివసిస్తూంది. అందువల్ల నేను ఈ అడవిని విడిచిపెట్టవలసి వచ్చింది. ఇందువల్ల చకితుడను అయ్యాను. దాని మహాశబ్దం నేను విన్నాను. శబ్దాన్నిబట్టి ఆ ప్రాణి గొప్పబలం కలదిగా ఉండవచ్చును".

గ. దమనకో బ్రూతే- 'అస్తి తావదయం మహాన్ భయహేతుః, స శబ్దోఽస్మాభిరప్యాకర్ణితః. కిన్తు స కిమ్మన్త్రీ, యః ప్రథమం భూమిత్యాగం పశ్చాద్యుద్ధఞ్చోపదిశతి'? అస్మిన్ కార్యసన్దేహే భృత్యానాముపయోగ ఏవ జ్ఞాతవ్యః. యతః-

శ్లో. బన్ధు-స్త్రీ-భృత్యవర్గస్య బుద్ధేః సత్త్వస్య చాత్మనః,
ఆపన్నికషపాషాణే నరో జానాతి సారతామ్. 80

అను. దమనకుడు ఇలా అన్నాడు- 'ఇది అయితే గొప్ప భయకారణంనే ఉంది. ఆ శబ్దాన్ని మేముసైతం విన్నాము. కానీ మొదట దేశపరిత్యాగాన్ని మ్మట యుద్ధాన్ని దుష్టమంత్రియే ఉపదేశిస్తాడు. ఇలాంటి సందేహకార్యంలో వకుల ఉపయోగమే తెలిసికొనదగింది. ఏలననగా-

"ఆపద అనే ఒఱపిడిఱాతియందే బంధువులయు, భార్యలయు, సేవకజనుము బుద్ధిబల సారాన్ని, అలాగే తనదైన బుద్ధిబలసారాన్ని మానవుడు తెలికొండు." 80

గ. సింహో బ్రూతే- 'భద్ర మహతీ శఙ్కా మాం బాధతే'. మనకః పునరాహ స్వగతమ్- 'అన్యథా రాజ్యసుఖం పరిత్యజ్య స్థానారం గన్తుం కథం మాం సమ్భాషసే'. ప్రకాశం బ్రూతే- 'దేవ! యావ

దహం జీవామి, తావదృయం న కర్తవ్యమ్. కిన్తు కరటకాదయోఽప్యా
శ్వాస్యన్తాం యస్మాదాపత్ప్రతీకారకాలే దుర్లభః పురుషసమవాయః.'

అను. సింహం ఇలా చెప్పింది— "శుభమూర్తీ! పెద్ద సందేహం నన్ను బాధిస్తూంది''. దమనకుడు- తనలో ఇలా తలంచాడు- 'లేనిచో రాజ్యసుఖాన్ని వదలి వేఱొకచోటునకు పోవుటను గూర్చి నాతో ఎట్లు మాట్లాడెదవు'. ఇలా తలంచి ప్రకాశంగా అతడితో ఇలా అనెను- 'ప్రభూ! నేను జీవించి ఉండగా భయపడకుడు. కాని కరటకుడు మొదలైనవారికి సైతం ఓదార్పు గల్గించుదాం. (ఇచ్చట ధైర్యంగా చేరునట్లు చేయుదము) ఆపదకు ప్రతీకారం చేసేటప్పుడు పురుషుల నందరిని ఒకచోట చేర్చడం కష్టం.'

గ. తతస్తౌ కరటకదమనకౌ రాజ్ఞా సర్వస్వేనాఽపి పూజితౌ భయప్రతీకారం ప్రతిజ్ఞాయ ప్రస్థితౌ. కరటకో గచ్ఛన్ దమనకమాహ- 'సఖే! కిం శక్యప్రతీకారో భయహేతురశక్యప్రతీకారో వేతి న జ్ఞాత్వా భయోపశమం ప్రతిజ్ఞాయ కథమయం మహాప్రసాదో గృహీతః. యతో ఽనుపకుర్వాణో న కస్యాఽప్యుపాయనం గృహ్ణీయాద్విశేషతో రాజ్ఞః. పశ్య-

శ్లో. యస్య ప్రసాదే పద్మాఽఽస్తే విజయశ్చ పరాక్రమే,
మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః.

తథాహి—

శ్లో. బాలోఽపి నాఽవమన్తవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి. 82

అను. పిమ్మట కరటక దమనకులు రాజసన్నిధిని చేరారు. బహువిధములుగా రాజుచే గౌరవింపబడ్డారు. భయానికి ప్రతీకారం చేసెదము అని ప్రతిజ్ఞ చేశారు. అచ్చటినుండి కదిలారు. పోతూ(దారిలో) కరటకుడు దమనకుడితో ఇలా అన్నాడు- 'మిత్రమా! దీనికి (భయానికి) ప్రతీకారం సాధ్యమా అసాధ్యమా అని గ్రహింపక, భయాన్ని తొలగిస్తాం- అని ప్రతిజ్ఞ చెసి ఎందుకు ఈ మహాబహుమానం

స్వీకరించాం. ఏలనన- ఉపకరింపక ఎవరినుండీ బహుమానం గ్రహింపరాదు. విశేషించి ప్రభువులనుండియు తీసికొనరాదు. చూడుము-

"అతని (రాజుయొక్క) కరుణయందు లక్ష్మీదేవి(సంపద), పరాక్రమంలో విజయం, క్రోధంనందు మృత్యువు నివసిస్తూ ఉంటాయి. ప్రభువు సర్వతేజోమయుడు". 81

అలాగే-"ప్రభువు బాలుడు అయినా సామాన్యమానవునిగా అతన్ని దలంచి అవమానం చేయరాదు. అతడు మానవరూపంలో ఉండే గొప్ప దేవత." 82

గ. దమనకో విహస్యాఽఽహ- "మిత్ర ! తూష్ణీమాస్యతామ్, జ్ఞాతం మయా భయకారణమ్. మలీవర్ధనర్దితం తత్. వృషభాశ్చాఽస్మాకమపి భక్ష్యాః. కిం పునః సింహస్య". కరటకో బ్రూతే- "యద్యేవం తదా కిం పునః స్వామిత్రాసస్తత్రైవ కిమితి నాపనీతః" దమనకో బ్రూతే- "యది స్వామిత్రాసస్తత్రైవ ముచ్యతే తదా కథమయం మహాప్రసాదలాభః స్యాత్? అపరఞ్చ-

శ్లో. నిరపేక్షో న కర్తవ్యః స్వామీ భృత్యైః కదాచన,
నిరపేక్షం ప్రభుం కృత్వా భృత్యః స్యాద్దధికర్ణవత్. 83

గ. కరటకః పృచ్ఛతి- "కథమేతత్!" దమనకః కథయతి-

అను. అది విని నవ్వుతూ దమనకుడు ఇలా అన్నాడు- 'మిత్రమా : మౌనం వహింపుము. భయకారణం నాకు తెలియును. అది ఎద్దుఱంకె. ఎద్దులు మనకుసైతం ఆహారవస్తువులే. ఇక సింహవిషయం ఏమనాలి'. కరటకుడు అడిగాడు-'అలా అయితే స్వామిభయాన్ని అచ్చటనే ఎందుకు పోగొట్టలేదు? అందుకు దమనకుడు ఇలా చెప్పాడు- 'స్వామిభయాన్ని అలా అచ్చటనే తొలగిస్తే ఈ గొప్ప బహుమానం ఎలా లభిస్తుంది?

మరియూ- "సేవకులు ప్రభువును నిరపేక్షునిగా అనగా- తమ(సేవకుల

యొక్క) అవసరం లేనివాడినిగా చేసికొనరాదు. అలా చేసికొన్నచో సేవకుడైన దధికర్ణుడు అనే పిల్లివలె దురవస్థను పొందును. 83

కరటకుడు అడిగాడు- 'అది ఎట్లు.'

దమనకుడు ఇలా చెప్పసాగాడు-

## 3. దధికర్ణ బిడాల కథా

### (దధికర్ణుడు అనే పిల్లికథ)

గ. అస్త్యుత్తరాపథేఽర్బుదశిఖరనామ్ని పర్వతే దుర్దాన్తో నామ మహావిక్రమః సింహః. తస్య పర్వతకన్దరమధిశయానస్య కేసరాగ్రం కశ్చిన్మూషికః ప్రత్యహం ఛినత్తి తతః కేసరాగ్రం లూనం దృష్ట్వా కుపితో వివరాఽన్తర్గతం మూషికమలభమానోఽచిన్తయత్-

శ్లో. క్షుద్రశత్రుర్భవేద్యస్తు విక్రమాన్నైవ లభ్యతే.
తమాహన్తుం పురస్కార్యః సదృశస్తస్య సైనికః. 84

అను. ఉత్తరభారతమున అర్బుదశిఖరం అనే పర్వతం ఉంది. ఆ పర్వతంలో దుర్దాంతుడు అనే సింహం నివసిస్తుంది. అది గొప్ప పరాక్రమం గలది. ఆ సింహం పర్వతగుహలో నిద్రించేటప్పుడు ఒకానొక ఎలుక వచ్చి దాని జూలు అంచులను కొరికివేసేది. ఇలా ప్రతిదినం జరుగుతూ ఉంది. తన జూలును చూచుకొనగానే సింహానికి ఎలుకపై కోపం వచ్చేది. కాని బొరియలో దూరిన ఎలుక దొరకడం లేదు. అప్పుడు ఆ సింహం ఇలా విచారించింది-

"అల్పుడైన శత్రువు బలంవలన లభింపడు. వానిని చంపడానికి అలాంటి చిన్న సైనికుడిని గౌరవపూర్వకంగా నియమించాలి." 84

గ. ఇత్యాలోచ్య తేన గ్రామం గత్వా విశ్వాసం కృత్వా దధికర్ణ

నామా బిడాలో యత్నేనాऽऽనీయ మాంసాऽऽహారం దత్త్వా స్వకన్దరే స్థాపితః. అనన్తరం తద్భయాన్మూషికోఽపి బిలాన్న నిఃసరతి. తేనాऽసౌ సింహోఽక్షతకేసరః సుఖం స్వపితి. మూషికశబ్దం యదా యదా శృణోతి, తదా తదా మాంసాహార దానేన తం బిడాలం సంవర్ధయతి.

అను. ఇలా తలంచి ఆ సింహం (దగ్గరఉండే) గ్రామానికి పోయింది. అచ్చట దధికర్ణుడు అనే పిల్లిని చూచింది. ఆ పిల్లిని ఎంతో ప్రయత్నించి (బుజ్జగించి) తనతో తెచ్చుకొంది. మాంసాహారం ఇస్తూ తన గుహలో ఉంచుకొంది. పిల్లివలన భయంచే ఎలుక తొఱ్ఱనుండి వెలుపలికి రావడం లేదు. సింహం జూలు కొఱకబడడం లేదు. అందువలన సింహం హాయిగా నిద్రపోయేది. ఇలా ఎలుక సద్దు ఉన్నంతకాలం ఆ సింహం పిల్లిని మాంసాహారంచే బాగా పోషించింది.

గ. అథైకదా చ మూషికః క్షుధాపీడితో బహిః సఞ్చరన్ బిడాలేన ప్రాప్తో వ్యాపాదితశ్చ. అనన్తరం స సింహోఽనేకకాలం యావన్మూషికం న పశ్యతి తత్కృతాऽऽరావమపి న శృణోతి తదా తస్యాऽనుపయోగాద్ బిడాలస్యాऽऽహారదానే మన్దాదరో బభూవ. తతోऽసావాహారవిరహాద్దుర్బలో దధికర్ణోఽవసన్నో బభూవ. తతోఽహం బ్రవీమి- 'నిరపేక్షో న కర్తవ్య' ఇత్యాది. తతో దమనక కరటకౌ సఞ్జీవకసమీపం గతౌ. తత్ర కరటకస్తరుతలే సాటోపముపవిష్టః. దమనకః సఞ్జీవకసమీపం గత్వాऽబ్రవీత్-

అను. అంత ఒకనాడు ఎలుక ఆకలిచే పీడింపబడి వెలుపలికి వచ్చితిరుగ సాగింది. పిల్లికి చిక్కింది. చచ్చింది. పిమ్మట ఎలుక కనబడడంగానీ దానిశబ్దం గానీ ఎంతకాలానికీ లేకపోవడంతో సింహానికి పిల్లి నిరుపయోగంగా తోచింది. అందువల్ల పిల్లిపై ఆదరం తగ్గింది. ఆహారంసైతం సరిగా ఇవ్వడం మానివేసింది. అప్పుడు దుర్బలమై పిల్లి మరణించింది. అందువలన నేను(దమనకుడను) చెప్పుచున్నాను- 'నిరపేక్షుడినిగా ప్రభువును చేసికొనరాదు' -ఇత్యాది. పిమ్మట దమనక కరటకులు సంజీవకుడిని సమీపించారు. అచ్చట ఒక చెట్టుకింద కరటకుడు ఆడంబరంగా కూర్చున్నాడు. దమనకుడు సంజీవకునివద్దకు పోయి ఇలా అడిగాడు.

గ. 'అరే వృషభ ఏషోఽహం రాజ్ఞా పిఙ్గలకేనాఽరణ్యరక్షణార్థం నియుక్తః. సేనాపతిః కరటకః సమాజ్ఞాపయతి సత్వరమాగచ్ఛ. నచేదస్మాదరణ్యాద్దూరమపసర. అన్యథా తే విరుద్ధం ఫలం భవిష్యతి. న జానే క్రుద్ధః స్వామీ కిం విధాస్యతి". తచ్ఛ్రుత్వా సఞ్జీవకశ్చాఽఽయాత్. యతః-

శ్లో. ఆజ్ఞాభఙ్గో నరేన్ద్రాణాం బ్రాహ్మణానామనాదరః,
పృథక్ శయ్యా చ నారీణామశస్త్రవిహితో వధః. 85

అను. ఓరీ వృషభమా ! ఇదిగో నేను రాజైన పింగలకుడిచే ఈ అడవిని రక్షించేందుకు నియమింపబడిన సేవకుడను. సేనాపతి అయిన కరటకుడు ఆజ్ఞాపిస్తున్నాడు—వెంటనే రమ్ము. అలా కానిచో ఈ అడవినుండి దూరంగా తొలగిపొమ్ము. లేనిచో విపరీతఫలం సంభవిస్తుంది. ప్రభువు క్రుద్ధుడు అయితే ఏమి చేస్తాడో తెలియదు.' అది విని సంజీవకుడు కదలి వచ్చాడు. ఏలనన-

"ఆజ్ఞను ఉల్లంఘించడం ప్రభువులకూ, అగౌరవం గల్గడం బ్రాహ్మణులకూ, వేఱుగా (ఒంటరిగా) పండుకొనడం స్త్రీలకూ- ఇవి ఆయుధరహితంగా గల్గించిన మరణములు". (85)

గ. తతో దేశవ్యవహారాఽనభిజ్ఞః సఞ్జీవకః సభయముపసృత్య సాష్టాఙ్గపాతం కరటకం ప్రణతవాన్. తథా చోక్తమ్-

శ్లో. మతిరేవ బలాద్ గరీయసీ
యదభావే కరిణామియం దశా,
ఇతి ఘోషయతీవ డిణ్డిమః
కరిణో హస్తిపకాఽఽహతః క్వణన్. 86

అను. అంతట దేశవ్యవహారాలను తెలియని సంజీవకుడు, భయపడి అతడిని సమీపించాడు- సాష్టాంగవందనం చేశాడు. విజ్ఞులు ఇలా చెప్పారు- ''బలం కంటె బుద్ధియే గొప్పది. అలాంటి బుద్ధి లేకయే ఏనుగులకు ఈ అవస్థ పట్టినది.

మావటివాడు మ్రోగించిన ఢక్కా ధ్వనిస్తూ ఈ విషయం తెల్పుచున్నట్లుగా ఉంది." 86

గ. అథ సఞ్జీవకః సాశఙ్కమాహ- 'సేనాపతే కిం మయా కర్తవ్యమ్. తదభిధీయతామ్.' కరటకో బ్రూతే– 'వృషభ ! అత్ర కాననే తిష్ఠసి. అస్మద్దేవపాదారవిన్దం ప్రణమ'. సఞ్జీవకో బ్రూతే- 'తదభయ వాచం మే యచ్ఛ. గచ్ఛామి'. కరటకో బ్రూతే- 'శృణు రే బలీవర్ద ! అలమనయా శఙ్కయా. యతః-

శ్లో. ప్రతివాచమదత్త కేశవః
శపమానాయ న చేదిభూభుజే,
అనుహుఙ్కురుతే ఘనధ్వనిం
న హి గోమాయురుతాని కేసరీ. 87

అను. అప్పుడు సంజీవకుడు భయంతో ఇలా అన్నాడు- 'ఓ సేనాపతీ' నేను ఏమి చేయాలో చెప్పండి.

కరటకుడు- 'ఓ వృషభమా ! ఈ అడవిలో ఉన్నావు. మా ప్రభువుల పాదకమలాలకు ప్రణమిల్లుము'.

సంజీవకుడు_ 'అయితే నాకు అభయవాక్కును ఇయ్యండి'. వస్తాను.

కరటకుడు_ 'ఓరీ బలీవర్దమా ! (వృషభమా !) ఈ సందేహం మానుము ఏలననగా-

"శ్రీకృష్ణుడు తనను నిందించే శిశుపాలుడికి బదులు ఏమీ పల్కలేదు. సింహం మేఘగర్జనలకు హుంకరిస్తుంది. నక్కకూతలకు గర్జింపదు''. (87)

గ. అన్యచ్చ-

శ్లో. తృణాని నోన్మూలయతి ప్రభఞ్జనో
మృదూని నీచైః ప్రణతాని సర్వతః,
సముచ్ఛ్రితానేవ తరూన్ ప్రబాధతే
మహాన్ మహత్యేవ కరోతి విక్రమమ్. 8

అను. మరియు– "కోమలములూ క్రిందికి వ్రాలినవీ అయిన గడ్డిపరక లను గాలి పెళ్లగింపదు. గొప్పగా పెరిగిన వృక్షాలనే పడగొట్టుతుంది. అలాగే గొప్పవాడు సాటి గొప్పవాడియెడనే పరాక్రమిస్తాడు''. (88)

గ. తతస్తౌ సఞ్జీవకం కియద్దూరే సంస్థాప్య పిఙ్గలకసమీపం గతౌ. తతో రాజ్ఞా సాదరమవలోకితౌ ప్రణమ్యోపవిష్టౌ. రాజాఽఽహ- 'త్వయా స దృష్టః. దమనకో బ్రూతే- దేవ ! దృష్టః. కిన్తు యద్దేవేన జ్ఞాతం తత్తథా? మహానేవాఽసౌ దేవం ద్రష్టుమిచ్ఛతి. కిన్తు మహాబలోఽసౌ సజ్జీభూయోపవిశ్య దృశ్యతామ్. శబ్దమాత్రాదేవ న భేతవ్యమ్. తథా చోక్తమ్-

శ్లో. శబ్దమాత్రాన్న భేతవ్యమజ్ఞాత్వా శబ్దకారణమ్,
శబ్దహేతుం పరిజ్ఞాయ కుట్టనీ గౌరవం గతా. 89

రాజాఽఽహ- 'కథమేతత్ ?'. దమనకః కథయతి-

అ. పిమ్మట వారు ఇరువురూ (కరటక. దమనకులు) సంజీవకుడిని కొంచెం దూరంలో ఉంచారు. తాము మాత్రం పింగలకుడి వద్దకు పోయారు. రాజుచే ఆదరంగా చూడబడ్డారు. ప్రణామం చేసి కూర్చున్నారు. రాజు ఇలా అడిగాడు– 'అతణ్ణి చూచినావా ?'

దమనకుడు– 'దేవా చూచాను. ప్రభువులు తలచినట్లే ఉంది. అతడు గొప్పవాడే. ప్రభువులను చూడగోరుచున్నాడు. అయినా అతడు గొప్పబలం గలవాడు కనుక ఆత్మరక్షణకు సిద్ధమై ఉండండి. కాని కేవలం శబ్దానికై భయ పడవద్దు. విజ్ఞులు ఇలా అన్నారు.

"కారణం తెలిసికొనక శబ్దమాత్రానికి భయపడరాదు. శబ్దకారణం తెలిసి కొని కుట్టిని (కుంటెనకత్తె-దాసి) గౌరవం పొందింది."

రాజు అడిగాడు– 'అది ఎట్లు'

దమనకుడు ఇలా చెప్పసాగాడు.

# 4. ఘణ్టాకర్ణ-కుట్టనీ కథా

గ. అస్తి శ్రీపర్వతమధ్యే బ్రహ్మపురాఖ్యం నగరమ్. తచ్ఛిఖర ప్రదేశే ఘణ్టాకర్ణో నామ రాక్షసః ప్రతివసతీతి జనప్రవాదః శ్రూయతే. ఏకదా ఘణ్టామాదాయ పలాయమానః కశ్చిచ్చౌరో వ్యాఘ్రేణ వ్యాపాదితః. తత్పాణిపతితా ఘణ్టా వానరైః ప్రాప్తా. వానరాస్తాం ఘణ్టామనుక్షణం వాదయన్తి. తతో నగరజనైః స మనుష్యః ఖాదితో దృష్టః. ప్రతిక్షణం ఘణ్టారవశ్చ శ్రూయతే. అనన్తరం ఘణ్టాకర్ణః కుపితో మనుష్యాన్ ఖాదతి, ఘణ్టాఞ్చ వాదయతీత్యుక్త్వా జనా నగరాత్ పలాయితాః.

అను. శ్రీపర్వతమధ్యభాగంలో బ్రహ్మపురం అనే నగరం ఉంది. ఆ పర్వతశిఖరప్రాంతంలో ఘంటాకర్ణుడు అనే రాక్షసుడు నివసిస్తున్నాడు- అని జనులు చెప్పుకుంటూ ఉంటారు. ఒకప్పుడు గంటను తీసికొని పరుగెత్తే దొంగను పులి చంపింది. వాడి చేతిలోని గంట కోతులకు దొరికింది. కోతులు ఆ గంటను క్షణక్షణం మ్రోగిస్తాయి. పిమ్మట నగరవాసులు పులిచే తినబడిన ఆ మనుష్యుడి శవాన్ని (అస్థిపంజరాన్ని) చూచారు. ప్రతిక్షణం ధ్వనించే ఘంటాశబ్దాన్ని వింటున్నారు. తర్వాత (వారు) ఇలా తలంచారు. 'ఘంటాకర్ణుడు కోపంతో మనుష్యులను తింటున్నాడు. గంటను వాయిస్తున్నాడు'- ఇలా తలంచి నగరంనుండి పారిపోయారు.

గ. తతః కరాలయా నామ కుట్టన్యా విమృశ్య- 'అనవసరోఽయం ఘణ్టానాదః, తత్కిం మర్కటా ఘణ్టాం వాదయన్తి'-ఇతి స్వయం విజ్ఞాయ రాజా విజ్ఞాపితః- "దేవ ! యది కియద్ధనోపక్షయః క్రియతే, తదాఽహమేనం ఘణ్టాకర్ణం సాధయామి'. తతో రాజ్ఞా తస్యై ధనం దత్తమ్. కుట్టన్యా చ కుణ్డలం కృత్వా తత్ర గణేశాదిపూజాగౌరవం దర్శయిత్వా స్వయం వానరప్రియఫలాన్యాదాయ వనం ప్రవిశ్య ఫలాన్యాకీర్ణాని. తతో ఘణ్టాం పరిత్యజ్య వానరాః ఫలాసక్తా బభూవుః! కుట్టనీ చ

ఘణ్టాం గృహీత్వా నగరమాగతా సర్వజనపూజ్యాఽభవత్। అతోఽహం బ్రవీమి- 'శబ్దమాత్రాన్న భేతవ్యమ్'- ఇత్యాది. తతః సఞ్జీవకమాదాయ దర్శనం కారితవన్తౌ. పశ్చాత్తత్రైవ పరమప్రీత్యా నివసతి (సఞ్జీవకః).

అను. అప్పుడు కరాల అనే కుట్టని(తార్పుకత్తె) ఇలా ఆలోచించింది-'ఈ గంట అనవసరంగా మ్రోగుతూ ఉంది. ఏవేని కోతులు గంటను వాయిస్తూ ఉండ వచ్చు'. ఇలా తలంచి ఆమె రాజుతో ఇట్లు విన్నవించింది- 'ప్రభూ! కొంత ధనం ఖర్చు చేసినచో నేను ఈ ఘంటాకర్ణున్ని సాధిస్తాను'. అంత ప్రభువు ఆమెకు ధనం ఇచ్చాడు. ఆ కుట్టని ఏదో చక్రం గీసింది. దానిపై గణేశాదిపూజ ఇత్యాదికం ఏదో ఆడంబరంగా నిర్వహించింది. తాను స్వయంగా కోతులకు ఇష్టమైన పండ్లను మూటగట్టుకొంది. ఆ అడవికి పోయింది. ఆ పండ్లను వెదజల్లింది. వెంటనే కోతులు గంటను వదలివేశాయి. ఆ పండ్లను ఆసక్తితో గ్రహించాయి. (అది గుర్తించి) కుట్టని(తార్పుకత్తె) గంటను తీసుకొంది. నగరానికి వచ్చింది. అందరికీ పూజనీయురాలు అయింది. అందుచే నేను (దమనకుడను)చెప్పుతూఉన్నాను-'శబ్ద మాత్రంచే భయపడరాదు'- ఇత్యాదిగ!....తర్వాత కరటకదమనకులు సంజీవకుడిని తెచ్చాయి- పింగలకుడి దర్శనం చేయించాయి. (స్నేహం గల్గించాయి). పిమ్మట సంజీవకుడు మిక్కిలి ప్రేమతో అచ్చటనే నివసింపసాగాడు.

గ. అథ కదాచిత్ తస్య సింహస్య భ్రాతా స్తబ్ధకర్ణనామా సింహః సమాగతః. తస్యాఽఽతిథ్యం కృత్వా సింహముపవేశ్య పిఙ్గలకస్తదాహారాయ పశుం హన్తుం చలితః. అత్రాన్తరే సఞ్జీవకో వదతి- "దేవ! అద్య హతమృగాణాం మాంసాని క్వ!" రాజాఽఽహ- "దమనక కరటకౌ జానీతః." సఞ్జీవకో బ్రూతే-"జ్ఞాయతాం కిమస్తి నాస్తి వా!"సింహో విమృశ్యాఽఽహ-"నాస్త్యేవ తత్" సఞ్జీవకో బ్రూతే- "కథమేతావన్మాంసం తాభ్యాం ఖాదితమ్"? రాజాఽఽహ- "ఖాదితం వ్యయితమవధీరితఞ్చ- ప్రత్యహమేష క్రమః". సఞ్జీవకో బ్రూతే- "కథం శ్రీమద్దేవపాదానామగోచరేణైవ క్రియతే" రాజాఽఽహ- "మదీయాఽగోచరేణైవ క్రియతే"। అథ సఞ్జీవకో బ్రూతే-"నైతదుచితమ్. తథా చోక్తమ్-

శ్లో. నాఽనివేద్య ప్రకుర్వీత భర్తుః కిఞ్చిదపి స్వయమ్,
కార్యమాపత్ప్రతీకారాదన్యత్ర జగతీపతేః. 90

అను. అంత ఒకనాడు ఆ సింహంయొక్క సోదరుడైన స్తబ్ధకర్ణుడు అనే సింహం వచ్చింది. పింగలకుడు(సింహంపేరు) అతనికి అతిథిసత్కారం చేశాడు. కూర్చుండబెట్టాడు. అతనికి ఆహారార్థమై ఏదేని జంతువును చంపడానికి కదలాడు. ఇంతలో(వచ్చి) సంజీవకుడు ఇలా అన్నాడు- 'ప్రభూ! నేడు(ఉదయం) చంపిన మృగాల మాంసాలు ఎచ్చట ఉన్నాయి?

రాజు- '(ఆవిషయం) కరటక దమనకులు ఎరుంగుదురు'.

సంజీవకుడు- 'ఉందో లేదో విచారించండి.'

పింగలకుడు (రాజు)- విచారించి ఇలా చెప్పాడు- "స్వయంగా కొంత తిన్నారు. ఇతరులకు కొంత పంచి ఖర్చుచేశారు. మిగిలినదాన్ని ఇటు అటు వెదజల్లారు." ప్రతిదినం ఇదే వరుస?

సంజీవకుడు- 'పూజ్యపాదులైన శ్రీప్రభువులవారికి తెలువకయే ఇది ఎలా చేస్తున్నారు?'

పింగలకుడు- 'నాకు తెలుపకయే చేస్తున్నారు!'

సంజీవకుడు- 'ఇది సముచితం గాదు. విజ్ఞులు ఇలా అన్నారు—

"ప్రభువునకు తెలుపక ఏ చిన్నపనినీ స్వయంగా చేయరాదు. (ఒకవేళ చేయవలసివస్తే) ఏదేని ఆపదకు ప్రతీకారాన్ని మాత్రం తెలువకయే చేయవచ్చు." 90

అన్యచ్చ-

శ్లో. కమణ్డలూపమోఽమాత్యస్తనుత్యాగో బహుగ్రహః,
నృపతే! కింక్షణో మూర్ఖః దరిద్రః కింవరాటకః. 91

శ్లో. స హ్యమాత్యః సదా శ్రేయాన్ కాకినీం యః ప్రవర్ధయేత్,
కోషః కోషవతః ప్రాణాః ప్రాణాః ప్రాణా న భూపతేః. 92

అను. మరియూ- "ఓ రాజా : మంత్రి అయినవాడు కమండలమువలె అల్పంగా ఖర్చుచేసేవాడుగానూ, అధికంగా సేకరించేవాడుగానూ ఉండాలి. ఇక కింక్షణుడు మూర్ఖుడుగాను కింవరాటుడు దరిద్రుడుగాను తలంపబడును. 91

కింక్షణుడు = ఈ క్షణకాలం ఎంత అని కాలం దుర్వ్యయం చేసేవాడు.

కింవరాటకః = ఈ పైసా ఎంత అని ధనం దుర్వ్యయం చేసేవాడు.

"నిత్యం ఒక్క పైసా అయినా పెంచేవాడే ఉత్తముడు అయిన మంత్రి అనబడును. ధనాగారం గల ప్రభుడి ప్రాణాలే ధననిధివలె సురక్షితాలై ఉంటాయి. అలా వేని ప్రాణాలు ప్రాణాలుగావు- అనగా రక్షితములు గావు అనిభావం." 92

శ్లో. కిఞ్చార్థైర్నకులాచారైః సేవ్యతామేతి పూరుషః,
ధనహీనః స్వపత్న్యాఽపి త్యజ్యతే కిం పునః పరైః. 93

గ. ఏతచ్చ రాజ్ఞః ప్రధానం దూషణమ్-

శ్లో. అతివ్యయోఽనవేక్షా చ తథాఽఽర్జనమధర్మతః,
మోక్షణం దూరసంస్థానాం కోషవ్యసనముచ్యతే. 94

అను. "మరియూ- సంపదలచే పురుషుడు సేవ్యుడు అగును. కులాచారాలచే గాదు. ధనహీనుడు భార్యచే సైతం విడువబడును. ఇతరుల విషయం ఏమనాలి." 93

ఇది రాజునకు ప్రధానమైన దోషం- (ఏదనగా)

"అధికంగా ఖర్చుచేయడం, ఆయవ్యయాదికం సమీక్షింపకపోవడం, అధర్మంగా ఆర్జించడం, దూరంగా ఉండే లాభకరమైవాటిని విడువడం- ఈనాలుగు ధనాగారానికి హానిదాయకాలు అనబడుతాయి." 94

యతః

శ్లో. క్షిప్రమాయమనాలోచ్య వ్యయమానః స్వవాఞ్ఛయా,
పరిక్షీయత ఏవాఽసౌ ధనీ వైశ్రవణోపమః. 95

అను. ఏలననగా- "ఆదాయం గుర్తించక వేగంగా ఇష్టప్రకారం ఖర్చు చేసేవాడు కుబేరుడివంటి ధనవంతుడైనా తప్పక క్షీణిస్తాడు." 95

గ. స్తబ్ధకర్ణో బ్రూతే-"శృణు భ్రాతః? చిరాశ్రితావేతౌ దమనక కరటకౌ సంధివిగ్రహకార్యాధికారిణౌ చ. కదాచిదర్థాధికారే న నియోక్తవ్యౌ. అపరఞ్చ; నియోగప్రస్తావే యన్మయా శ్రుతం తత్కథ్యతే-

శ్లో. బ్రాహ్మణః క్షత్రియో బన్ధుర్నాధికారే ప్రశస్యతే,
బ్రాహ్మణః సిద్ధమప్యర్థం కృచ్ఛ్రేణాఽపి న యచ్ఛతి. 96

శ్లో. నియుక్తః క్షత్రియో ద్రవ్యే ఖడ్గం దర్శయతే ధ్రువమ్,
సర్వస్వం గ్రసతే బన్ధురాక్రమ్య జ్ఞాతిభావతః. 97

అను. స్తబ్ధకర్ణుడు ఇలా అన్నాడు- 'సోదరా! వినుము. ఈ దమనక కరటకులు చాలకాలంగా ఆశ్రయించి ఉన్నారు. సంధికార్యంలో విగ్రహ (యుద్ధ) కార్యంలో అధికారులు సైతం అగుదురు. అందుచే వీరికి ధనంపై అధికారం ఇవ్వరాదు. మరియూ- ధనాధికారం ఇచ్చే విషయంలో నేను విజ్ఞులవలన విన్నదానిని తెల్పెదను'-

"బ్రాహ్మణుడిని, క్షత్రియుడిని, బంధువుని అనగా ఈ ముగ్గురిని ధనాధికారంలో నియమించడం ప్రశస్తం గాదు. ఏలననగా- బ్రాహ్మణుడు సిద్ధంగా ఉండే ధనాన్ని సైతం చాల కష్టంతోగాని ఇవ్వడు. క్షత్రియుడు తప్పక ఖడ్గం చూపుతాడు. ఇక బంధువైనవాడు దాయాదిభావంతో సర్వధనం కైంకర్యం చేస్తాడు.'' 96-97

శ్లో. అపరాధేఽపి నిఃశఙ్కో నియోగీ చిరసేవకః,
స స్వామినమవజ్ఞాయ చరేచ్చ నిరవగ్రహః. 98

శ్లో. ఉపకర్తాఽధికారస్థః స్వాధికారం న మన్యతే.
ఉపకారం ధ్వజీకృత్య సర్వమేవాఽవలుమ్పతి. 99

అను. "మొదటినుండీ ఉండే సేవకుడు తాను తప్పుచేసియూ నిర్భయంగా ప్రభువును అవమానిస్తూ నిరాటంకంగా(నిరవగ్రహుడై) సంచరిస్తాడు. 98

"ఒకప్పుడు ఉపకారం చేసినవాడు అధికారంలో ఉంటే తన తప్పులను గుర్తింపడు. ఉపకారం అనే జండాను ఎగురవేస్తూ అంతా మ్రింగివేస్తాడు". 99

శ్లో. ఉపాంశుక్రీడితోఽమాత్యః స్వయం రాజాయతే యతః,
అవజ్ఞా క్రియతే తేన సదా పరిచయాద్ ధ్రువమ్. 100

శ్లో. అన్తర్దుష్టః క్షమాయుక్తః సర్వానర్థకరః కిల,
శకునిః శకటారశ్చ దృష్టాన్తావత్ర భూపతే? 101

అను. "రహస్యంగా రాజుతో జూదం మొదలగు క్రీడలకు అలవాటుపడిన మంత్రి తనను రాజుగా భావించును. నిత్యపరిచయం కారణంగా అతడు రాజును తిరస్కరిస్తాడు. ఇది నిశ్చయం". 100

"ఓ రాజా! లోపల దుష్టుడూ(వెలుపలికి) క్షమ గలవాడూ అయిన మంత్రి అన్ని అనర్థాలు గల్గిస్తాడు. ఇందుకు దృష్టాంతంగా, దుర్యోధనుడి మేనమామ అయిన శకునిని, నందరాజు మంత్రి అయిన శకటారున్ని చెప్పవచ్చును." 101

శ్లో. సదాఽమాత్యో న సాధ్యః స్యాత్ సమృద్ధః సర్వ ఏవ హి,
సిద్ధానామయమాదేశః బుద్ధిశ్చిత్తవికారిణీ. 102

శ్లో. ప్రాప్తాఽర్థగ్రహణం ద్రవ్యపరీవర్తోఽనురోధనమ్,
ఉపేక్షా బుద్ధిహీనత్వం భోగోఽమాత్యస్య దూషణమ్. 103

అను. "ఐశ్వర్యసమృద్ధుడైన మంత్రి నిత్యం లోబడి ఉండదు. ఐశ్వర్యం సాధారణంగా అందరికీ చిత్తవికారం గల్గిస్తుంది-అని నీతిశాస్త్రవేత్తలు అందురు."

"లభించిన ప్రభుధనాన్ని తాను (సొంతానికి) గ్రహించడం, ద్రవ్యపరీవర్తనం- అనగా అధికమూల్యవస్తువునకు బదులుగా అల్పమూల్యవస్తువును ఉంచడం,స్వార్థకార్యానికై ప్రభువును ఒత్తిడిపెట్టడం, రాజాజ్ఞాదులందు అశ్రద్ధగా ఉపేక్షగా వర్తించడం, మూర్ఖత్వం, రాజధనాన్ని స్వేచ్ఛగా అనుభవించడం- అనే ఈ ఆరుగుణాలు మంత్రికి దోషాలు అనబడును." 103

శ్లో. నియోగ్యర్థగ్రహోపాయో రాజ్ఞా నిత్యపరీక్షణమ్,
ప్రతిపత్తిప్రదానఞ్చ తథా కర్మవిపర్యయః. 104

# 5. స్వర్ణరేఖాదీనాం కథా

## స్వర్ణరేఖ మొదలైనవారి కథ

గ. అస్తి కాఞ్చనపురనామ్ని నగరే వీరవిక్రమో రాజా. తస్య ధర్మాధికారిణా కశ్చిన్నాపితో వధ్యభూమిం నీయమానః కన్దర్పకేతు నామ్నా పరివ్రాజకేన సాధుద్వితీయకేన-'నాఽయం హన్తవ్య'-ఇత్యుక్త్వా వస్త్రాఞ్చలే ధృతః. రాజపురుషా ఊచుః-'కిమితి నాయం వధ్యః'! స ఆహ "శ్రూయతామ్- స్వర్ణరేఖామహం స్పృష్ట్వా"-ఇత్యాది పఠతి! త ఆహుః- "కథమేతత్" పరివ్రాజకః కథయతి-

అను. కాంచనపురం అనే నగరంలో వీరవిక్రముడు అనే రాజు గలడు. అతడి ధర్మాధికారులు ఒకానొక మంగలికి మరణశిక్షను విధించారు. అందుచే రాజభటులు వాడిని వధ్యభూమికి తీసికొని పోతూ ఉన్నారు. ఇంతలో కందర్ప కేతువు అనే సంన్యాసి ఆ దారిన వచ్చాడు. అతడివెంట ఒక సాధువు సైతం ఉన్నాడు. సంన్యాసి 'ఇతడు చంపదగినవాడు కాదు'- అని పల్కి ఆ మంగలిని తన వస్త్రం అంచుతో కప్పాడు. రాజపురుషులు అడిగారు-

"వీడిని ఎందుకు చంపరాదు?" సంన్యాసి ఇలాచెప్పాడు-

"వినుడు. స్వర్ణరేఖను నేను తాకి- ఇత్యాది పఠించాడు (చూడుడు. 110 శ్లోకభావం). ఆ రాజభటులు మరల అడిగారు. "అది ఎట్లు? సన్యాసి ఇలా చెప్ప సాగాడు-

గ. అహం సింహలద్వీపస్య భూపతేర్జీమూతకేతోః పుత్రః కన్దర్పకేతుర్నామ. ఏకదా కేలికాననాఽవస్థితేన మయా పోతవణిజ్ముఖాచ్ఛ్రుతం- యదత్ర సముద్రమధ్యే చతుర్దశ్యా మావిర్భూతకల్పతరుతలే రత్నావలీకిరణకర్బురపర్యఙ్కే స్థితా సర్వాఽలఙ్కారభూషితా లక్ష్మీ

రివ వీణాం వాదయన్తీ కన్యా కాచిద్దృశ్యతే" ఇతి. తతోఽహం పోతవ ణిజమాదాయ పోతమారుహ్య తత్ర గతః. అనన్తరం తత్ర గత్వా పర్య ఙ్కేఽర్ధమగ్నా తథైవ సాఽవలోకితా. తతస్తల్లావణ్యగుణాఽఽకృష్టేన మయాఽపి తత్పశ్చాజ్ఝమ్పో దత్తః. తదనన్తరం కనకపత్తనం ప్రాప్య సువర్ణప్రాసాదే తథైవ పర్యఙ్కే స్థితా విద్యాధరీభిరుపాస్యమానా మయాఽవలోకితా. తయాఽప్యహం దూరాదేవ దృష్ట్వా సఖీం ప్రస్థాప్య సాదరం సమ్భాషితః. తత్సఖ్యా చ మయా పృష్టయా సమాఖ్యాతమ్-

అను. నేను సింహలద్వీపాధిపతి అయిన జీమూతకేతుడి పుత్రుడను. నా పేరు కందర్పకేతువు. నేను ఒకనాడు క్రీడావనంలో విహరిస్తుండగా ఒక నౌకా వ్యాపారి ఇలా చెప్పాడు- "చతుర్దశినాడు సముద్రంలో కల్పవృక్షం ఆవిర్భవి స్తుంది. దానిక్రింద రత్నసమూహకిరణాలచే శబలితమైన ఒక మంచం కనబడు తుంది. ఆ మంచమీద సర్వాభరణభూషితయై (సాక్షాత్తుగా) లక్ష్మీదేవివలె ఒక కన్యామణి వీణ వాయిస్తూ దర్శనం ఇస్తుంది'- అంత నేను ఆ నౌకావ్యాపారిని తోడుగా తీసికొని అచ్చటికి వెళ్ళాను. అలాగే ఆ సుందరీమణిని చూచాను. మంచంపై వయ్యారంగా సగం ఆమె పరుండి ఉంది. ఆమె లావణ్యంచే ఆకర్షింప బడ్డాను- వెంటనే ఆమెను సమీపించేందుకై సముద్రంలోనికి దూకాను- కాని ఆ మీదటనే నేను ఒక బంగారునగరాన్ని చేరాను. అచ్చట బంగారుమేడలో విద్యా ధరసుందరీమణులచే సేవింపబడుతూ మంచంపై అలాగే ఆ సౌందర్యరాశి కన బడింది. ఆమెయూ దూరంనుండియే నన్ను చూచింది. సాదరంగా చెలికత్తెను పంపింది. ఆ చెలిద్వారా సంభాషించింది. పిమ్మట నేను "ఈ సుందరీమణి ఎవరు? ఇత్యాది అడుగగా ఆ చెలికత్తె ఇలా చెప్పింది-

గ. "ఏషా కన్దర్పకేలినామ్నో విద్యాధరచక్రవర్తినః పుత్రీ రత్న మఞ్జరీ నామ ప్రతిజ్ఞాపితా విద్యతే, యః కనకపత్తనం స్వచక్షుషాఽఽ గత్య పశ్యతి స ఏవ పితురగోచరోఽపి మాం పరిణేష్యతీతి మనసః సఙ్కల్పః- తదేనాం గాన్ధర్వవిధినా పరిణయతు భవాన్" ఇతి.

అను. ఈమె గంధర్వచక్రవర్తి అయిన కందర్పకేలియొక్క పుత్రిక- పేరు రత్నమంజరి. ఈమె ఇలా ప్రతిజ్ఞ చేసింది.

ఈ విషయం చూచాను. గొల్లవాడు పశువులను మేపి సాయంకాలం ఇంటికి వచ్చాడు. తన భార్య దూతికతో ఏదో మాట్లాడడం చూచాడు. వెంటనే ఆ గొల్ల దానిని దండించి స్తంభానికి కట్టివేసి నిద్రించాడు. పిమ్మట ఈ అర్ధరాత్రమున మంగలి భార్య అయిన ఆ దూతిక వచ్చింది-ఆ గొల్లదానితో ఇలా చెప్పింది- నీ ప్రియుడు నీ విరహం అనే అగ్నిలో కాలిపోతూ ఉన్నాడు- మన్మథుడి బాణాలచే శిథిలశరీరుడై చచ్చుటకు సిద్ధంగా ఉన్నాడు. విజ్ఞులు ఇలా చెప్పారు-

శ్లో. రజనీచరనాథేన ఖణ్డితే తిమిరే నిశి,
యూనాం మనాంసి వివ్యాథ దృష్ట్వా దృష్ట్వా మనోభవః. 111

గ. తస్య తాదృశీమవస్థామవలోక్య పరిక్లిన్నమనాస్త్వామనువర్తితుమాగతా. తదహమత్రాఽఽత్మానం బద్ధ్వా తిష్ఠామి. త్వం తత్ర గత్వా తం సన్తోష్య సత్వర మాగమిష్యసి'.

అను. "చంద్రుడు ఉదయించాడు- రాత్రియందలి చీకటిని తొలగించాడు. అంత మన్మథుడు గుఱిగా చూచి చూచి యువకుల హృదయాలను వేధించాడు."

నేను అతడి అలాంటి అవస్థను చూచాను. మిక్కిలి కలతనొందాను. నిన్ను అనుకూలంగా చేయడానికై వచ్చాను. అందుచే నేను నన్ను ఇచ్చట బంధించుకొని ఉంటాను. నీవు అచ్చటికి పొమ్ము. అతన్ని సంతోషపఱిచి వెంటనే రమ్ము"

గ. తథాఽనుష్ఠితే సతి స గోపః ప్రబుద్ధోఽవదత్-'ఇదానీం త్వాం పాపిష్ఠాం జారాన్తికం నయామి'. తతో యదాఽసౌ న కిఞ్చిదపి బ్రూతే; తదా క్రుద్ధో గోపః 'దర్పాన్మమ వచసి ప్రత్యుత్తరమపి న దదాసి'- ఇత్యుక్త్వా క్రుద్ధేన తేన కర్తరికామాదాయాఽస్యా నాసికా ఛిన్నా. తథా కృత్వా పునః సుప్తో గోప్తో నిద్రాముపగతః. అథాఽఽగత్య గోపీ దూతీమపృచ్ఛత్- 'కా వార్తా' ఇతి. దూత్యోక్తమ్- "పశ్య మామ్. ముఖమేవ వార్తాం కథయతి" అనన్తరం సా గోపీ తథా కృత్వాఽఽత్మానం బద్ధ్వా స్థితా. ఇయఞ్చ దూతీ తాం ఛిన్ననాసికాం గృహీత్వా స్వగృహం ప్రవిశ్య స్థితా.

అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సన్ధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్. 112

అను. అంత అచ్చట (గొల్లవాడియింటిలో) ఆ గొల్లదియూ భర్త మరల అడుగగా ఇలా చెప్పింది- 'ఓరీ పాపాత్ముడా, నన్ను కురూపను చేయడానికి ఎవడికి శక్తి గలదు? విశుద్ధమైన నా నడవడికను లోకపాలకులు ఎనిమిదిమంది ఎరుంగుదురు. ఏలననగా-

"సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, ఆకాశం, భూమి, నీరు, హృదయం, యముడు, పగలు, రాత్రి రెండు సంధ్యలు- ధర్మం—వీరు అందరూ మానవుడి ప్రవర్తనను ఎరుంగుదురు."

గ. యద్యహం పరమసతీ స్యామ్, త్వాం విహాయాఽన్యం న జానే పురుషాన్తరం స్వప్నేఽపి న భజే, తేన ధర్మేణ ఛిన్నాఽపిమమ నాసికాఽఛ్ఛిన్నాఽస్తు. మయా త్వం భస్మ కర్తుం శక్యసే. కిన్తు స్వామీ త్వమ్. లోకభయాదుపేక్షే. పశ్య మన్ముఖమ్" ఇతి. యావదసౌ దీపం ప్రజ్వాల్య తన్ముఖమవలోకతే తావదున్నసం ముఖమవలోక్య తచ్చరణయోః పతితః—"ధన్యోఽహం యస్యేదృశీ భార్యా పరమసాధ్వీ"ఇతి.

అను. నేను పరమపతివ్రతను అయినచో- నిన్ను వీడి ఇతరున్ని ఎరుగనిదానిని అయినచో- కలలోనూ పరపురుషసంబంధం లేనిదానను అయినచో-అలాటి ధర్మమహిమచే కోయబడినదైనా, నా ముక్కు పూర్వం మాదిరిగా (కోయబడనిదిగా)ఉండుగాక! నేను నిన్ను బూడిదగా చేయగలను. కాని నీవు నాకుమగడవు, లోకభయంచే వదలుతున్నాను. నా మొగం చూడుము."

అంత గొల్లవాడు దీపం వెల్గించి ఆమెమొగం చూచాడు. ముక్కు చక్కగా ఉండడం తెలిసికొన్నాడు. వెంటనే ఆమె కాళ్ళపై పడ్డాడు- 'నేను ధన్యుడను. ఇంతటి పరమపతివ్రత నాకు భార్యగా లభించింది' అని అన్నాడు.

గ. యోఽయమాస్తే సాధురేతద్వృత్తాన్తమపి కథయామి. అయం స్వగృహాన్నిర్గతో ద్వాదశవర్షైర్మలయోపకణ్ఠాదిమాం నగరీమను

ప్రాప్తః. అత్ర వేశ్యాగృహే సుప్తః. తస్యాః కుట్టన్యా గృహద్వారి స్థాపితకాష్ఠఘటితవేతాలస్య మూర్ధని రత్నమేకముత్కృష్టమాస్తే. తత్ర లుబ్ధేనాఽనేన సాధునా రాత్రావుత్థాయ రత్నం గ్రహీతుం యత్నః కృతః. తదా తేన వేతాలేన సూత్రసఞ్చారితబాహుభ్యాం పీడితః సన్నార్తనాద మయం చకార. పశ్చాదుత్థాయ కుట్టన్యోక్తమ్- "పుత్ర మలయోపకణ్ఠా దాగతోఽసి. తత్ సర్వరత్నాని ప్రయచ్ఛాఽస్మై. నోచేదనేన న త్యక్త వ్యోఽసి. ఇత్థమేవాఽయం చేటకః"-ఇతి.

అను. ఇదిగో ఈ సాధువు ఉన్నాడే అతడి విషయం చెప్పేదను- ఇతను ఇల్లు వదలి పన్రెండేండ్లు మలయపర్వతప్రాంతాల్లో వసించాడు. ఇప్పుడు ఈ నగరానికి వచ్చాడు. ఒక రాత్రి ఒక వేశ్య ఇంట్లో శయనించాడు. ఆ వేశ్య యొక్క (కుట్టనియొక్క) ఇంటి ముఖద్వారంవద్ద కఱ్ఱతో చేసిన భేతాలుడి బొమ్మ ఉంది. ఆ ప్రతిమ (బొమ్మ) శిరస్సున ఒక ఖరీదైన రత్నం పొదుగబడి ఉంది. ఈ సాధువు ఆ రత్నాన్ని చూచాడు. ఆశపడ్డాడు. రాత్రివేళ లేచాడు. రత్నాన్ని తీసుకొన యత్నించాడు. వెంటనే భేతాలుడి భుజాలు దారాలచే కదలింపబడినాయి. ఇతన్ని గట్టిగా బంధించాయి. ఇతడు దీనుడై బిగ్గరగా ఏడ్వసాగాడు. వేశ్య లేచి వచ్చింది. ఇలా చెప్పింది- 'బిడ్డా! మలయ పర్వతప్రాంతంనుండి వచ్చావు. (నీదగ్గర రత్నాలు చాలా ఉంటాయి) కనుక రత్నాలు అన్నీ ఇతడికి ఇమ్ము. లేనిచో వీడు విడువడు. ఈ సేవకుడు ఇంతే'.

గ. తతోఽనేన సర్వరత్నాని సమర్పితాని. యథాఽయమ పహృత సర్వస్వోఽస్మాసు సమాగమ్య మిలితః." ఏతత్ సర్వం శ్రుత్వా రాజపురుషైర్న్యాయే ధర్మాధికారీ ప్రవర్తితః. అనన్తరం తేన సా దూతీ గోపీ చ గ్రామాద్బహిర్నిఃసారితే. నాపితశ్చ గృహం గతః. స్వర్ణరేఖా మహం స్పృష్ట్వా-ఇత్యాది అతః స్వయంకృతోఽయం దోషః. అత్ర విలపనం నోచితమ్. (క్షణం విమృశ్య) మిత్రః యథాఽనమోః సౌహార్దం మయా కారితమ్, తథా మిత్రభేదోఽపి మయా కార్యః యతః-

శ్లో. అతథ్యాన్యపి తథ్యాని దర్శయన్త్యతిపేశలాః,
సమే నిమ్నోన్నతానీవ చిత్రకర్మవిదో జనాః. 113

అను. అప్పుడు ఇతను రత్నాలు అన్నీ సమర్పించుకున్నాడు. ఇలా అంతా పోగొట్టుకొని మాతో వచ్చి చేరాడు''. రాజభటులు ఇది అంతా విన్నారు. న్యాయం తెలుపవలసిందిగా ధర్మాధికారిని కోరారు. అంతట ధర్మాధికారి దూతి అయిన మంగలిదానికి మరియూ గొల్లదానికి గ్రామబహిష్కారం శిక్షగా విధించాడు. మంగలి సుఖంగా ఇల్లు చేరాడు.

అందుచే నేను (దమనకుడను) 'స్వర్ణరేఖను నేను తాకి'- ఇత్యాదిగ చెప్పుతున్నాను. ఇది స్వయంగా చేసికొన్న దోషం. దీన్ని గూర్చి విచారింపరాదు." ఇలా అని దమనకుడు క్షణకాలం ఆలోచించి మరలా ఇలా చెప్పాడు-'మిత్రమా! నేను ఎలా వీరిరువురికి మైత్రి గల్గించానో అలాగే మిత్రభేదం సైతం చేయాలి. ఏలనన—

''చిత్రకారుడు తన ప్రతిభచే చిత్రరువునందు సమతలాన్ని సైతం హెచ్చు తగ్గులుగా చూపగలడు. అలాగే నీతిశాస్త్రనిపుణుడునూ అసత్యాలను సత్యాలుగా నిరూపింపగలడు." (113)

గ. అపరఞ్చ-

శ్లో. ఉత్పన్నేష్వపి కార్యేషు మతిర్యస్య న హీయతే,
స నిస్తరతి దుర్గాణి గోపీ జారద్వయం యథా. 114

గ. కరటకః పృచ్ఛతి- 'కథమేతత్'
దమనకః కథయతి-

అను. మరియూ, "విపత్కరములైన కార్యాలు సంభవించినా ఎవరి బుద్ధి (ప్రతిభ) క్షీణింపదో అలాటివాడు మాత్రమే గొల్లది ఇద్దరు మిండగాండ్రను తప్పించినట్లు దుఃఖాలను తరిస్తాడు." (114)

కరటకుడు అడిగాడు- 'అది ఎట్లు'.

దమనకుడు ఇలా చెప్పసాగాడు—

# 6. గోపీ విటద్వయ కథా

## గోపీ–జారద్వయ కథ

గ. అస్తి ద్వారవత్యాం పుర్యాం కస్యచిద్గోపస్య వధూర్బన్ధకీ. సా గ్రామస్య దణ్డనాయకేన తత్పుత్రేణ సమం రమతే. తథా చోక్తమ్-

శ్లో. నాఽగ్నిస్తృప్యతి కాష్ఠానాం నాఽఽపగానాం మహోదధిః,
నాఽన్తకః సర్వభూతానాం న పుంసాం వామలోచనాః. 115

అన్యచ్చ-

శ్లో. న దానేన న మానేన నాఽఽర్జవేన న సేవయా,
న శస్త్రేణ న శాస్త్రేణ సర్వథా విషమాః స్త్రియః 116

అను. ద్వారవతి అనే నగరంలో ఒకానొక గొల్లవాడు గలడు. వాడి భార్య రంకులాడి. ఆమె ఆ గ్రామ దండనాయకుడితోనూ, అతడి పుత్రుడితోనూ వ్యభిచారం చేసేది.

విజ్ఞులు ఇలా అన్నారు–

"అగ్ని కట్టెలచే, సముద్రం నదులచే, యముడు సర్వప్రాణులచే, యువతి పురుషులచే తృప్తి పొందరు. (115)

మరియూ– "స్త్రీలు భయంకరమైనవారు. వారు దానంచే గానీ, సమ్మానంచే గానీ- ఋజు (సరళ) భావంచేగానీ, శస్త్రం (దండన)చేగానీ శాస్త్రబోధచే గానీ సంస్కరింపబడజాలరు". (116)

యతః-

శ్లో. గుణాశ్రయం కీర్తియుతం చ కాన్తం
పతిం రతిజ్ఞం సధనం యువానమ్,

విహాయ శీఘ్రం వనితా వ్రజన్తి
నరాన్తరం శీలగుణాదిహీనమ్. 117

గ. అపరఞ్చ-

శ్లో. న తాదృశీం ప్రీతిముపైతి నారీ
విచిత్రశయ్యాశయితాఽపి కామమ్,
యథా హి దూర్వాదివికీర్ణభూమౌ
ప్రయాతి సౌఖ్యం పరాకాన్తసఙ్గాత్. 118

అను. ఏలననగా— "స్త్రీలు గుణవంతుడూ, కీర్తిశాలీ, సుందరుడూ, కామశాస్త్రవేత్తయూ, ధనికుడూ, యువకుడూ అగు భర్తను వీడి శీఘ్రంగా గుణహీనుడూ, దుష్టుడూ అయిన విటునితో రమింతురు"- (117)

మరియూ "గడ్డికనేలపై పరపురుషుడి సంపర్కంతో ఎంత తృప్తిని పొందుతుందో అంత తృప్తిని ఆడది భర్తతో సుందరమైన శయ్యపైననూ పొందదు".

గ. అథ కదాచిత్ సా దణ్డనాయకపుత్రేణ సహ రమమాణా తిష్ఠతి. అథ దణ్డనాయకోఽపి రన్తుం తత్రాఽఽగతః. తమాయాన్తం దృష్ట్వా తత్పుత్రం కుసూలే నిక్షిప్య దణ్డనాయకేన సహ తథైవ క్రీడతి. అనన్తరం తస్యా భర్తా గోపో గోష్ఠాత్ సమాగతః.

తమవలోక్య గోప్యోక్తమ్—'దణ్డనాయక! త్వం లగుడం గృహీత్వా కోపం దర్శయన్ సత్వరం గచ్ఛ' ఇతి. తథా తేనాఽనుష్ఠితే గోపేన గృహమాగత్య భార్యా పృష్టా- "కేన కార్యేణ దణ్డనాయకః సమాగత్యాఽత్ర స్థితః". సా బ్రూతే- 'అయం కేనాఽపి కార్యేణ పుత్రస్యోపరి క్రుద్ధః. స చ మార్గ్యమాణోఽప్యత్రాఽఽగత్య ప్రవిష్టో మయా నిక్షిప్య రక్షితః.

తత్పిత్రా చాఽన్విష్యాఽత్ర న దృష్టః? అత ఏవాఽయం దణ్డనాయకః క్రుద్ధ ఏవ గచ్ఛతి. తతః సా తత్పుత్రం కుసూలాద్బహిష్కృత్య దర్శితవతీ. తథాచోక్తమ్-

శ్లో. ఆహారో ద్విగుణః స్త్రీణాం బుద్ధిస్తాసాం చతుర్గుణా,
షడ్గుణో వ్యవసాయశ్చ కామశ్చాష్టగుణః స్మృతః. 119

అను. అంత ఒకనాడు ఆమె దండనాయకుడి పుత్రుడితో రమిస్తూ ఉంది. అంతలో దండనాయకుడు సైతం రమించడానికి అచ్చటికి వచ్చాడు. ఆ గొల్లది అతడు రావడం చూచింది- అతడి పుత్రుణ్ణి గాదెలో దాచింది. అతడితో (దండనాయకుడితో) అలాగే రమింపసాగింది. కొంతసేపటికి ఆమె మగడు ఆవుల కొట్టంనుండి వచ్చాడు. ఆ గొల్లది మగని రాకను గుర్తించింది- దండనాయకుడితో ఇలా అంది- 'దండనాయక! నీవు ఆ కట్టను తీసికొమ్ము, కోపంనటిస్తూ వేగంగా పొమ్మ'. అతడు అలాగే చేశాడు. గొల్లవాడు ఇంటిలోనికి వచ్చాడు- భార్యను ఇలా అడిగాడు-'దండనాయకుడు ఎందుకు ఇచ్చటికి వచ్చాడు?' ఆ గొల్లది ఇలా బదులు చెప్పింది- 'అతను ఎందువల్లనో పుత్రుడిపై క్రుద్ధుడు అయ్యాడు. పుత్రుడు పరుగెత్తుచూ వచ్చాడు. మన ఇంటిలో దూరాడు- నేను గాదెలో ఉంచి రక్షించాను. అతడి తండ్రి ఇంటిలో వెదికాడు కనగొనలేదు. అందుచే క్రోధంతోనే పోతున్నాడు". ఇలా అని దండనాయకుడి పుత్రుణ్ణి గాదెనుండి వెలికి రప్పించి చూపించింది.

పెద్దలు ఇలా చెప్పారు-

"పురుషాపేక్షతో చూస్తే స్త్రీలకు ఆహారం రెండురెట్లు, బుద్ధి నాల్గురెట్లు, ప్రయత్నశీలత ఆరు రెట్లు, కామం ఎనిమిదిరెట్లు అయి ఉంటుంది." 119

గ. అతోఽహం బ్రవీమి- 'ఉత్పన్నేష్వపి కార్యేషు'- ఇత్యాది. కరటకో బ్రూతే- 'అస్త్వేవమ్! కిన్త్వనయోర్మహానన్యోన్యనిసర్గోపజాతః స్నేహః కథం భేదయితుం శక్యః?' దమనకో బ్రూతే- "ఉపాయః క్రియతామ్. తథా చోక్తమ్-

శ్లో. ఉపాయేన హి యచ్ఛక్యం న తచ్ఛక్యం పరాక్రమైః,
కాక్యా కనకసూత్రేణ కృష్ణసర్పో నిపాతితః. 120

గ. కరటకః పృచ్ఛతి- "కథమేతత్" దమనకః కథయతి-

అను. అందువల్ల నేను(దమనకుడను) చెప్పుతున్నాను- విపత్కరము లైన కార్యాలు సంభవించినా- ఇత్యాది. కరటకుడు ఇలా అన్నాడు-'అలాగే కానిమ్ము. కానీ ఈ ఇరువురికీ పరస్పరం సహజసిద్ధమైన మైత్రి గొప్పది. దాన్ని ఎలాభేదించ గలవు'. దమనకుడు ఇలా చెప్పాడు- "ఉపాయాన్ని వెదకాలి."

విజ్ఞులు ఇలా తెల్పారు- "ఉపాయంచే ఏది సాధ్యమో అది పరాక్రమాలచే సాధింపబడదు. ఆడకాకి బంగారుహారంద్వారా నల్లత్రాచును చంపింది॰" 120

కరటకుడు అడిగాడు- "అది ఎట్లు?"

దమనకుడు ఇలా చెప్పసాగాడు.

# 7. కాకీ - కృష్ణసర్ప కథా

## (కాకి - నల్లత్రాచు కథ)

గ. కస్మింశ్చిత్తరౌ వాయసదమ్పతీ నివసతః. తయోశ్చాఽపత్యాని కోటరాఽవస్థితేన కృష్ణసర్పేణ ఖాదితాని- తతః పునర్గర్భవతీ వాయసీ వాయసమాహ- "నాథ! త్యజ్యతామయం వృక్షః. అత్రాఽవస్థితేన కృష్ణ సర్పేణాఽవయోః సన్తతిః సతతం భక్ష్యతే.

యతః-

శ్లో. దుష్టా భార్యా శఠం మిత్రం భృత్యశ్చోత్తరదాయకః,
ససర్పే చ గృహే వాసో మృత్యురేవ న సంశయః. 121

అను. ఒకానొక చెట్టుపై కాకులజంట నివసిస్తూంది. వాటి పిల్లలను ఆ చెట్టుతొఱ్ఱలో ఉండే నల్లత్రాచు తినివేసింది. మరలా (కొంతకాలానికి) ఆడకాకి గర్భవతి అయింది- తన భర్తతో ఇలా చెప్పింది- 'నాథా! ఈ చెట్టును వదలి పోదాం. ఈ చెట్టుతొఱ్ఱయందు ఉండే నల్లత్రాచు మన సంతానాన్ని తినివేస్తూ

ఉంది. ఏలనన- "దుష్టురాలు అయిన భార్య వంచకుడైన మిత్రుడు, ఎదురించి మాట్లాడే సేవకుడు, పాము ఉండే ఇంటిలో నివాసం- ఇవన్నీ మరణతుల్యాలు. ఇందు సందేహం లేదు". (121)

గ. వాయసో బ్రూతే- "ప్రియే న భేతవ్యమ్. వారం వారం మయైతస్య మహాపరాధః సోఢః. ఇదానీం పునర్న క్షన్తవ్యః. వాయస్యాహ- 'కథమేతేన బలవతా సార్థం భవాన్ విగ్రహీతుం సమర్థః' వాయసో బ్రూతే- 'అలమనయా శఙ్కయా యతః-

శ్లో. బుద్ధిర్యస్య బలం తస్య నిర్బుద్ధేస్తు కుతో బలమ్,
పశ్య సింహో మదోన్మత్తః శశకేన నిపాతితః. 122

గ. వాయసో విహస్యాఽఽహ- 'కథమేతత్ ?' వాయసః కథయతి-

అను. మగకాకి ఇలా అంది. 'ప్రియురాలా! భయపడకుము. నేను చాలా మార్లు ఇతడి మహాపరాధాలు క్షమించాను. ఇక ఇప్పుడు మాత్రం క్షమింపను'.

ఆడకాకి ఇలా అంది- 'తాము ఈ బలవంతుడితో ఎలా పోరాడగలరు'?-

మగకాకి ఇలా బదులు పల్కింది- 'ఈ సందేహం విడువుము. ఏలననగా-

"ఎవడు బుద్ధి గలవాడో వాడే బలవంతుడు అనబడును. బుద్ధిహీనుడికి బలం ఎక్కడిది? చూడుము- మదంచే గర్వించిన సింహాన్ని కుందేలు చంపింది".

ఆడకాకి నవ్వుతూ అడిగింది- 'అది ఎట్లు ?

మగకాకి ఇలా చెప్పసాగింది-

# 8 దుర్దాన్త సింహ - శశక కథా

## దుర్దాంతుడు అనే సింహాన్ని చంపిన కుందేలు కథ

గ. అస్తి మన్దరనామ్ని పర్వతే దుర్దాన్తో నామ సింహః. స చ సర్వదా పశూనాం వధం కుర్వన్నాస్తే. తతః సర్వైః పశుభిః మిలిత్వా స సింహో విజ్ఞప్తః-'మృగేన్ద్ర! కిమర్థ మేకదా బహుపశుఘాతః క్రియతే. యది ప్రసాదో భవతి తదా వయమేవ భవదాహారాయ ప్రత్యహమేకైకం పశుముపఢౌకయామః - ఇతి. తతః సింహేనోక్తమ్-'యద్యేతదభిమతం భవతాం తర్హి భవతు తత్'. తతః ప్రభృత్యేకైకం పశుముపకల్పితం భక్షయన్నాస్తే. అథ కదాచిద్వృద్ధశశకస్య వారః సమాయాతః. సోఽచిన్తయత్.

శ్లో. 'త్రాసహేతో ర్వినీతిస్తు క్రియతే జీవితాఽఽశయా,
పఞ్చత్వం చేద్గమిష్యామి కిం సింహానునయేన మే. 123

గ. మన్దం మన్దం గచ్ఛామి' ఇతి.

అను. మందరం అనే పర్వతంలో దుర్దాంతుడు అనే సింహం ఉంది. అది నిత్యం జంతువులను చంపుతూ ఉండేది. అప్పుడు [ఆ అడవిలోని] జంతువులు అన్నీ కలిశాయి. సింహంవద్దకు పోయి ఇలా విన్నవించాయి - "మృగరాజా ఒకేసారి జంతువులను అన్నిటిని ఏల చంపెదవు? తాము అనుగ్రహిస్తే మేమే తమకు ఆహారంగా ప్రతిదినం ఒక్కొక్క జంతువును సమర్పిస్తాము', అందుకు సింహం ఇలా అంది-'మీకు అది సమ్మతం అయితే అలాగే చేయండి.' అదిమొదలు ఆ సింహం తనకు పంపబడిన జంతువును భక్షిస్తూ ఉండేది. అంత ఒకనాడు ఒక ముసలికుందేలు వంతు వచ్చింది. అది ఇలా తలచింది.

''జీవించే ఆశతో అపాయ (భయ) కారణాన్ని గూర్చి వినయం (ప్రార్థన)

చేయబడుతూంది. మరణం తప్పక గల్గేటప్పుడు సింహాన్ని ఎందుకు నేను ప్రార్థించాలి" 123

మెల్లమెల్లగా పోయెదను.?

తతః సింహోఽపి క్షుధా పీడితః కోపాత్తమువాచ - 'కుతస్త్వం విలమ్బ్య సమాగతోఽసి'. శశకోఽబ్రవీత్ - "దేవ నాఽహమపరాధీ. ఆగచ్ఛన్ పథి సింహాన్తరేణ బలాద్ధృతః. తస్యాగ్రే పునరాగమనాయ శపథం కృత్వా స్వామినం నివేదయితు మత్రాఽఽగతోఽస్మి. సింహః సకోపమాహ - "సత్వరం గత్వా తం దురాత్మానం దర్శయ. క్వ స దురాత్మా తిష్ఠతి". తతః శశకస్తం గృహీత్వా గభీరకూపం దర్శయితుం గతః. తత్రాఽఽగత్య - 'స్వయమేవ పశ్యతు స్వామీ' - ఇత్యుక్త్వా తస్మిన్ కూపజలే తస్య సింహస్యైవ ప్రతిబింబం దర్శితవాన్. తతోఽసౌ క్రోధాఽఽధ్మాతో దర్పాత్తస్యోపర్యాత్మానం నిక్షిప్య పఞ్చత్వం గతః. అతోఽహం బ్రవీమి - "బుద్ధిర్యస్య బలం తస్య - " ఇత్యాది.

అను. [ఇలా తలంచి ఆ కుందేలు ఆలస్యంగా పోయింది]. అందువల్ల సింహానికి ఆకలిచే చాల బాధ గల్గింది - కుందేలును చూచి కోపంతో ఇలా అడిగింది-'ఓయీ నీవు ఎందుకుఆలస్యంగా వచ్చావు?' కుందేలు అందుకు ఇట్లు సమాధానం చెప్పింది - 'ప్రభూ ఇందు నా అపరాధం లేదు. ఇచ్చటికి వస్తూ ఉండగా దారిలో మరియొక సింహం బలంగా పట్టుకొంది. అప్పుడు నేను తమ్ము దర్శించి మరలా వచ్చెదను - అని దానిముందు ప్రమాణంచేసి ఆ విషయం తెల్పడానికి వచ్చాను". అది వినగానే సింహానికి మిక్కిలి కోపం వచ్చింది - ఇలా అంది - 'వెంటనే నన్ను తీసికొని పొమ్ము - ఆ దుర్మార్గుడు ఎచ్చట ఉన్నాడో చూపుము " అప్పుడు కుందేలు సింహాన్ని తనవెంట రమ్ము-అని కోరింది. మిక్కిలి లోతైన బావివద్దకు తీసుకొని పోయింది - ఇదిగో ఈ బావిలోనికి ప్రభువులు స్వయంగా చూడండి" - ఇలా అని బావిలోని నీటిలో ఆ సింహంయొక్క నీడను చూపింది. వెంటనే సింహం క్రోధంచే కన్నులు గానక గర్వంతో ఆ సింహంమీదికి - అనగా బావిలోనికి దూకింది. మరణించింది. అందుచే నేను (మగకాకిని) చెప్పుతున్నాను. ఎవడు తెలివిగలవాడో వాడే బలవంతుడు - ఇత్యాదిగ.

గ. వాయస్యాహ - "శ్రుతం మయా సర్వమ్ సమ్ప్రతి యథా కర్తవ్యం తద్బ్రూహి" ఇతి. వాయసోఽవదత్ "అత్రాఽఽసన్నే సరసి రాజపుత్రః ప్రత్యహమాగత్య స్నాతి. స్నానసమయే తదఙ్గాదవతారితం తీరస్థశిలానిహితం కనకసూత్రం చఞ్చ్వా విధృత్యాఽఽనీయాఽస్మిన్ కోటరే ధారయిష్యసి." అథ కదాచిత్ స్నాతుం జలం ప్రవిష్టే రాజ పుత్రే వాయస్యా తదనుష్ఠితమ్. అథ కనకసూత్రాఽనుసరణప్రవృత్తై రాజపురుషైస్తత్ర తరుకోటరే కృష్ణసర్పో దృష్టో వ్యాపాదితశ్చ. అతోఽహం బ్రవీమి - "ఉపాయేన తు యచ్ఛక్యమ్ - ఇత్యాది". 1

అను. ఆడకాకి ఇలా అంది - 'నేను అంతా విన్నాను. ఇప్పుడు ఎలా చేయాలో చెప్పుము. మగకాకి ఇలా చెప్పింది - 'ఒక రాజకుమారుడు ప్రతిదినం ఇచ్చటికి సమీపంలో ఉండే కొలనుకు వచ్చి స్నానం చేస్తాడు - అప్పుడు తీరంలో ఉండే రాతిమీద తన మెడలోని బంగారుహారాన్ని ఉంచుతాడు. నీవు ఆ గొలుసును ముక్కుతో పట్టుకొనుము - తెచ్చి ఈ తొఱ్ఱలో పడవేయుము.' ఒకనాడు రాజపుత్రుడు స్నానం చేసేందుకు నీటిలోనికి దిగగానే ఆడకాకి అలాగే చేసింది. అంత బంగారుహారాన్ని అనుసరిస్తూ రాజభటులు వచ్చారు - [చెట్టుతొఱ్ఱలో ఆడ కాకి వేయడం చూచారు] తొఱ్ఱలో నల్లత్రాచు ఉండడం గాంచారు - దాన్ని చంపారు. అందుచే నేను (దమనకుడను) చెప్పుతున్నాను - "ఉపాయంచే ఏవి సాధ్యం అగునో - ఇత్యాది (చూడుడు - 120 శ్లోకభావం)

గ. కరటకో బ్రూతే - "యద్యేవం తర్హి గచ్ఛ. శివాస్తే సన్తు పన్థానః." తతో దమనకః పిఙ్గలక - సమీపం గత్వా ప్రణమ్యోవాచ - 'దేవ ఆత్యయికం కిమపి మహాభయకారి కార్యం మన్యమానః సమాగతోఽస్మి. యతః -

శ్లో. ఆపద్యున్మార్గగమనే కార్యకాలాఽత్యయేషు చ,
కల్యాణవచనం బ్రూయాదపృష్టోఽపి హితో నరః. 124

అను. కరటకుడు అన్నాడు - 'అలా అయితే వెళ్ళుము. నీ మార్గాలు శుభమయాలు అగుగాక.' అంతట దమనకుడు పింగలకుడివద్దకు వెళ్ళాడు -

ప్రణామం చేశాడు - ఇలా విన్నవించాడు - "ప్రభూ తమకు సంభవించే మిక్కిలి భయంకరమైన ఆపదను గుర్తించాను - అందుచే (పిలువకపోయినా) వచ్చాను. ఏలనన -

"ఆపత్కాలంలో, చెడుదారిని పయనించే సమయంలో, అవశ్య కర్తవ్యమైన కార్యానికి సమయం మించే వేళలో - మేలుగోరేవాడు తనను అడుగకపోయినా హితమైన మాటను తెలుపాలి." (124)

అన్యచ్చ

శ్లో. భోగస్య భాజనం రాజా న రాజా కార్యభాజనమ్,
రాజకార్యపరిధ్వంసీ మన్త్రీ దోషేణ లిప్యతే. 125

గ. తథాహి పశ్య. అమాత్యానామేష క్రమః

శ్లో. వరం ప్రాణపరిత్యాగః శిరసో వాఽపి కర్తనమ్,
న తు స్వామిపదాఽవాప్తిపాతకేచ్ఛోరుపేక్షణమ్. 126

అను. మరియూ - "ప్రభువు భోగమయజీవనుడై ఉంటాడు. అతడు కార్యకర్తయై ఉండడు. ప్రభుకార్యాలను చెడగొట్టే మంత్రి దోషం పొందును".

మరియూ చూడండి - మంత్రులకు ఇది నియమం -

"ప్రాణాలు వీడడంగాని లేక శిరస్సును ఖండించుకొనడం గాని ఉత్తమం. రాజపీఠాన్ని పొందగోరే పాతకుణ్ణిమాత్రం ఉపేక్షించడం (మంత్రికి) తగదు."

గ. పిఙ్గలకః సాదరమాహ- 'అథ భవాన్ కిం వక్తుమిచ్ఛతి'? దమనకో బ్రూతే- 'దేవ! సఞ్జీవక స్తవోపర్యసదృశవ్యవహారీవ లక్ష్యతే. తథా చాఽస్మత్సన్నిధానే శ్రీమద్దేవపాదానాం శక్తిత్రయనిన్దాం కృత్వా రాజ్యమేవాఽభిలషతి". ఏతచ్ఛ్రుత్వా పిఙ్గలకః సభయం సాశ్చర్యం మత్వా తూష్ణీం స్థితః. దమనకః పునరాహ-దేవ! సర్వామాత్యపరిత్యాగం కృత్వైక ఏవాఽయం యద్భవతా సర్వాధికారీ కృతః, స ఏష దోషః. యతః-

శ్లో. అత్యుచ్ఛ్రితే మన్త్రిణి పార్థివే చ
విష్టభ్య పాదావుపతిష్ఠతే శ్రీః,
సా స్త్రీస్వభావాదసహా భరస్య
తయోర్ద్వయోరేకతరం జహాతి. 127

అను. పింగలకుడు ఆదరంగా ఇలా అన్నాడు- 'మంచిది; తాము ఏమి చెప్పదలుస్తున్నారు ?'

దమనకుడు- 'ప్రభూ! సంజీవకుడు తమ విషయంలో అనుచితంగా వ్యవహరిస్తున్నట్లు తోస్తూ ఉంది. ఎట్లన- అతను మాముందు పూజ్యపాదులైన శ్రీమంతులైన ప్రభువులయొక్క త్రివిధశక్తులను (ప్రభు-మంత్ర-ఉత్సాహశక్తులను) నిందించాడు- రాజ్యాన్నే కాంక్షించాడు !'

ఇది విని పింగలకుడు భయాన్నీ, ఆశ్చర్యాన్నీ పొందాడు. మౌనం వహించాడు. అంత దమనకుడు మరలా ఇలా అన్నాడు- "ప్రభూ! తాము మంత్రులను అందర్నీ పరిత్యజించారు. అతన్నే సర్వాధికారిగా చేశారు. ఇదియే దోషం. ఏల ననగా-

"మిక్కిలి ఉన్నతుడైన మంత్రి మీదా అలాగే రాజుమీదా లక్ష్మి తన రెండు కాళ్లను మోపి నివసిస్తుంది. కాని ఆమె తన స్త్రీసహజమైన చాంచల్యంవలన (రెండుప్రక్కల పాదాలు ఉంచడం అనే) కార్యభారం సహింపజాలనిదై వారిరువురిలో ఒకరిని వదలివేస్తుంది." (127)

గ. అపరఞ్చ

శ్లో. ఏకం భూమిపతిః కరోతి సచివం రాజ్యే ప్రమాణం యదా
తం మోహాచ్ఛ్రయతే మదః స చ మదాలస్యేన నిర్విద్యతే,
నిర్విణ్ణస్య పదం కరోతి హృదయే తస్య స్వతన్త్రస్పృహా
స్వాతన్త్ర్యస్పృహయా తతః స నృపతేః ప్రాణాన్తికం ద్రుహ్యతి.

అ. మరియూ- "ప్రభువు రాజ్యంలో ఒక మంత్రినే సర్వాధికారయుక్తుణ్ణి (ప్రమాణమైనవాణ్ణి) చేస్తే, ఆ మంత్రిని అధికార మోహంవల్ల మదం అనగా అహంకారం ఆవరిస్తుంది. అట్టి అహంకారంవలన గల్గిన సోమరితనంచే (నిర్ల

క్ష్యంచే) భేదభావం పొడసూపుతుంది. భేదభావాన్ని పొందిన హృదయంలో స్వతంత్ర వాంఛ జనిస్తుంది. పిమ్మట అలాంటి స్వాతంత్ర్యవాంఛచే అతను రాజానకు ప్రాణహానికరమైన ద్రోహం చేయనారంభిస్తాడు".

గ. అపరఞ్చ-

శ్లో. విషదగ్ధస్య భక్తస్య దన్తస్య చలితస్య చ,
అమాత్యస్య చ దుష్టస్య మూలాదుద్ధరణం సుఖమ్.. 129

గ. కిఞ్చ—

శ్లో. యః కుర్యాత్ సచివాఽఽయత్తాం శ్రియం తద్వ్యసనే సతి,
సోఽన్ధవజ్జగతీపాలః సీదేత్ పఞ్చారకైర్వినా. 130

అ. మరియూ- ''విషమిశ్రం అయిన అన్నమునూ— కదులుతూ ఉండే పంటినీ— దుష్టుడు అయిన మంత్రినీ సమూలంగా తీసివేయడం సుఖకరం."

ఇంకనూ— "ఏ భూపాలుడు తన రాజ్యలక్ష్మిని తన మంత్రియొక్క అధీనం చేస్తాడో- ఆ భూపాలుడు తనకు ఏదేని ఆపద సంభవించినచో దారిచూపేవాడు లేని గ్రుడ్డివాడివలె దుఃఖం అనుభవిస్తాడు". (130)

గ. స చ సర్వకార్యేషు స్వేచ్ఛాతః ప్రవర్తతే. తదత్ర ప్రమాణం స్వామీ. ఏతచ్చ జానాతి-

శ్లో. న సోఽస్తి పురుషో లోకే యో న కామయతే శ్రియమ్,
పరస్య యువతిం రమ్యాం సాదరం నేక్షతేఽత్ర కః. 131

అను. అతను అన్నికార్యాల్లో స్వేచ్ఛగా ప్రవర్తిల్లుతున్నాడు. ఆపైన ఈ విషయంలో ప్రభువుల చిత్తం. (తాము) ఇదియూ ఎరుంగుదురు-

"ఈ ప్రపంచంలో సంపదను కోరనివాడు ఎవడూ లేడు. అందంగా ఉండే పరుడి జవరాల్ని చూడనివా డెవడు ?" (131)

గ. సింహో విహస్యాఽఽహ- 'భద్ర ? యద్యప్యేవం తథాపి సఞ్జీవకేన సహ మమ మహాన్ స్నేహః. పశ్య-

శ్లో. కుర్వన్నపి వ్యలీకాని యః ప్రియః ప్రియ ఏవ సః,
అశేషదోషదుష్టోఽపి కాయః కస్య న వల్లభః ? 132

గ. అన్యచ్చ-

శ్లో. అప్రియాణ్యపి కుర్వాణో యః ప్రియః ప్రియ ఏవ సః,
దగ్ధమన్దిరసారేఽపి కస్య వహ్నావనాదరః. 133

అను. సింహం నవ్వి ఇలా అంది- 'శుభమూర్తి ! ఇలా అయినప్పటికీ నాకు సంజీవకుడియెడ స్నేహం గొప్పదిగానే ఉంటుంది. చూడుము-

"ఇష్టుడైనవాడు తప్పులు చేసినా ఇష్టుడుగానే ఉంటాడు. రోగాదిదోషాలతో పరిపూర్ణంగా ఉండినా శరీరం ఎవరికి ప్రియంగా ఉండదు ?" (132)

మరియూ- "అప్రియం అయిన కార్యాలు ఎన్ని చేస్తూ ఉండినా ప్రియమైన వాడు ప్రియుడుగానే ఉంటాడు. ఎన్ని గృహాలను కాల్చివేసిననూ అగ్నిని ఎవరూ అగౌరవంగా చూడరు గదా !"

గ. దమనకః పునరేవాఽఽహ- 'దేవ ! స ఏవాఽతి దోషః యతః-

శ్లో. యస్మిన్నేవాధికంచక్షురారోహయతి పార్థివః,
సుతేఽమాత్యేఽప్యుదాసీనే స లక్ష్మ్యాఽఽశ్రీయతే జనః. 134

గ. శృణు దేవ-

శ్లో. అప్రియస్యాఽపి పథ్యస్య పరిణామః సుఖావహః,
వక్తా శ్రోతా చ యత్రాఽస్తి రమన్తే తత్ర సమ్పదః. 135

అను. దమనకుడు మరలా ఇలా చెప్పాడు- 'దేవా ! అదే మిక్కిలి దోషం. ఏమనగా-

"ప్రభువుల ఆదరదృష్టి ఎవడిపై అధికంగా ప్రసరిస్తుందో వాడు పుత్రుడైనా మంత్రి అయినా తుదకు ఆ ప్రభువును ఉపేక్షించేవాడైనా లక్ష్మిచే ఆశ్రయింపబడును." (134)

ప్రభూ! వినుము- "హితం గల్గించేదీ, వినడానికి కటువుగా ఉన్నా దాని పరిణామం సుఖదాయకంగా ఉంటుంది. అలాంటి హితం చెప్పేవాడూ వినేవాడూ ఎక్కడ ఉంటారో అచ్చట సంపదలు ఆనందంతో ఉంటాయి." (135)

గ. త్వయా చ మూలభృత్యానపాస్యాఽయమాగన్తుకః పురస్కృతః. ఏతచ్చానుచితం కృతమ్. యతః-

శ్లో. మూలభృత్యాన్ పరిత్యజ్య నాఽఽగన్తూన్ ప్రతిమానయేత్,
నాఽతః పరతరో దోషో రాజ్యభేదకరో యతః. 136

అను. మీరు పూర్వసేవకులను తొలగించి ఈ క్రొత్తగా వచ్చినవాణ్ణి పెద్దగా గౌరవించారు. ఇలా చేయడం అనుచితం. ఏలననగా- "ప్రాచీన సేవకులను తొలగించి క్రొత్తగా వచ్చినవారిని ఆదరింపరాదు. ఏలనన రాజ్యంలో భేదాలను గల్గించేందుకు ఇంతకుమించి వేఱే దోషం లేదు." (136)

గ. సింహో బ్రూతే- 'కిమాశ్చర్యమ్' మయా యదభయవాచం దత్వాఽఽనీతః సంవర్ధితశ్చ తత్కథం మహ్యం ద్రుహ్యతి? దమనకో బ్రూతే- దేవ!

శ్లో. దుర్జనో నార్జవం యాతి సేవ్యమానోఽపి నిత్యశః,
స్వేదనాఽభ్యఞ్జనోపాయైః శ్వపుచ్ఛమివ నామితమ్. 137

అపరఞ్చ-

శ్లో. స్వేదితో మర్దితశ్చైవ రజ్జుభిః పరివేష్టితః,
ముక్తో ద్వాదశభిర్వర్షైః శ్వపుచ్ఛః ప్రకృతిం గతః. 138

అను. సింహం ఇలా అంది- 'ఎంత ఆశ్చర్యం అయిన విషయం? నేను అభయవాగ్దానం చేశాను- పిలిపించాను. అభివృద్ధికి తెచ్చాను, అలాంటప్పుడు నాకే ద్రోహం ఎలా చేయదలుస్తాడు'?

అందుకు దమనకుడు ఇలా చెప్పాడు- "దేవా! నిత్యం సేవితుడైనా దుర్జనుడు మంచిగుణాన్ని (ఋజుతను) పొందడు. కుక్కతోక వేడితైలంచే ఎంత స్వేదితం అయినా వంకరగా ఉండడాన్ని వీడదు." 13

మరియూ— "కుక్కతోక తైలంచే స్వేదితం (అనగా వేడితైలంచే తడువబడడం) అయినా- తోమబడినా- త్రాళ్ళచే పండ్రెండేండ్లు చుట్టబడినదై విడువబడినా, అది తన ప్రకృతిగుణమైన వంకరతనాన్ని పొందనే పొందును." 138

అన్యచ్చ

శ్లో. వర్ధనం వాథ సమ్మానం ఖలానాం ప్రీతయే కుతః,
ఫలన్త్యమృతసేకేఽపి న పథ్యాని విషద్రుమాః. 139

గ. తతోఽహం బ్రవీమి-

శ్లో. అపృష్టోఽపి హితం బ్రూయాద్యస్య నేచ్ఛేత్ పరాభవమ్,
ఏష ఏవ సతాం ధర్మో విపరీతమతోఽన్యథా. 140

అను. ఇంకనూ— "అభివృద్ధికి తేవడంగానీ సన్మానించడంగానీ దుష్టులకు ప్రీతిని గల్గింపజాలవు. అమృతం పోసి పెంచినా విషవృక్షాలు ఆరోగ్యదాయకాలు అయిన ఫలాలను ఇవ్వవు గదా!" ఇందువల్ల నేను చెప్పుచున్నాను-

"ఎవడి పరాభవాన్ని ఎవడు కోరడో- అలా కోరినవాడు అడగకపోయినా పరాభవలక్ష్యమైనవాడికి హితాన్ని బోధించాలి. ఇదే సత్పురుషుల ధర్మం. ఇందుకు భిన్నంగా ప్రవర్తిల్లడం దుర్జనుల లక్షణం అనబడుతుంది. 140

తథా చోక్తమ్-

శ్లో. సః స్నిగ్ధోఽకుశలాన్నివారయతి యస్తత్కర్మ యన్నిర్మలం,
సా స్త్రీ యాఽనువిధాయినీ స మతిమాన్ యః సద్భిరభ్యర్చ్యతే.
సా శ్రీర్యా న మదం కరోతి స సుఖీ యస్తృష్ణయా ముచ్యతే
తన్మిత్రం యదకృత్రిమం స పురుషో యః ఖిద్యతే నేన్ద్రియైః.

అను. విజ్ఞులు ఇలా అన్నారు— "అశుభంనుండి నివారించేవాడే ప్రేమగలవాడు అనీ, పవిత్రం అయినదానినే కార్యం(కర్మ) అనీ, అనుసరించేదాన్నే భార్య అనీ, సజ్జనుల గౌరవం పొందినవాడినే బుద్ధిమంతుడు అనీ, గర్వంగల్గింపని దానినే లక్ష్మి (సంపద) అనీ, ఆశ లేనివాడినే సుఖి అనీ, కపటం లేనివాడినే మిత్రుడు అనీ, ఇంద్రియాలచే దుఃఖం పొందనివాడినే పురుషుడు అనీ అంటారు."

గ. యది సఞ్జీవకవ్యసనాదితో విజ్ఞాపితోఽపి స్వామీ న నివర్తతే తదీదృశే భృత్యే న దోషః. తథా చ-

శ్లో. నృపః కామాసక్తో గణయతి న కార్యం న చ హితం
యథేష్టం స్వచ్ఛన్దః ప్రవిచరతి మత్తో గజ ఇవ.
తతో మానధ్మాతః స పతతి యదా శోకగహనే
తదా భృత్యే దోషాన్ క్షిపతి న నిజం వేత్త్యవినయమ్. 142

అను. నేను ఇంతగా విన్నవించినా ప్రభువులవారు సంజీవకుడిపై ఉండే వ్యసనరూపమైన ప్రేమ మొదలైన కారణాలవలన మనస్సును మార్చుకొనకపోతే అప్పుడు ఈ విషయంలో ఈ సేవకుడి దోషం ఏమీ లేదు. మరియూ-

"కామాసక్తుడైన ప్రభువు (అవశ్యమైన) కార్యాన్ని గణింపడు. హితం వినడు. మదగజం వలె ఇష్టం వచ్చినట్లు స్వచ్ఛందంగా ప్రవర్తిస్తాడు. అప్పుడు అభిమానంచే ఉన్మత్తుడు అయిపోతాడు. అలాంటప్పుడు (క్రమంగా) దుఃఖం అనే దుర్గమారణ్యంలో చిక్కుపడుతాడు. ఆ దోషాన్ని సేవకులపై నెట్టివేస్తాడు. తన అవినయాన్ని అందుకు కారణంగా గుర్తింపడు". 142

గ. పిఙ్గలకః (స్వగతమ్)-

శ్లో. న పరస్యాపరాధేన పరేషాం దణ్డమాచరేత్,
ఆత్మనాఽవగతం కృత్వా బధ్నీయాత్పూజయేచ్చ వా. 143

గ. తథా చోక్తమ్

శ్లో. గుణదోషావనిశ్చిత్య విధిర్న గ్రహనిగ్రహే,
స్వనాశాయ యథా న్యస్తో దర్పాత్ సర్పముఖే కరః. 144

గ. ప్రకాశం బ్రూతే- 'తదా సఞ్జీవకః కిం ప్రత్యాదిశ్యతామ్':

అను. అంత పింగలకుడు తనలో ఇలా తలంచాడు-

"ఒకడి అపరాధంచే మఱియొకణ్ణి దండింపరాదు. స్వయంగా గ్రహించాలి. ఆమీదట దండించడంగానీ, గౌరవించడంగానీ చేయాలి". 143

మరియూ విజ్ఞులు ఇలా అన్నారు-

"మంచిచెడ్డలను నిశ్చయింపక అనుగ్రహంగానీ ఆగ్రహంగానీ చూపడం సముచితం గాదు. అలా చేయడం అనేది అహంకారంతో (గర్వంతో) పాము నోటిలో చేతిని ఉంచడంవంటిది." ఇలా తలంచి ప్రకాశంగా దమనకుడితో ఇలా చెప్పాడు- 'అలాంటప్పుడు సంజీవకుణ్ణి బహిష్కరింపవలయునా ఏమిః'

గ. దమనకః ససంభ్రమమాహ- 'దేవ! మామైవమ్. ఏతావతా మన్త్రిభేదో జాయతే'. తథాహ్యుక్తమ్-

శ్లో. మన్త్రిబీజమిదం గుప్తం రక్షణీయం యథా తథా,
మనాగపి న భిద్యేత తద్భిన్నం న ప్రరోహతి. 145

కిఞ్చ-

శ్లో. ఆదేయస్య ప్రదేయస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి తద్రసమ్. 146

అను. అందుకు దమనకుడు తొట్రుపాటుతో ఇలా అన్నాడు-'ప్రభూ! వద్దు అలా వద్దు. ఇందుచే మంత్రం (ఆలోచన-రహస్యం) పొక్కుతుంది. విజ్ఞులు ఇలా అన్నారు-

"ప్రభువు మంత్రం అనే బీజాన్ని ఉన్నది ఉన్నట్లుగా(జాగ్రత్తగా) రక్షించాలి. అది అల్పంగా స్ఫుటితం(పగిలినది)అయినా మరలా మొలక ఎత్తదు" 145

మరియూ- "తీసికొనడంగాని, ఇవ్వడంగాని, ఇతరకర్తవ్య కార్యంగాని త్వరగా చేయబడనిచో వాటి సారాన్ని కాలం పీల్చివేస్తుంది". అనగా శీఘ్రంగా చేయబడని ఆదాన-ప్రదాన కర్తవ్యకార్యాదుల పరిణామం సుఖావహం గాదు-అని భావం. 146

గ. తదవశ్యం సమారబ్ధం మహతా ప్రయత్నేన సమ్పాదనీయమ్.

కిఞ్చ-

శ్లో. మన్త్రో యోధ ఇవాధీరః సర్వాఙ్గైః సంవృతైరపి,
చిరం న సహతే స్థాతుం పరేభ్యో భేదశఙ్కయా. 147

గ. యద్యసౌ దృష్టదోషోఽపి దోషాన్నివర్త్య సన్ధాతవ్యస్తద తీవాఽనుచితమ్. యతః-

శ్లో. సకృద్దుష్టస్తు యో మిత్రం పునః సన్ధాతుమిచ్ఛతి,
స మృత్యుమేవ గృహ్ణాతి గర్భమశ్వతరీ యథా. 148

అను. అందుచే ఆరంభించిన కార్యాన్ని మిక్కిలి ప్రయత్నంతో అవశ్యం పూర్తిచేయాలి. మరియూ-

"పిరికివాడైన యుద్ధవీరుడు తన అవయవాలను అన్నింటినీ కవచాదికంచే కప్పుకొని ఉన్నా శత్రువులు భేదిస్తారు అనే భయంచే యుద్ధభూమిలో చాలాకాలం నిలవజాలనివిధంగా మంత్రాన్ని(రాజకీయరహస్యాన్ని)సైతం చాలాకాలం అలాగే ఉంచరాదు.'' 147

ఇక ఇతడి దోషం తెలిసినా- 'దోషంనుండి మరలించి ఇతడితో సంధిని చేసుకొందము'-అని తలంతుమేని అది మిక్కిలి అనుచితం. ఏలననగా-

"ఒకమారు దుష్టుడైన (వంచనచేసిన) మిత్రుడితో ఎవడు మరల సంధిని కోరునో- వాడు కంచరగాడిద గర్భం దాల్చినట్లు మరణమునే స్వీకరిస్తున్నాడు".

గ. సింహో బ్రూతే—'జ్ఞాయతాం తావత్ కిమస్మాకమసౌ కర్తుం సమర్థః ?' ఇతి దమనక ఆహ—దేవ !

శ్లో. అఙ్గాఙ్గిభావమజ్ఞాత్వా కథం సామర్థ్యనిర్ణయః,
పశ్య టిట్టిభమాత్రేణ సముద్రో వ్యాకులీకృతః. 149

గ. సింహః పృచ్ఛతి—'కథమేతత్ ?' దమనకః కథయతి—

అను. సింహం అడిగింది-'ఇతను మమ్ము ఏమి చేయగలడో (మొదట)

తెల్పుము?. దమనకుడు ఇలా చెప్పాడు- 'ప్రభూ ? "సహాయ్య-సహాయక రూప మైన ఇతడి అంగాంగిసంపదను తెలిసుకొనకుండా ఎలా సామర్థ్యం నిర్ణయింప గలం ? చూడండి-చిన్న తీతువుపిట్ట సముద్రుణ్ణి ఎంతగా కలతపెట్టిందో ?

సింహం అడిగింది-'అది ఎట్లు'.

దమనకుడు ఇలా చెప్పసాగాడు-

## 9. సముద్ర - టిట్టిభకథా

(సముద్రంయొక్కయూ తీతువుపిట్టలజంటయొక్కయూ కథ)

గ. దక్షిణసముద్రతీరే టిట్టిభదమ్పతీ నివసతః. తత్ర చాసన్న ప్రసవా టిట్టిభీ భర్తారమాహ—"నాథ ? ప్రసవయోగ్యస్థానం నిభృత మనుసన్ధీయతామ్" ఇతి.

టిట్టిభోఽవదత్ — "ప్రియే ! నన్విదమేవస్థానం ప్రసూతి యోగ్యమ్". సా బ్రూతే—"సముద్రవేలయా వ్యాప్యతే స్థాన మేతత్". టిట్టిభోఽవదత్—"కిమహం నిర్బలః సముద్రేణ నిగ్రహీతవ్యః"? టిట్టిభీ విహస్యాఽఽహ—"స్వామిన్ త్వయా సముద్రేణ చ మహద న్తరమ్. అథవా

శ్లో. పరాభవం పరిచ్ఛేత్తుం యోగ్యాయోగ్యఞ్చ వేత్తి యః,
అస్తీహ యస్య విజ్ఞానం కృచ్ఛ్రేణాఽపి న సీదతి. 150

గ. అపిచ-

శ్లో. అనుచితకార్యారమ్భః స్వజనవిరోధో బలీయసా స్పర్ధా,
ప్రమదాజనవిశ్వాసో మృత్యోర్ద్వారాణి చత్వారి. 151

అను. దక్షిణసముద్రతీరంలో తీతువుపిట్టల జంట నివసిస్తూంది. ప్రసవ కాలం సమీపించడంతో ఆడతీతువు భర్తతో ఇలా చెప్పింది- 'నాథ ః పురుటికి తగిన ఏకాంత స్థానం వెదుకండి'. అందుకు మగతీతువు ఇలా అంది 'ప్రియులారా! ఈ చోటే నీ పురుటికి తగినదై ఉంది గదా ?' ఆడ తీతువు ఇలా అంది- 'నాథా! ఈ ప్రదేశం సముద్రంయొక్క అలలచే నిండి పోతుంది'? (అందుకు) మగతీతువు ఇలా బదులు పల్కింది- 'సముద్రంచే నిగ్రహింపబడడానికి (అవమానింపబడ డానికి) నేనేమి అంత బలహీనుడనా ః అది విని ఆడ తీతువు పక్కున నవ్వింది- మగడితో ఇలా అంది- సముద్రుడికి తమకుచాల భేదం ఉంది. మరియూ-స్వామీ ః

"ఎవడు తన అవమానాన్ని తొలగించుకొనే విషయంలో తన యోగ్యతను గుర్తింపగలడో-తన శక్తిని గూర్చిన (సమగ్ర) జ్ఞానం గల్గి ఉంటాడో- అలాంటి వాడు ఎలాంటి ఆపదలందూ దుఃఖితుడు గాడు". 150

ఇంకనూ-"తగని పనిని ఆరంభించడం, తనవారితో విరోధం, బలవంతుడితో పోటీపడడం, ఆడవారిని నమ్మడం-అనే ఈ నాలుగు మృత్యుద్వారాలు అంటారు".

గ. తతః కృచ్ఛ్రేణ స్వామివచనాత్ సా తత్రైవ ప్రసూతా. ఏతత్సర్వం శ్రుత్వా సముద్రేణాఽపి తచ్ఛక్తిజ్ఞానార్థం తదణ్డాన్యపహృతాని. తతష్టిట్టిభీ శోకాఽఽర్తా భర్తారమాహ-"నాథ! కష్టమాపతితమ్. తాన్యణ్డాని మే నష్టాని టిట్టిభోఽవదత్-'ప్రియే? మా భైషీః'. ఇత్యుక్త్వా పక్షిణాం మేలకం కృత్వా పక్షిస్వామినో గరుడస్య సమీపం గతః. తత్ర గత్వా సకలవృత్తాన్తం టిట్టిభేన భగవతో గరుడస్యపురతో నివేదితమ్ 'దేవ! సముద్రేణాఽహం స్వగృహేఽవస్థితో వినాఽపరాధేనైవ నిగృహీతః? తత స్తద్వచనమాకర్ణ్య గరుత్మతా ప్రభుర్భగవాన్నారాయణః సృష్టి-స్థితి ప్రలయ హేతుర్విజ్ఞప్తః. స సముద్రమణ్డదానాయాఽఽదిదేశ. తతో భగవదాజ్ఞాం మౌళౌ నిధాయ సముద్రేణ తాన్యణ్డాని టిట్టిభాయ సమర్పితాని. అతోఽహం బ్రవీమి-'అఙ్గాఙ్గిభావమజ్ఞాత్వా ఇత్యాది."

అను. అంత ఆడతీతువు తనకు కష్టంగా ఉన్నా భర్తమాటను

పాటించింది. అచ్చటనే ప్రసవించింది (గ్రుడ్లు పెట్టింది). ఇది అంతా సముద్రుడు విన్నాడు- వాటి శక్తిని పరీక్షింపదలచాడు-అందుచే ఆ గ్రుడ్లను అపహరించాడు. అప్పుడు ఆడతీతువు మిక్కిలి దుఃఖంచే పీడిత అయింది-మగడితో ఇలా అంది-'నాథ ! కష్టం వచ్చిపడింది. ఆ నా గ్రుడ్లు నశించాయి'. అందుకు మగతీతువు ఇలా బదులు చెప్పింది-'ప్రియురాలా ? భయపడవద్దు'. ఇలా అని మగతీతువు పక్షులను అన్నింటినీ సమావేశపరచింది-(ఆ సమావేశంలోని నిర్ణయం ప్రకారం పక్షులకు అన్నింటికి ప్రభువు అయిన గరుడునివద్దకు పోయింది. విషయం అంతా తెలిపి ఇలా విన్నవించింది-'దేవ ? నేను ఏ దోషం చేయలేదు. నా యింటిలో ఉండే నన్ను సముద్రుడు ఇలా శిక్షించాడు?. గరుడుడు అది అంతా విన్నాడు- భగవానుడు సర్వజగత్ప్రభువు సృష్టి-స్థితి-ప్రలయకారకుడు అయిన నారాయణుడికి విన్నవించాడు. నారాయణుడు గ్రుడ్లను ఇవ్వవలసినదిగా సముద్రుణ్ణి ఆజ్ఞాపించాడు. అంత సముద్రుడు భగవదాజ్ఞను శిరమున వహించాడు. గ్రుడ్లను తీతువునకు ఇచ్చాడు. అందుచే నేను(దమనకుడను) చెప్పుతున్నాను. (అంగాంగి భావం తెలుసుకొనక) సహాయ సహాయకసంపదను గుర్తింపక-ఇత్యాది. (చూడుడు-149 శ్లోకభావం)

గ. రాజాఽఽహ-'కథమసౌ జ్ఞాతవ్యో ద్రోహబుద్ధిరితి' దమనకో బ్రూతే-"యదాఽసౌ సదర్పః శృఙ్గాగ్రప్రహరణాఽభిముఖశ్చకిత ఇవాఽఽగచ్ఛతి తదా జ్ఞాస్యతి స్వామీ" ఇతి. ఏవముక్త్వా స సఞ్జీవక సమీపం గతః. తత్ర గతశ్చ మన్దం మన్దముపసర్పన్ విస్మితమివాఽఽత్మానమదర్శయత్. సఞ్జీవకేన సాదరముక్తమ్— 'భద్ర, కుశలం తే'? దమనకో బ్రూతే- 'అనుజీవినాం కుతః కుశలమ్. యతః—

శ్లో. సమ్పత్తయః పరాధీనాః సదా చిత్తమనిర్వృతమ్,
స్వజీవితేఽప్యవిశ్వాసస్తేషాం యే రాజసేవకాః. 152

అను. అది విని ప్రభువైన పింగలకుడు ఇలా అడిగాడు-'ఇతనుద్రోహబుద్ధి గలవాడని తెలిసికొనడం ఎలా?" దమనకుడు ఇలా చెప్పాడు-"ఎప్పుడు అతను కొమ్ములకొనలతో పొడవడానికి తయారైనవాడులా తత్తరపాటుతో వస్తాడో అప్పుడు ప్రభువులు(అతడి ద్రోహిబుద్ధిని)తెలుసుకోగలరు". ఇలా అచ్చటి

నుండి కదలాడు దమనకుడు. సంజీవకుడివద్దకు పోయాడు- మెల్లమెల్లగా అతన్ని సమీపిస్తూ తనను ఆశ్చర్యంతో కూడియున్నట్లుగా కనబడజేశాడు. సంజీవకుడు అతన్ని చూచాడు- ఆదరంగా ఇలా అడిగాడు- 'శుభమూర్తీ, మీరు క్షేమంగా ఉన్నారా?' అది విని దమనకుడు ఇలా అన్నాడు- 'సేవకులకు కుశలం ఎక్కడిది?

ఏలననగా- "రాజసేవకుల సంపదలు నిత్యం పరాధీనాలై ఉంటాయి. మనస్సునకు శాంతి ఉండదు. తమ జీవితమునందే నమ్మకం ఉండదు.'' 152

అన్యచ్చ

శ్లో. కోఽర్థాన్ ప్రాప్య న గర్వితో విషయిణః కస్యాపదోఽస్తంగతాః
స్త్రీభిః కస్య న ఖణ్డితం భువి మనః కో వాఽస్తి రాజ్ఞాం ప్రియః,
కః కాలస్య భుజాన్తరం న చ గతః కోఽర్థీ గతో గౌరవం
కో వా దుర్జనవాగురాసు పతితః క్షేమేణ యాతః పుమాన్. 153

అను. మరియూ- "ఈ ప్రపంచంలో సంపదలు పొంది గర్వించనివాడూ, విషయాసక్తుడై ఆపదలను తొలగించుకొన్నవాడూ, ఆడవారిచే మనస్సు విఱుగడను పొందనివాడూ, ప్రభువులకు (నిత్యం) ఇష్టమైనవాడూ, మృత్యువు కౌగిట్లో చిక్కనివాడూ, యాచకుడై గౌరవం పొందినవాడూ, దుర్జనుల వలల్లో చిక్కి క్షేమంగా మరలినవాడూ ఎవ్వడు ఉన్నాడు?"- అనగా ఎవ్వడు లేడు అని భావం.

గ. సఞ్జీవకేనోక్తమ్- "సఖే ! కిమేతత్?" ఇతి. దమనక ఆహ- "కిం బ్రవీమి మన్దభాగ్యః. పశ్య-

శ్లో మజ్జన్నపి పయోరాశౌ లబ్ధ్వా సర్పావలమ్బనమ్,
న ముఞ్చతి న చాఽఽదత్తే తథా ముగ్ధోఽస్మి సమ్ప్రతి. 154

యతః-

శ్లో. ఏకత్ర రాజవిశ్వాసో నశ్యత్యన్యత్ర బాన్ధవః,
కిం కరోమి క్వ గచ్ఛామి పతితో దుఃఖసాగరే. 155

గ. ఇత్యుక్త్వా దీర్ఘం నిఃశ్వస్యోపవిష్టః.

అను. సంజీవకుడు అడిగాడు- 'మిత్రమా ! ఇదేమి? (ఇలా మాట్లాడుతున్నావు)'. దమనకుడు ఇలా చెప్పాడు- 'అభాగ్యుణ్ణి. ఏం చెప్పగలను' చూడుము. "ఒకడు సముద్రంలో మునుగుతూ ఉండగా ఒక పాము ఆధారంగా చేతికి అందింది. కాని అతను దాన్ని విడువలేడు. గట్టిగా పట్టుకోలేడు. అలానే ప్రస్తుతం భ్రాంతిలో ఏమి చేయడానికి తెలియనిస్థితిలో ఉన్నాను." 154

ఏలననగా- "ఒకప్రక్క రాజువద్ద నమ్మకం నశిస్తుంది. ఇంకొకప్రక్క (నీవంటి) బంధువు నశిస్తాడు. ఏమి చేయుదును? ఎక్కడికి పోవాలి? దిక్కుతోచక దుఃఖసముద్రంలో మునిగిపోయాను." 155

ఇలా పల్కి నిట్టూర్పు విడిచి చతికిలబడ్డాడు.

గ. సఞ్జీవకో బ్రూతే- 'మిత్ర ! తథాపి సవిస్తరం మనోగతము చ్యతామ్' ఇతి. దమనకః సునిభృతమాహ– 'యద్యపి రాజవిశ్వాసో న కథనీయః తథాపి భవానస్మదీయప్రత్యయాదాగతః. మయా పరలోకార్థినాఽవశ్యం తవ హితమాఖ్యేయమ్, శృణు. అయం స్వామీ తవోపరి వికృతబుద్ధీ రహస్యుక్తవాన్- "సఞ్జీవకమేవ హత్వా స్వపరివారం తర్ప యామి". ఏతచ్ఛ్రుత్వా సఞ్జీవకః పరం విషాదమగమత్. దమనకః పునరాహ- "అలం విషాదేన; ప్రాప్తకాలం కార్యమనుష్ఠీయతామ్."

అను. సంజీవకుడు అడిగాడు– 'మిత్రమా ! అలా అయిన వివరంగా నీ మనస్సులోని విషయం తెల్పుము'. అంత దమనకుడు మిగుల నమ్రతతో(మెల్లగా-గోప్యంగా) ఇలా చెప్పాడు- ప్రభువు నమ్మకంతో చెప్పినదాన్ని తెలుపరాదు. ఏమైనా తాము నన్ను నమ్మి వచ్చినవారు. అందుచే చావును కోరి అయినా నేను తప్పక తమకు హితం బోధించాలి. వినండి- ఈ ప్రభుబుద్ధి మీయెడ వికృతంగా మారింది. అతను నాతో రహస్యంగా ఇలా అన్నాడు- 'ఈ సంజీవకుణ్ణి చంపి ఈ నా పరివారానికి విందు చేస్తాను'. ఇది వినగానే సంజీవకుడు మిగుల విషాదం పొందాడు. అంతట దమనకుడు మరలా ఇలా అన్నాడు-'తాము విషాదం పొందవద్దు. సమయానికి తగినట్లు ఆచరించండి'.

గ. సఞ్జీవకః క్షణం విమృశ్యాఽఽహ స్వగతమ్-"సుష్ఠు ఖల్విద ముచ్యతే - కిం వా దుర్జనచేష్టితం న వేత్యేతద్ వ్యవహారాన్నిర్ణేతుం న శక్యతే. యతః-

శ్లో. దుర్జనగమ్యా నార్యః ప్రాయేణాపాత్రభృద్భవతి రాజా,
కృపణానుసారి చ ధనం మేఘో గిరిజలధివర్షీ చ. 156

శ్లో. కశ్చిదాశ్రయసౌన్దర్యాద్ధత్తే శోభామసజ్జనః,
ప్రమదాలోచనన్యస్తం మలీమసమివాఞ్జనమ్. 157

అను. సంజీవకుడు క్షణకాలం విచారించి తనలో తాను తలంచాడు-'విజ్ఞులు ఈ విషయంలో చక్కగా చెప్పారు- మరియూ ఇది దుర్జనులు పన్నిన కుట్రయా-కాదా అని సైతం నడవడికవల్ల నిర్ణయం చేయడానికి వీలుపడదు. ఏలననగా-

"స్త్రీలు దుర్జనులనే పొందుతారు. ప్రభువు అయోగ్యులనే పోషిస్తాడు ధనం లోభివానినే చేరుతుంది. మేఘం కొండలపై సముద్రంపై వర్షిస్తుంది." 156

"ఎలా సుందరీమణియొక్క అందమైన కంటిని చేరడంతో నల్లనైన కాటుకసైతం కాంతి నందుతోందో అలాగే దుష్టుడుసైతం తాను ఆశ్రయించిన వస్తువుయొక్క శోభచే విరాజిల్లుతాడు." 157

గ. తత్ర విచిన్త్యోక్తమ్– 'కష్టం కిమిదమాపతితమ్. యతః-

శ్లో. ఆరాధ్యమానో నృపతిః ప్రయత్నా
న్న తోషమాయాతి కిమత్ర చిత్రమ్,
అయం త్వపూర్వప్రతిమావిశేషో
యః సేవ్యమానో రిపుతాముపైతి. 158

గ. తదయమశక్యార్థః ప్రమేయః. యతః-

శ్లో. నిమిత్తముద్దిశ్య హి యః ప్రకుప్యతి
ధ్రువం స తస్యాఽపగమే ప్రసీదతి,

అకారణద్వేషి మనస్తు యస్య వై
కథం జనస్తం పరితోషయిష్యతి. 159

గ. కిం మయాఽపకృతం రాజ్ఞః. అథవా నిర్నిమిత్తాఽపకారిణశ్చ భవన్తి రాజానః".

అను. ఇలా తనలో విచారించి దమనకుడితో సంజీవకుడు అన్నాడు- 'ఈ కష్టమైన(గొప్పదైన) ఆపద ఇలా వచ్చిపడింది.'

ఏలననగా- "ఏదేని ప్రతిమారూపమైన (అర్చావతారమైన) దైవాన్ని అల్పంగా ఆరాధించినా సుకృతం లభిస్తుంది- కానీ ఈ నూతనప్రతిమారూపమైన ప్రభువునుమాత్రం ఎంతగా ఆరాధించినా సంతోషం పొందదు. ఇందు ఆశ్చర్యం లేదు. సేవించేకొద్దీ శత్రుతనే పొందును." అనగా- ప్రభువును సేవించేకాలంలో అల్పకాలాన్ని దైవసేవకు వినియోగిస్తే మానవుడు తరిస్తాడు అని భావం. 158

అందువలన ఈ రాజసేవావిషయం (ప్రమేయం) మిక్కిలి అసాధ్యమైన కార్యం. ఏలననగా-

"ఏదేని కారణంవల్ల ఎవడేని కోపం పొందితే, ఆ కారణం తొలగించి అతన్ని సంతోషం పొందించడానికి సాధ్యం అవుతుంది. కాని అకారణంగా ద్వేషించే మనస్సు గలవాడిని ఎలా సంతుష్టుని చేయగలం?" 159

నేను ప్రభువునకు ఏమి కీడు చేశాను ? అయినా ప్రభువులు అకారణంగా అపకర్తలుగా ఉంటారు?

గ. దమనకో బ్రూతే- 'ఏవమేతత్' శృణు-

శ్లో. విజ్ఞైః స్నిగ్ధైరుపకృతమపి ద్వేష్యతామేతి కైశ్చిత్
సాక్షాదన్యైరపకృతమపి ప్రీతిమేవోపయాతి,
చిత్రం చిత్రం కిమథ చరితం నైకభావాశ్రయాణాం,
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః. 160

అను. దమనకుడు ఇలా చెప్పాడు- 'ఇది ఇంతే. వినుము-

"విజ్ఞులూ మేలుకోరేవారూ అయిన కొందరు సేవకులు చేసిన ఉపకారం సైతం ప్రభువులచే ద్వేషింపబడుతూంది. ఇక అహితులు చేసిన సాక్షాత్తుగా అప కారం సైతం ప్రీతికారణం అవుతూంది. స్థిరచిత్తంలేని ప్రభువుల చరితంలో ఇంత కంటె ఆశ్చర్యం ఏముంది ? అందువల్ల ఈ సేవాధర్మం దుర్గ్రాహ్యమైంది. యోగు లకునూ బోధపడదు." 160

అన్యచ్చ -

శ్లో. కృతశతమసత్సు నష్టం సుభాషితశతం చ నష్టమబుధేషు,
వచనశతమవచనకరే బుద్ధిశతమచేతనే నష్టమ్. 161

కిఞ్చ—

శ్లో. చన్దనతరుషు భుజఙ్గా జలేషు కమలాని తత్ర చ గ్రాహాః,
గుణఘాతినశ్చ భోగే ఖలా న చ సుఖాన్యవిఘ్నాని. 162

అను. మరియూ- "నీచులకు చేసిన వందలకొలది ఉపకారాలూ, మూర్ఖు లకు చెప్పిన వందలకొలది సుభాషితాలూ, ఆచరింపనివాడికి బోధించిన వందల కొలది సలహాలు, తెలివిలేనివాడికి చేసిన వందలకొలది ఉపదేశాలు- ఇవన్నీ నిష్ఫలాలు." 161

ఇంకనూ- "పరిమళం ఉండే గంధపుచెట్లలో పాములూ, కమలాలు ఉండే నీళ్ళలో మొసళ్ళూ, భోగములలో గుణఘాతకులైన నీచులూ ఉండడం లోకస్థితి. సుఖాలు ఏవీ విఘ్నాలులేనివై లేవు". అనగా విఘ్నయుక్తాలు అని భావం. 162

(ద్వితీయాభావం వస్తురూపం అని న్యాయశాస్త్రసిద్ధాంతం).

గ. అయం స్వామీ వాచిమధురో విషహృదయో జాతః. యతః-

శ్లో. దూరాదుచ్ఛ్రితపాణిరార్ద్రనయనః ప్రోత్సారితార్ధాసనో
గాఢాలిఙ్గనతత్పరః ప్రియకథాప్రశ్నేషు దత్తాదరః,
అన్తర్భూతవిషో బహిర్మధుమయశ్చాతీవ మాయాపటుః
కో నామాఽయమపూర్వనాటకవిధిర్యః శిక్షితో దుర్జనైః. 163

అను. ఈ ప్రభువు మాటలో తియ్యనివాడుగా హృదయంలో విషయుక్తుడుగా అయినట్లున్నాడు. ఏలననగా—

"వచ్చే వ్యక్తిని చూడగానే దూరంనుండియే స్వాగతభావంతో చేతిని ఎత్తడం, ఆనందబాష్పాలతో కన్నులను నింపడం, గాఢంగా కౌగలించుకోడానికి ఆసక్తితో ఉండడం, ప్రియజనుల విషయాలను అడుగడంలో ఆదరాన్ని చూపడం, లోపల విషంతో నిండిఉన్నా బయటికి మధురంగా కనబడడం- మొదలైన మాయానైపుణ్యాన్ని అద్భుతంగా ప్రదర్శించే ఈ అపూర్వనాటకవిధానం ఎంత విచిత్రమైంది? దీన్ని దుర్జనులు చక్కగా నేర్చుతారు." 163

గ. తథాహి-

శ్లో. పోతో దుస్తరవారిరాశితరణే దీపోఽన్ధకారాఽఽగమే
నిర్వాతే వ్యజనం మదాన్ధకరిణాం దర్పోపశాన్త్యై సృణిః,
ఇత్థం తద్భువి నాస్తి యస్య విధినా నోపాయచిన్తా కృతా
మన్యే దుర్జనచిత్తవృత్తిహరణే ధాతాఽపి భగ్నోద్యమః. 164

అను. అది యుక్తమే- (ఎట్లనగా)-

"దాటశక్యంగాని సముద్రం దాటడానికి నౌక, చీకటిని తొలగించడానికి దీపం, గాలి లేనప్పుడు విసనకఱ్ఱ, మదగజాల మదాన్ని అణచేందుకు అంకుశం ఇలా ప్రతిదానికి ప్రతీకారోపాయం బ్రహ్మ చేశాడు. అలా ప్రతీకారం లేనిది లోకంలో లేదు. కానీ దుర్జనుల చిత్తవృత్తిని మార్చే విషయంలో బ్రహ్మదేవుడు సైతం ప్రయత్నవిఫలుడనియే తలుస్తాను". 164

గ. [తచ్ఛ్రుత్వా]సఞ్జీవకః పునర్నిశ్వస్య 'కష్టం భోః' కథమహం సస్యభక్షకః సింహేన నిపాతయితవ్యః! యతః-

శ్లో. యయోరేవ సమం విత్తం యయోరేవ సమం బలమ్,
తయోర్వివాదో మన్తవ్యో నోత్తమాధమయోః క్వచిత్. 165

గ. (పునర్విచిన్త్య) కేనాఽయం రాజా మమోపరి వికారితః, న జానే. భేదముపగతాద్రాజ్ఞః సదా భేతవ్యమ్.

యద్వా-

శ్లో. మన్త్రిణా పృథివీపాలచిత్తం విఘటితం క్వచిత్,
వలయం స్ఫటిక స్యేవ కో హి సన్ధాతుమీశ్వరః. 166

అను. (అది విని) సంజీవకుడు మరల నిట్టూర్పు విడిచాడు- ఇలా తలంచాడు. 'అయ్యో! కష్టం, నేను గడ్డితినేవాడనై ఉండియూ సింహంచే చంప బడుతున్నాను- ఏలననగా-

"లోకంలో సమానధనం అలాగే సమానబలం గలవారికే విరోధం (లేక స్నేహం) సంభవమగును. ఉత్తములకు అధములకు ఎచ్చటా సంభవం గాదు". (మరల ఆలోచించి) ఈ రాజుకు నాపై ఎవడు విపరీతభావము పుట్టించినాడో తెలియదు. భేదమును పొందిన రాజునుండి భయపడవలెను. ఎందుచేతననగా "స్ఫటికకంకణాన్ని విరగగొట్టినట్లు ఎవడో మంత్రి రాజుమనస్సును విఱచి ఉంటాడు. దాన్ని అతికించే సమర్థుడు ఎవడు గలడు?" 165-166

గ. అన్యచ్చ -

శ్లో. వజ్రం చ రాజతేజశ్చ ద్వయమేవాతిభీషణమ్,
ఏకమేకత్ర పతతి పతత్యన్యత్ సమన్తతః. 167

తతః సఙ్గ్రామే మృత్యురేవ వరమ్. ఇదానీం తదాజ్ఞాఽనువర్తన మయుక్తమ్. యతః-

శ్లో. మృతః ప్రాప్నోతి వా స్వర్గం శత్రుం హత్వా సుఖాని చ,
ఉభావపి హి శూరాణాం గుణావేతౌ సుదుర్లభౌ. 168

అను. మరియూ- "వజ్రాయుధం, రాజశక్తి- ఈ రెండూ మిక్కిలి భయంకరమైనట్టివి. ఇందులో ఒకటి (అయిన వజ్రాయుధం) ఒకచోటనే పడు తుంది. రెండవది (రాజశక్తి) అంతటా పడుతుంది''. 167

అందువల్ల యుద్ధంలో మరణించడమే ఉత్తమం. ఇప్పుడు అతడి ఆజ్ఞను పాలించడం సముచితం గాదు. ఏలననగా- ''వీరుడైనవాడు మరణిస్తే స్వర్గానికి

పోతాడు. శత్రువును చంపితే సుఖాలు అనుభవిస్తాడు. వీరులైనవారికి ఈ రెండూ లాభాలే''. (ఇతరులకుమాత్రం ఇవి కష్టసాధ్యాలు) 168

గ. యుద్ధకాలశ్చాయమ్.

శ్లో. యత్రాఽయుద్ధే ధ్రువం మృత్యుర్యుద్ధే జీవితసంశయః,
తమేవ కాలం యుద్ధస్య ప్రవదన్తి మనీషిణః. 169

యతః-

శ్లో. అయుద్ధే హి యదా పశ్యేన్న కిఞ్చిద్ధితమాత్మనః,
యుధ్యమానస్తదా ప్రాజ్ఞో మ్రియతే రిపుణా సహ. 170

అను. ఇది యుద్ధానికి తగిన కాలం.

"ఎచ్చట యుద్ధం లేకుండినా మరణం తప్పదో - యుద్ధంనందే జీవితం సంశయయుక్తంగా ఉంటుందో- అలాంటి పరిస్థితినే యుద్ధానికి .తగిన కాలం అని విజ్ఞులు అంటారు''. 169

ఏలననగా- "యు ద్ధం చేయనందువల్ల తనకు ఏవిధమైన మేలు లేనప్పుడు ప్రాజ్ఞుడైనవాడు యుద్ధం చేస్తూ శత్రువుచే మరణిస్తాడు". 170

శ్లో. జయే చ లభతే లక్ష్మీం మృతే చాఽపి సురాఙ్గనామ్,
క్షణవిధ్వంసినః కాయాః కా చిన్తా మరణే రణే. 171

ఏతచ్చిన్తయిత్వా సఞ్జీవక ఆహ- 'భో మిత్ర ! కథమసౌ మాం జిఘాంసుర్జ్ఞాతవ్యః' ఇతి.

అను. ''జయిస్తే రాజ్యలక్ష్మి లభిస్తుంది. మరణిస్తే వీరస్వర్గంలో దేవకాంతసుఖం లభిస్తుంది. శరీరాలు క్షణికాలు. అలాంటి స్థితిలో యుద్ధంలో సంభవించే మరణాన్ని గూర్చి విచారించడం దేనికి ?" 171

ఇలా తలంచి సంజీవకుడు (ప్రకాశంగా) ఇలా అన్నాడు- ఓ మిత్రమా ! ఇతను నన్ను చంపదలచాడు- అని ఎలా తెలుసుకోవాలి ?

గ. దమనకో బ్రూతే- 'యదాఽసౌ పిఙ్గలకః సమున్నతలాఙ్గూల ఉన్నతచరణో వివృతాస్యస్త్వాం పశ్యతి, తదా త్వమపి సవిక్రమం దర్శయిష్యసి. యతః-

శ్లో. బలవానపి నిస్తేజాః కస్య నాఽభిభవాఽఽస్పదమ్,
నిఃశఙ్కం దీయతే లోకైః పశ్య భస్మచయే పదమ్. 172

గ. కిన్తు సర్వమేతత్ సుగుప్తమనుష్ఠాతవ్యమ్. నోచేన్న త్వం నాఽహమ్'-ఇత్యుక్త్వా దమనకః కరటకసమీపం గతః.

అను. దమనకుడు ఇలా అన్నాడు- ఎప్పుడైతే ఈ పింగలకుడు తోకను పైకి ఎత్తి ఉంటాడో అలాగే ముందరికాళ్ళను సైతం పైకెత్తి నోరు బాగుగా తెఱచి దాడిచేయడానికి సిద్ధమైనట్లుగా ఉండి నిన్ను చూస్తాడో అప్పుడు నీవూ నీ పరాక్రమం చూపగలవు. ఏలననగా-

''బలం ఉన్నా తేజస్సు (పరాక్రమం) లేనిచో ఎవడైనా అవమానం పొందుతాడు. చూడుము- జనులు బూడిదరాశిపై నిర్భయంగా పాదం ఉంచుతారు''. 172

కానీ ఇదంతా మిక్కిలి రహస్యంగా ఆచరించాలి. అలా కానిచో నీవూ ఉండవు; నేనూ ఉండను. ఇలా అని దమనకుడు కరటకుడివద్దకు పోయాడు.

గ. కరటకేనోక్తమ్ - 'కిం నిష్పన్నమ్'? దమనకేనోక్తమ్- "నిష్పన్నోఽసావన్యోన్యభేదః". కరకకో బ్రూతే- కోఽత్ర సన్దేహః యతః-

శ్లో. బన్ధుః కో నామ దుష్టానాం కుప్యతే కో న యాచితః,
కో న దృప్యతి విత్తేన కుకృత్యే కో న పణ్డితః. 173

గ. అన్యచ్చ-

శ్లో. దుర్వృత్తః క్రియతే ధూర్తైః శ్రీమానాత్మవివృద్ధయే,
కిం నామ ఖలసంసర్గః క్రియతే నాఽఽశ్రయాశవత్. 174

అను. కరటకుడు అడిగాడు- 'ఏమి చేశావు ?" అందుకు దమనకుడు ఇలా చెప్పాడు- "ఇరువురికి భేదభావాలు పుట్టించాను". అది విని కరటకుడు ఇలా అన్నాడు- 'ఇందు సందేహం ఏముంది ? ఏలనన- "దుష్టులకు బంధువు ఎవడు ఉన్నాడు ? యాచిస్తే కోపం పొందనివాడు ఎవడు గలడు ? ధనంచే గర్వం పొందనివాడెవడు గలడు ? చెడ్డపనిని చేయడానికి నేర్పులేనివాడు ఎవడు గలడు?

మరియూ- "వంచకులు తమ అభివృద్ధికై ధనికుడిని దుష్టునిగా చేస్తారు. దుష్టసహవాసం అగ్నివలె ఏపనినైనా చేస్తుంది".

గ. తతో దమనకః పిఙ్గలకసమీపం గత్వా- "దేవ! సమాగతోఽసౌ పాపాశయః. తతః సజ్జీభూయ స్థీయతామ్-ఇత్యుక్త్వా పూర్వోక్తాకారం కారయామాస. సఞ్జీవకోఽప్యాగత్య తథావిధం వికృతాకారం సింహం దృష్ట్వా స్వానురూపం విక్రమం చకార. తతస్తయోర్యుద్ధే సఞ్జీవకః సింహేన వ్యాపాదితః.

అను. ఇలా కరటకుడు అనుచుండగా దమనకుడు పింగలకుడి వద్దకు పోయాడు. ఇలా విన్నవించాడు- "దేవా ! ఆ పాపబుద్ధి (అయిన సంజీవకుడు) వచ్చాడు. దాడికి సిద్ధంగా ఉండండి. ఇలా అని పింగలకుడిని ఆలాంటి రూపం గలవాడిని (సంజీవకుడి దగ్గర తాను తెల్పిన రూపం గలవాడిని)గా చేశాడు. తర్వాత సంజీవకుడు వచ్చాడు- అలా వికృతరూపంతో ఉండే సింహాన్ని చూచాడు. తన శక్తికి తగినట్లుగా ఎదిరించాడు. ఆ ఇరువురికి జరిగిన యుద్ధంలో పింగలకుడు సంజీవకుణ్ణి వధించాడు.

గ. అథ సంజీవకం సేవకం పిఙ్గలకో వ్యాపాద్య విశ్రాన్తః సశోక ఇవ తిష్ఠతి, బ్రూతే చ- "కిం మయా దారుణం కర్మ కృతమ్? యతః-

శ్లో. పరైః సంభుజ్యతే రాజ్యం స్వయం పాపస్య భాజనమ్,
ధర్మాతిక్రమతో రాజా సింహో హస్తివధాదివ. 175

గ. అపరఞ్చ-

శ్లో. భూమ్యేకదేశస్య గుణాన్వితస్య
భృత్యస్య వా బుద్ధిమతః ప్రణాశః,
భృత్యప్రణాశో మరణం నృపాణాం
నష్టాపి భూమిః సులభా న భృత్యాః. 176

అను. అంత తన సేవకుడైన సంజీవకుణ్ణి చంపి (అలసిపోయిన) పింగలకుడు విశ్రాంతి తీసికొంటూ దుఃఖితుడయ్యాడు. ఇలా అన్నాడు- 'అయ్యో! నేను ఈ పాపమైన పనిని ఎందుకు చేశాను? -ఏలననగా-

"సింహం ఏనుగును చంపి పాపం పొందుతుంది. ఏనుగుమాంసాన్ని తక్కిన జంతువులన్నీ భుజిస్తాయి. అలాగే రాజు ధర్మాతిక్రమణం చేసి (రాజ్యం సంపాదించి) తాను పాపానికి పాత్రుడౌతాడు. కానీ రాజ్యసుఖాన్ని ఇతరులు హాయిగా అనుభవిస్తారు". 175

మరియూ - "రాజ్యంలో సారవంతమైన కొంతభాగం లేక గుణవంతుడూ బుద్ధిమంతుడూ అయిన సేవకుడూ - అనే ఈ రెండింటిని తులనాత్మకంగా పరిశీలిస్తే అలాంటి సేవకుడి మరణం రాజునకు తన మరణంతో సమానం. ఏలనన- పోయిన రాజ్యాన్ని మరల సంపాదించవచ్చును. మరణించిన సేవకుడు మరల తిరిగిరాడు గదా!" 176

గ. దమనకో బ్రూతే- "స్వామిన్! కోఽయం నూతనో న్యాయో యదరాతిం హత్వా సన్తాపః క్రియతే. తథా చోక్తమ్ -

శ్లో. పితా వా యది వా భ్రాతా పుత్రో వా యది వా సుహృత్,
ప్రాణచ్ఛేదకరా రాజ్ఞా హన్తవ్యా భూతిమిచ్ఛతా. 177

అపిచ-

శ్లో. ధర్మార్థకామతత్త్వజ్ఞో నైకాన్తకరుణో భవేత్,
న హి హస్తస్థమప్యన్నం క్షమావాన్ భక్షితుం క్షమః. 178

అను. అప్పుడు దమనకుడు ఇలా చెప్పాడు - "దేవా ! ఇదేమి క్రొత్త రాజనీతిగా ఉందే. శత్రువును చంపి దుఃఖం పొందుతున్నారు. విజ్ఞులు ఇలా అన్నారు-

"ఐశ్వర్యం కోరే ప్రభువు - తన ప్రాణానికి అపాయంగా తోస్తే తండ్రిని గాని, సోదరుణ్ణి గాని - పుత్రున్ని గాని - మిత్రుని గాని వధించవలసిందే."

మరియూ - "ధర్మార్థకామాలు అనే పురుషార్థముల తత్త్వం చక్కగా నెరింగినవాడు, పూర్తిగా దయామయుడై ఉండరాదు. ఏలనన, అధికక్షమ గల వాడు చేతిలోని అన్నాన్ని సైతం భక్షింపలేడు". 178

అపరఞ్చ-

శ్లో. క్షమా శత్రౌ చ మిత్రే చ యతీనామేవ భూషణమ్,
అపరాధిషు సత్త్వేషు నృపాణాం సైవ దూషణమ్. 179

కిఞ్చ-

శ్లో. రాజ్యలోభాదహంకారాదిచ్ఛతః స్వామినః పదమ్,
ప్రాయశ్చిత్తన్తు తస్యైకం జీవోత్సర్గో న చాపరమ్. 180

అను. మరియూ - "శత్రువునందు, మిత్రుడియందు సహనంగా ఉండడం అనేది సంన్యాసులకు (యతీశ్వరులకు) మాత్రమే శోభను గల్గిస్తుంది. అపరాధులైన ప్రాణులను క్షమించడం అనేది మాత్రం రాజులకు దోషం - అనగా కీడును గల్గిస్తుంది". 179

ఇంకా - "రాజ్యంపై ఆశచేగానీ - అహంకారంచేగానీ రాజపీఠం గోరే వాడికి ప్రాయశ్చిత్తం మరణమే. ఇతరశిక్ష యేదీ సరిపోదు." 180

అన్యచ్చ-

శ్లో. రాజా ఘృణీ బ్రాహ్మణః సర్వభక్షీ
స్త్రీ చావశా దుష్ప్రకృతిః సహాయః,
ప్రేష్యః ప్రతీపోఽధికృతః ప్రమాదీ
త్యాజ్యా ఇమే యశ్చ కృతం న వేత్తి. 181

విశేషతశ్చ-

శ్లో. సత్యానృతా చ పరుషా ప్రియవాదినీ చ
హింస్రా దయాలురపి చార్థపరా వదాన్యా,
నిత్యవ్యయా ప్రచురరత్నధనాగమా చ
వారాఙ్గనేవ నృపనీతిరనేకరూపా. 182

అను. మరియూ- "దయావంతుడైన ప్రభువు, అన్నీ భుజించే బ్రాహ్మణుడు, లోబడి ఉందని ఆడది, చెడుస్వభావం గల సహాయకుడు, ఎదురించే సేవకుడు, తప్పులు చేసే అధికారీ, చేసిన ఉపకారం గుర్తింపనివాడు, - ఈ ఏడుగురిని పరిత్యజించాలి.'' 181

విశేషించి "ఈ రాజనీతి అనేది వేశ్యవలె - ఒకచో సత్యవాక్కు గలదైనచో మఱియొకచోట అసత్యం పలుకుతూంది. కొన్నియెడల కఠినంగా ఉంటే మఱియొకచోట మృదుమధురంగా మాట్లాడుతుంది. ఒకచో హింసకమైతే వేఱొకచో దయామయంగా భాసిల్లుతుంది. ఒకచో ధనార్జనపరంగా ఉంటే మరియొకచో అధికదానశీలతతో విరాజిల్లుతుంది. ఒకచో నిత్యం వ్యయం చేసేదిగా ఉంటే ఇంకొకచోట అధికంగా ధనాన్ని ఆర్జించేదిగా ఉంటుంది. ఇలా ఈ రాజనీతి అనేకరూపంగా విరాజిల్లుతూంది." 182

గ. ఇతి దమనకేన సన్తోషితః పిఙ్గలకః స్వాం ప్రకృతిమాపన్నః. సింహాసనే సముపవిష్టః. దమనకః ప్రహృష్టమనాః - "విజయతాం మహారాజః. శుభమస్తు సర్వజగతామ్' - ఇత్యుక్త్వా యథాసుఖమవస్థితః.

అను. ఇలా దమనకుడు సంతోషకరమైన మాటలు పల్కాడు. అది విని పింగలకుడు ఆనందం పొందాడు. మొదటి స్థితికి వచ్చాడు. సింహాసనం అధిష్ఠించాడు. అప్పుడు దమనకుడు మిక్కిలి సంతృప్తుడయ్యాడు - 'మహారాజుకు విజయం కల్గుగాక. సర్వప్రపంచానికి శుభం అగుగాక ! అని పల్కి సుఖంగా (అతడిముందు) కూర్చున్నాడు."

గ. విష్ణుశర్మోవాచ - 'సుహృద్భేదః శ్రుతస్తావద్భవద్భిః.' రాజ

పుత్రా ఊచుః - "భవత్ప్రసాదాచ్ఛ్రుతః. సుఖినో భూతా వయమ్.
విష్ణుశర్మాఽబ్రవీత్ - ' అపరమపీదమస్తు.

శ్లో. సుహృద్భేదస్తావద్భవతు భవతాం శత్రుభవనే
ఖలః కాలాఽఽకృష్టః ప్రలయముపసర్పత్వహరహః,
జనో నిత్యం భూయాత్ సకలసుఖసంపత్తివసతిః
కథారమ్భే రమ్యే సతతమిహ బాలోఽపి రమతామ్. 183

ఇతి హితోపదేశే నారాయణపణ్డితసఙ్గృహీతే సుహృద్భేదో నామ ద్వితీయః కథాసఙ్గ్రహః సమాప్తః.

అను. విష్ణుశర్మ ఇలా చెప్పాడు - 'తాము ఈ మిత్రభేదం విన్నారు గదా?
రాజపుత్రులు అన్నారు-'తమ అనుగ్రహంవల్ల విన్నాం. మేము సుఖం పొందాం.
విష్ణుశర్మ (మరల) ఇలా అన్నాడు - 'మరియు ఈ శుభంసైతం గల్గుగాక.

"ఈ మిత్రభేదం మీ శత్రువుల ఇండ్లలో సంభవించుగాక. దుష్టులు ప్రతిదినం మృత్యువుచే ఆకృష్టులై నశింతురు గాక. ప్రజలు అందరు సకలశుభసంపదలకు నివాసం అగుదురుగాక. నా యీ అందమైన కథల ఆరంభాదికంచే శిశువులుసైతం ఆనందం పొందుదురుగాక." శుభం. 183

ఇది శ్రీ నారాయణ పండిత సంగృహీతమైన హితోపదేశంలో మిత్రభేదం అనే ద్వితీయకథాసంగ్రహానికి శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి విరచితమైన ఆంధ్రానువాదం సమాప్తం.

ఓమ్ - తత్ - సత్

# అకారాదిక్రమ శ్లోకసూచిక

హ

హితోపదేశము—ద్వితీయభాగము
[విగ్రహము, సంధి]

ప్రథమ ముద్రణ : 1994

ప్రతులు : 2000

వెల రూ. /- 30/—



This book is published with the financial Assistance of Tirumala Tirupati Devasthanams under their scheme "Aid to publish Religious books."

ప్రకాశకులు :

సంస్కృతభాషా ప్రచార సమితి
5.4.743 (2వ అంతస్తు)
హరేకృష్ణదేవాలయం ప్రక్కన,
నాంపల్లిస్టేషన్ రోడ్డు,
హైదరాబాదు - 500 001.
ఫోన్ నెం. 515481, 590028.

ముద్రణ :
శివాజీ ప్రెస్, 4-4-53, గంజ్‌బజార్, సికింద్రాబాదు-3.

శ్రీః

# తొలిపలుకు

అత్యుత్తమమైన ప్రాచీనసంస్కృతసాహిత్య గ్రంథాలను తెలుగు అనువాదాలద్వారా ఆంధ్రయువతకు అందజేయాలనే ఉద్దేశ్యంతో సంస్కృతభాషా ప్రచార సమితి గ్రంథప్రచురణ కార్యాన్ని యథాశక్తిగా సాగిస్తూన్నది. నీతులను కథలద్వారా బోధించడంలో పంచతంత్రానికీ, దాన్ని అనుసరించి వ్రాయబడిన హితోపదేశానికీ ఉన్న వైశిష్ట్యం అందరికీ తెలిసినదే. ఇంతకు పూర్వమే పంచతంత్రం రెండు సంపుటాలలో ఉత్తమ సంస్కృతవిద్వాంసులు శ్రీ జీరెడ్డి బాల చెన్నారెడ్డిగారి ఆంధ్రానువాదంతో ప్రకటించబడింది. వారే రచించిన ఆంధ్రానువాదంతో హితోపదేశం మొదటి సంపుటం 1993 లో సమితి ఆంధ్రపాఠకలోకానికి అందజేసింది. దీని రెండవసంపుటాన్ని ఇప్పుడు సంతోషపూర్వకంగా అందజేస్తున్నది. ఏతదనువాదరచయితలైన శ్రీబాలచెన్నారెడ్డిగారికి సమితి కృతజ్ఞతను తెలుపుతున్నది.

ఇంతకు పూర్వం కొన్ని గ్రంథాల ప్రచురణకూ, ఈ హితోపదేశ ద్వితీయ భాగ ప్రచురణకూ ఆర్థికసహాయం అందజేసిన శ్రీ తిరుమల తిరుపతిదేవస్థానాధికారులకు సమితిపక్షాన కృతజ్ఞత తెలుపుతూ ఏతాదృశగ్రంథప్రచురణకు శ్రీవేంకటగిరీశుడు నిరంతరము సమితికి తగు సామర్థ్యమును కలిగించగలడని విశ్వసిస్తున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు
కులపతి
సంస్కృతభాషా ప్రచార సమితి

హైదరాబాదు,
30-3-1994.

# విషయ సూచికా

# హితోపదేశః – విగ్రహః

## ౼తోపదేశము - విగ్రహము (యుద్ధము)

అథ పునః కథారమ్భకాలే రాజపుత్రా ఊచుః- ''ఆర్య !
ౕయమ్. త ద్విగ్రహం శ్రోతుం నః కుతూహలమస్తి''.
క్తమ్- ''యద్యేవం భవద్భ్యో రోచతే తత్ కథయామి.
ౕయతామ్. యస్యాఽయమాద్యః శ్లోకః-

ఏః సహ మయూరాణాం విగ్రహే తుల్యవిక్రమే,
స్య వఞ్చితా హంసాః కాకైః స్థిత్వాఽరిమన్దిరే. 1

అంతట మరల కథారంభసమయాన రాజపుత్రులు ఇలా అడిగారు-
ు రాజపుత్రులం. అందువల్ల మాకు విగ్రహాన్ని (యుద్ధాన్ని)
్కంఠగా ఉంది." విష్ణుశర్మ ఇలా చెప్పాడు-"మీకు అలా ఇష్టంగా
పిస్తాను. విగ్రహం (యుద్ధం) వినండి". దాని మొదటి శ్లోకం ఇది

ా నెమళ్లూ సమానపరాక్రమం గలవి. అయినా వాటికి యుద్ధం
అప్పుడు కాకులు శత్రువులైన హంసల ఇల్లు చేరాయి. హంసలకు
ాయి. వాటిని మోసగించాయి (ఓడించాయి). 1

రాజపుత్రా ఊచుః- ''కథమేతత్ ?" విష్ణుశర్మా కథయతి-
రద్వీపే పద్మకేలినామధేయం సరః. తత్ర హిరణ్యగర్భో
ంసః ప్రతివసతి. స చ సర్వై ర్జలచరైః పక్షిభి ర్మిలిత్వా
షిక్తః. యతః-

శ్లో. యది న స్యాన్నరపతిః సమ్యఙ్నేతా తతః ప్రజా,
అకర్ణధారా జలధౌ విప్లవేతేహ నౌ రివ. 2

అపరఞ్చ-

శ్లో. ప్రజాం సంరక్షతి నృపః సా వర్ధయతి పార్థివమ్,
వర్ధనా ద్రక్షణం శ్రేయ స్తదభావే సదప్యసత్. 3

అను. రాజపుత్రులు అడిగారు-"అది ఎట్లు? విష్ణుశర్మ ఇలా చెప్పసాగాడు- "కర్పూరద్వీపమున పద్మకేలి అనే ప్రసిద్ధమైన కొలను ఉంది. అచ్చట హిరణ్య గర్భుడు అనే రాజహంస నివసిస్తూంది. నీటిలో నివసించే పక్షులన్నీ కలిసి ఆ హిరణ్యగర్భుణ్ణి పక్షిరాజ్యానికి ప్రభువుగా అభిషేకం చేశాయి. ఏలనన-

చక్కని నాయకుడైన ప్రభువు లేనిచో ప్రజ సరంగు లేని నౌకవలె దుఃఖ సముద్రంలో మునిగిపోతుంది. 2

మరియూ- రాజు ప్రజను సంరక్షిస్తాడు. ప్రజ ధనధాన్యాదిరూపమైన పన్ను (శిస్తు)చే రాజును వృద్ధి నందిస్తుంది. కాని ఈ రక్షణ-వర్ధనములనే రెండిం టిలో రక్షణయే శ్రేష్ఠమైనది. రక్షణ లేనియెడల వర్ధనం ఉండియూ లేనట్లే. 3

మూ. ఏకదాఽసౌ రాజహంసః సువిస్తీర్ణకమలపర్యఙ్కే సుఖాఽఽసీనః పరివారపరివృత స్తిష్ఠతి. తతః కుతశ్చిద్దేశా దాగత్య దీర్ఘముఖో నామ బకః ప్రణమ్యోపవిష్టః. రాజోవాచ- "దీర్ఘముఖ! దేశాన్తరా దాగతోఽసి. వార్తాం కథయ". స బ్రూతే-దేవ! మహతీ వార్తా. తా మాఖ్యాతుకామ ఏవ సత్వర మాగతోఽస్మి. శ్రూయతామ్-

అను. ఒకనాడు ఆ రాజహంస సువిశాలమైన కమలశయనంపై ఆనందంగా కూర్చుండి పరివారంతో కొలువుదీరి ఉంది. అప్పుడు ఏదో దేశాంతరంనుండి దీర్ఘముఖుడు అనే కొంగ వచ్చింది. ప్రణమిల్లి- ప్రభుని కనుసైగచే యథోచిత పీఠంపై కూర్చుంది. అంత ప్రభువు ఇలా అడిగాడు- "దీర్ఘముఖా! దేశాంతరం నుండి వచ్చావు. అచ్చటి వార్తను తెలుపుము." దీర్ఘముఖుడు ఇలా బదులు చెప్పాడు- "ప్రభూ! గొప్ప వార్త గలదు. దాన్ని తెల్పడానికే త్వరగా వచ్చాను. వినండి-

మూ. అస్తి జమ్బూద్వీపే విన్ధ్యో నామ గిరిః. తత్ర చిత్రవర్ణో నామ మయూరః పక్షిరాజో నివసతి. తస్యాఽనుచరై శ్చరద్భిః పక్షిభి రహం దగ్ధారణ్యమధ్యే చర న్నవలోకితః. పృష్టశ్చ- "క స్త్వమ్? కుతః సమాగతోఽసి"? తదా మయో క్తమ్-"కర్పూరద్వీపస్య రాజచక్రవర్తినో హిరణ్యగర్భస్య రాజహంసస్యాఽనుచరోఽహం, కౌతుకా ద్దేశా న్తరం ద్రష్టు మాగతోఽస్మి. ఏతచ్ఛ్రుత్వా పక్షిభి రుక్తమ్- "అనయో ర్దేశయోః కో దేశో భద్రతరో, రాజా చ".

అను. జంబూద్వీపాన వింధ్యం అనే పర్వతం ఉంది. అచ్చట చిత్రవర్ణుడు అనే నెమలి నివసిస్తుంది. అది అచ్చటి పక్షులకు అన్నింటికి రాజు. నేను దండకారణ్యంలో తిరుగుతూ ఉండగా అతడి సేవకులైన పక్షులు నన్ను చూచాయి. ఇలా అడిగాయి-"నీవు ఎవరు ? ఎచ్చటినుండి వచ్చావు ?" అంత నేను ఇలా చెప్పాను- "కర్పూరద్వీపంలో హిరణ్యగర్భుడు అనే రాజహంస కలదు. అతను ఆ ద్వీపానికి సార్వభౌముడు. నేను అతడి సేవకుడను. ఇతరదేశాలు చూచే కుతూహలంతో వచ్చాను." అది విని ఆ పక్షులు ఇలా అన్నాయి- "ఈ రెండుదేశాలలో ఏ దేశం శుభతరమైంది ? ఏ ప్రభువు ప్రశస్తుడు ?"

మూ. తతో మయో క్తమ్- "ఆః! కి మేవ ముచ్యతే ? మహద న్తరమ్. యతః కర్పూరద్వీపః స్వర్గ ఏవ. రాజహంసశ్చ ద్వితీయః స్వర్గ పతిః. కథం వర్ణయితుం శక్యతే ? అత్ర మరుస్థలే పతితా యూయం కిం కురుథ? అస్మద్దేశే గమ్యతామ్." తతోఽస్మ ద్వచన మాకర్ణ్య సర్వే పక్షిణః సకోపా బభూవుః.

శ్లో. పయఃపానం భుజఙ్గానాం కేవలం విషవర్ధనమ్,
ఉపదేశో హి మూర్ఖాణాం ప్రకోపాయ న శా న్తయే. 4

అను. అప్పుడు నేను ఇలా అన్నాను-"ఆః ! ఎందుకు ఇలా అంటున్నారు? చాలా భేదం ఉంది. కర్పూరద్వీపం స్వర్గమే. రాజహంసుడు రెండవ ఇంద్రుడు, ఎలా వర్ణింపగలం ? ఈ ఎడారిభూమిలో పడిన మీరు ఏం చేస్తారు ? మా దేశానికి

రండి". అంత నా మాటలు వినగానే ఆ పక్షులు అన్నీ మిక్కిలి కోపంపొందాయి. విజ్ఞులు ఇలా చెప్పారు—

పాములకు పాలు త్రాపడం వాటి విషాన్ని పెంచడానికే అవుతుంది. అలాగే మూర్ఖులకు హితం బోధించడంవల్ల వారి కోపం పెరుగునే గాని శాంతిం. 4

అన్యచ్చ-

శ్లో. విద్వానే వోపదేష్టవ్యో నాఽవిద్వాంస్తు కదాచన,
వానరా నుపదిశ్యాఽథ స్థానభ్రష్టా యయుః ఖగాః. 5

రాజోవాచ— "కథ మేతత్ ?" దీర్ఘముఖః కథయతి-

అను. మరియూ బుద్ధిమంతుడికే ఉపదేశం చేయాలి. మూర్ఖుడికి ఎన్నటికి చేయరాదు. కోతులకు నీతిని బోధించి పక్షులు స్థానభ్రష్టాలై (ఇల్లూ-వాకిలీ విడిచి పెట్టి) పోయాయి. 5

రాజు అడిగాడు-"అది ఎట్లు?" దీర్ఘముఖుడు (కొంగ) ఇలా చెప్పసాగాడు—

# 1. వానరాణాం పక్షిణాం చ కథా

## [కోతులయు పక్షులయు కథ]

మూ. అస్తి నర్మదాతీరే పర్వతోపత్యకాయాం విశాలః శాల్మలీ తరుః. తత్ర నిర్మితనీడక్రోడే పక్షిణః సుఖేన నివసన్తి. అథైకదా వర్షాసు నీలపట్టైరివ జలధరపటలై రావృతే నభస్తలే ధారాఽఽసారై ర్మహతీ వృష్టిర్బభూవ. తతో వానరాంశ్చ తరుతలేఽవస్థితాన్ శీతాఽఽకులాన్ కమ్పమానా నవలోక్య కృపయా పక్షిభి రుక్తమ్- "భో! భో! వానరాః! శృణుత-

శ్లో. అస్మాభి ర్నిర్మితా నీడా శ్చఞ్చుమాత్రాహృతై స్తృణైః,
హ స్తపాదాదిసంయుక్తా యూయం కి మవసీదథ. 6

అను. నర్మదానదీతీరంలో ఒక కొండలోయలో ఒకానొక పెద్ద బూరుగు చెట్టు ఉంది. ఆ చెట్టుకొమ్మలపై గూళ్ళు కట్టుకొని ఎన్నియో పక్షులు సుఖంగా నివసిస్తూ ఉన్నాయి. అంత ఒకసారి వర్షాకాలంలో ఆకాశం మేఘాలచే దట్టంగా ఆవరింపబడింది. తెఱపి లేకుండ ధారాపాతంగా గొప్ప వర్షం కురువసాగింది. అప్పుడు ఆ చెట్టుక్రిందికి కొన్ని కోతులు చేరాయి. అవి చలిచే వణకుతూ మిక్కిలి బాధపడుతూన్నాయి. వాటిని చెట్టుమీద ఉండే పక్షులు చూచాయి. జాలిపడినాయి. సమీపించి ఇలా అన్నాయి- "ఓ ఓ కోతులారా ! వినండి-

ముక్కు మాత్రమే ఉండే మేము గడ్డిపరకలు తెచ్చుకొని ఇలా గూళ్ళు కట్టుకున్నాము (వాటిలో సుఖంగా ఉన్నాము). మీకు కాళ్ళూ చేతులూ ఉన్నాయి. అయినా బాధ పడుతున్నారు." 6

మూ. తచ్ఛ్రుత్వా వానరై ర్జాతా మర్షై రాలోచితమ్- "అహో ! నిర్వాతనీడగర్భాఽవస్థితాః సుఖినః పక్షిణోఽస్మా న్నిన్దన్తి. తద్భవతు తావద్ వృష్టే రుపశమః." అనన్తరం శాన్తే పానీయవర్షే, తై ర్వానరై ర్వృక్ష మారుహ్య, సర్వే నీడా భగ్నాః; తేషా మణ్డాని చాధః పాతితాని. అతోఽహం బ్రవీమి- 'విద్వానేవోపదేష్టవ్య' ఇత్యాది (పానీయవర్షే=జల వృష్టౌ).

అను. ఆ మాటలు విని కోతులు కోపం పొందాయి. ఇలా ఆలోచన చేశాయి- "ఔరా ! గాలి దూరని గూళ్ళలో సుఖంగా ఉండడంతో ఈ పక్షులు మనలను నిందిస్తూన్నాయి. కానిమ్ము, వర్షం తగ్గనీ. ఇలా తలంచి వర్షం ఆగగానే ఆ కోతులు చెట్టును ఎక్కాయి. పక్షుల గూళ్ళను అన్నింటినీ నాశనం చేశాయి. వాటి గ్రుడ్లను నేలపై పడద్రోశాయి. అందుచే నేను (దీర్ఘముఖుడు అనే కొంగను) చెప్పుతున్నాను-"విద్వాంసులకే బోధించాలి"-ఇత్యాది.

మూ. రాజోవాచ - "తతస్తైః పక్షిభిః కిం కృతమ్"? బకః కథయతి-"తతస్తైః పక్షిభిః కోపాదుక్తమ్-'కేనాఽసౌ రాజహంసో రాజా

కృతః ?' తతో మయోపజాతకోపే నోక్తమ్-'అయం యుష్మదీయో మయూరః కేన రాజా కృతః'? ఏతచ్ఛ్రుత్వా తే పక్షిణో మాం హన్తు ముద్యతాః. తతో మయాఽపి స్వవిక్రమో దర్శితః.

యతః—

శ్లో. అన్యదా భూషణం పుంసః క్షమా లజ్జేవ యోషితః,
పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ. 7

అను. అంత ప్రభువు (హంసలరాజు హిరణ్యగర్భుడు) ఇలా అడిగాడు. "అప్పుడు ఆ పక్షులు ఏమి చేశాయి ?" కొంగ ఇలా చెప్పసాగింది- "ఆ పక్షులు అప్పుడు కోపంతో అన్నాయి. 'ఈ రాజహంసున్ని రాజుగా ఎవరు చేశారు ?' అది వినగానే నాకు కోపం వచ్చింది. ఇలా సమాధానం చెప్పాను- 'మీ ఈ నెమలిని ఎవరు రాజుగా చేశారు?' అది వినగానే ఆ పక్షులు నన్ను చంపడానికి సిద్ధమైనాయి. అప్పుడు నేనూ నా పరాక్రమం చూపాను. ఏలనగా- స్త్రీలకు (సురతంకంటె) ఇతరములైన సమయాలలో సిగ్గువలె, పురుషులకు క్షమ శోభ నిస్తుంది. అలాగే రతికాలంలో స్త్రీలకు ధృష్టతవలె, పురుషులకు అవమానసమయంలో పరాక్రమం శోభను కల్గిస్తుంది. 7

[ధృష్టత = నేర్పు; ప్రౌఢత]

మూ. రాజా విహస్యాఽఽహ-

శ్లో. ఆత్మనశ్చ పరేషాం చ యః సమీక్ష్య బలాబలమ్,
అన్తరం నైవ జానాతి స తిరస్క్రియతేఽ రిభిః. 8

కిఞ్చ-

శ్లో. సుచిరం హి చరన్నిత్యం క్షేత్రే సస్య మబుద్ధిమాన్,
ద్వీపిచర్మపరిచ్ఛన్నో వాగ్దోషాద్ గర్దభో హతః. 9

బకః పృచ్ఛతి-'కథ మేతత్ ?' రాజా కథయతి—

అను. రాజు నవ్వి ఇలా అన్నాడు-తనయొక్కయు, శత్రువులయొక్కయూ

బలాన్ని, బలహీనతను పరిశీలించి అందలి భేదాన్ని గ్రహింప జాలనివాడు శత్రువులచే తిరస్కృతుడు అగును. 8

మరియూ- ఒకనొక గాడిద పులిచర్మంచే కప్పబడినదై చాలకాలంగా పంటపొలంలో పైరును మేస్తూనే ఉంది. కానీ ఒకనాడు బుద్ధిహీనత కారణంగా ఓండ్ర పెట్టింది. పొలం కాపరులచే చంపబడింది. 9

కొంగ అడిగింది- "అది యెట్లు ?"

రాజహంస ఇలా చెప్పసాగింది-

## 2. రజకస్య-తద్గర్దభస్య చ కథా

(చాకలి - మరియు వాడి గాడిద కథ)

మూ. అస్తిహస్తినాపురే విలాసో నామ రజకః. తస్య గర్దభోఽతి భారవహనా ద్దుర్బలో ముమూర్షురివాభవత్. తతస్తేన రజకేనాఽసౌ వ్యాఘ్రచర్మణా ప్రచ్ఛాద్యాఽరణ్యసమీపే సస్యక్షేత్రే విముక్తః. తతో దూరా త్తమవలోక్య వ్యాఘ్రబుద్ధ్యా క్షేత్రపతయః సత్వరం పలాయన్తే.

అను. హస్తినాపురంలో విలాసుడు అనే చాకలి ఉండేవాడు. అతనికి ఒక గాడిద ఉండేది. అది బరువును అధికంగా మోయడంతో బలహీనతవల్ల చచ్చేదిగా తయారైంది. అప్పుడు చాకలి ఆ గాడిదకు పులితోలు కప్పాడు. అడవికి దగ్గరగా ఉండే పంటచేలో వదిలాడు. పొలంకాపరులు దూరంనుండి దాన్ని చూచేవారు. పులి అని తలంచి (భయంతో) పరుగెత్తేవారు.

మూ. అథైకదా కేనాఽపి సస్యరక్షకేణ ధూసరకమ్బలకృతతనుత్రాణేన ధనుష్కాణ్డం సజ్జీకృత్య ఆనతకాయే నైకాన్తే స్థితమ్. తం చ దూరా ద్దృష్ట్వా గర్దభః పుష్టాఙ్గో యథేష్టసస్యభక్షణజాతబలో 'గర్ద

భో౽య' మితి మత్వోచ్చైః శబ్దం కుర్వాణ స్తదభిముఖం ధావితః. తతస్తేన సస్యరక్షకేణ చీత్కారశబ్దా ద్గర్దభో౽య మితి నిశ్చిత్య లీల యైవ వ్యాపాదితః. అతో౽హం బ్రవీమి- "సుచిరం హి చరన్నిత్యమ్-" ఇత్యాది.

అను. అంతట ఒకనాడు ఒకానొక పొలంకాపరి బూడిదపన్నె కంబళిని ఒడలంతా కవచంవలె కప్పుకున్నాడు. విల్లును ఎక్కుపెట్టాడు. బాణప్రయోగానికి అనుకూలంగా ముందుకు కొంచెం వంగి ఒక ఏకాంతప్రదేశంలో పొంచి ఉన్నాడు. స్వేచ్ఛగా పైరును మేయడంతో బలిసి అవయవపుష్టితో ఉండే ఈ గాడిద అతణ్ణి చూచింది. "ఇది మఱియొక గాడిద" అని తలచింది. వెంటనే బిగ్గరగా ఓండ్ర పెట్టుతూ అతడి ముందుకు పరుగెత్తింది. అప్పుడు ఆ పొలంకాపరి దాని ఓండ్ర పెట్టడాన్ని వినడంతో ఇది గాడిద అని నిశ్చయించాడు. తేలికగా దాన్ని చంపి వేశాడు. అందుచే నేను (హిరణ్యగర్భుడు అనే రాజహంసను) చెప్పుచున్నాను. "చాలాకాలంగా నిత్యం మేస్తూ"- ఇత్యాది.

మూ. దీర్ఘముఖో బ్రూతే- "తతః పశ్చాత్తైః పక్షిభి రుక్తమ్- "అరే పాప! దుష్టబక! అస్మాకం భూమౌ చరన్నస్మాకం స్వామిన మధిక్షిపసి? తన్న క్షన్తవ్య మిదానీమ్." ఇత్యుక్త్వా సర్వే మాం చఞ్చుభి ర్హత్వా సకోపా ఊచుః- "పశ్య రే మూర్ఖ! స హంస స్తవ రాజా సర్వథా మృదుః. తస్య రాజ్యాధికారో నాస్తి. యత ఏకాన్తమృదుః కరతలస్థ మ ప్యర్థం రక్షితు మక్షమః. స కథం పృథివీం శాస్తి? రాజ్యం వా తస్య కిమ్? త్వం చ కూపమణ్డూకః. తేన తదాశ్రయ ముపదిశసి. శృణు-

శ్లో. సేవితవ్యో మహావృక్షః ఫలచ్ఛాయాసమన్వితః,
యది దైవాత్ ఫలం నాస్తి ఛాయా కేన నివార్యతే. 10

అను. దీర్ఘముఖుడు (కొంగ) ఇలా చెప్పాడు—"పిమ్మట ఆ పక్షులు ఇలా అన్నాయి.- 'ఓరీ పాపాత్మా! దుష్టుడా! మా భూమిలో తిరుగుచూ మాప్రభువును ఆక్షేపిస్తావా! ఇందుకు నిన్ను మేము ఇప్పుడు క్షమింపరాదు'- ఇలా అని అవి అన్నీ నన్ను ముక్కుతో పొడుస్తూ ఇలా అన్నాయి- 'చూడు. ఓరీ మూర్ఖా! నీ

ప్రభువైన ఆ హంస అన్నివిధాలా మెత్తనివాడు. అట్టివాడికి రాజ్యం పాలించే అర్హత లేదు. ఏల ననగా మిక్కిలి మెత్తనివాడు. చేతిలోని వస్తువును సైతం రక్షించుకోజాలడు. అలాంటివాడు ఇక భూమిని ఎలా శాసిస్తాడు ? వాడికి రాజ్యం దేనికి ? నీ వొక బావిలోని కప్పవు. అందుచే అతడి ఆశ్రయాన్ని గూర్చి ఉపదేశిస్తున్నావు, వినుము-

పండ్లూ, నీడా ఉండే పెద్దచెట్టునే ఆశ్రయించాలి. దురదృష్టంవల్ల పండ్లు లభింపకపోతే నీడ అయినా లభిస్తుంది. దాన్ని ఎవడూ నివారింపడు. 10

అన్యచ్చ-

శ్లో. హీనసేవా న కర్తవ్యా కర్తవ్యో మహదాశ్రయః,
పయోఽపి శౌణ్డికీహస్తే వారుణీ త్యభిధీయతే. 11

అన్యచ్చ-

శ్లో. మహాన ప్యల్పతాం యాతి నిర్గుణే గుణవిస్తరః,
ఆధారాఽఽధేయభావేన గజేన్ద్ర ఇవ దర్పణే. 12

అను. మరియూ- నీచులను సేవింపరాదు. మహాత్ములను ఆశ్రయించాలి. ఈడిగదాని చేతిలో ఉండే పాలుసైతం మద్యంగా (కల్లుగా) తలంపబడుతూంది.

[ఈడిగ = మద్యవ్యాపారంచేసే జాతి- గౌండ్లజాతి].

ఇంకనూ- గుణహీనుణ్ణి ఆశ్రయించిన మహాగుణసముదాయం సైతం ఆధారప్రభావంచే అల్పంగా భావింపబడుతూంది. గజరాజం అద్దంలో చిన్నదిగా కనబడుతుంది గదా. 12

కిన్తు-

శ్లో. అజా సింహప్రసాదేన వనే చరతి నిర్భయమ్,
రామమాసాద్య లఙ్కాయాం రాజ్యం లేభే విభీషణః. 13

విశేషతశ్చ-

శ్లో. వ్యపదేశేఽపి సిద్ధిః స్యాదతిశక్తే నరాధిపే,
శశినో వ్యపదేశేన శశకాః సుఖమాసతే''. 14

మయోక్తమ్- "కథమేతత్ ?" తే పక్షిణః కథయన్తి-

అను. మరియూ- సింహంయొక్క అనుగ్రహంచే మేకయూ అడవిలో నిర్భయంగా సంచరింపగలదు. శ్రీరాముడి రక్షణను పొంది విభీషణుడు లంకలో రాజ్యపీఠం అధిష్ఠించాడు. 13

విశేషించి- మిక్కిలి బలవంతుడైన ప్రభువుయొక్క పేరును గ్రహించడం వల్లనూ కార్యం సిద్ధిస్తుంది. శశకములు (కుందేళ్ళు) శశి (చంద్రుని) యొక్క పేరును చెప్పకొని సుఖాన్ని పొందాయి. 14

అంత నేను (దీర్ఘముఖుడు అనే కొంగను) అడిగాను- "అది ఎట్లు ?" ఆ పక్షులు ఇలా చెప్పాయి-

## 3. గజ గాథ - శశక కథా

[గజయూథం-కుందేళ్లు]

మూ. కదాచి ద్వర్షాస్వపి వృష్టేరభావాత్ తృషార్తో గజయూథో యూథపతిమాహ- "నాథ ! కోఽభ్యుపాయోఽస్మాకం జీవనాయ? నాఽస్తి క్షుద్రజన్తూనాం (అపి) నిమజ్జనస్థానమ్. వయం చ నిమజ్జనస్థానాఽభావాన్మృతాః. అన్ధా ఇవ కిం కుర్మః ? క్వ యామః?" తతో హస్తిరాజో నాఽతిదూరం గత్వా నిర్మలం హ్రదం దర్శితవాన్.

అను. ఒకప్పుడు వర్షాకాలంలోనూ వానలు కురువలేదు. అందువల్ల ఏనుగుల గుంపు దాహంచే మిక్కిలి బాధ నొందింది. అప్పుడు అవి తమ యూథ

పతితో ఇలా విన్నవించాయి- "ప్రభూ ! మాకు జీవించే మార్గం ఏదీ కనబడడం లేదు. గున్న ఏనుగులకునూ స్నానం చేయడానికి తగిన స్థలం ఏదీ లేదు. మేమూ స్నానయోగ్యస్థానం లభింపనందున మృతతుల్యులం అయినాము. ఇప్పుడు గ్రుడ్డి వారివలె ఏమి చేయగలం ? ఎచ్చటికి పోగలం ?" అది విన్నాడు ఏనుగులరాజు. కొలదిదూరం వెళ్ళాడు. శుభ్రమైన నీరు గల సరోవరం చూచాడు. దాన్ని ఏనుగులకు చూపాడు (ఏనుగులు ప్రతిదినం అచ్చటికి పోయి స్నానం చేస్తూ ఉండేవి).

మూ. తతో దినేషు గచ్ఛత్సు తత్తీరాఽవస్థితాః క్షుద్రశశకా గజపాదాఽఽహతిభి శ్చూర్ణితాః. అనన్తరం శిలీముఖో నామ శశక శ్చిన్తయామాస- "అనేన గజయూథేన పిపాసాఽఽకులితేన ప్రత్యహ మత్రాఽఽగన్తవ్యమ్. తతో వినష్టమస్మత్కులమ్". తతో విజయో నామ వృద్ధ శశకోఽవదత్- "మా విషీదత. మయాఽత్ర ప్రతీకారః కర్తవ్యః." తతోఽసౌ ప్రతిజ్ఞాయ చలితః. గచ్ఛతా చ తేనాఽఽలోచితమ్- "కథం మయా గజయూథనాథసమీపే స్థిత్వా వక్తవ్యమ్ ? యతః-

శ్లో. స్పృశన్నపి గజో హన్తి జిఘ్రన్నపి భుజఙ్గమః,
పాలయన్నపి భూపాలః ప్రహసన్నపి దుర్జనః. 15

అతోఽహం పర్వతశిఖర మారుహ్య యూథనాథం సంవాదయామి.

అను. అలా కొన్ని దినాలు గడిచాయి. ఆ కొలనుతీరంలో నివసించే చిన్న ప్రాణులైన కుందేళ్ళు ఏనుగుల కాళ్ళ త్రొక్కిళ్ళచే పిండిపైపోయాయి. అప్పుడు శిలీముఖుడు అనే కుందేలు ఇలా విచారించింది– "దాహంచే పీడింపబడే ఏనుగుల గుంపు ప్రతిదినం ఇచ్చటికి వస్తుంది. ఇందువల్ల మా జాతిఅంతా నశించి పోతుంది". అది విని విజయుడు అనే ముసలికుందేలు ఇలా చెప్పింది- "దుఃఖ పడకుడు. ఈ ఆపద తొలగడానికి నేను ఏదేని ఉపాయం చేస్తాను." ఇలా ప్రతిజ్ఞ చేసి అది వెళ్ళిపోయింది. అలా పోతూ అది ఇలా ఆలోచన చేసింది- నేను ఎలా ఏనుగుల గుంపుయొక్క ప్రభువునకు సమీపంలో నిలబడి మాట్లాడగలను ?

ఏలనన- ఏనుగు తాకుతూనే, పాము వాసనచూస్తూనే, రాజు రక్షిస్తూనే, నీచుడు నవ్వుతూనే చంపుతారు. 15

అందుచే పర్వతశిఖరాన్ని ఎక్కి యూథపతితో సంభాషిస్తాను.

మూ. తథాఽనుష్ఠితే సతి యూథనాథ ఉవాచ- "క స్త్వమ్? కుతః సమాయాతః?"

స బ్రూతే- "శశకోఽహమ్. భగవతా చన్ద్రేణ భవద న్తికం ప్రేషితః." యూథపతిరాహ- "కార్య ముచ్యతామ్" విజయో బ్రూతే-

శ్లో. ఉద్యతేష్వపి శస్త్రేషు దూతో వదతి నాఽన్యథా,
సదైవాఽవధ్యభావేన యథార్థస్య హి వాచకః. 16

తదహం తదాజ్ఞయా బ్రవీమి. శృణు- యదేతే చన్ద్రసరోరక్షకాః శశకా స్త్వయా నిస్సారితా స్తదనుచితం కృతమ్. తే శశకా శ్చిర మస్మాకం రక్షితాః. అత ఏవ మే శశాఙ్క ఇతి ప్రసిద్ధిః.

అను. పిమ్మట ఆ ముసలికుందేలు అలాగే ఏనుగులు వచ్చేదారిలో ఉండే ఒక పర్వతశిఖరాన్ని ఎక్కింది. వచ్చే గజయూథాన్ని చూచింది. బిగ్గరగా సగర్వంగా ఇలా అంది— "ఓరీ గజయూథనాథా! నా సందేశం వినుము." అది విని యూథనాథుడు ఇలా అడిగాడు. "ఎవరు నీవు? ఎచ్చటినుండి వచ్చావు?" అది (కుందేలు) ఇలా చెప్పింది- "నేను శశకమును (కుందేలును). భగవానుడైన చంద్రుడు నీదగ్గరకు పంపాడు." యూథపతి అడిగాడు-"పని ఏమిటో తెల్పుము." విజయుడు (కుందేలు పేరు) ఇలా చెప్పాడు- "తనపైకి ఆయుధాలు ఎత్తబడిఉన్నా దూత అయినవాడు అసత్యం పల్కడు. వధార్హుడు కానందున అతను సర్వదా యథార్థాన్నే బోధిస్తాడు. 16

అందువల్ల నేను ఆ చంద్రుడి ఆజ్ఞచే మాట్లాడుతున్నాను. వినుము- నీవు ఈ చంద్రసరోవరరక్షకులైన కుందేళ్ళను (శశకములను) వెళ్ళగొట్టి తప్పుచేశావు. ఈ శశకాలను చిరకాలంగా మేము రక్షిస్తూ వచ్చాము. అందువల్లనే నాకు శశాంకుడు అనే ప్రసిద్ధి గల్గింది."

మూ. ఏవ ముక్తవతి దూతే యూథపతి ర్భయా దిదమాహ- "ప్రణిధే! ఇద మజ్ఞానతః కృతమ్. పునర్న తత్ర గమిష్యామి".

దూత ఉవాచ— "యద్యేవం తదత్ర సరసి కోపాత్ కమ్పమానం భగవన్తం శశాఙ్కం ప్రణమ్య ప్రసాద్య చ గచ్ఛ."

తతస్తేన రాత్రౌ యూథపతిం నీత్వా తత్ర జలే చఞ్చలం చన్ద్రబిమ్బం దర్శయిత్వా స యూథపతిః ప్రణామం కారితః. ఉక్తఞ్చ తేన- "దేవ! అజ్ఞానా దనేన అపరాధః కృతః. తతః క్షమ్యతామ్. నైవం వారాన్తరం విధాస్యతే" ఇత్యుక్త్వా ప్రస్థాపితః. తతో వయం బ్రూమః- "వ్యపదేశేఽపి సిద్ధిః స్యాత్'' ఇతి.

అను. ఇలా దూత చెప్పగానే గజరాజు భయపడిపోయాడు. నమ్రుడై ఇలా విన్నవించాడు- "ఓ రాయబారీ! క్షమించండి. తెలియక ఈ తప్పుచేశాను. మరలా అచ్చటికి పోను."

అది విని దూత [విజయుడు అనే ముసలికుందేలు] ఇలా అంది- "అలా అయితే కొలనువద్దకు రమ్ము. కొలనులో భగవానుడైన చంద్రుడు ఉన్నాడు. అతను నీయెడ కోపావేశంతో వణకుతున్నాడు. ప్రణమిల్లి అతన్ని ప్రసన్నుని చేసికొని పొమ్ము."— ఇలా పల్కి ఆ కుందేలు రాత్రివేళ ఆ గజరాజును కొలనువద్దకు తీసుకొనిపోయింది. కొలనులో అలల తాకిడిచే కదలాడే చంద్రబింబాన్ని చూపించింది. పిమ్మట అతడిచే (గజరాజుచే) ప్రణామం చేయించింది. స్వయంగా ఇలా అర్థించింది- "ప్రభూ! ఇతను తెలియక ఈ తప్పు చేశాడు. అందువల్ల ఇప్పటికి క్షమించండి. మరలా ఇలాంటితప్పు ఎప్పటికీ చేయడు."

ఇలా ప్రార్థనను నటించి ఆ గజయూథపతిని పంపివేసింది. అందుచే మేము (మయూరప్రభు సేవకులం) చెప్పుతున్నాం— "మహాత్ముల పేరును ఏదో నెపంగా పేర్కొనడంవల్లనూ కార్యం సిద్ధిస్తుంది" అని.

మూ. తతో మయోక్తమ్— "స ఏవాఽస్మత్ప్రభూ రాజహంసో మహాప్రతాపోఽతిసమర్థః. త్రైలోక్యస్యాపి ప్రభుత్వం తత్ర యుజ్యతే. కిం పునః పక్షిరాజ్యమ్" ఇతి. తదాఽహం తైః పక్షిభిః-"దుష్ట! కథమస్మ

ద్భూమౌ చరసి'' ఇత్యభిధాయ రాజ్ఞశ్చిత్రవర్ణస్య సమీపం నీతః. తతో రాజ్ఞః పురో మాం ప్రదర్శ్య తైః ప్రణమ్యోక్తమ్- ''దేవ! అవధీయతామ్. ఏష దుష్టోఽస్మద్దేశే చరన్నపి దేవపాదా నధిక్షిపతి" ఇతి.

రాజాఽఽహ- "కోఽయమ్? కుతః సమాయాతః?" ఇతి.

తే ఊచుః- "హిరణ్యగర్భనామ్నో రాజహంస స్యానుచరః కర్పూరద్వీపా దాగతః".

అథాఽహం గృధ్రేణ మన్త్రిణా పృష్టః– ''కస్తత్ర ముఖ్యో మన్త్రీ'' ఇతి.

మయోక్తమ్- "సర్వశాస్త్రార్థపారగః సర్వజ్ఞో నామ చక్రవాకః" ఇతి.

అను. పిమ్మట నేను ఇలా అన్నాను- "ఆ మా ప్రభువైన రాజహంసుడే మహాపరాక్రమసంపన్నుడూ, అధిక బలశాలీ. అతడు ముల్లోకాలకు ప్రభువు అగుటకు సమర్థుడు. ఇక ఈ పక్షిరాజ్యం ఎంత? అప్పుడు ఆ పక్షులు- "అలాంటప్పుడు మారాజ్యంలో ఎలా తిరుగుతున్నావు?" అని నిందించి తమ ప్రభువైన చిత్రవర్ణుడి వద్దకు తీసుకొనిపోయాయి. అతడికి ప్రణమిల్లాయి. నన్ను చూపి ఇలా విన్నవించాయి- "దేవా! అవధరింపుడు. ఈ దుష్టుడు మనదేశంలో తిరుగుతూ పూజ్యపాదులైన ప్రభువును నిందిస్తున్నాడు.

రాజు అడిగాడు– "ఇతను ఎవడు? ఎచ్చటనుండి వచ్చాడు?"

వారు ఇలా చెప్పారు– "ఇతను హిరణ్యగర్భుడు అనే రాజహంసయొక్క సేవకుడు. కర్పూరద్వీపంనుండి వచ్చాడు."

అంతట మంత్రి అయిన గ్రద్ద నన్ను ఇలా అడిగింది– "అచ్చట ముఖ్య మంత్రి ఎవరు?" అందుకు నేను ఇలా అన్నాను– "సర్వజ్ఞుడు అనే చక్రవాక పక్షి. అతను సర్వశాస్త్రిలను సమగ్రంగా అధ్యయనం చేసిన మేధావి."

మూ. గృధ్రో బ్రూతే- "యుజ్యతే. స్వదేశజోఽసౌ". యతః-

శ్లో. స్వదేశజం కులాచారవిశుద్ధ ముపధాశుచిమ్,
మన్త్రజ్ఞ మవ్యసనినం వ్యభిచారవివర్జితమ్, 17
అధీతవ్యవహారార్థం మౌలం ఖ్యాతం విపశ్చితమ్,
సముత్పాదక మర్థస్య విదధ్యా న్మన్త్రిణం నృపః. 18

అను. గ్రద్ద ఇలా అంది— "మంచిది. అతను ఆ దేశంలో జన్మించినవాడే. ఏలననగా—

"స్వదేశంలో పుట్టినవాడూ, సత్కులసంజాతుడూ, ఆచారశుద్ధుడూ, ధర్మ పరీక్షలలో పవిత్రుడుగా నిల్చినవాడూ (ఉపధాశుద్ధుడూ), రాజనీతిజ్ఞుడూ, త్రాగుడు మొదలైన వ్యసనాలు లేనివాడూ, పరస్త్రీలపై వ్యామోహం లేనివాడూ, వంశ పరంపరంగా వచ్చినవాడూ(మౌలుడూ), సద్గుణాలచే ప్రసిద్ధుడూ, విద్వాంసుడూ, ధనసంపాదనదక్షుడూ అయినవాడినే మంత్రిగా ప్రభువు నియమించాలి." (17-18)

మూ. అత్రాన్తరే శుకేనోక్తమ్- "దేవ! కర్పూరద్వీపాదయో లఘుద్వీపా జమ్బూద్వీపాఽన్తర్గతా ఏవ. అత స్తత్రాపి దేవపాదానామే వాధిపత్యమ్". తతో రాజ్ఞాఽప్యుక్తమ్- "ఏవమేవ. యతః-

శ్లో. రాజా మత్తః శిశుశ్చైవ ప్రమదా ధనగర్వితః,
అప్రాప్యమపి వాఞ్ఛన్తి కింపున ర్లభ్యతేఽపి యత్. 19

అను. ఇంతలో (అచ్చట ఉండే) చిలుక ఇలా అంది- "దేవా ! కర్పూర ద్వీపం మొదలైన చిన్న ద్వీపాలు జంబూద్వీపంలో చేరినవే. అందువల్ల అచ్చట సైతం ప్రభువులదే అధికారం." అప్పుడు రాజుగూడ-"అలాగే" అన్నాడు. ఏలనన-

"ప్రభువు, ఉన్మత్తుడు (పిచ్చివాడు), శిశువు, యౌవనమదంతోఁడి యువతి, ధనగర్వితుడు ఈ ఐదుగురు పొందడానికి సాధ్యంగాని దానిని సైతం కాంక్షిస్తారు. ఇక లభించేస్థితిలో ఉన్నదానినిగూర్చి ఏమనాలి."

మూ. తతో మయోక్తమ్- "యది వచనమాత్రేణై వాధిపత్యం సిద్ధ్యతి, తదా జమ్బూద్వీపేఽప్యస్మత్ప్రభో ర్హిరణ్యగర్భస్య స్వామ్య

మస్తి." శుకో బ్రూతే- "కథ మత్ర నిర్ణయః ?" మయో క్తమ్- "సఙ్గ్రామ ఏవ."

రాజ్ఞా విహస్యోక్తమ్- "స్వస్వామినం గత్వా సజ్జీకురు." తదా మయోక్తమ్- "స్వదూతోఽపి ప్రస్థాప్యతామ్. రాజోవాచ- "కః ప్రయాస్యతి దౌత్యేన ? యత ఏవమ్భూతో దూతః కార్యః—

శ్లో. భక్తో గుణీ శుచిర్దక్షః ప్రగల్భోఽవ్యసనీ క్షమీ,
బ్రాహ్మణః పరమర్మజ్ఞో దూతః స్యాత్ ప్రతిభానవాన్. 20

అను. అంతట నేను ఇలా అన్నాను— "మాటమాత్రంచేతనే ప్రభుత్వం సిద్ధించేటట్లు అయితే ఈ జంబూద్వీపంలో సైతం మా ప్రభువైన హిరణ్యగర్భుడి యొక్క ఆధిపత్యం ఉంది." అది విని చిలుక ఇలా అంది- "అయితే ఇందు నిర్ణయం ఎలా అగును ?"

అప్పుడు నేను "యుద్ధమే పరిష్కారమార్గం" అన్నాను.

అది విని ఆ రాజు నవ్వుతూ- "అలా అయితే నీవు పోయి మీ ప్రభువును యుద్ధానికి సిద్ధం చేయుము" అన్నాడు.

అందుకు నేను- "తమ దూతనుసైతం పంపండి" అన్నాను. అప్పుడు రాజు తనవారితో ఇలా చర్చించాడు-"రాయబారిగా ఎవడు పోగలడు ? ఏలనన-(దూత) రాయబారి అయినవాడు ఇలా ఉండాలి-

రాజభక్తుడు, గుణవంతుడు, పవిత్రుడు, కార్యదక్షుడు, వాక్పటుత్వంగలవాడు, మద్యాదివ్యసనాలు లేనివాడు, సహనశీలుడు, పరహృదయం గ్రహించేవాడు, బ్రాహ్మణుడు, ప్రతిభావంతుడు అయినవాడినే రాయబారిగా నియమించాలి.

మూ. గృధ్రో వదతి- "సన్త్యేవ దూతా బహవః. కిన్తు బ్రాహ్మణ ఏవ కర్తవ్యః". యతః—

శ్లో. ప్రసాదం కురుతే పత్యుః సమ్పత్తిం నాభివాఞ్ఛతి,
కాలిమా కాలకూటస్య నాఽపైతీశ్వరసఙ్గమాత్. 21

అను. గ్రద్ద ఇలా చెప్పింది– "దౌత్యానికైతే చాలమందియే ఉన్నారు. కాని బ్రాహ్మణుడినే దూతగా నియమించాలి. ఏలననగా-

బ్రాహ్మణుడైన దూత ప్రభువును ప్రసన్నుని చేసుకుంటాడు. ధనాన్ని కాంక్షింపడు. అనగా ధనాశకు లోబడడు. ఈశ్వరుడి సంబంధం పొందినా కాల కూటవిషం తన నల్లదనాన్ని పోగొట్టుకొనలేదు." (అనగా బ్రాహ్మణుడు ఐశ్వర్యం మధ్యన ఉన్నా తన సిర్లోభగుణాన్ని విడువడు. అని భావం). 21

మూ. రాజాఽఽహ- "శుక ఏవ వ్రజతు. శుక ! త్వమేవానేన సహ తత్ర గత్వాఽస్మదభిలషితం బ్రూహి" ఇతి. శుకో బ్రూతే- "యథాఽఽజ్ఞాపయతి దేవః. కిన్త్వయం దుర్జనో బకః. తదనేన సహ న గచ్ఛామి. తథా చోక్తమ్-

శ్లో. ఖలః కరోతి దుర్వృత్తం నూనం ఫలతి సాధుషు,
దశాననోఽహరత్సీతాం బన్ధనం తు మహోదధేః. 22

అను. అంతట రాజు (=చిత్రవర్ణుడు – జంబూద్వీప పక్షిరాజు) ఇలా అన్నాడు- "అలా అయితే చిలుకయే పోవుగాక." ఇలా అని చిలుకను ఉద్దేశించి "ఓ చిలుకా ! నీవే ఇతడితో అచ్చటికి పొమ్ము. రాజహంస అయిన హిరణ్య గర్భుడికి మా అభిప్రాయం తెల్పుము". అందుకు చిలుక ఇలా అంది- "ప్రభువుల చిత్తం. కాని ఈ కొంగ చెడ్డది. కనుక ఇతడితో వెళ్ళను. విజ్ఞులు ఇలా అన్నారు-

దుష్టుడు నీచకార్యం చేస్తాడు - దాని ఫలం సజ్జనుడు అనుభవించవలసి వస్తుంది. రావణుడు సీతను అపహరించాడు. సముద్రం బంధనం పొందింది. 22

అపరఞ్చ-

శ్లో. న స్థాతవ్యం న గన్తవ్యం దుర్జనేన సమం క్వచిత్,
కాకసఙ్గాద్ధతో హంస స్తిష్ఠన్ గచ్ఛంశ్చ వర్తకః. 23

రాజోవాచ- "కథ మేతత్ ?" శుకః కథయతి-

అను. మరియూ- దుర్జనుడితో కలిసి ఎచ్చటా ఉండరాదు. అలాగే దుర్జ

నుడితోడ ఎచ్చటికీ ప్రయాణం చేయరాదు. ఏలననగా కాకితో కలిసిఉన్నదై హంస, అలాగే కాకితో కలిసి ప్రయాణం చేసి వర్తకపక్షి (మీలపల్లంకిపిట్ట) మరణించాయి." 23

రాజు అడిగాడు- "అది ఎట్లు ?" చిలుక ఇలా చెప్పదొడగింది.

## 4. హంస-కాక-పథిక కథా

[హంస - కాకి - బాటసారి]

మూ. అస్త్యుజ్జయినీవ ప్రాన్తరే ప్లక్షతరుః. తత్ర హంసకాకౌ నివసతః. కదాచిద్గ్రీష్మసమయే పరిశ్రాన్తః కశ్చిత్ పథికస్తత్ర తరుతలే ధనుష్కాణ్డం సన్నిధాయ సుప్తః. తత్ర క్షణాన్తరే తన్ముఖాద్ వృక్షచ్ఛాయాఽపగతా. తతః సూర్యతేజసా తన్ముఖం వ్యాప్తమవలోక్య తద్వృక్షస్థితేన పుణ్యశీలేన శుచినా రాజహంసేన కృపయా పక్షౌ ప్రసార్య పునస్తన్ముఖే ఛాయా కృతా. తతో నిర్భరనిద్రాసుఖినా పరిభ్రమణపరిశ్రాన్తేన పాన్థేన ముఖవ్యాదానం కృతమ్.

అను. ఉజ్జయినీనగరానికి పోయే దారిలో ఒక రావిచెట్టు ఉంది. ఆ చెట్టు మీద ఒక హంస, ఒక కాకి నివసిస్తూన్నాయి. ఒకసారి ఎండకాలమున ఒక బాటసారి ఆ దారిన పోతూ ఉన్నాడు. (ఎండ తీవ్రంగా ఉండడంతో)అలసిపోయాడు. ఆ చెట్టుక్రిందికి వచ్చాడు. విల్లును నేలపై ఉంచి శయనించాడు. వెంటనే నిద్ర వచ్చింది. కానీ త్వరలోనే అతడి ముఖంమీది చెట్టునీడ తొలగిపోయింది. ఎండ వచ్చింది. దీన్ని చెట్టుమీద ఉండే హంస చూచింది. మిక్కిలి జాలి పొందింది. విశుద్ధపుణ్యస్వభావం గలది అగుటచే తన రెక్కలను విప్పింది. ఆ బాటసారికి నీడ పట్టింది. అంతట మార్గాయాసంచే గాఢమైన నిద్రాసుఖంలో ఉండే ఆ బాటసారి యాదృచ్ఛికంగా నోరు తెరచాడు.

మూ. అథ పరసుఖ మసహిష్ణుః స్వభావదౌర్జన్యేన స కాక స్తస్య ముఖే పురీషోత్సర్గం కృత్వా పలాయితః. తతో యావదసౌ పాన్థ ఊర్ధ్వ యోర్ధ్వం నిరీక్షతే, తావ త్తేనావలోకితో హంసః, కాణ్డేన హతో వ్యాపాదితశ్చ. అతోఽహం బ్రవీమి- 'న స్థాతవ్యమ్' ఇతి.

అను. "అంత ఇతరుల సుఖాన్ని సహింపలేని కాకి, తనకు పుట్టుకతో వచ్చిన దుర్బుద్ధిని అనుసరించి ఆ బాటసారి నోటిలో రెట్ట వేసింది, వెంటనే పారిపోయింది. బాటసారికి మెలకువ వచ్చింది. కోపంతో పైకి చూచాడు. అతడికి హంస కనబడింది. కఱ్ఱతో కొట్టాడు. ఆ దెబ్బతో హంస చచ్చింది. అందుచే నేను చెప్పుచున్నాను- "నీచులతో కలిసి ఉండరాదు" ఇత్యాది.

## 5. కాక-వర్తకయోః కథా

[కాకి - మీనపల్లంకిపిట్ట]

మూ. దేవ! వర్తకకథామపి కథయామి. శ్రూయతామ్-

ఏకత్ర వృక్షే కాక- వర్తకౌ సుఖం నివసతః. ఏకదా భగవతో గరుడస్య యాత్రాప్రసఙ్గేన సర్వే పక్షిణః సముద్రతీరం గతాః. తతః కాకేన సహ వర్తక శ్చలితః. అథ గచ్ఛతో గోపాలస్య మస్తకస్థితదధిభాణ్డాద్ వారం వారం తేన కాకేన దధి ఖాద్యతే. తతో యావదసౌ దధిభాణ్డం భూమౌ నిధాయోర్ధ్వ మవలోకతే తావత్తేన కాకవర్తకౌ దృష్టౌ. తతస్తేన దృష్టః కాకః పలాయితః. వర్తకః స్వభావనిరపరాధో మన్దగతిస్తేన ప్రాప్తో వ్యాపాదితః. అతోఽహం బ్రవీమి- 'న గన్తవ్యమ్' ఇత్యాది.

అను. దేవా ! వర్తకపక్షి (మీనపల్లంకిపిట్ట) కథను చెప్పెదను. వినండి—

ఒక వృక్షంమీద కాకి, వర్తకపక్షి సుఖంగా నివసిస్తున్నాయి. ఒకసారి తీర్థయాత్రాప్రసంగంగా దేశసంచారం చేస్తూ భగవానుడైన గరుడుని దర్శించేందుకై సముద్రతీరానికి పోయాయి. అప్పుడు కాకితో వర్తకపక్షియు వెళ్ళింది. ఈ పక్షులు రెండూ వెళ్ళే దారిలో ఒకానొక గొల్లవాడు నెత్తిన పెరుగుకుండ ఉంచుకొని పోతూ ఉన్నాడు. కాకి అది చూచింది. మాటిమాటికి ఆ పాత్రపై వాలడం, పెరుగును ముక్కుకు అందినంత తినడం, ఎగురడం చేయసాగింది. గొల్లవాడు ఇది గమనించాడు. పెరుగుపాత్రను నేలమీద ఉంచాడు. పైకి చూచాడు. కాకి, మీన పల్లంకిపిట్ట కనబడ్డాయి. కాని కాకి పారిపోయింది. వేగంగా పరుగెత్తే శక్తి లేనిదీ, సహజనిర్దోషి అయిన ఈ వర్తకపక్షి మాత్రం వాడికి చిక్కింది. చంపబడింది. అందుచే నేను చెప్పుచున్నాను- 'దుష్టులతో కలిసి ప్రయాణం చేయరాదు' ఇత్యాది.

మూ. తతో మయోక్తమ్- 'భ్రాతః శుక! కిమేవం బ్రవీషి? మాం ప్రతి యథా శ్రీమద్దేవపాదా స్తథా భవానపి?' శుకేనోక్తమ్- 'అస్త్వేవమ్ కిన్తు-

శ్లో. దుర్జనై రుచ్యమానాని సమ్మతాని ప్రియాణ్యపి,
అకాలకుసుమానీవ భయం సఞ్జనయన్తి హి. 24

దుర్జనత్వం చ భవతో వాక్యాదేవ జ్ఞాతం యదనయో ర్భూపాలయో ర్విగ్రహే భవద్వచనమేవ నిదానమ్. పశ్య-

శ్లో. ప్రత్యక్షేఽపి కృతే దోషే మూర్ఖః సాన్త్వేన తుష్యతి,
రథకారో నిజాం భార్యాం సజారాం శిరసాఽకరోత్. 25

రాజ్ఞోక్తమ్ -'కథమేతత్?' శుకః కథయతి-

అను. అంత నేను ఇలా అన్నాను- 'సోదరా! శుకమా! ఇలా ఎందుకు అంటున్నావు? నాకు శ్రీమంతులైన మహారాజులు ఎట్లో, నీవూ అట్లే.' చిలుక ఇలా అంది- 'అలాగే కానిమ్ము. కాని—

దుష్టులు చెప్పే మాటలు శాస్త్రసమ్మతాలుగా ప్రీతికరాలుగా ఉండినా అకాల పుష్పాలవలె భయాన్నే గల్గిస్తాయి. 24

దుర్జనత్వం నీ వాక్కులవల్లనే తెలిసింది. ఎట్లన ఈ ఇర్వురు ప్రభువుల యుద్ధానికి నీ వాక్కే కారణం. చూడుము-

తప్పును కన్నులతో చూచియూ మూర్ఖుడు ఓదార్పుమాటలతో సంతుష్టి నందును. వడ్రంగి తన భార్యను (ఆవిడ) విటుడితో బాటు నెత్తిన బెట్టుకొన్నాడు.

రాజు అడిగాడు— 'అది ఎట్లు ?' చిలుక ఇలా చెప్పదొడగింది—

# 6. రథకార కథా

## [వడ్రంగి కథ]

మూ. అస్తి యౌవనశ్రీనగరే మన్దమతి ర్నామ రథకారః. స చ స్వభార్యాం బంధకీం జానాతి. కిన్తు జారేణ సమం స్వచక్షుషా నైకస్థానే పశ్యతి. తతోఽసౌ రథకారః-'అహమన్యం గ్రామం గచ్ఛామి'-ఇత్యుక్త్వా చలితః. స కియద్దూరం గత్వా పునరాగత్య పర్యఙ్కతలే స్వగృహే నిభృతం స్థితః. అథ రథకారో గ్రామాన్తరం గత ఇతి సముపజాత విశ్వాసః స జారః సన్ధ్యాకాల ఏవాగతః. పశ్చాత్తేన జారేణ సమం తస్మిన్ పర్యఙ్కే నిర్భరం క్రీడన్తీ పర్యఙ్కతలస్థితస్య భర్తుః కిఞ్చిదఙ్గస్ప ర్శాత్ స్వామినం మాయావినం విజ్ఞాయ మనసి సా విషణ్ణాఽభవత్.

అను. యౌవనశ్రీ అనే నగరంలో మందమతి అనే వడ్రంగి ఉండేవాడు. వాడు తన భార్యను జారిణి అని గ్రహించాడు. కాని మిండగాడితో ఒకేచోట ఉండడాన్ని తన కన్నులతో చూచియుండలేదు. అంత ఆ వడ్రంగి తన భార్యతో-"నేను ప్రక్కఊరికి పోతూ ఉన్నాను" అని ఇంటినుండి కదిలాడు. కానీ కొంతదూరం పోయి మరలివచ్చాడు. భార్యకు తెలియకుండా ఇంటిలో ప్రవేశించాడు. మంచం క్రింద రహస్యంగా దాగాడు. అప్పుడు ఆమె మిండడు- "వడ్రంగి పొరుగూరికి పోయాడు" అని గట్టి నమ్మకంతో సంజవేళకే వచ్చాడు. ఆవిడఅతనితో ఆ మంచం

భర్త పరుషంగా మాట్లాడినా, క్రోధంగా చూచినా, ప్రసన్నవదనయై ఉండే నారీమణియే ధర్మభాగిని అవుతుంది. 26

మరియూ— భర్త నగరవాసి అయినా వనవాసి అయినా, పాపి అయినా పుణ్యుడు అయినా, ప్రేమించే ఆడదియే సంపూర్ణసుఖాలైన స్వర్గాదిలోకాలను పొందుతుంది. 27

మూ. అన్యచ్చ-

శ్లో. భర్తా హి పరమం నార్యా భూషణం భూషణైర్వినా,
ఏషా విరహితా తేన భూషణార్హా న శోభతే. 28

త్వం చ జారః పాపమతిః. మనోలౌల్యాత్ పుష్పతామ్బూల సదృశః. కదాచిత్ సేవ్యసే, కదాచి న్న సేవ్యసే చ. స చ పునర్మే స్వామీ మాం విక్రేతుం, దేవేభ్యో బ్రాహ్మణేభ్యో దాతుమీశ్వరః. కిం బహునా. తస్మిన్ జీవతి జీవామి, తన్మరణే చాఽనుమరణం కరిష్యా మీతి ప్రతిజ్ఞా వర్తతే. యతః-

శ్లో. తిస్రః కోట్యోఽర్ధకోటీ చ యాని లోమాని మానవే,
తావత్కాలం వసేత్ స్వర్గే భర్తారం యోఽనుగచ్ఛతి. 29

అను. మరియూ- ఏ భూషణాలు లేకపోయినా ఆడదానికి భర్తయే ఉత్తమమైన భూషణం. ఎన్ని భూషణాలు ఉండినా భర్త లేనిచో ఆడదానికి అందం లేదు. 28

నీవు జారుడవు, పాపబుద్ధివి. పూలనూ, తాంబూలాన్నీ ఒకసారి సేవించి, వేరొకసారి సేవించనట్లుగా, నా చాంచల్యం తీరేందుకై నీతో ఒకసారి రమిస్తాను. వేరొకసారి రమించను. ఆ నా భర్త అయితే నన్ను అమ్మడానికిగాని, లేక దేవతలకైనా బ్రాహ్మణులకైనా దానంచేయడానికి గాని అధికారం గలవాడు. పెక్కు మాటలెందుకు ? నా ప్రతిజ్ఞ ఇది- 'అతను జీవిస్తే జీవిస్తాను. మరణిస్తే సహగమనం చేస్తాను.' ఏలననగా—

మానవుడి శరీరాన మూడున్నరకోట్ల రోమాలు ఉన్నాయి అని అంటారు.

భర్తతో సహగమనం చేసిన ఆడది, అన్ని ఏండ్లు స్వర్గంలో సుఖంగా నివసిస్తుంది. 29

మూ. అన్యచ్చ-

శ్లో. వ్యాలగ్రాహీ యథా వ్యాలం బలాదుద్ధరతే బిలాత్,
తద్వద్భర్తార మాదాయ స్వర్గలోకే మహీయతే. 30

శ్లో. చితౌ పరిష్వజ్య విచేతనం పతిం
ప్రియా హి యా ముఞ్చతి దేహమాత్మనః,
కృత్వాఽపి పాపం శతలక్షమప్యసౌ
పతిం గృహీత్వా సురలోక మాప్నుయాత్. 31

యతః-

శ్లో. యస్మై దద్యాత్ పితా త్వేనాం భ్రాతా వాఽనుమతే పితుః,
తం శుశ్రూషేత జీవన్తం సంస్థితఞ్చ న లఙ్ఘయేత్. 32

అను. ఇంకా- సహగమనం చేసిన స్త్రీ, పాములవాడు తొఱ్ఱనుండి పామును బలంగా పైకి లాగినట్లు- తన భర్తను నరకంనుండి ఉద్ధరించి అతడితో స్వర్గ సుఖాలు హాయిగా అనుభవిస్తుంది." 30

మరియూ- మరణించిన మగడి శరీరాన్ని కౌగలించికొని చితికి ఆహుతి అయిన స్త్రీ కోటిపాపాలు చేసినదైనా భర్తతో స్వర్గసుఖాలు అనుభవిస్తుంది 31

ఏలనన- ఏ స్త్రీనైనా తండ్రిగానీ, తండ్రియొక్క అంగీకారంచే సోదరుడు గాని ఏ పురుషుడికి అర్పిస్తాడో, ఆ పురుషుణ్ణి జీవితపర్యంతం ఆమె సేవించాలి. అతను మరణిస్తే సహగమనం [illegible]లి.' 32

[సంస్థితం = మృతమ్, న లఙ్ఘయేత్ = న అతిచరేత్ = అనుమ్రియేతేతి భావః]

మూ. ఏతత్సర్వం శ్రుత్వా మన్దమతిః స రథకారః-'ధన్యోఽహం యస్యేదృశీ ప్రియవాదినీ స్వామివత్సలా చ భార్యా.' ఇతి మనసి నిధాయ

తాం ఖట్వాం స్త్రీపురుషసహితాం మూర్ధ్ని కృత్వా సానన్దం ననర్త. అతో ఒహం బ్రవీమి- 'ప్రత్యక్షేఒపి కృతే దోషే' ఇత్యాది.

అతోఒహం తేన రాజ్ఞా యథావ్యవహారం సమ్పూజ్య ప్రస్థాపితః. శుకోఒపి మమ పశ్చా దాగచ్ఛన్నాస్తే. ఏతత్ సర్వం పరిజ్ఞాయ యథా కర్తవ్య మనుసన్ధీయతామ్.

అను. ఇదంతా మందమతి అనే ఆ వడ్రంగి విన్నాడు- 'నేను ధన్యుణ్ణి, ఇంత ప్రియభాషిణి, మగనికే మనసిచ్చినదీ అయిన భార్య లభించింది"అని తలంచాడు. భార్య, ఆమె మిండడు ఉండే ఆ మంచాన్ని అలాగే తలపైకి ఎత్తుకున్నాడు. ఆనందంతో నృత్యం చేశాడు.' అందుచే నేను (చిలుకను) చెప్పుతున్నాను- 'తప్పును కన్నులతో చూచియూ- ఇత్యాది.'

అంతట నాకు (కొంగ అయిన నాకు) ఆ (మయూరరాజు) చిత్రవర్ణుడు తగినవిధంగా ఆదరించి వీడ్కోలు ఇచ్చాడు. చిలుకయూ నావెనుకనే వస్తూ ఉంది. ఇదంతా గ్రహించి ఏమి చేయాలో విచారించండి."

మూ. చక్రవాకో విహస్యాఒఒహ- 'దేవ! బకేన తావద్ దేశాన్తరమపి గత్వా యథాశక్తి రాజకార్య మనుష్ఠితమ్. కిన్తు దేవ! స్వభావ ఏష మూర్ఖాణామ్. యతః-

శ్లో. శతం దద్యాన్న వివదే దితి విజ్ఞస్య సంమతమ్,
వినా హేతుమపి ద్వన్ద్వమేత న్మూర్ఖస్య లక్షణమ్. 33

అను. చక్రవాకపక్షి (జక్కవపిట్ట) నవ్వి ఇలా అంది- "దేవ ! ఈ కొంగ పరదేశం సైతం పోయి శక్తికొలది రాజకార్యం నిర్వహించింది. కానీ ప్రభూ ! మూర్ఖుల స్వభావం ఇలాగే ఉంటుంది. ఏలనన_

"వంద ఇవ్వవచ్చు. కాని తగవును మాత్రం తెచ్చుకోరాదు" అనేది నీతివేత్తల మతం. కారణం లేకయే తగవు తెచ్చుకోడం మూర్ఖుల లక్షణం. 33

మూ. రాజాఒఒహ- "అల మనేనాఒతీతోపాలమ్భనేన. ప్రస్తుత మనుసన్ధీయతామ్." చక్రవాకో బ్రూతే- 'దేవ! విజనే బ్రవీమి. యతః-

శ్లో. వర్ణాఽఽకార ప్రతిధ్వానై ర్నేత్రవక్త్రవికారతః,
అభ్యూహ న్తి మనో ధీరా స్తస్మాద్రహసి మన్త్రయేత్. 34

అను. రాజు ఇలా చెప్పాడు- ఈ గతించినదాన్ని గూర్చి నిందించడంవల్ల ఉపయోగం ఏముంది? ప్రస్తుతం విచారించండి." జక్కవపిట్ట ఇలా అంది- 'ప్రభూ! రహస్యంగా విన్నవిస్తాను. ఏలననగా_

రంగు, రూపం, శబ్దం, కన్నులమార్పు, ముఖంలోని భేదాలు- ఇత్యాది కంచే మనస్సులోని భావాన్ని ప్రతిభాశాలురు గురిసారు. అందువలన (రాజకీయాలను) రహస్యంగా ఆలోచన చేయాలి. 34

మూ. తతో రాజా మన్త్రీ చ తత్ర స్థితౌ. అన్యేఽన్యత్ర గతాః. చక్రవాకో బ్రూతే- "దేవ! అహమేవం జానామి - 'కస్యాఽప్యస్మన్నియోగినః ప్రేరణయా బకేనేద మనుష్ఠితమ్. యతః -

శ్లో వైద్యానా మాతురః శ్రేయాన్ వ్యసనీ యో నియోగినామ్,
విదుషాం జీవనం మూర్ఖః సద్వర్ణో జీవనం సతామ్. 35

అను. అంత రాజూ, మంత్రీ మాత్రం అచ్చట ఉన్నారు. తక్కినవారు వేఱే చోటికి పోయారు. అప్పుడు జక్కవ పులుగు ఇలా అంది - "దేవా! మన వారిలోనే ఎవరో ఒక రాజోద్యోగియొక్క ప్రేరణచే కొంగ ఇలా చేసి ఉంటుందని నాకు తోస్తూ ఉంది. ఏలనన -

వైద్యులకు రోగి, రాజోద్యోగులకు ఆపన్నుడైన ప్రభువు, విద్వాంసులకు మూర్ఖుడు, సజ్జనులకు సత్కులీనుడు జీవితాధారం అంటారు. 35

మూ. రాజాఽబ్రవీత్ - "భవతు, కారణమత్ర పశ్చా న్నిరూపణీయమ్. సమ్ప్రతి యత్కర్తవ్యం తన్నిరూప్యతామ్. చక్రవాకో బ్రూతే- 'దేవ ప్రణిధి స్తావ త్తత్ర ప్రహీయతామ్. తత స్తదనుష్ఠానం బలాబలఞ్చ జానీమః. తథాహి -

శ్లో. భవేత్ స్వపరరాష్ట్రాణాం కార్యాకార్యావలోకనే,
చార శ్చక్షు ర్మహీభర్తు ర్యస్య నా స్త్యన్ధ ఏవ సః. 36

అను. రాజు ఇలా అన్నాడు - "అలాగే కానిమ్ము. ఈ విషయంలో కారణాన్ని తర్వాత విచారించుదాం. ప్రస్తుతం కర్తవ్యం ఆలోచించండి. చక్రవాకం ఇలా చెప్పింది - 'ప్రభూ ! గూఢచారిని (ముందుగా) పంపుదాం. అతడి (శత్రువు యొక్క) అభిప్రాయం, బలం, బలహీనత మొదలైనవి గ్రహించుదాం. అది సముచితం.

తన దేశంలోను పరదేశంలోనూ సంభవించే మంచిచెడ్డలను చూచేందుకు ప్రభువునకు వేగులవాడే కన్ను. ఏ రాజునకు అలాంటి వేగులవాడు లేడో అతను గ్రుడ్డివాడే.

మూ. స చ ద్వితీయం విశ్వాసపాత్రం గృహీత్వా యాతు. తేనాఽసౌ స్వయం తత్రాఽవస్థాయ ద్వితీయం తత్రత్యమన్త్రికార్యం సునిభృతం నిశ్చిత్య నిగద్య ప్రస్థాపయతి. తథా చోక్తమ్ -

శ్లో. తీర్థాశ్రమసురస్థానే శాస్త్రవిజ్ఞానహేతునా,
తపస్వివ్యఞ్జనోపేతైః స్వచరైః సహ సంవసేత్. 37

అను. అతడూ తనకు తోడుగా మరియొక నమ్మకమైనవాడిని తీసికొని పోవాలి. అచ్చట తాను ఉండాలి. అచ్చట (శత్రుగృహంలోని) మంత్రాలన్నిటినీ సేకరించి ఒక నిశ్చయానికి రావాలి. వాటిని రహస్యంగా ఈ రెండవ వాడికి బోధించి పంపాలి. విజ్ఞులచే ఇలా తెలుపబడింది -

ప్రధానగుప్తచరుడు తన సహచరులతో కలిసి ఏదేని పుణ్యతీర్థాన గానీ - సాధుసంన్యాసుల ఆశ్రమంలో గానీ - దేవాలయంలోగానీ, తాపసవేషాలతో శాస్త్రాధ్యయనం చేసే నెపంతో నివసించాలి.

మూ. గూఢచారశ్చ యో జలే స్థలే చ చరతి, తతోఽసావేవ బకో నియుజ్యతామ్. ఏతాదృశ ఏవ కశ్చిద్బకో ద్వితీయత్వేన ప్రయాతు. తద్గృహలోకశ్చ రాజద్వారే తిష్ఠతు. కిన్త్వేతదపి సుగుప్తమనుష్ఠాతవ్యమ్. యతః -

శ్లో. షట్కర్ణో భిద్యతే మన్త్ర స్తథా ప్రాప్తశ్చ వార్తయా,
ఇత్యాత్మనా ద్వితీయేన మన్త్రః కార్యో మహీభృతా. 38

అను. నీటిలోనూ, నేలమీదా సమానంగా సంచరింపగలవాడే గూఢచారు డవుటకు అర్హుడు. ఇలాంటిదాన్నే మరొక కొంగను దీనికి తోడుగా పంపుదాం. ఈ రెండు కొంగల కుటుంబాన్ని రాజాధీనంలో ఉండేలా చేద్దాం. కానీ ఇదంతా మిక్కిలి రహస్యంగా జరుగాలి. ఏలనన -

ఆరుచెవుల్లో పడిన (ముగ్గురికి తెలిసిన) సందేశం లేక మంత్రం అందరికీ వెల్లడి అవుతుంది. అందుచే ప్రభువు తానూ ఆత్మీయుడైన మరొకడు ఉండే టట్లుగా (అనగా - చతుష్కర్ణంగా = నాలుగు చెవులు ఉండేటట్లుగా) సందేశం పంపడం అలాగే ఆలోచనా (మంత్రం) చేయాలి. 38

మూ. పశ్య -

శ్లో. మన్త్రభేదే హి యే దోషా భవన్తి పృథివీపతేః,
న శక్యాస్తే సమాధాతు మితి నీతివిదాం మతమ్. 39

రాజా విమృశ్యోవాచ - 'ప్రాప్త స్తావన్మయోత్తమః ప్రణిధిః' మన్త్రీ బ్రూతే - "దేవ, తదా సఙ్గ్రామే విజయోఽపి ప్రాప్తః."

అను. చూడుము -

రహస్యం (మంత్రం) పొక్కితే రాజునకు సంభవించే దోషాలు తొలగించ డానికి వీలుగానివి అని నీతివేత్తలు అంటారు. 39

రాజు విమర్శించి ఇలా అన్నాడు - "నాకు మంచి వేగు లభించాడు." అందుకు మంత్రి ఇలా చెప్పాడు - "ప్రభూ ! అలా అయితే యుద్ధంలో విజయం సైతం లభిస్తుంది".

మూ. అత్రాన్తరే ప్రతీహారః ప్రవిశ్య ప్రణమ్యోవాచ - 'దేవ ! జమ్బూద్వీపా దాగతో ద్వారి శుక స్తిష్ఠతి.' రాజా చక్రవాక మాలోకతే. చక్రవాకేణోక్తమ్ - 'కృతాఽఽవాసే తావద్ గత్వా తిష్ఠతు. పశ్చా దానీయ ద్రష్టవ్యః. 'యథాజ్ఞాపయతి దేవః' ఇత్యభిధాయ ప్రతీహారః శుకం గృహీత్వా తదావాసస్థానం గతః. రాజాఽఽహ - 'విగ్రహస్తావత్

సముపస్థితః" చక్రవాకో బ్రూతే - 'దేవ ! తథాపి ప్రాగేవ విగ్రహో న విధిః. యతః -

శ్లో. స కింభృత్యః స కిమ న్త్రీ య ఆదావేవ భూపతిమ్,
యుద్ధోద్యోగం స్వభూత్యాగం నిర్దిశ త్యవిచారితమ్. 40

అను. ద్వారపాలకుడు లోనికి ప్రవేశించాడు. ప్రణమిల్లాడు. ఇలా విన్నవించాడు - 'ప్రభూ ! జంబూద్వీపంనుండి ఒక చిలుక వచ్చింది. ద్వారం వద్ద ఉంది.' అది విని రాజు మంత్రివైపు (సాభిప్రాయంగా) చూచాడు. అప్పుడు మంత్రి అయిన చక్రవాకపక్షి ఇలా అంది - 'అతిథిగృహానికి తీసికొని పొమ్ము. [కొంతసేపు విశ్రాంతి తీ మ్ము] తర్వాత తీసికొనివచ్చి ప్రభువుల దర్శనం చేయింపుము.'

అంత ప్రతీహారుడు - 'ప్రభువులు ఆజ్ఞాపించినటులే' - అని చిలుకను తీసికొని అతిథిగృహానికి పోయింది.

అప్పుడు రాజు మంత్రితో ఇలా అన్నాడు - 'ఇప్పుడు యుద్ధం ఎదురుగా వచ్చి కూర్చుంది". అందుకు చక్రవాకం ఇలా అంది -

"ప్రభూ ! అలా ఉన్నా మొదటనే యుద్ధం చేయడం సముచితం గాదు. ఏలనన - పూర్తిగా విచారింపక యుద్ధం చేయడానికిగానీ దేశాన్ని త్యజింపడానికి గాని ప్రభువునకు సలహా ఇచ్చే మంత్రి దుష్టమంత్రిగాను సేవకుడు దుష్టసేవకుడుగాను తలంపబడును 40

మూ. అపరఞ్చ -

శ్లో. విజేతుం ప్రయతేతాఽరీన్ న యుద్ధేన కదాచన,
అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుధ్యమానయోః. 41

అన్యచ్చ -

శ్లో. సామ్నా దానేన భేదేన సమస్తై రథవా పృథక్,
సాధితుం ప్రయతేతాఽరీన్ న యుద్ధేన కదాచన. 42

అను. మఱియూ - యుద్ధంద్వారా శత్రువును జయించేందుకు ఎప్పుడూ ప్రయత్నం చేయకూడదు. యుద్ధంలో ఇరుపక్షాలవారికీ విజయం అనిశ్చితంగానే ఉంటుంది. 41

ఇంకనూ - సామ, దాన, భేదాలు అనే ఉపాయాలు మూడింటినీ వేర్వేరుగా సమగ్రంగా ప్రయోగించి శత్రువులను లొంగదీయడానికి ప్రయత్నించాలి. యుద్ధంద్వారా మాత్రం వద్దు. 42

అపరఞ్చ -

శ్లో. సర్వ ఏవ జనః శూరో హ్యనాసాదితవిగ్రహః,
అదృష్టపరసామర్థ్యః సదర్పః కో భవేన్నహి. 43

కిఞ్చ -

శ్లో. న తథోత్థాప్యతే గ్రావా ప్రాణిభిర్దారుణా యథా,
అల్పోపాయా న్మహాసిద్ధి రేతన్మ న్త్రఫలం మహత్. 44

అను. ఇంతేగాదు. యుద్ధం నెత్తిమీదికి రానంతవరకు అందరూ వీరులే. శత్రువిక్రమాన్ని చవిచూచేవరకు ఎవరు గర్వంగా ఉండరు ? (అందరూ గర్వాందులే అని భావం) 43

మరియూ - (బరువైన) చట్టుబండ కఱ్ఱలద్వారా తేలికగా పైకి ఎత్తబడుతుంది గదా. అలాగే అల్పమైన (శ్రమలేని) ఉపాయంచే గొప్పకార్యం సిద్ధిస్తుంది. ఇదే మంత్ర (రాజనీతి) ఫలం. 44

మూ. కిన్తు విగ్రహ ముపస్థితం విలోక్య వ్యవహ్రియతామ్. యతః -

శ్లో. యథా కాలకృతోద్యోగాత్ కృషిః ఫలవతీ భవేత్,
తద్వన్నీతిరియం దేవ చిరాత్ ఫలతి న క్షణాత్. 45

అపరఞ్చ -

శ్లో. దూరే భీరుత్వ మాసన్నే శూరతా మహతో గుణః,
విపత్తౌ చ మహాన్ లోకే ధీరత్వ మధిగచ్ఛతి. 46

అను. కాని యుద్ధం ఎదుపగా ఉన్నట్లు తలంచి ప్రవర్తిల్లాలి. ఏలననగా ఓ రాజా! అదనున వేసిన పైరు ఋతుకాలంలో ఫలితం (పంటను) ఇచ్చినట్లు - సకాలంలో ఉ ంచిన రాజనీతి ఉత్తరోత్తరఫలవంతం అవుతుంది. వెంటనే మాత్రం గాదు. 45

మరియూ - ఆపదలను దూరంగా చూచి భయపడడం - అవి దాపునకు వచ్చినచో పరాక్రమంచే విజృంభించడం మహాత్ముల సుగుణం. కనుక ఈ లోకంలో మహాత్ములు ఆపదలో ధైర్యాన్ని ఆశ్రయిస్తారు. 46

మూ. అన్యచ్చ -

శ్లో. ప్రత్యూహః సర్వసిద్ధీనా ముత్తాపః ప్రథమం కిల,
అతిశీతల మప్యమ్భః కిం భినత్తి న భూభృతః. 47

విశేషతశ్చ దేవ! మహాబలోఽసౌ చిత్రవర్ణో రాజా. యతః -

శ్లో. బలినా సహ యోద్ధవ్యమితి నాస్తి నిదర్శనమ్,
తద్యుద్ధం హస్తినా సార్ధం నరాణాం మృత్యు మావహేత్. 48

అను. ఇంకనూ - ఉడుకుబోతుతనం (తొందరపాటు - క్రోధం) అన్ని కార్యసిద్ధులకు మొదటి విఘ్నంగా ప్రసిద్ధం. మిక్కిలి చల్లని నీరుసైతం పర్వతాన్ని భేదిస్తున్నది గదా. అనగా క్రోధానికి బదులు శాంతాన్ని వహిస్తే సాఫల్యం సిద్ధిస్తుంది అని భావం. 47

విశేషించి (ముఖ్యంగా) ఆ రాజైన చిత్రవర్ణుడు గొప్ప బలవంతుడు.

బలవంతుడితోడనే యుద్ధం చేయాలి - అనే నీతి ఏదీ లేదు. మానవులు ఏనుగుతో యుద్ధంచేయడం మృత్యువును ఆహ్వానించడమే. 48

మూ. అన్యచ్చ -

ఏలనన - కోటలో ఉండే వీరుడైన ఒక విలుకాడు వందమందిని ఎదురింప గలడు. ఇక వందవీరులు అయితే లక్షమందిని ఎదురింపగలరు. అందువల్ల యుద్ధానికి కోట ఉండడం ప్రశస్తం. 52

మూ. కిఞ్చ -

శ్లో. అదుర్గో విషయః కస్య నాఽరేః పరిభవాస్పదమ్,
అదుర్గోఽనాశ్రయో రాజా పోతచ్యుతమనుష్యవత్. 53

శ్లో. దుర్గం కుర్యా న్మహాఖాత ముచ్చప్రాకారసంయుతమ్,
సయన్త్రం సజలం శైలసరిన్మరువనాశ్రయమ్. 54

శ్లో. విస్తీర్ణతాఽతివైషమ్యం ధనధాన్యేధ్మసఙ్గ్రహః,
ప్రవేశశ్చాఽపసారశ్చ సప్తైతా దుర్గసమ్పదః." 55

అను. మరియూ - కోటలేని రాజ్యం ఎంత బలవంతుడైన ప్రభువునకు చెందినదైనా కోట ఉండే ఎంత చిన్న ప్రభువునకైనా లోబడిపోతుంది. కోటలేని వాడూ, ఆశ్రయం లేనివాడూ అయిన ప్రభువు పడవనుండి జారిన మనుష్యుడువలె మునిగిపోతాడు. 53

కోటను పర్వతప్రాంతానగానీ, నదీప్రాంతానగానీ, ఎడారిలోగానీ, దుర్గ మారణ్యంలోగానీ నిర్మించాలి. అది పెద్ద అగడ్తచే చుట్టబడినదై, ఎత్తైన ప్రాకారం గలదై, యుద్ధోపయోగియంత్రయుతమై, జలయుక్తతటాకాదిసహితమై ఉండాలి.

మరియు- విశాలత, దుర్గమత (విషమత), జలసౌకర్యం, ఆహారసమృద్ధి, ఇంధనసంగ్రహం, రహస్యమైన ప్రవేశమార్గం, నిర్గమనమార్గం అనే ఈ ఏడు కోటయొక్క సంపదలు అనబడుతాయి. 55

మూ. రాజాఽఽహ - "దుర్గాఽనుసన్ధానే కో నియుజ్యతామ్" ఇతి. చక్రవాకో బ్రూతే -

శ్లో. "యో యత్ర కుశలః కార్యే తం తత్ర వినియోజయేత్,
కర్మస్వదృష్టకర్మా యః శాస్త్రజ్ఞోఽపి విముహ్యతి. 56

# 7. నీలవర్ణశృగాలకథా

## (నీలిరంగునక్క కథ)

మూ. [అస్త్యరణ్యే] కశ్చిత్ శృగాలః. [సః] స్వేచ్ఛయా నగరోపాన్తే భ్రామ్య న్నీలీభాణ్డే నిపతితః. పశ్చాత్తత ఉత్థాతు మసమర్థః ప్రాతరాత్మానం మృతవత్ సన్దర్శ్య స్థితః. అథ నీలీభాణ్డస్వామినా 'మృత' ఇతి జ్ఞాత్వా తస్మాత్ సముత్థాప్య దూరే నీత్వాఽసౌ పరిత్యక్తః, తస్మాత్ పలాయితః.

అను. ఒక అడవిలో ఒకానొక నక్క ఉంది. ఒకనాడు స్వేచ్ఛగా నగర సమీపంలో తిరుగుతూ, ఒక నీలిమందు తొట్టిలో (పెనంలో) పడింది. తర్వాత ఎంత ప్రయత్నించినా అందుండి లేచి వెలుపలికి రాలేకపోయింది. అందుచే వేకువన యజమానుడు వచ్చేసమయానికి [ఊపిరి బిగబట్టి వెల్లకిల] చచ్చినదానివలె పండుకొంది. తలంచినట్లు యజమానుడు ఉదయం వచ్చాడు. నక్కను చూచాడు-"ఇది చచ్చిపోయింది" అని తలంచాడు. ఎత్తుకున్నాడు. దూరంగా తీసికొనిపోయి పారవేశాడు. వెంటనే ఆ నక్క లేచి పాఱిపోయింది.

మూ. తతోఽసౌ వనే గత్వా ఆత్మానం నీలవర్ణ మవలోక్యాఽచిన్తయత్- "అహమిదానీ ముత్తమవర్ణః, తదహం స్వకీయోత్కర్షం కిం న సాధయామి"– ఇత్యాలోచ్య శృగాలా నాహూయ తేనోక్తమ్- 'అహం భగవత్యా వనదేవతయా స్వహస్తేనాఽరణ్యరాజ్యే సర్వౌషధిరసేనాఽభిషిక్తః. [పశ్యన్తు మమ వర్ణమ్] తదద్యాఽఽరభ్యాఽస్మదాజ్ఞయాఽస్మిన్నరణ్యే వ్యవహారః కార్యః.

అను. తర్వాత ఆ నక్క అడవికి పోయింది. తాను నల్లగా ఉండడం (మారడం) తెలిసికొంది. ఇలా తలంచింది- "నారంగు ఇప్పుడు ఉత్తమమైంది.

అందుచే నేను నాకు గొప్పతనాన్ని ఎందుకు సాధించుకోలేను" ఇలా తలంచి తక్కిన నక్కలను పిలిచింది. వాటితో ఇలా చెప్పింది- "నేను పూజ్యురాలైన వన దేవతచే సర్వౌషధీరసాలతో ఈ అరణ్యరాజ్యానికి ప్రభువుగా అభిషేకింపబడ్డాను. [నా రంగును చూడండి] అందువల్ల నేటినుండి నా ఆజ్ఞను అనుసరించియే ఈ అరణ్యంలో అన్నిపనులు జరుగాలి."

మూ. శృగాలాశ్చ తం విశిష్టవర్ణ మవలోక్య సాష్టాఙ్గపాతం ప్రణమ్యోచుః- 'యథాఽఽజ్ఞాపయతి దేవః' ఇతి. అనేనైవ క్రమేణ సర్వే ష్వరణ్యవాసి ష్వాధిపత్యం తస్య బభూవ. తతస్తేన వ్యాఘ్రసింహాఽఽదీ నుత్తమపరిజనాన్ ప్రాప్య, సదసి శృగాలా నవలోక్య లజ్జమానేనాఽ వజ్ఞయా స్వజాతయః సర్వే దూరీకృతాః.

అను. నక్కలు సైతం దాని నూతన (నీల)వర్ణం చూచాయి. సాష్టాంగంగా ప్రణమిల్లాయి- "ప్రభువు ఆజ్ఞాపించినట్లే" అని పల్కాయి.

ఇలా క్రమంగా దానికి ఆ అడవిలో ఉండే మృగాలు అన్నిటిపై ఆధిపత్యం లభించింది. అంతట పులులూ, సింహాలూ మొదలైన ఉత్తమజాతి సేవకులయోగం గల్గింది. అందువల్ల తన సభలో సజాతీయాలైన నక్కలను చూచి సిగ్గుపడింది. అలా అవమానించడంతో సాటిజాతికి చెందిన నక్కలు అన్నీ దూరమై పోయాయి.

మూ. తతో విషణ్ణాన్ శృగాలా నవలోక్య కేనచిద్ వృద్ధశృగాలే నైతత్ ప్రతిజ్ఞాతమ్-"మా విషీదత, యదనేనాఽనీతిజ్ఞేన వయం మర్మజ్ఞాః [స్వసమీపాత్] పరిభూతాః. తద్యథాఽయం నశ్యతి తథా విధేయమ్. యతోఽమీ వ్యాఘ్రాదయో వర్ణమాత్రవిప్రలబ్ధాః శృగాలమజ్ఞాత్వా రాజానమిమం మన్యన్తే. తద్యథాఽయం పరిచీయతే తథా కురుత. తత్ర చైవ మనుష్ఠేయం, యథా వదామి- సర్వే సన్ధ్యాసమయే తత్సన్నిధానే మహారావ మేకదైవ కరిష్యథ. తతస్తం శబ్ద మాకర్ణ్య జాతిస్వభావాత్ తేనాఽపి శబ్దః కర్తవ్యః యతః-

శ్లో. యః స్వభావో హి యస్యాఽస్తి స నిత్యం దురతిక్రమః,
శ్వా యది క్రియతే రాజా తత్కిం నాఽశ్నాత్యుపానహమ్. 60

తతః శబ్దా దభిజ్ఞాయ స వ్యాఘ్రేణ హన్తవ్యః" ఇతి. తత స్తథాఽనుష్ఠితే సతి తద్వృత్తమ్. తథా చోక్తమ్-

శ్లో. ఛిద్రం మర్మ చ వీర్యఞ్చ సర్వం వేత్తి నిజో రిపుః,
దహ త్యన్తర్గతశ్చైవ శుష్కం వృక్ష మివానలః. 61

అతోఽహం బ్రవీమి- 'ఆత్మపక్షం పరిత్యజ్య' ఇత్యాది.

అను. అప్పు డొక ముసలినక్క దుఃఖితులైన తనవారిని చూచి ఇలా ప్రతిజ్ఞ చేసింది- "దుఃఖపడకుడు. నీతి లేని ఈ నక్క తన మర్మం తెలిసిన మనలను (తన సమీపంనుండి) అవమానించి వెళ్ళగొట్టింది. ఇది నశించే పద్ధతిని (ఉపాయం) నేను చేస్తాను. ఈ పులులు మొదలైనవన్నీ దీని రంగుచే మోసపోయి దీన్ని రాజుగా తలుస్తూన్నాయి. ఇది నక్కగా గుర్తింపబడేటట్లు చేయాలి. అందుకై అందరు నేను చెప్పినట్లు చేయండి. ఏమన-

సాయంకాలం దాని ఎదుట అందరు ఒకేసారి బిగ్గరగా కూయండి. అప్పుడు అది ఆ గొప్ప కూతను విని జాతిస్వభావంచే తానుసైతం కూస్తుంది. ఏలననగా-

ఎవడికి ఏ స్వభావం ఉందో దాన్ని వాడు ఎన్నడూ వదలలేడు. కుక్కను రాజు చేసినా చెప్పులు తినడం మానదు గదా ! 60

అంతట ఆ కూతచే అది నక్కగా గుర్తింపబడుతుంది. పులిచే చంపబడుతుంది. పిమ్మట ఆ నక్కలు అలాగే చేశాయి. అంత ఆ నక్క పులిచే అలాగే చంపబడింది. విజ్ఞులు ఇలా అన్నారు-

తన దుర్బలతను, రహస్యాన్నీ, బలాన్ని ఇలా తక్కిన సర్వవిషయాలను ఎరింగిన తనవాడే శత్రువు అవుతాడు. వాడు ఎండిన చెట్టును దానిలోపల ఉండే అగ్నివలె దహించివేస్తాడు. 61

అందువల్ల నేను (మంత్రి అయిన చక్రవాకాన్ని) చెప్పుతూన్నాను- 'తన వారిని వదలి' ఇత్యాది.

మూ. రాజాఽఽహ-"యద్యేవం తథాపి దృశ్యతాం తావదయం దూరాదాగతః. తత్సఙ్గ్రహే విచారః కార్యః" ఇతి. చక్రో బ్రూతే- ప్రణిధిస్తావత్ ప్రహితో దుర్గఞ్చ సజ్జీకృతమ్. అతః శుకోఽప్యానీయ ప్రస్థాప్యతామ్. కిన్తు యోధబలసమన్వితో భూత్వా దూరాదేవ తమవలోకయ. యతః-

శ్లో. నన్దం జఘాన చాణక్య స్తీక్ష్ణదూతప్రయోగతః,
తద్ దూరా న్తరితం దూతం పశ్యేద్వీరసమన్వితః. 62

అను. రాజు ఇలా అన్నాడు- "అలాగే అగుగాక. ఇతను దూరంనుండి వచ్చాడు. కనుక మనలో చేర్చుకొనే విషయం అవశ్యం విచారించాలి." అందుకు చక్రవాకం ఇలా బదులు పల్కింది- "మనం మన గూఢచరుని (కొంగను) పంపాం. కోటసైతం సిద్ధం చేయబడింది. అందువల్ల (శత్రుదూత అయిన)చిలుకను గూడ సభకు పిలిపించి అతడిమాటలు విని వీడ్కోలు ఇద్దాం. కాని, ఆ రాయబారిని దూరంనుండియే చూడుము. నీదగ్గర యుద్ధవీరులను అప్పుడు సిద్ధంగా ఉంచుకొనుము. ఏలననగా-

చాణక్యుడు దూతవేషంతో వంచనగా ఒక యుద్ధవీరుని పంపి నంద భూపాలుడిని చంపాడు. అందువల్ల ప్రభువైనవాడు ఆత్మరక్షణకై వీరసైనికులను ఉంచుకొని దూరంనుండియే దూతను చూడాలి. 62

మూ. తతః సభాం కృత్వాఽఽహూతః శుకః కాకశ్చ. శుకః కిఞ్చిదున్నతశిరా దత్తాఽఽసనే ఉపవిశ్య బ్రూతే- "భో హిరణ్యగర్భ! త్వాం మహారాజాధిరాజః శ్రీమచ్చిత్రవర్ణః సమాజ్ఞాపయతి - యది జీవితేన శ్రియా వా ప్రయోజనమస్తి, తదా సత్వరమాగత్యాఽస్మచ్చరణౌ ప్రణమ. నోచే దవస్థాతుం స్థానా న్తరం పరిచి న్తయ" ఇతి. రాజా సకోపమాహ- "ఆః, సభాయా మస్మాకం న కోఽపి విద్యతే, య ఏనం గలహ స్తయతి."

అను. పిమ్మట రాజు సభను ఏర్పాటుచేశాడు. చిలుక, కాకి సభకు ఆహ్వా

నింపబడ్డాయి. చిలుక తన తలను కొంచెం పైకెత్తి(ఠీవిగా) తనకు ఏర్పాటుచేసిన పీఠంపై కూర్చుంది. ఇలా అంది-"ఓ హిరణ్యగర్భా! నిన్ను మహారాజాధిరాజులు శ్రీమాన్ చిత్రవర్ణులవారు ఇలా ఆజ్ఞాపిస్తున్నారు. ఏమన- "నీకు జీవితంపై గానీ రాజ్యసంపదపై గానీ ఉపయోగం (ఆశ) ఉంటే వెంటనే వచ్చి మా పాదాలకు ప్రణమిల్లుము. అలా గానిచో బ్రతుకడానికై వేఱే చోటును వెదుకుము."

అది విని హిరణ్యగర్భుడు కోపావిష్టుడై ఇలా అన్నాడు-"ఓరీ! ఈ మూర్ఖుణ్ణి గలహస్తుని చేసేందుకు [మెడ పట్టి గెంటేందుకు] ఎవరూ లేరా?"

మూ. తత ఉత్థాయ మేఘవర్ణో బ్రూతే-"దేవ! ఆజ్ఞాపయ. హన్మి చైనం దుష్టశుకమ్." తదా సర్వజ్ఞో [మన్త్రీ చక్రవాకః] రాజానం కాకఞ్చ సాన్త్వయన్ బ్రూతే- "భద్ర! మా మైవమ్." శృణు తావత్-

శ్లో. న సా సభా యత్ర న సన్తి వృద్ధాః
వృద్ధా న తే యే న వదన్తి ధర్మమ్,
ధర్మః స నో యత్ర న సత్యమస్తి
సత్యం న తద్యచ్ఛల మభ్యుపైతి. 63

అను. అంతట మేఘవర్ణుడు [సింహలద్వీపంనుండి వచ్చిన కాకి] లేచి ఇలా పల్కింది- "ప్రభూ! ఆజ్ఞ ఇవ్వండి. ఈ దుష్టశుకాన్ని సంహరిస్తాను" అప్పుడు సర్వజ్ఞుడు (చక్రవాకమంత్రి పేరు)రాజును, కాకిని శాంతింపజేస్తూ ఇలా అన్నాడు- "శుభమూర్తీ! వద్దు. అలా వద్దు. నా మాట వినండి_

వృద్ధులు లేనిది సభ గాదు. ధర్మం పల్కనివారు వృద్ధులు గారు. సత్య విహీనమైనది ధర్మం కాజాలదు. మోసంతో (కపటంతో) కూడినది సత్యం కాదు.

మూ. యతో రాజధర్మశ్చైషః-

శ్లో. దూతో మ్లేచ్ఛోఽప్యవధ్యః స్యాద్రాజా దూతముఖో యతః,
ఉద్యతేష్వపి శస్త్రేషు దూతో వదతి నాఽన్యథా. 64

అన్యచ్చ-

శ్లో. స్వాపకర్షం పరోత్కర్షం దూతోక్తై ర్మన్యతే తు కః,
సదైవాఽవధ్యభావేన దూతః సర్వం హి జల్పతి. 65

అను. ఏలనన- ఇది రాజధర్మం.

రాజు దూతయే వాక్కుగా కలవాడు అవడంవల్ల దూత అయినవాడు మ్లేచ్ఛుడు అయినా (నీచజాతీయుడైనా) అవధ్యుడే (చంపదగనివాడే). ఇందువల్ల ఆయుధాలు ఎత్తబడిఉండినా దూత అసత్యం పల్కడు. మరియూ- 64

దూతమాటలను అనుసరించి తనను తక్కువగానూ, శత్రువును ఎక్కువగానూ ఎవడూ తలంపడు. అతను(దూత) సర్వదా అవధ్యుడైన కారణంచే నిర్భయంగా మంచీ చెడూ అంతా మాట్లాడుతాడు. 65

మూ. తతో రాజా కాకశ్చ స్వాం ప్రకృతి మాపన్నౌ. శుకోఽ ప్యుత్థాయ చలితః. పశ్చాచ్చక్రవాకేణాఽఽనీయ కనకాలంకారాఽఽ దికం దత్వా ప్రబోధ్య సమ్ప్రేషితః స్వదేశం యయౌ. శుకోఽపి విన్ధ్యాఽచలం గత్వా స్వస్య రాజానం చిత్రవర్ణం ప్రణతవాన్.

తం విలోక్య రాజోవాచ- "శుక! కా వార్తా? కీదృశోఽసౌ దేశః?" శుకో బ్రూతే- ''సంక్షేపాదియం వార్తా. సమ్ప్రతి యుద్ధోద్యోగః క్రియ తామ్. దేశశ్చాసౌ కర్పూరద్వీపః స్వర్గైకదేశో, రాజా చ ద్వితీయః స్వర్గ పతిః. కథం వర్ణయితుం శక్యతే" ఇతి.

అను. అంతట రాజు కాకి పూర్వస్థితిని పొందారు (శాంతించారు). చిలుక లేచి కదిలింది. వెనువెంటనే మంత్రి అయిన చక్రవాకం ఆ చిలుకకు నచ్చచెప్పి నిలిపింది. బంగారు ఆభరణాలు మొదలైనవి ఇచ్చింది. తగిన సందేశం బోధించింది. సాదరంగా పంపింది. పిమ్మట చిలుకయూ తన దేశం వెళ్ళింది. తర్వాత వింధ్యపర్వతానికి పోయింది. తన ప్రభువైన చిత్రవర్ణుణ్ణి దర్శించింది. ప్రణామం చేసింది.

చిలుకను చూచి రాజు(చిత్రవర్ణుడు) అడిగాడు- "ఓ చిలుకా ! వార్త ఏమి? ఆ దేశం ఎలా ఉంది ?"

చిలుక ఇలా చెప్పింది- ''దేవ ! సంగ్రహంగా విషయం ఇది. యుద్ధ ప్రయత్నం చేయండి. ఆ కర్పూరద్వీపదేశం స్వర్గంలో ఒక భాగమే. ప్రభువు రెండో ఇంద్రుడు (స్వర్గపతి). దాన్ని ఏమని వర్ణింపగలను" (వర్ణనాతీతం అని భావం).

మూ. తతః సర్వాన్ శిష్టా నాహూయ రాజా మన్త్రయితు ముపవిష్టః. ఆహ చ తాన్- "సమ్ప్రతి కర్తవ్యే విగ్రహే యథాకర్తవ్య ముపదేశం బ్రూత. విగ్రహః పునరవశ్యం కర్తవ్యః. తథా చోక్తమ్-

శ్లో. అసన్తుష్టా ద్విజా నష్టాః సన్తుష్టాశ్చ మహీభుజః,
సలజ్జా గణికా నష్టా నిర్లజ్జాశ్చ కులాఙ్గనాః. 66

అను. పిమ్మట రాజు (చిత్రవర్ణుడు = నెమలి) సభాసదులను అందరిని ఆహ్వానించాడు. వారితో ఇలా అన్నాడు- "ఇప్పుడు చేయవలసిన యుద్ధంలో ఎలా ప్రవర్తించాలో బోధింపండి. యుద్ధం అయితే అవశ్యం చేయదగియే ఉంది. విజ్ఞులు ఇలా అన్నారు-

సంతుష్టిలేని బ్రాహ్మణులూ, సంతుష్టులైన క్షత్రియులూ, సిగ్గుగల వేశ్యలూ, సిగ్గులేని కులస్త్రీలూ నశిస్తారు.''

మూ. అథ దూరదర్శీ నామ గృధ్రో మన్త్రీ బ్రూతే- 'దేవ! వ్యసనితయా విగ్రహో న విధిః. యతః—

శ్లో. మిత్రాఽమాత్యసుహృద్వర్గా యదా స్యు ర్దృఢభక్తయః,
శత్రూణాం విపరీతాశ్చ కర్తవ్యో విగ్రహ స్తదా. 67

అన్యచ్చ-

శ్లో. భూమి ర్మిత్రం హిరణ్యఞ్చ విగ్రహస్య ఫలం త్రయమ్,
యదైత త్త్రితయం భావి కర్తవ్యో విగ్రహ స్తదా. 68

అను. అంతట దూరదర్శి అనే పేరుగల గ్రద్ద ఇలా చెప్పింది- "దేవా! మనం వ్యసనంలో-అనగా మిత్రులు, మంత్రులు, ప్రజలు, సైన్యం ఇత్యాదికం అనుకూలంగా లేని సమయంలో, యుద్ధంచేయడం మంచిదిగాదు. ఏలనన-

మిత్రులు, మంత్రులు, సుహృత్తులు (= ఆత్మీయులు) తనయందూ దేశంనందు అచంచలమైన భక్తితో ఉన్నప్పుడు- శత్రువులకు మాత్రం పైవర్గం వ్యతిరేకంగా ఉన్నప్పుడు యుద్ధం చేయాలి. 67

మరియూ- భూమి, మిత్రం, కనకం- అనే ఈ మూడే యుద్ధానికి ప్రయోజనం అంటారు. ఈ మూడూ లభిస్తాయి అనే నిశ్చయం ఉన్నచోట యుద్ధం చేయాల్సిందే."

మూ. రాజాఽఽహ— "అస్మద్బలం తావదవలోకయతు మన్త్రీ. తథై తేషా ముపయోగో జ్ఞాయతామ్. ఏవ మాహూయతాం మౌహూర్తికః. స యాత్రార్థం శుభలగ్నం నిర్ణీయ దదాతు".

మన్త్రీ బ్రూతే- "దేవ! తథాపి సహసా యాత్రాకరణ మనుచితమ్. యతః-

శ్లో. విశన్తి సహసా మూఢా యేఽవిచార్య ద్విషద్బలమ్,
ఖడ్గధారాపరిష్వఙ్గం లభన్తే తే సునిశ్చితమ్. 69

అను. రాజు ఇలా చెప్పాడు-"మంత్రిగారు మొదట మన సైన్యయోగ్యతను నిరీక్షించండి. తర్వాత ఆ సైనికులను ఉపయోగించే విధానాన్ని గమనించండి. అందుకు తగిన శుభముహూర్తం నిర్ణయించేందుకు జ్యోతిష్కుని (పురోహితుని) పిలవండి."

అది విని మంత్రి ఇలా అన్నాడు- "ప్రభూ! తొందరపడి యుద్ధయాత్ర చేయడం సముచితం గాదు. ఏలనన-

"శత్రుబలాన్ని గుర్తింపక తొందరపాటున ఎవరైతే శత్రుదేశంలో ప్రవేశిస్తారో అలాంటివారు ఖడ్గధారను కౌగలించుకొంటున్నారు. అనగా తమ గొంతులను తామే కోసుకొనుచున్నారు" అని భావం. 69

మూ. రాజాఽఽహ- "మన్త్రిన్! మమోత్సాహభఙ్గం సర్వథా మా కృథాః. విజిగీషుర్యథా పరభూమి మాక్రామతి, తథా కథయ" ఇతి. గృధ్రో బ్రూతే- 'దేవ! తత్కథయామి. కిన్తు తదనుష్ఠితమేవ ఫలప్రదమ్. తథా చోక్తమ్-

శ్లో. కిం మన్త్రేణాఽననుష్ఠానే శాస్త్రవిత్పృథివీపతేః,
న హ్యౌషధిపరిజ్ఞానాద్ వ్యాధేః శాన్తిః క్వచిద్భవేత్. 70

రాజాఽఽదేశ శ్చాఽనతిక్రమణీయః ఇతి యథాశ్రుతం కథయామి, శృణు. దేవ!

శ్లో. నద్యద్రివనదుర్గేషు యత్ర యత్ర భయం నృప,
తత్ర తత్ర చ సేనానీ ర్యాయాద్ వ్యూహీకృతై ర్బలైః. 71

అను. అది విని రాజు ఇలా చెప్పాడు- "ఓ మంత్రిగారూ! నాకు ఉత్సాహభంగాన్ని ఎట్టి పరిస్థితులలోనూ కల్గింపవద్దు. విజయేచ్ఛ గల భూపాలుడు శత్రురాజ్యాన్ని ఎలా ఆక్రమిస్తాడో దాన్ని తెలుపండి." అందుకు గ్రద్ద ఇలా అంది- "ప్రభూ! అది విన్నవిస్తాను. కాని ఆచరిస్తేనే అది ఫలం ఇస్తుంది. అందుకే విజ్ఞులు ఇలా అన్నారు-

ఎంతటి రాజనీతిశాస్త్రం తెలిసిన రాజైనా మంత్రాన్ని (ఆలోచనను) ఆచరింపనిచో ఉపయోగం ఏమీ లేదు. వైద్యశాస్త్రంద్వారా ఔషధాల జ్ఞానంవల్ల (ఆ ఔషధాలను సేవింపక) రోగం శాంతింపదు గదా. 70

"ప్రభువుల ఆజ్ఞ దాట వీలుగానిది" అని తలంచి శాస్త్రాన్ని అనుసరించి చెప్పుతున్నాను. వినుడు- ఓ ప్రభూ!

నదులు, పర్వతాలు, అడవులు, దుర్గమప్రదేశాలు మొదలైన స్థలాల్లో ఎచ్చటెచ్చట అపాయభయం ఉంటుందో, అచ్చటచ్చట సేనాధిపతి సేనను వ్యూహాలుగా విభజించి ప్రయాణం చేయాలి. 71

శ్లో. బలాధ్యక్షః పురో యాయాత్ ప్రవీరపురుషాన్వితః,
మధ్యే కలత్రం స్వామీ చ కోశః ఫల్గు చ యద్బలమ్. 72

శ్లో. పార్శ్వయో రుభయో రశ్వా అశ్వానాం పార్శ్వతో రథాః,
రథానాం పార్శ్వతో నాగా నాగానాఞ్చ పదాతయః. 73

శ్లో. పశ్చాత్ సేనాపతి ర్యాయాత్ ఖిన్నానాశ్వాసయన్ శనైః,
మన్త్రిభిః సుభటై ర్యుక్తః ప్రతిగృహ్యా బలం నృపః. 74

శ్లో. సమేయాద్ విషమం నాగై ర్జలాఢ్యం సమహీధరమ్,
సమమశ్వై ర్జలం నౌభిః సర్వత్రైవ పదాతిభిః. 75

అను. మహావీరులైన సైనికులతో గూడి సేనాపతి సేనకు ముందుగా పోవాలి. నడుమ అంతఃపురకాంతలు, ప్రభువు (వృద్ధప్రభువు), ధనాగారం సామాన్యసైనికులు (అల్పబలం) ఉండాలి. 72

ఇరుప్రక్కల గుఱ్ఱపుదళం, దానికి ప్రక్కన రథికులు (రథసైన్యం) ఆమీదట అనగా- రథికుల ప్రక్కన గజబలం, ఆ తర్వాత కాల్బలం ఉండాలి.

వెనుక వేఱొక సేనాధిపతి అలసిపోయిన సైనికులను ఉత్సాహకరమైన మాటలతో వారి అలసటను పోగొట్టుతూ పయనించాలి. వీరికి వెనుక మంత్రుల తోడనూ మహావీరులైన సైనికులతోడనూ పరివేష్టితుడై భూపాలుడు పయనించాలి. 74

హెచ్చుతగ్గులు గల విషమభూములందూ, నీటితో గూడిన ప్రదేశాలందూ, కొండప్రాంతాలయందూ, ఏనుగుబలాన్ని ఆధారంగా చేసికొనియూ, పెద్ద పెద్ద నదులు గల ప్రదేశాలనూ నౌకలను ఆధారంగా చేసికొనియూ, సమప్రదేశాలను గుఱ్ఱపుదళంద్వారానూ, మిగిలిన అన్నిప్రదేశాలనూ కాల్బలంద్వారాను పయనించాలి. 75

శ్లో. హస్తినాం గమనం ప్రోక్తం ప్రశస్తం జలదాగమే,
తదన్యత్ర తురఙ్గాణాం పత్తీనాం సర్వదైవ హి. 76

శ్లో. శైలేషు దుర్గమార్గేషు విధేయం నృపరక్షణమ్,
స్వయోధై రక్షితస్యాఽపి శయనం యోగనిద్రయా. 77

శ్లో. నాశయేత్ కర్షయే చ్ఛత్రూన్ దుర్గకణ్టకమర్దనైః,
పరదేశప్రవేశే చ కుర్యా దాటవికాన్ పురః. 78

అను. వానకాలంలో ఏనుగుల సైన్యంతోడి జైత్రయాత్ర శ్రేష్ఠం. తక్కిన అన్ని కాలాలలో అశ్వదళం, కాల్బలం ఎక్కువ ఉపయోగకరాలు. 76

పర్వతప్రాంతాలలో (దారులు సరిగాలేని) దుర్గమప్రదేశాలలో రాజరక్షణ విషయంలో ఎక్కువ శ్రద్ధ వహించాలి. తన వీరులు రక్షిస్తూ ఉన్నా ప్రభువు సైతం యోగనిద్రలో ఉన్నట్లు నిత్యం జాగరూగతతో ఉండాలి. 77

కోటను ధ్వంసంచేసి ఇతర ఆటంకాలను తొలగించుకొని శత్రువులను నాశం చేయాలి. శత్రుదేశంలో ప్రవేశించడానికి ముందు ఆటవికులను లంచం మొదలైనవాటిద్వారా లోబఱచుకొని వారిని ముందుంచుకొనడం శుభం. 78

శ్లో. యత్ర రాజా తత్ర కోశో వినా కోశం న రాజతా,
సుభటేభ్య స్తతో దద్యాత్ కో హి దాతు ర్న యుధ్యతే. 79

యతః—

శ్లో. న నరస్య నరో దాసో దాస స్త్వర్థస్య భూపతే,
గౌరవం లాఘవం వాపి ధనాఽధననిబన్ధనమ్. 80

శ్లో. అభేదే న చ యుద్ధ్యేత రక్షేచ్చైవ పరస్పరమ్,
ఫల్గుసైన్యఞ్చ యత్కిఞ్చి న్మధ్యే వ్యూహస్య కారయేత్. 81

అను. రాజు ఉన్నచోటనే ధనాగారం ఉండాలి. ధనం లేనిచో రాజరికం ఉండదు. అందువల్ల వీరులైన భటులకు ప్రభువు అధికంగా ధనం ఇవ్వాలి. దాత అయిన ప్రభువునకై సేవకుడు ప్రాణం ఒడ్డి యుద్ధం చేస్తాడు. 79

ఏలనననగా- ఓ రాజా ! మానవుడు మానవునకు ఎన్నడూ దాసుడు లేదు. ధనానికే దాసుడు. కలిమిచే గౌరవం, లేమిచే అగౌరవం సంభవిస్తాయి. 80

సైనికులు అంతా కలిసి యుద్ధం చేయడం- (సంకులసమరం చేయడం)

ఒక సైనికుడు మరొక్క సై  రక్షించడం బలహీనసైన్యాన్ని వ్యూహానికి నడుమ ఉంచడం ముఖ్యమైన విషయాలుగా గుర్తించాలి. 81

శ్లో. పదాతీంశ్చ మహీపాలః పురోఽనీకస్య యోజయేత్,
ఉపరుధ్యారిమాసీత రాష్ట్రం చాఽస్యోపపీడయేత్. 82

శ్లో. స్యన్దనాశ్వైః సమే యుద్ధ్యే దనూపే నౌద్విపై స్తథా,
వృక్షగుల్మాఽఽవృతే చాపై రసిచర్మాఽఽయుధైః స్థలే. 83

శ్లో. దూషయేచ్చాస్య సతతం యవసాన్నోదకేన్ధనమ్,
భిన్ద్యాచ్చైవ తటాకాని ప్రాకారాన్ పరిఖా స్తథా. 84

శ్లో. బలేషు ప్రముఖో హస్తీ న తథాఽన్యో మహీపతేః,
నిజై రవయవైరేవ మాతఙ్గోఽష్టాయుధః స్మృతః. 85

అను. ప్రభువు కాల్బలాన్ని సేనకు ముందుగా ఉంచాలి. శత్రువును నాల్గువైపులనుండి చుట్టుముట్టాలి. శత్రురాజ్యాన్ని లూటీలు, హత్యలు, సస్యనాశం ఇత్యాదులచే పీడించాలి. 82

సమప్రదేశాలలో రథాలతో, జలప్రాంతాలతో, నౌకలతో, ఏనుగులతో, చెట్లు, పొదలు గల ప్రదేశాలలో విలుకాండ్రతో, ఇతరస్థలాలలో ఖడ్గాది ఆయుధ ధారులతో గూడినవాడై ప్రభువు శత్రువుతో యుద్ధం చేయాలి. 78

మరియూ శత్రుసంబంధమైన పశుగ్రాసం, ఆహారవస్తువులు, నీరు మొద లైన నిత్యావసరవస్తువులను విషాదికంచే కలుషితం చేయాలి. చెరువుగట్లు, కోట గోడలు, అగడ్తలు మొదలైనవాటిని ధ్వంసం చేయాలి. 84

రాజుయొక్క సైన్యంలో ఏనుగంత ముఖ్యమైంది ఏదీ లేదు. తన అవ యవాలచేతనే ఏనుగును అష్టాయుధం అంటారు. [అనగా–(1) తొండం (2) తోక (3,4) రెండుకోరలు (5,6,7,8) నాల్గుపాదాలు మొత్తం ఎనిమిది అవయవాలు ఏనుగునకు ఆయుధాలు]. 85

శ్లో. బల మశ్వశ్చ సైన్యానాం ప్రాకారో జఙ్గమో యతః,
తస్మా దశ్వాధికో రాజా విజయీ స్థలవిగ్రహే 86

తథా చోక్తమ్-

శ్లో. యుధ్యమానా హయారూఢా దేవానామపి దుర్జయాః,
అపి దూరస్థితా స్తేషాం వైరిణో హస్తవర్తినః. 87

శ్లో. ప్రథమం యుద్ధకారిత్వం సమస్తబలపాలనమ్,
దిఙ్మార్గాణాం విశోధిత్వం పత్తికర్మ ప్రచక్షతే. 88

శ్లో. స్వభావశూర మస్త్రజ్ఞం త్వవిరక్తం జితశ్రమమ్,
ప్రసిద్ధక్షత్రియప్రాయం బలం శ్రేష్ఠతమం విదుః. 89

అను. అశ్వం (గుఱ్ఱం) సైతం సేనకు ఒక విధంగా ముఖ్యమైన బలమే. అది సంచరించే ప్రాకారంతో సమానం. మైదానయుద్ధంలో ఆశ్వికదళం అధికంగా ఉండే ప్రభువే విజయం పొందుతాడు. 86

విజ్ఞులు ఇలా అన్నారు— ఆశ్వికవీరులు దేవతలకునూ అజేయులు. వారికి దూరంలో ఉండే శత్రువులుగూడ చేతిలో ఉన్నట్లే. 87

సమస్తసేనకు ముందుండి యుద్ధం చేయడం, సేన నంతనూ రక్షించడం, అన్ని దిక్కులకు పోయే దారులను గుర్తించి నిర్మించడం కాల్బలంయొక్క పనులు. 88

సహజంగా వీరులూ, ఆయుధప్రయోగనిపుణులూ, ప్రభుభక్తిపరులూ, శ్రమజీవులూ, ప్రసిద్ధక్షత్రియజాతీయులూ అయిన సైనికులతో నిండిన సేనను సర్వశ్రేష్ఠం అంటారు. 89

శ్లో. యథా ప్రభుకృతా న్మానా ద్యుధ్యన్తే భువి మానవాః,
న తథా బహుభి ర్దత్తై ర్ద్రవిణై రపి భూపతేః. 90

శ్లో. వర మల్పబలం సారం న కుర్యా న్ముణ్డమణ్డలీమ్,
కుర్యా దసారభఙ్గో హి సారభఙ్గమపి స్ఫుటమ్. 91

శ్లో. అప్రసాదోఽనధిష్ఠానం దేయాంశహరణం చ యత్,
కాలయాపోఽప్రతీకార స్తద్వైరాగ్యస్య కారణమ్. 92

శ్లో. అపీడయన్ బలం శత్రూన్ జిగీషు రభిషేణయేత్,
సుఖసాధ్యం ద్విషాం సైన్యం దీర్ఘయానప్రపీడితమ్. 93

అను. ఈ ప్రపంచంలో మానవుడు ప్రభువువల్ల సన్మానం పొంది అతడికై ఎంతగా యుద్ధం చేస్తాడో- అంతగా ఇతరులు ధనాదికం ఇచ్చినా చేయడు. 90

పరాక్రమం, యుద్ధనైపుణ్యం గల్గిన సైన్యం పరిమాణంలో తక్కువగా ఉన్నా శ్రేష్ఠమే. (ముండలగుంపు వంటి) పిరికిపందలతోడి సైన్యం ఎంత గొప్ప దైనా ఉపయోగం లేదు. మొదట ఈ పిరికిపందలతోడి సైన్యం ఓడిపోతే తర్వాత వీరసైనికసైన్యం సైతం తప్పక ఓడిపోతుంది. 91

విక్రమాదికం గుర్తించి సన్మానించకపోవడం, సరియైన సేనాపతి లేక పోవడం, ఇవ్వదగిన వేతనాన్ని తగ్గించి ఇవ్వడం, సమయం దాటిన తర్వాత ఇవ్వడం, సైనికుల ఇబ్బందులకు ప్రతీకారం చేయకపోవడం అనే ఈ అయిదు సైనికుల విరక్తికి కారణాలు అంటారు. 92

విజయం కోరే ప్రభువు దీర్ఘప్రయాణంద్వారా తన సైన్యానికి బడలిక కల్గింపరాదు. చిన్న చిన్న ప్రయాణాలు చేస్తూ శత్రువుపై దాడిచేయాలి. శత్రు సైన్యం దీర్ఘప్రయాణంచే అలసిఉంటే విజయం తేలిగ్గా సిద్ధిస్తుంది. 93

శ్లో. దాయాదా దపరో యస్మా న్నాస్తి భేదకరో ద్విషామ్,
తస్మా దుత్థాపయే ద్యస్మా ద్దాయాదం తస్య విద్విషః. 94

శ్లో. సన్ధాయ యువరాజేన యది వా ముఖ్యమన్త్రిణా,
అన్తః ప్రకోపణం కుర్యా దభియోక్తా స్థిరాత్మనః. 95

శ్లో. క్రూరాఽమిత్రం రణే చాఽపి భజ్గం కృత్వా విఘాతయేత్,
అథవా గోగ్రహాకృష్ట్యా తన్ముఖ్యాఽఽశ్రితబన్ధనాత్. 96

శ్లో. స్వరాజ్యం వాసయే ద్రాజా పరదేశాపహారణాత్,
అథవా దానమానాభ్యాం వాసితం ధనదం హి తత్. 97

అను. శత్రురహస్యాలు తెలిసికొనడానికి, అతణ్ణి ఓడించడానికి, అతడి దాయాదిని లోబఱచుకోడం కంటె శ్రేష్ఠమైన ఉపాయం ఏదీ లేదు. అందువల్ల అధికంగా యత్నించి శత్రుభాగస్వాములను లోలోపల ప్రోత్సహించి అతడికి విరుద్ధంగా నిలపడం, విజయం కోరే ప్రభువుకు ముఖ్యకర్తవ్యం. 94

దుర్గాదికంచే బలవంతుడైన శత్రుభూపాలుడిని ఓడించాలంటే యువరాజుతో గానీ, ముఖ్యమంత్రితోగానీ రహస్యమైన సంధిని చేసికొని శత్రుపక్షంలో విద్రోహం పుట్టునట్లు చేయాలి. 95

దుష్టుడైన శత్రువును యుద్ధంలో ఓడించి చంపివేయాలి. అలా కానిచో దూడను బంధిస్తే దానికొఱకు వచ్చిన ఆవును బంధించడం తేలిక అయినట్లుగా- శత్రువునకు మిక్కిలి ప్రియమైన బంధువునో ఆప్తున్నో బంధించడంద్వారా శత్రువును స్వాధీనపఱచుకొనాలి. తర్వాత సంహరించాలి. దీన్నే గోగ్రహాకృష్టిన్యాయం అంటారు. 96

ప్రభువు శత్రుదేశంలో అరాజకత్వాది ఆపదలు పుట్టించడంద్వారా అచ్చటి ప్రజలు తన దేశంలోకి వచ్చునట్లు చేయాలి. అలా కానిచో ధనం ఇచ్చిగానీ సన్మానాదులు చేసిగానీ శత్రుదేశవాసులు తన రాజ్యంలోనికి వచ్చి నివసించేటట్లు చేయాలి. అలా చేయడంవల్ల వారి వ్యవసాయవాణిజ్యాదివృత్తులద్వారా మరియూ వారు ఇచ్చే పన్నులద్వారా రాజసంపద వృద్ధి చెందుతుంది. 97

మూ. అథవా కిం బహునోదితేన-

శ్లో. ఆత్మోదయః పరగ్లాని ర్ద్వయం నీతి రితీయతీ,
తదూరీకృత్య కృతిభి ర్వాచస్పత్యం ప్రతాయతే. 98

అథ రాజ్ఞా విహస్యోక్తమ్-

శ్లో. అన్య దుచ్ఛృఙ్ఖలం సత్త్వ మన్య చ్ఛాస్త్రనియన్త్రితమ్,
సామానాధికరణ్యం హి తేజస్తిమిరయోః కుతః. 99

తత ఉత్థాయ రాజా మౌహూర్తికాऽऽవేదితలగ్నే ప్రస్థితః.

అను. అధికంగా తెల్పడం దేనికి?

తన అభివృద్ధి, శత్రువుయొక్క అవనతి అనే ఈ రెండే సమస్తరాజనీతికి సారాంశాలు. దీన్ని దృష్టిలో ఉంచుకొని విద్వాంసులు తమ పాండిత్యాన్ని ప్రకటిస్తారు 98

ఇది విని రాజు చిరునవ్వు చిందిస్తూ ఇలా అన్నాడు—

'పరాక్రమం ఏలాంటి శృంఖలాలు (గొలుసులు - బంధాలు) లేనిది అని ఒక ప్రక్కన అంటారు. రాజనీతిశాస్త్రంచే నియమితమైంది బలం అని మరొక ప్రక్కన అంటారు. ఇలా చీకటివెలుగులవలె ఉండే ఈ రెంటికి ఏ విధంగా ఏకాశ్రయత్వం లభిస్తుంది? 99

ఇలా అని రాజు అచ్చటినుండి లేచాడు. జ్యోతిష్కులు సూచించిన శుభలగ్నంలో యుద్ధప్రయాణం చేశాడు.

మూ. అథ ప్రహితప్రణిధి శ్చరో హిరణ్యగర్భ మాగత్య ప్రణమ్యోవాచ-

"దేవ! సమాగతప్రాయో రాజా చిత్రవర్ణః. సమ్ప్రతి మలయపర్వతాధిత్యకాయాం సమావాసితకటకో వర్తతే. దుర్గశోధనం ప్రతిక్షణమనుసన్ధాతవ్యమ్. యతోऽసౌ గృధ్రో మహామన్త్రీ. కిఞ్చ కేనచిత్ సహ తస్య విశ్వాసకథాప్రసఙ్గేన తదిఙ్గిత మవగతం మయా, యత్- అనేకోऽప్యస్మద్దుర్గే నియుక్త" ఇతి. చక్రవాకో బ్రూతే-'దేవ! కాక ఏవాऽసౌ సమ్భవతి.'

అను. ఇక అచ్చట కర్పూరద్వీపంలో ఉండే రాజహంస అయిన హిరణ్యగర్భుడివద్దకు ప్రధానగుప్తచరుడైన కొంగద్వారా పంపబడిన మరియొక గుప్తచరుడైన కొంగ వచ్చింది. నమస్కరించి ఇలా విన్నవించింది-

"ప్రభూ! [జంబూద్వీప పక్షిరాజైన] చిత్రవర్ణుడు యుద్ధానికి సిద్ధమై వచ్చినట్లేతలంచాలి. ప్రస్తుతం మలయపర్వత ప్రాంతంలో సైన్యంతో విడిది చేసి ఉన్నాడు.

మనకోటను ప్రతిక్షణం పరీక్షిస్తూ ఉండాలి. ఏలననగా-అచ్చట మహామంత్రి గ్రద్ధ సమర్థుడు. మరియూ అతడి రహస్యసంభాషణ సంకేతం ద్వారా- 'అతడి (గుప్త చరుడు) వేగు ఒకడు మనకోటలో ముందుగానే నియమితుడై ఉన్నట్లు నేను గ్రహించాను.'

అది విని మంత్రి అయిన చక్రవాకం ఇలా అంది- 'ప్రభూ! అతడి వేగు ఈ కాకి కావచ్చును.'

మూ. రాజాఽఽహ- 'న కదాచి దేతత్! యద్యేవం తదా కథం తేన శుకస్యాఽభిభవోద్యోగః కృతః? అపరఞ్చ; శుకస్యాఽఽగమనాత్ తస్య విగ్రహోత్సాహః. స చ చిరాదత్రాఽఽస్తే' ఇతి. మన్త్రీ బ్రూతే- తథాప్యాగన్తుకః శఙ్కనీయః'. రాజాఽఽహ- 'ఆగన్తుకా అపి కదాచి దుపకారకా దృశ్యన్తే. శృణు-

శ్లో. పరోఽపి హితవాన్ బన్ధు ర్బన్ధుర ప్యహితః పరః,
అహితో దేహజో వ్యాధి ర్హిత మారణ్య మౌషధమ్. 100

అను. ఆ మాట విని రాజు (హిరణ్యగర్భుడు) ఇలా చెప్పాడు– "అలా ఎప్పటికీ గాదు. అలా అయితే అతను చిలుకను అవమానించడానికి ఎందుకు ప్రయత్నిస్తాడు ? మరియూ చిలుక ఇచ్చటికి వచ్చినప్పటినుండియే అతడికి(చిత్ర వర్ణుడికి) యుద్ధోత్సాహం పుట్టింది. ఈ కాకి అయితే చాలాకాలంగా ఇచ్చట ఉంది." అందుకు మంత్రి (చక్రవాకం) ఇలా అంది- 'అయినా ఇతడు క్రొత్తగా వచ్చిన వాడు. అందువల్ల సంశయాస్పదుడు.' అది విని రాజు ఇలా చెప్పాడు- 'ఆగంతుకులు సైతం (క్రొత్తగా చేరినవారునూ) ఒకప్పుడు ఉపకర్తలుగా కనబడుతున్నారు. వినండి–

ఇతరుడైనా మేలుచేసేవాడు బంధువు. బంధువైనా కీడుచేసేవాడు శత్రువు. తన దేహంలో పుట్టినదైనా రోగం కీడు చేస్తుంది. అడవిలో పుట్టినదైనా మూలిక మేలు చేస్తుంది. 100

అపరఞ్చ -

శ్లో. ఆసీద్వీరవరో నామ శూద్రకస్య మహీభృతః,
సేవకః స్వల్పకాలేన స దదౌ సుతమాత్మనః. 101

చక్రవాకః పృచ్ఛతి- 'కథమేతత్?' రాజా కథయతి-

అను. మరియూ- శూద్రకుడు అనే ప్రభువునకు వీరవరుడు అనే సేవకుడు ఉండేవాడు. అతడు స్వల్పకాలంలోనే అనగా క్రొత్తగా కొలువులో చేరినవాడైనా రాజహితానికై తన కొడుకును దుర్గాదేవికి సమర్పించాడు.

చక్రవాకం అడిగింది— 'అది ఎట్లు?'

రాజు ఇలా చెప్పసాగాడు—

# 8. వీరవర కథా

## [వీరవరుడి కథ]

మూ. అహం పురా శూద్రకస్య రాజ్ఞః క్రీడాసరసి కర్పూరకేలి నామ్నః రాజహంసస్య పుత్ర్యా కర్పూరమఞ్జర్యా సహానురాగవా నభవమ్. [తత స్తత్ర న్యవసమ్.] తదా వీరవరో నామ మహాన్ రాజపుత్రః కుతశ్చిద్దేశా దాగత్య రాజద్వార ముపగమ్య ప్రతీహారమువాచ- "అహం వర్తనార్థీ రాజపుత్రః. మాం రాజదర్శనం కారయ." తత స్తేనాఽసౌ రాజదర్శనం కారితో బ్రూతే- 'దేవ! యది మయా సేవకేన ప్రయోజన మస్తి, తదాఽస్మద్వర్తనం క్రియతామ్.'

అను. పూర్వం శూద్రకుడు అనే ఒక రాజు ఉండేవాడు. ఆ రాజుయొక్క క్రీడాసరోవరంలో కర్పూరకేలి అనే రాజహంస సకుటుంబంగా వసించేది. ఆ హంసపుత్రిక కర్పూరమంజరి. నేను ఆ కర్పూరమంజరిని ప్రేమించాను. అందువల్ల ఆ కొలనులోనే ఉండేవాణ్ణి. అప్పుడు వీరవరుడు అనే మహాగుణుడు అయిన ఒక రాజపుత్రవీరుడు ఏ దేశం నుండియో వచ్చాడు. రాజద్వారం వద్దకు పోయాడు. ద్వారపాలకుడితో ఇలా చెప్పాడు- 'నేను జీవికను(ఉద్యోగం-నౌకరి) అర్థించే రాజ

పుత్రవీరుడను. నాకు రాజదర్శనం గల్గింపుము. ద్వారపాలకుడు అలాగే అతడికి రాజదర్శనం గల్గించాడు. అంత అతడు ప్రభువునకు ఇలా విన్నవించాడు-'ప్రభూ! నేను నౌకరిని అర్థిస్తూ వచ్చిన రాజపుత్రజాతీయుణ్ణి. నాసేవవల్ల తమకు ఉప యోగం ఉంటే ఏదేని నౌకరిని అనుగ్రహించండి.'

మూ. శూద్రక ఉవాచ- 'కిం తే వర్తనమ్?'

వీరవరో బ్రూతే- 'ప్రత్యహం సువర్ణపఞ్చశతాని దేహి.'

రాజాఽఽహ- 'కా తే సామగ్రీ?'

వీరవరో బ్రూతే- 'ద్వౌ బాహూ, తృతీయశ్చ ఖడ్గః.'

రాజాఽఽహ-'నైతచ్ఛక్యమ్.'

తచ్ఛ్రుత్వా వీరవరః ప్రణమ్య చలితః. అథ మన్త్రిభి రుక్తమ్- 'దేవ! దినచతుష్టయస్య వర్తనం దత్త్వా జ్ఞాయతామస్య స్వరూపమ్. కి ముపయుక్తోఽయ మేతావద్వర్తనం గృహ్ణాతి, అనుపయుక్తో వా'ఇతి.తతో మన్త్రివచనా దాహూయ వీరవరాయ తామ్బూలం దత్త్వా పఞ్చశతాని సువర్ణాని దత్తాని.

అను. శూద్రకుడు అడిగాడు—'నీ జీతం ఎంత?

వీరవరుడు—'రోజుకు అయిదువందల బంగారు నాణెములు ఇప్పించండి.'

రాజు—'నీ సామగ్రి ఏమి?'

వీర—'రెండు చేతులు. మూడవది ఖడ్గం.'

రాజు—'ఇంత వేతనం ఇవ్వడానికి వీలు గాదు.

అది విని వీరవరుడు రాజుకు నమస్కరించాడు. అచ్చటినుండి కదిలాడు. అంత మంత్రులు ప్రభువునకు ఇలా విన్నవించారు-'ప్రభూ! నాల్గు దినాలకు జీతం ఇచ్చి ఇతడి స్వరూపం పరీక్షిద్దాం. ఇతను ఇంత భృతికి అర్హుడో కాదో తెలుస్తుంది'- అంతట రాజు మంత్రుల మాట ప్రకారం వీరవరుణ్ణి వెనక్కు పిలిపించాడు. తాంబూలంతో బాటు అతనికి అయిదువందల బంగారునాణాలు ఇచ్చాడు.

మూ. వర్తనవినియోగశ్చ రాజ్ఞా సునిభృతం నిరూపితః. తదర్ధం వీరవరేణ దేవేభ్యో బ్రాహ్మణేభ్యో దత్తమ్. స్థితస్యార్ధం దుఃఖితేభ్యః, తదవశిష్టం భోజ్యవిలాసవ్యయేన. ఏతత్సర్వం నిత్యకృత్యం కృత్వా రాజద్వార మహర్నిశం ఖడ్గపాణిః సేవతే. యదా చ రాజా స్వయం సమాదిశతి తదా స్వగృహమపి యాతి.

అను. తీసుకొన్న అంత పెద్ద జీతాన్ని వీరవరుడు ఎలా ఖర్చు చేసేది రాజు ప్రచ్ఛన్నంగా (రహస్యంగా) తెలుసుకున్నాడు. ఇది ఇలా ఉంది-సగం ధనాన్ని దైవకార్యాలకు బ్రాహ్మణులకు సమర్పిస్తాడు. తక్కిన సగంలో సగం అనగా మొత్తంలో నాల్గవభాగాన్ని దీనులకూ, దుఃఖితులకూ దానంచేస్తాడు. మిగిలినదాన్ని అనగా నాల్గవభాగాన్ని మాత్రం తన ఆహార-విలాసాదులకు వ్యయం చేస్తాడు. ఇలా తన నిత్యకృత్యం నిర్వహించి, రేబగళ్ళు ఏమరక రాజ ద్వారంవద్ద ఖడ్గధారియై సేవిస్తాడు. ఎప్పుడైనా రాజు స్వయంగా ఆజ్ఞాపిస్తే తన యింటికి పోతాడు. (లేకుంటే పోడు).

మూ. అథైకదా కృష్ణచతుర్దశ్యాం రాత్రౌ స రాజా సకరుణ క్రన్దనధ్వనిం శుశ్రావ. తచ్ఛ్రుత్వా రాజా బ్రూతే-'కః కోఽత్ర ద్వారి తిష్ఠతి? తదా తేనోక్తమ్- "దేవ! అహం వీరవరః". రాజోవాచ- 'క్రన్దనాఽనుసరణం క్రియతామ్.' వీరవరోఽపి - 'యథాఽఽజ్ఞాపయతి దేవః'-ఇత్యుక్త్వా చలితః. రాజ్ఞాఽపి చిన్తితమ్-'అయ మేకాకీ రాజపుత్రో మయా సూచీభేద్యే తమసి ప్రహితః. నైతదుచితమ్. తదహమపి గత్వా కిమేతత్ ఇతి నిరూపయామి' ఇతి.

అను. అంతట ఒక కృష్ణచతుర్దశినాడు రాత్రివేళ ఆ రాజు ఒకానొక దీనమైన రోదనధ్వనిని విన్నాడు. విని ఇలా పిలిచాడు-'ఎవరు అచ్చట ద్వారంలో ఉండేది ఎవరు? అందుకు వీరవరుడు ఇలా చెప్పాడు-'ప్రభూ! నేను వీరవరుణ్ణి'. రాజు-'అయితే ఆ ఏడ్పు ఏమిటో పోయి విచారించి రమ్మ'ని చెప్పాడు. తోడనే 'చిత్తం' అని వెళ్లాడు వీరవరుడు. అతను పోగానే రాజు ఇలా తలంచాడు-'ఈ కటికచీకటిలో ఈ రాజపుత్రుణ్ణి ఇట్లు ఒంటరిగా పంపడం సముచితంగా లేదు. అందుచేత నేను సైతం (రహస్యంగా) పోతాను. ఇదేమిటో విచారిస్తాను.

మూ. తతో రాజాఒపి ఖడ్గ మాదాయ తదనుసరణక్రమేణ నగరాద్ బహి ర్నిర్జగామ. గత్వా చ వీరవరేణ రుదతీ రూపయౌవన సమ్పన్నా సర్వాఒలఙ్కారభూషితా కాచిత్ స్త్రీ దృష్టా పృష్టా చ-'కా త్వమ్? కిమర్థం రోదిషి?' ఇతి. స్త్రియోక్తమ్-"అహమేతస్య శూద్రకస్య రాజ్యలక్ష్మీః చిరాదేతస్య భుజచ్ఛాయాయాం మహతా సుఖేన విశ్రాన్తా. ఇదానీ మన్యత్ర గమిష్యామి' ఇతి. వీరవరో బ్రూతే-'యత్రాఒపాయః సమ్భవతి, తత్రోపాయోఒప్యస్తి. తత్కథం స్యాత్ పునరిహాఒఒవాసో భవత్యాః?

అను. అంత రాజు సైతం ఖడ్గం చేబూని అతన్ని అనుసరించాడు. క్రమంగా అతడితోబాటు నగరానికి వెలుపలికి పోయాడు. అచ్చట వీరవరుడు ఏడ్చే ఒక సుందరీమణిని చూచాడు. అమె యవ్వనంలో ఉంది. అంతే గాదు; బహువిధాలైన ఆభరణాలతో విరాజిల్లుతూంది. చూచి వీరవరుడు ఇలా అడిగాడు-'నీవెవరు? ఎందుకు ఏడుస్తున్నావు? ఆ సుందరీమణి ఇలా అంది-'నేను ఈ శూద్రకప్రభువు యొక్క రాజ్యలక్ష్మిని. చిరకాలంగా ఇతడి భుజములనీడలో (పాలనలో) సుఖంగా ఉన్నాను. (త్వరలో ఇతడికి ఆయువు తీరనుంది) ఇప్పుడు వేఱేచోటికి పోవాలి. (అందుకై దుఃఖిస్తూన్నాను).

అది విని వీరవరుడు మరల ఇలా అడిగాడు-అపాయం గలచోట దానికి విరుగుడు అయిన ఉపాయం సైతం ఉంటుంది. "అందుచే నీవు ఇచ్చట ఉండే ఉపాయం ఏదో తెల్పుము".

మూ. లక్ష్మీ రువాచ-"యది త్వమాత్మనః పుత్రం శక్తిధరం ద్వాత్రింశల్లక్షణోపేతం భగవత్యాః సర్వమఙ్గలాయా ఉపహారీకరోషి, తదాఒహం పునరత్ర సుచిరం నివసామి." ఇత్యుక్త్వా సాఒదృశ్యాఒభవత్.

అను. రాజ్యలక్ష్మి ఇలా చెప్పింది-"అలా అయితే నీవు ముప్పదిరెండు శుభలక్షణాలతో విరాజిల్లే నీ పుత్రుడైన శక్తిధరుణ్ణి ఈ దుర్గాదేవికి బలిగా

సమర్పింపుము. (రాజు చిరంజీవి అవుతాడు). నేను మరలా ఇచ్చట చాలాకాలం నివసిస్తాను." ఇలా అని ఆ రాజ్యలక్ష్మి అదృశ్యయై పోయింది.

మూ. తతో వీరవరేణ స్వగృహం గత్వా నిద్రాయమాణా స్వవధూః ప్రబోధితా, పుత్రశ్చ. తౌ నిద్రాం పరిత్యజ్యోత్థాయోపవిష్టౌ. వీరవర స్తత్సర్వం లక్ష్మీవచన ముక్తవాన్. తచ్ఛ్రుత్వా సానన్దః శక్తిధరో బ్రూతే - "ధన్యోఽహ మేవంభూతః స్వామిరాజ్యరక్షార్థం యస్యోపయోగః. తాత! తత్కోఽధునా విలమ్బస్య హేతుః ? ఏవంవిధే కర్మణి దేహస్య వినియోగః శ్లాఘ్యః. యతః-

శ్లో. ధనాని జీవితఞ్చైవ పరార్థే ప్రాజ్ఞ ఉత్సృజేత్,
తన్నిమిత్తో వరం త్యాగో వినాశే నియతే సతి. 102

అను. అంత వీరవరుడు తన ఇంటికి పోయాడు. నిద్రించే భార్యను, పుత్రుణ్ణి మేల్కొల్పాడు. నిద్ర వీడి వారిరువురూ లేచి కూర్చుండగానే రాజ్యలక్ష్మిచే తెల్పబడిన విషయం అంతా చెప్పాడు. అది విని పుత్రుడైన శక్తిధరుడు ఆనందంతో ఇలా అన్నాడు-"నేను మిక్కిలి ధన్యుణ్ణి. ఇలా ప్రభువునకూ, రాజ్యానికీ రక్షణకై ఉపయోగపడుతున్నాను. తండ్రీ ! ఇక ఇప్పుడు ఆలసించడం దేనికి? ఇలాటి సత్కార్యానికి శరీరం ఉపయోగపడడం ఎంతయూ ప్రశంసనీయం. ఏలనన-

ప్రాజ్ఞుడైనవాడు ధనాన్నీ, జీవితాన్నీ ఇతరుల మేలుకై త్యజించాలి. మరణం తప్పనిదై ఉండగా అలా త్యాగంచేయడం శ్రేష్ఠం గదా. 102

మూ. శక్తిధరమాతోవాచ-"యద్యేత న్న కర్తవ్యం, తత్కేనాన్యేన కర్మణా గృహీతస్య మహావర్తనస్య నిష్క్రయో భవిష్యతి." ఇత్యాలోచ్య సర్వే సర్వమఙ్గలాయాః స్థానం గతాః. తత్ర సర్వమఙ్గలాం సమ్పూజ్య వీరవరో బ్రూతే-"దేవి! ప్రసీద- విజయతాం శూద్రకో మహారాజః. గృహ్యతా మయ ముపహారః." ఇత్యుక్త్వా పుత్రస్య శిర శ్ఛిచ్ఛేద. తతో వీరవర శ్చిన్తయామాస-"గృహీతరాజవర్తనస్య నిస్తారః కృతః.

అధునా నిష్పుత్రస్య మే జీవితేనాఽలమ్. ఇత్యాలోచ్యాఽఽ త్మనః శిర శ్ఛిచ్ఛేద. తతః స్త్రియాఽపి స్వామిపుత్రశోకా ర్తయా తదనుష్ఠితమ్.

అను. శక్తిధరుడి తల్లి ఇలా అంది-"ఈ త్యాగం చేయనిచో ఇంతటి గొప్పవేతనఋణం తీర్చడం ఎలా సాధ్యం ?" ఇలా ఆలోచించి వారు అందరూ (ముప్వురూ) దుర్గగుడికి పోయారు. అచ్చట ఆ దేవిని పూజించి వీరవరుడు ఇలా ప్రార్థించాడు-"ఓ దేవీ ! అనుగ్రహింపుము. శూద్రకమహారాజు సర్వశుభముల విజయ మందుగాక. ఈ కానుకను స్వీకరింపుము." ఇలా ప్రార్థించి పుత్రుడి కంఠం ఛేదించాడు. ఆలా ఛేదించినమీదట అతను ఇలా చింతించాడు-"తీసుకొన్న గొప్పవేతనానికి తగినప్రతిక్రియ చేశాను. పుత్రహీనమైన జీవితం చాలు (వ్యర్థం)." ఇలా తలంచి తన తలను ఖండించుకున్నాడు. పిమ్మట వీరవరుడి భార్యయూ, మగడు, పుత్రుడు మరణించడంతో ఆదుఃఖం భరింపలేక తానూ అలాగే చేసింది. (ఆ ఖడ్గంతోనే తన తల నరుకుకొంది).

మూ. తత్సర్వం దృష్ట్వా రాజా సాశ్చర్యం చిన్తయామాస-

శ్లో. జాయన్తే చ మ్రియన్తే చ మద్విధాః క్షుద్రజన్తవః,
అనేన సదృశో లోకే న భూతో న భవిష్యతి. 103

తదేతత్పరిత్యక్తేన మమ రాజ్యేనాఽపి కిం ప్రయోజనమ్ ? (ఇత్యేవం విచిన్త్య) తతః శూద్రకేణాఽపి స్వశిరశ్ఛేత్తుం ఖడ్గః సముత్థాపితః. అథ భగవత్యా సర్వమఙ్గలయా ప్రత్యక్షీభూతయా రాజా హస్తే ధృతః, ఉక్తశ్చ-"పుత్ర ! ప్రసన్నాఽస్మి తే. సాహసేనాఽలమ్. చిరం జీవ. జీవనాన్తేఽపి తవ రాజభఙ్గో నాస్తి.'

అను. రాజు ఇదంతా చూచాడు. ఆశ్చర్యం చెందాడు. ఇలా విచారించాడు. నావంటి నీచప్రాణులు ఎందరో పుట్టుతూన్నారు. చస్తూన్నారు. ఇతడితో సమానుడు పూర్వం లేడు. ఇక పుట్టబోడు. (103)

అందుచే ఇలాంటివాణ్ణి పోగొట్టుకొన్న ఈ రాజ్యంచే నాకు ఉపయోగం ఏముంది ?-(ఇలా దుఃఖించి) పిమ్మట శూద్రకమహారాజుసైతం తన శిరస్సును ఖండించుకొనేందుకై ఖడ్గం ఎత్తాడు. అంత వెంటనే భగవతి అయిన దుర్గాదేవి

ప్రత్యక్షమైంది.(ఖడ్గయుక్తమైన) అతడి చేతిని పట్టుకొంది. ఇలా అంది-"పుత్రా! నీయెడ సంతుష్టురాలను. సాహసం చేయకుము. చిరంజీవివి కమ్ము. నీ జీవితం తర్వాతను నీకు రాజ్యభంగం లేదు. (అనగా నీ వారసులు ప్రభువులు అగుదురు. అని భావం.)

మూ. రాజా చ సాష్టాఙ్గపాతం ప్రణమ్యోవాచ-'దేవి! కిం మే రాజ్యేన? జీవితేన వా కిం ప్రయోజనమ్? యద్యహ మనుకమ్పనీయ స్తదా మమాఽఽయుశ్శేషేణాఽప్యయం సదారపుత్రో వీరవరో జీవతు. అన్యథాఽహం యథాప్రాప్తాం గతిం గచ్ఛామి. భగవత్యువాచ-పుత్ర! అనేన తే సత్త్వోత్కర్షేణ భృత్యవాత్సల్యేన చ సర్వథా సన్తుష్టాఽస్మి. గచ్ఛ; విజయీ భవ. అయమపి సపరివారో రాజపుత్రో జీవతు, ఇత్యుక్త్వా దేవ్యదృశ్యాఽభవత్. తతో వీరవరః సపుత్రదారః ప్రాప్త జీవనః స్వగృహం గతః. రాజాఽపి తై రలక్షితః సత్వర మన్తఃపురం ప్రవిష్టః.

అను. వెంటనే రాజు సాష్టాంగపాతంగా ప్రణమిల్లి దేవితో ఇలా విన్నవించాడు-"తల్లీ! నాకు రాజ్యంతో గానీ జీవితంతో గానీ ఉపయోగం ఏముంది? నాయందు దయదలంతువేని నా మిగిలిన ఆయువుతోనైన ఈ వీరవరుణ్ణి భార్యాపుత్రులతో బాటు బ్రతికింపుము. అలా కానిచో నా గతికొద్దీ నేను పోతాను. (అది విని) ఆ దేవత ఇలా అంది-"కుమారా! నీ ఈ గొప్పసాహసంచేతనూ, సేవకప్రేమచేతనూ మిక్కిలి సంతోషం పొందాను. పొమ్ము. విజయం పొందుము. ఈ రాజపుత్రుడునూ భార్యాపుత్రసమేతంగా జీవిస్తాడు". ఇలా అని ఆ దేవి అంతర్ధానం పొందింది. పిమ్మట భార్యాపుత్రసహితంగా వీరవరుడు జీవించాడు. తన యింటికి పోయాడు. రాజుసైతం వారికి కనబడనట్లుగా అంతఃపురం ప్రవేశించాడు.

మూ. అథ ప్రభాతే వీరవరో ద్వారస్థః పున ర్భూపాలేన పృష్టః సన్నాహ- 'దేవ! సా రుదతీ మామవలోక్యాఽదృశ్యాఽభవత్. న కాఽప్యన్యా వార్తా విద్యతే' ఇతి. తద్వచన మాకర్ణ్య సన్తుష్టో రాజా సాశ్చర్యం చిన్తయామాస- 'కథమయం శ్లాఘ్యో మహాసత్త్వః?

యతః-

శ్లో. ప్రియం బ్రూయా దకృపణః శూరః స్యాదవికత్థనః,
దాతా నాఽపాత్రవర్షీ చ ప్రగల్భః స్యాదనిష్ఠురః. 104

ఏతన్మహాపురుషలక్షణ మేతస్మిన్ సర్వమస్తి ఇతి.

అను. మరునాడు ప్రాతఃకాలాన వీరవరుడు పూర్వంమాదిరిగా ద్వారంవద్ద ఉన్నాడు. ప్రభువు- 'రాత్రివిషయం ఏమి' అని అడుగగా ఇలా చెప్పాడు-

'దేవా ! ఏడ్చే ఆ యువతి నన్ను చూచి కనబడకుండా పోయింది. వేఱే సమాచారం ఏమీ లేదు.' అది విని ప్రభువు మిక్కిలి సంతుష్టుడయ్యాడు. ఆశ్చర్యం పొంది ఇలా తలంచాడు- 'ఈ మహాపురుషుణ్ణి ఎలా ప్రశంసించాలి? ఏలనన-

ఉదారచిత్తుడు ప్రియంగా మాట్లాడాలి. శూరుడు ఆత్మస్తుతి లేనివాడై ఉండాలి. దాత అయోగ్యులకు దానం చేయనివాడై ఉండాలి. ప్రగల్భుడు(నేర్పరి-తేజస్వి) క్రౌర్యశూన్యుడై ఉండాలి. 104

ఈ మహాపురుషలక్షణం అంతా ఇతనియందు ఉంది.

మూ. తతః స రాజా ప్రాతః శిష్టసభాం కృత్వా సర్వం వృత్తాన్తం ప్రస్తుత్య ప్రసాదాత్ తస్మై కర్ణాటకరాజ్యం దదౌ. తత్కి మాగన్తుకో జాతిమాత్రా ద్దుష్టః? తత్రా ప్యుత్తమాధమమధ్యమాః సన్తి'. చక్రవాకో బ్రూతే-

శ్లో. యోఽకార్యం కార్యవచ్ఛాస్తి స కింమన్త్రీ నృపేచ్ఛయా,
వరం స్వామిమనోదుఃఖం తన్నాశో న త్వకార్యతః. 105

అను. పిమ్మట ఆ రాజు ఉదయం సభ చేశాడు. శిష్టుల నందర్నీ సభకు ఆహ్వానించాడు. రాత్రి జరిగినదంతా వివరించాడు. సాదరంగా వీరవరుడికి కర్ణాటకరాజ్యం సమర్పించాడు.'

ఇలా ఈ కథను తెలిపి రాజహంస (హిరణ్యగర్భుడు) తన మంత్రి అయిన చక్రవాకపక్షిని ఇలా అడిగింది—'ఏమీ! నూతనత్వం అనే జాతిచేతనే క్రొత్తవారు

అంతా దుష్టులు అగుదురా ? వారిలోనూ ఉత్తములు, మధ్యములు, అధములు అని ఉంటారు."

అది విని చక్రవాకం ఇలా అంది– "ప్రభువుకు ఇష్టంగా ఉన్నా చేయ గూడని పనిని చేయదగినదిగా చెప్పేవాడు (శాసించేవాడు) దుష్టమంత్రి అనబడు తాడు. ప్రభువుయొక్క మనస్సునకు దుఃఖం గల్గినా మంచిదే గానీ అకృత్యం ద్వారా ప్రభువు నశింపరాదు. 105

శ్లో. వైద్యో గురుశ్చ మన్త్రీ చ యస్య రాజ్ఞః ప్రియంవదాః,
శరీర-ధర్మ-కోశేభ్యః క్షిప్రం స పరిహీయతే. 106

శృణు, దేవ!

శ్లో. పుణ్యాల్లబ్ధం యదేకేన తన్మమాఽపి భవిష్యతి,
హత్వా భిక్షుం యతో మోహా న్నిధ్యర్థీ నాపితో హతః. 107

రాజా పృచ్ఛతి- 'కథమేతత్?' మన్త్రీ కథయతి-

అను. ఏ ప్రభువునకైతే వైద్యుడు, గురువు, మంత్రీ ఈ ముప్పురు (ముఖ స్తుతికై) ప్రియమైన మాటలు పల్కుతారో ఆ రాజుకు వెంటనే క్రమంగా శరీరం, ధర్మం, ధనాగారం నశించిపోతాయి. 106

మరియూ మహారాజా! వినుము. ఎవడో ఏదో పూర్వపుణ్యఫలంగా పొందితే 'అది నాకూ కావాలి' అని తలంచి అజ్ఞానంచే నిధిని ఆశించినవాడై మంగలి సంన్యాసిని చంపాడు. రాజుచే మరణదండన పొందాడు. 107

రాజు అడిగాడు- 'అది ఎట్లు ?'

మంత్రి ఆ కథను ఇలా చెప్పసాగాడు-

## 9. నిధ్యర్థి-నాపిత కథా

[నిధిని కోరే మంగలి కథ]

మూ. అ స్త్యయోధ్యాయాం పురి చూడామణి ర్నామ క్షత్రియః. తేన ధనార్థినా మహతా క్లేశేన భగవాం శ్చన్ద్రార్ధచూడామణిః చిర మారాధితః. తతః క్షీణపాపోఽసౌ స్వప్నే దర్శనం దత్త్వా భగవదాదేశా ద్యక్షేశ్వరాదిష్టో యత్- 'త్వమద్య ప్రాతః క్షౌరం కారయిత్వా లగుడ హ స్తః సన్ స్వగృహద్వారి నిభృతం స్థాస్యసి, తతో యమేవాగతం భిక్షుకం ప్రాఙ్గణే పశ్యసి, తం నిర్దయం లగుడప్రహారేణ హనిష్యసి, తతోఽసౌ భిక్షుక స్తత్క్షణాత్ సువర్ణకలశో భవిష్యతి. తేన త్వయా యావ జ్జీవం సుఖినా భవితవ్యమ్' ఇతి. తత స్తథాఽనుష్ఠితే తద్వృత్తమ్.

అను. అయోధ్య అనే నగరంలో 'చూడామణి' అనే పేరు గల ఒక క్షత్రి యుడు ఉన్నాడు. అతడికి 'ధనం అధికంగా సంపాదించాలి' అని కోరిక గల్గింది. అందువల్ల మిక్కిలి దీక్షతో చంద్రమౌళి అయిన శివుణ్ణి ఆరాధించాడు. పాప విము క్తి నందాడు. అంత శివుడి ఆజ్ఞచే ధనాధిపతి అయిన కుబేరుడు ఈ రాజునకు స్వప్నంలో దర్శనం అనుగ్రహించాడు. ఇలా బోధించాడు- 'ఓ రాజా ! ఈ వేకు వనే క్షౌరం చేయించుకొనుము. ఒక గట్టి లాఠీని (కఱ్ఱను) పట్టుకొని నీ యింటి ద్వారంవద్ద రహస్యంగా దాగి ఉండుము. అప్పుడు నీ యింటి ముంగిలిలోనికి (మొదట) ఏ భిక్షుకుడు వస్తాడో అతన్ని చూడగనే ఏమాత్రం దయ దలంపక కఱ్ఱతో బాదుము. వెంటనే ఆ భిక్షుకుడు (సంన్యాసి) బంగారుకలశంగా మారుతాడు. అందుచే నీవు బ్రతికినన్నాళ్లూ సుఖంగా ఉండొచ్చు.' పిమ్మట ఆ రాజు అలాగే చేసి ఆ సంపదను పొందాడు.

మూ. తత్ర క్షౌరకరణాయాఽఽనీతేన నాపితేన తత్సర్వ మాలోక్య చిన్తితమ్- 'అయే! నిధిప్రాప్తే రయ ముపాయః. తదహమ

ప్యేవం కిం న కరోమి? ఇతి. తతఃప్రభృతి స నాపితః ప్రత్యహం తథా విధో లగుడహస్తః సునిభృతం భిక్షో రాగమనం ప్రతీక్షతే. ఏకదా తేన ప్రాప్తో భిక్షు ర్లగుడేన వ్యాపాదితః. తస్మా దపరాధాత్ సోఽపి నాపితో రాజపురుషై ర్వ్యాపాదితః. అతోఽహం బ్రవీమి-'పుణ్యాల్లబ్ధం యదేకేన' ఇత్యాది.

అను. అచ్చటికి క్షౌరం చేయడానికి పిలిపించబడిన మంగలి ఇదంతా చూచాడు. ఇలా తలంచాడు- 'ఆహా! ధననిధిని పొందడానికి ఇది చక్కటి ఉపాయం. నేను సైతం ఇలా ఎందుకు చేయకూడదు?' ఇలా తలంచి ఆ మంగలి ప్రతిదినం గుండు గొరిగించుకుంటాడు. దిట్టమైన కఱ్ఱను చేత ధరిస్తాడు. వాకిలి వద్ద ఎవరికీ కనబడనట్లు దాగి- 'భిక్షుకు డెవడైనా ఎప్పుడు వస్తాడో'- అని ఎదురు చూస్తూ ఉంటాడు. ఇలా కొన్ని దినాలు జరిగాయి. ఒకనాడు ఒక భిక్షుకుడు (సంన్యాసి) దురదృష్టంకొద్దీ వచ్చాడు. మంగలి కఱ్ఱతో మోదగా చచ్చాడు. అంతట రాజభటులు వచ్చారు. ఆ అపరాధం కారణంగా మంగలిని బంధించారు. మంగలికి మరణదండన విధింపబడింది.

అందుచే నేను (చక్రవాకాన్ని) చెప్పుతూన్నాను- 'పుణ్యఫలంగా ఎవడికో ఏదో లభిస్తే'- ఇత్యాది (107 వ శ్లోకభావం చూడుడు).

మూ. రాజాఽఽహ-

శ్లో. పురా వృత్తకథోద్గారైః కథం నిర్ణీయతే పరః,
స్యా న్నిష్కారణబన్ధుర్వా కిం వా విశ్వాసఘాతకః. 108

యాతు; ప్రస్తుత మనుసన్ధీయతామ్. మలయాధిత్యకాయాం చేచ్చిత్ర వర్ణ స్తదధునా కిం విధేయమ్?' మన్త్రీ వదతి- ఆగతప్రణిధిముఖా న్మయా శ్రుతమ్, యత్- మహామన్త్రిణో గృధ్రస్యోపదేశే చిత్రవర్ణేనాఽనాదరః కృతః, తతోఽసౌ మూఢో జేతుం శక్యః. తథా చోక్తమ్-

శ్లో. లుబ్ధః క్రూరోఽలసోఽసత్యః ప్రమాదీ భీరు రస్థిరః,
మూఢో యోధావమన్తా చ సుఖచ్ఛేద్యో రిపుః స్మృతః. 109

అను. రాజు ఇలా అన్నాడు-

ప్రాచీనకథలద్వారా క్రొత్తగా వచ్చినవాడు అకారణబంధువు అని గానీ విశ్వాసఘాతుకుడు అని గానీ ఎలా నిర్ణయించగలం? (108)

ఆ విషయం పోనీండు. ప్రస్తుతవిషయం చర్చించండి. మలయపర్వత శిఖరాన చిత్రవర్ణుడు విడిది చేస్తే మనం ఏమి చేయాలి? అది విని మంత్రి ఇలా బదులు పల్కాడు-'దేవా! వచ్చిన మనవేగువల్ల నేనూ విన్నాను. అతడు (తన) మహామంత్రి అయిన గ్రద్ధ బోధను పెడచెవి బెట్టాడు. అందువల్ల ఆ మూర్ఖుణ్ణి జయింపవచ్చును. విజ్ఞులు ఇలా చెప్పారు-

లోభీ, క్రూరుడూ, సోమరీ, అసత్యభాషీ, జాగ్రత్తలేనివాడూ, పిఱికివాడూ, చపలచిత్తుడూ, మూర్ఖుడూ, యుద్ధవీరులను అవమానించేవాడూ అయిన శత్రువును తేలిగ్గా జయింపవచ్చును. (109)

మూ. తతోఽసౌ యావదస్మద్దుర్గద్వారరోధం న కరోతి తావన్నద్యద్రివనవర్త్మసు తద్బలాని హన్తుం సారసాదయః సేనాపతయో నియుజ్యన్తామ్. తథా చోక్తమ్-

శ్లో. దీర్ఘవర్త్మ పరిశ్రాన్తం నద్యద్రివనసఙ్కులమ్,
ఘోరాగ్ని భయ సన్త్రస్తం క్షుత్పిపాసార్దితం తథా. 110

ప్రమత్తం భోజనవ్యగ్రం వ్యాధిదుర్భిక్షపీడితమ్,
అసంస్థిత మభూయిష్ఠం వృష్టివాతసమాకులమ్. 111

పఙ్కపాంసుజలాఽఽచ్ఛన్నం సువ్యస్తం దస్యువిద్రుతమ్,
ఏవంభూతం మహీపాలః పరసైన్యం విఘాతయేత్. 112

అను. అందుచే అతను మన కోటద్వారాన్ని నిరోధింపకముందే -(అనగా కోటను ముట్టడింపకముందే) నదులయు పర్వతములయు అడవులయు మార్గాలలో అతడి సైన్యాలను చంపేందుకు బెగ్గురుపక్షి మొదలైన సేనాపతులను నియమించండి. విజ్ఞులు ఇలా బోధించారు-

శత్రుసైన్యం-దీర్ఘప్రయాణంచే అలసినదై ఉన్నా, నదులయూ పర్వతా

లయూ అడవులయూ దారులను గుర్తింపజాలనిదై ఉన్నా, భయంకరమైన అగ్ని భయంచే కలత నందినదై ఉన్నా, ఆకలిదప్పులచే ఆరాటపడుచున్నా, అజాగ్రత్తగా ఉన్నా, ఆహారలగ్నమై ఉన్నా, రోగాలచే కఱవుచే బాధితమై ఉన్నా, వ్యూహ రూపంగా లేనిదై ఉన్నా, అల్పంగా ఉన్నా, వానచే గాలిచే వెతనందినదైనా, చుట్టూ బురదగానీ దుమ్ముగాని నీరుగానీ కలదై ఉన్నా, నిశ్చింతగా ఒడలు మరచినదై ఉన్నా, దొంగలచే పరాభూతమై (తరుమబడినదై) ఉన్నా, భూపాలుడు తేలికగా జయింపగలడు (జయింప యత్నించాలి).

మూ. అన్యచ్చ-

శ్లో. అవస్కన్దభయాద్రాజా ప్రజాగరకృతశ్రమమ్,
దివా సుప్తం సమాహన్యా న్నిద్రావ్యాకులసైనికమ్. 113

అత స్తస్య ప్రమాదినో బలం గత్వా యథావకాశం దివానిశం ఘ్నన్త్వస్మత్సేనాపతయః' ఇతి. తథాఽనుష్ఠితే చిత్రవర్ణస్య సైనికాః సేనాపతయశ్చ బహవో నిహతాః.

అను. మరియూ-ఎప్పుడు ఆకస్మికంగా ఆక్రమణ జరుగుతుందో అనే భయంచే రాత్రిళ్లు మేల్కొనడంవల్ల అలసినదీ, పగలు నిద్రించేదీ, నిద్రకై కలతనందిన సైనికులు గలదీ అయిన శత్రుసేనను రాజు సంహరించాలి. 113

కనుక మన సేనాధిపతులు అశ్రద్ధగా ఉండే అతడి సైన్యాన్ని సమీపించాలి. అవకాశాన్ని బట్టి పగలు, రాత్రి అనే భేదం పాటించక సంహరించాలి."

మంత్రి (చక్రవాకం) చెప్పినట్లుగా హిరణ్యగర్భుడి సేనాధిపతులు ఆచరించారు. అందువల్ల చిత్రవర్ణుడి సైనికులు, సేనానాయకులు అనేకులు చంపబడ్డారు.

మూ. తత శ్చిత్రవర్ణో విషణ్ణః స్వమన్త్రిణం దూరదర్శిన మాహ-"తాత! కిమి త్యస్మదుపేక్షా క్రియతే? కిం క్వాఽప్యవినయో మమాఽస్తి? తథా చోక్తమ్-

శ్లో॥ న 'రాజ్యం ప్రాప్త' మిత్యేవ వర్తితవ్య మసాంప్రతమ్,
శ్రియం హ్యవినయో హన్తి జరా రూపమివోత్తమమ్. 114

అపి చ-

శ్లో. దక్షః శ్రియ మధిగచ్ఛతి పథ్యాశీ కల్యతాం సుఖ మరోగీ,
ఉద్యుక్తో విద్యాన్తం ధర్మార్థయశాంసి చ వినీతః". 115

అను. అప్పుడు చిత్రవర్ణుడు దుఃఖితుడు అయ్యాడు. తన మంత్రి అయిన దూరదర్శితో ఇలా చెప్పాడు-'తాతా! నాయెడ ఎందుకు అశ్రద్ధ వహిస్తున్నారు? ఎచ్చటనైనా ఏదైనా నావల్ల తప్పు జరిగిందా? పెద్దలు ఇలా చెప్పారు-

'నాకు రాజ్యం లభించింది.' అని ప్రభువు ఎవ్వడూ అనుచితంగా ప్రవర్తిల్ల రాదు. ముసలితనం ప్రశస్తమైన సౌందర్యాన్ని వలె అవినయప్రవర్తన రాజ్య లక్ష్మిని నాశం చేస్తుంది. 114

మరియూ - నిపుణుడు లక్ష్మిని (సంపదను) పథ్య, (ఉచిత) భోజనుడు ఆరోగ్యాన్ని, ఆరోగ్యవంతుడు సుఖాన్ని, ప్రయత్నశీలుడు (పరిశ్రమి) విద్యా పారంగతినీ, వినయవంతుడు ధర్మాన్నీ ధనాన్నీ కీర్తినీ - పొందుతారు. 115

మూ - గృధ్రోఽవదత్ - 'దేవ! శృణు -

శ్లో. అవిద్వానపి భూపాలో విద్యావృద్ధోపసేవయా,
పరాం శ్రియ మవాప్నోతి జలాఽఽసన్నతరు ర్యథా. 116

అన్యచ్చ—

శ్లో. పానం స్త్రీ మృగయా ద్యూత మర్థదూషణమేవ చ,
వాగ్దణ్డయోశ్చ పారుష్యం వ్యసనాని మహీభుజామ్. 117

కిఞ్చ-

శ్లో. న స్వాహసైకాన్తరసాఽనువర్తినా
న చాఽప్యుపాయోపహతాఽన్తరాత్మనా,

విభూతయః శక్య మవాప్తు మూర్జితా
నయే చ శౌర్యే చ వసన్తి సమ్పదః. 118

అను. గ్రద్ద (దూరదర్శి) ఇలా బదులు పల్కింది - దేవా! వినుము. ప్రభువు స్వయంగా విద్వాంసుడు కాకుండినా విద్యచే వృద్ధులైన వారిని అనగా అనుభవవిద్యావంతులను సేవించడం ద్వారా, నీటిసమీపం లోని వృక్షం అభి వృద్ధిని పొందునట్లు ఉత్తమసంపదను పొందును. 116

మరియూ - మద్యాదిపానం, స్త్రీవ్యసనం (వ్యభిచారం), జూదం, అన్యాయ ప్రాప్తధనం, వాక్పారుష్యం, కఠినశిక్షావిధానం అనే ఈ ఆరు ప్రభువులకు చెడు గుణాలు అంటారు. 117

ఇంకా - కేవలం సాహసక్రియలను ఆధారంగా చేసుకొనడంవల్లనూ, అలాగే కేవలం ఉపాయాలను మాత్రమే ఆశ్రయించడంవల్లనూ, సమృద్ధమైన సంపదలు లభింపజాలవు. మరేమనగా, రాజనీతితోడి ఉపాయాలూ, పరాక్రమం ఈ రెండూ ఉండేచోటనే సంపదలు నివసిస్తాయి. 118

మూ - త్వయా స్వబలోత్సాహ మవలోక్య సాహసైకరసికేన మయోపన్యస్తేష్వపి మన్త్రే ష్వనవధానం వాక్పారుష్యం చ కృతమ్. అతో దుర్నీతేః ఫల మిద మనుభూయతే. తథా చోక్తమ్ -

శ్లో. దుర్మన్త్రిణం క ముపయాన్తి న నీతిదోషాః
సన్తాపయన్తి క మపథ్యభుజం న రోగాః,
కం శ్రీ ర్న దర్పయతి కం న నిహన్తి మృత్యుః
కం స్త్రీకృతా న విషయాః పరితాపయన్తి. 119

అను. నీవు నీ సైన్యబలంయొక్క ఉత్సాహాన్ని గాంచావు. కేవలం సాహసమంటే ఆసక్తిని చూపావు. నేను బోధించిన రాజనీతిమంత్రాల విషయంలో (ఆలోచనలయెడ) నిర్లక్ష్యం వహించావు. అంతేగాక పరుషంగా సైతం మాట్లా డావు. ఆ అవినీతికి ఫలం ఇప్పుడు అనుభవిస్తున్నావు. విజ్ఞులు ఇలా చెప్పారు - దుష్టమంత్రి గల ఏ ప్రభువు రాజనీతిదోషఫలములు పొందలేదు ? అపథ్యమును భుజించే ఎవడు రోగాలచే పీడింపబడలేదు ? సంపద ఎవడికి గర్వం గల్గింపలేదు? మృత్యువు ఎవణ్ణి చంపక వదలివేసింది ? స్త్రీవ్యసనంచే ఎవడు బాధింపబడలేదు ?

మూ. అపరం చ -

శ్లో. ముదం విషాదః శరదం హిమాగమః
తమో వివస్వాన్ సుకృతం కృతఘ్నతా,
ప్రియోపపత్తిః శుచ మాపదం నయః
శ్రియః సమృద్ధా అపి హన్తి దుర్నయః. 120

తతో మయాఽప్యాలోచితమ్ - 'ప్రజ్ఞాహీనోఽయం రాజా. న చేత్ కథం నీతిశాస్త్రకథాకౌముదీం వాగుల్కాభిః తిమిరయతి. యతః -

శ్లో. యస్య నాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్ ?
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి'? 121

ఇత్యాలోచ్య తూష్ణీం స్థితః.

అను. మరియూ ; దుఃఖం సంతోషాన్నీ, మంచుకాలం వెన్నెలఋతువునూ, సూర్యుడు చీకటినీ, కృతఘ్నత పుణ్యాన్నీ, ప్రియవస్తుయోగం శోకాన్నీ, నీతి వర్తన ఆపదనూ, దుష్టనీతి సమృద్ధములై ఉన్నా సంపదలను, నాశనం చేస్తాయి.

పిమ్మట నేనూ ఇలా ఆలోచించాను - 'ఈ ప్రభువు ప్రతిభ లేనివాడు. అలా కానిచో నీతిశాస్త్రకథలు అనే వెన్నెలను (అనుచిత) వాక్కులనే మిణుగురు పురుగులచే (అనగా మిణుగురు పురుగులను ఆధారం చేసికొని వెన్నెలను) తిరస్కరించి ఎందుకు చీకటిగా చేస్తాడు ?. ఏలనన -

ఎవడికి గ్రహించే ప్రజ్ఞ స్వయంగా లేదో వానియెడ శాస్త్రం ఏమీ చేయ లేదు. కన్నులు లేనివాడికి అద్దం ఏమి ఉపకారం చేయగలదు ?" 121

ఇలా తలంచి మిన్నక ఉన్నాను".

మూ. అథ రాజా బద్ధాఞ్జలి రాహ - తాత ! అస్త్యయం మమా పరాధః. ఇదానీం యథాఽహ మవశిష్టబలసహితః ప్రత్యావృత్య విన్ధ్యా చలం గచ్ఛామి, తథోపదిశ. గృధ్రః స్వగతం చిన్తయతి - 'క్రియతా మద్య ప్రతీకారః. యతః -

శ్లో. దేవతాసు గురౌ గోషు రాజసు బ్రాహ్మణేషు చ,
నియన్తవ్యః సదా కోపో బాలవృద్ధాతురేషు చ. 122

ఇత్యేవం చిన్తయిత్వా స మన్త్రీ ప్రహస్య ప్రకాశం బ్రూతే - 'దేవ! మా భైషీః. సమాశ్వసిహి. శృణు దేవ-

శ్లో. మన్త్రిణాం భిన్నసన్ధానే భిషజాం సాన్నిపాతకే,
కర్మణి వ్యజ్యతే ప్రజ్ఞా సుస్థే కో వా న పణ్డితః. 123

అను. అంత రాజు చేతులు జోడించి ఇలా అన్నాడు-'నాయనా! ఇదంతా నా దోషమే. ఇప్పుడు మిగిలిన సేనతో మరలి వింధ్యపర్వతం పోయే ఉపాయం ఏదో బోధింపుము'. అందులకు (మంత్రి అయిన) గ్రద్ద తనలో ఇలా విచారించింది - 'ఇందుకు ప్రతీకారం ఏదేని చేయాలి. ఏలనన -

దేవతలయెడ, గురుజనులయెడ, గోవులయెడ, రాజులయెడ, బ్రాహ్మణుల యెడ, బాలురయెడ, వృద్ధులయెడ, రోగాదిపీడితులయెడ కోపం వచ్చినా దాన్ని సర్వదా నిరోధించాలి.' 122

ఇలా తలంచి నవ్వుతూ ప్రకాశంగా ఇలా చెప్పాడు -

'ప్రభూ! భయపడకుడు. ఊరడిల్లుడు. దేవా! వినుము -

చెడినదానిని (భిన్నమైనదానిని) చక్కదిద్దడంలో మంత్రుల ప్రతిభయూ సన్నిపాతరోగం (విషజ్వరం) వస్తే వైద్యుల నేర్పూ తెలియబడుతూంది. సామాన్యస్థితిలో పండితుడు గానివా డెవడున్నాడు ?

మూ. అపరఞ్చ -

శ్లో. ఆరభన్తేఽల్పమేవాఽజ్ఞాః కామం వ్యగ్రా భవన్తి చ,
మహారమ్భాః కృతధియ స్తిషన్తి చ నిరాకులాః. 124

తదత్ర భవత్ప్రతాపేన దుర్గం భఙ్క్త్వా కీర్తిప్రతాపసహితం త్వా మచిరేణ కాలేన విన్ధ్యాచలం నేష్యామి" ఇతి. రాజాఽఽహ - కథ మధునా స్వల్పబలేన తత్సమ్పద్యతే ? గృధ్రో వదతి - 'దేవ! సర్వం

భవిష్యతి యతో విజిగీషో రదీర్ఘసూత్రతా విజయసిద్ధేః అవశ్యంభావి లక్షణమ్. తత్సహసైవ దుర్గద్వారాఽవరోధః క్రియతామ్.'

అను. బుద్ధిహీనులు చిన్నకార్యం ఆరంభించినా ఎంతో కంగారుపడుతారు. బుద్ధిశాలురు గొప్పకార్యాన్ని ఆరంభించినా ధైర్యంగా ఉంటారు. 124

కనుక ఈ విషమపరిస్థితిలోనే తమ ప్రతాపంచే శత్రుదుర్గాన్ని భేదిస్తాను. కీర్తితో ప్రతాపంతో కూడిన మిమ్ము త్వరలోనే వింధ్యపర్వతం చేరుస్తాను'. [ఇది విని] రాజు ఇలా అడిగాడు - 'ఇప్పుడు ఈ చిన్న సేనతో అదేవిధంగా సాధ్యం?' అందుకు గ్రద్ద ఇలా అంది - దేవా! సర్వం సిద్ధిస్తుంది. విజయం కోరేవాడు విజయసిద్ధికై దీర్ఘసూత్రతను వీడాలి. శీఘ్రంగా కార్యాలు చేయాలి. ఇది విజయానికి ముఖ్యలక్షణంగా తలంచాలి. అందుచే వెంటనే (శత్రు) దుర్గాన్ని ముట్టడించాలి.

మూ. అథ (ప్రహిత) ప్రణిధినా బకేనాఽఽగత్య హిరణ్యగర్భస్య కథితమ్ - 'దేవ! స్వల్పబల ఏవాఽయం రాజా చిత్రవర్ణో గృధ్రస్య వచనోపష్టమ్భా దాగత్య దుర్గద్వారాఽవరోధనం కరిష్యతి. రాజహంసో బ్రూతే - 'భోః సర్వజ్ఞ! కిమధునా విధేయమ్?' చక్రవాకో బ్రూతే - 'స్వబలే సారాఽసారవిచారః క్రియతామ్. తద్ జ్ఞాత్వా సువర్ణ వస్త్రాదికం యథార్హం ప్రసాదప్రదానం చ క్రియతామ్. యతః -

శ్లో. యః కాకిణీమ ప్యపథప్రపన్నాం
సముద్ధరే న్నిష్కసహస్రతుల్యామ్,
కాలేషు కోటిష్వపి ముక్తహస్త -
స్తం రాజసింహం న జహాతి లక్ష్మీః. 125

అను. ఇక (అచ్చట కర్పూరద్వీపంలో పద్మకేలిసరస్సులో ఉండే రాజహంస అయిన) హిరణ్యగర్భుడి వద్దకు అతడు పంపిన గుప్తచరుడైన కొంగ వచ్చింది. ఇలా విన్నవించింది - దేవ! మిగిలిన చిన్న సేనతోనే రాజు అయిన చిత్రవర్ణుడు గ్రద్దయొక్క (మంత్రియొక్క) మంత్రణాబలంచే వస్తున్నాడు. త్వరలోనే మన కోటను ముట్టడిస్తాడు. అది విని రాజహంస తన మంత్రిని ఇలా

అడిగింది - 'ఓ సర్వజ్ఞా! (మంత్రి పేరు) ఇప్పుడేం చేయాలి ? చక్రవాకం ఇలా అంది - 'మన సైన్యంలో బలవంతు లెవరో, బలహీను లెవరో గమనించాలి. అది తెలుసుకొని బంగారం, వస్త్రాలు మొదలైనవి వారి యోగ్యతకు తగిన విధంగా ఇచ్చి సత్కరించాలి. ఏలనన -

ఏ ప్రభువైతే అనుచితస్థలంలో పడిన చిన్న గవ్వనైనా వెయ్యి బంగారు నాణెములతో సమానంగా స్వీకరిస్తాడో మరియూ అవసరసమయాలయందు కోట్ల కొలది బంగారునాణెములనైనా వదలడానికి (చేతులు తెరుస్తాడో)సిద్ధంగా ఉంటాడో, అలాంటి భూపాలుణ్ణి రాజ్యలక్ష్మి వదలిపెట్టదు. 125

మూ. అన్యచ్చ-

శ్లో. క్రతౌ వివాహే వ్యసనే రిపుక్షయే
యశస్కరే కర్మణి మిత్రసఙ్గ్రహే,
ప్రియాసు నారీ ష్వధనేషు బాన్ధవే
ష్వతివ్యయో నాస్తి నరాధిపోఽష్టసు. 126

యతః-

శ్లో. మూర్ఖః స్వల్పవ్యయత్రాసాత్ సర్వనాశం కరోతి హి,
కః సుధీః సన్త్యజేద్భాణ్డం శుల్కస్యైవాతిసాధ్వసాత్. 127

అను. మరియూ- యజ్ఞంలో, వివాహకార్యంలో, ఆపద వచ్చినప్పుడూ, శత్రుసంహారవిషయంలో, కీర్తికరములైన పనులలో, మిత్రసంపాదనయందూ, ప్రియురాండ్రవిషయంలో, ధనహీనులైన బంధుజనుల విషయంలో, ఈ ఎనిమిదింటియందు ఖర్చుచేసే ప్రభువు అతివ్యయపరుడుగా తలంపబడడు. 126

ఏలనన- అల్పవ్యయానికి భయపడి మూర్ఖుడు సమస్తం పోగొట్టుకుంటాడు. బుద్ధిమంతు డెవడూ పన్ను కట్టవలసివస్తుందనే భయంతో సంపదను పరిత్యజింపడు. 127

మూ. రాజాఽఽహ-'కథ మిహ సమయేఽతివ్యయో యుజ్యతే?' ఉక్తఞ్చ- 'ఆపదర్థే ధనం రక్షేత్' ఇతి. మన్త్రీ బ్రూతే- 'శ్రీమతాం కథ

మాపదః?' రాజాఽఽహ - 'కదాచి చ్చలితా లక్ష్మీః'. మన్త్రీ బ్రూతే- 'సఞ్చితాఽపి వినశ్యతి. తద్దేవ! కార్పణ్యం విముచ్య స్వభటా దానమానాభ్యాం పురస్క్రియన్తామ్. తథా చోక్తమ్-

శ్లో. పరస్పరజ్ఞాః సంహృష్టా స్త్యక్తుం ప్రాణాన్ సునిశ్చితాః,
కులీనాః పూజితాః సమ్యగ్విజయన్తే ద్విషద్బలమ్. 128

అపరఞ్చ-

శ్లో. సుభటాః శీలసమ్పన్నాః సంహతాః కృతనిశ్చయాః,
అపి పఞ్చశతం శూరా నిఘ్నన్తి రిపువాహినీమ్ 129

అను. రాజు (రాజహంస-హిరణ్యగర్భుడు) ఇలా అడిగాడు- 'ఈ ఆపద సమయంలో అధికంగా ఖర్చుచేయడం ఎలా సముచితం అవుతుంది? విజ్ఞులు ఇలా అన్నారు- 'ఆపత్కాలానికై ధనం రక్షించాలి.'

అందుకు మంత్రి ఇలా సమాధానం చెప్పాడు- 'శ్రీమంతులైన ప్రభువులకు ఆపదలు ఎట్లు ...యి?' అది విని రాజు మరలా ఇలా అన్నాడు- 'ఒకానొక వేళ దైవికంగా లక్ష్మి (సంపద) చలించి పోతేనో-' మంత్రి అన్నాడు- 'అలా అయితే కూడబెట్టిన సంపదసైతం నశిస్తుంది.' కనుక ఓ ప్రభూ! లోభగుణం వదలండి. దాన-సన్మానాలచే మన వీరులను పురస్కరించండి. విజ్ఞులు అన్నారు-

భేదభావాలు లేక ఒకరిభావాలు మరొకరు గ్రహించినవారూ, పారితోషికాదికంచే సంతుష్టులూ, ప్రభుశ్రేయస్సునకై ప్రాణార్పణకు సిద్ధమైనవారూ, సత్కులీనులూ, సన్మానితులూ అయిన సైనికులు శత్రుసేనను లెస్సగా జయింపగలరు.

మరియూ- శీలవంతులూ, కలిసికట్టుగా ఉండేవారూ, దృఢప్రతిజ్ఞులూ, వీరులూ అయిన సైనికులు అయిదువందలమంది ఉన్నా శత్రుసైన్యాన్ని పరిమార్చగలరు. 129

మూ. కిఞ్చ-

శ్లో. శిష్టై రప్యవిశేషజ్ఞ ఉగ్రశ్చ కృతనాశకః,
త్యజ్యతే కిం పునర్నాన్యై ర్యశ్చాఽప్యాత్మమ్భరి ర్నరః. 130

యతః-

శ్లో. సత్యం శౌర్యం దయా త్యాగో నృపస్యైతే మహాగుణాః,
ఏతై స్త్యక్తో మహీపాలః ప్రాప్నోతి ఖలు వాచ్యతామ్. 131

అను. ఇంకనూ- విశేషజ్ఞత లేనివాడూ, క్రుద్ధుడూ, కార్యవినాశకుడూ, స్వార్థపరుడూ అయిన మానవుణ్ణి సజ్జనులుసైతం పరిత్యజిస్తారు. అన్యుల విషయం ఏమనాలి ? 130

ఏలననగా- ప్రభువునకు సత్యం, పరాక్రమం, దయ, త్యాగం- అనే మహా గుణాలు తప్పక ఉండాలి. ఈ గుణాలు లేనిచో అతను తప్పక లోకనిందను పొందుతాడు. 131

మూ. ఈదృశి ప్రస్తావేఽమాత్యా స్తావ దవశ్యమేవ పురస్కర్తవ్యాః. తథా చోక్తమ్-

శ్లో. యో యేన ప్రతిబద్ధః స్యాత్ సహ తేనోదయీ వ్యయీ,
స విశ్వస్తో నియోక్తవ్యః ప్రాణేషు చ ధనేషు చ. 132

యతః -

శ్లో. ధూర్తః స్త్రీ వా శిశుర్యస్య మన్త్రిణః స్యు ర్మహీపతేః,
అనీతిపవనక్షిప్తోఽకార్యాబ్ధౌ స నిమజ్జతి. 133

అను. ఇలాంటి పరిస్థితి వచ్చినచో (మొదట) మంత్రులను తప్పక గౌరవించాలి. విజ్ఞులు ఇలా అన్నారు-

ఏమంత్రి ఏరాజుతో సంబంధం గల్గి ఉంటాడో, అతడు (మంత్రి) ఆ ప్రభుడి అభివృద్ధిని తన అభివృద్ధిగానూ, అతడి పతనాన్ని తన పతనంగాను భావిస్తాడు. అలా భావించే మంత్రినే విశ్వసించి ప్రభువు తన ప్రాణరక్షణకు ధనరక్షణకు నియమించాలి. 132

ఏలననగా- ఏ భూపాలుడికి వంచకుడు గానీ, ఆడుది గానీ, బాలుడు గానీ (మూర్ఖుడుగానీ), మంత్రులుగా ఉంటారో, ఆ భూపాలుణ్ణి అవినీతి అనే సుడిగాలి

ఎత్తుకొని పోతుంది. చెడుపనులు అనే సముద్రంలో పడవేస్తుంది. అతడు ఆ సము ద్రంలో మునిగిపోతాడు. 133

మూ. శృణు దేవ !

శ్లో. హర్షక్రోధౌ యతౌ యస్య శాస్త్రార్థే ప్రత్యయస్తథా,
నిత్యం భృత్యాఽనుపేక్షా చ తస్య స్యాద్ధనదా ధరా. 134

శ్లో. యేషాం రాజ్ఞా సహ స్యాతా ముచ్చయాఽపచయౌ ధ్రువమ్,
అమాత్యా ఇతి తాన్ రాజా నాఽవమన్యేత్ కదాచన. 135

శ్లో. మహీభుజో మదాన్ధస్య సఙ్కీర్ణస్యేవ దన్తినః,
స్ఖలతో హి కరాఽఽలమ్బః సుశిష్టైరేవ దీయతే. 136

అను. దేవా ! వినుము-

సంతోషం, క్రోధం స్వాధీనంలో ఉంచుకొనేవాడూ, శాస్త్రార్థమందు విశ్వాసం గలవాడూ, సేవకుల విషయంలో ఎన్నడూ అశ్రద్ధవహింపనివాడూ అయిన భూపాలుడికి రాజ్యం ధనాన్ని అనుగ్రహిస్తుంది. 134

ఏ మంత్రులు ప్రభువుయొక్క ఉన్నతిని తమ ఉన్నతిగానూ, అవనతిని తమ అవనతిగానూ అవశ్యం భావించి ప్రవరిసారో, అలాంటి మంత్రులను ప్రభువు ఎప్పటికినీ అవమానింపరాదు. 135

మదంచే కన్నుగానక బురదలో పడిన ఏనుగును (ఒడ్డున) అప్రమత్తములై మిగిలిఉండే ఏనుగులు తమ తొండాలను ఊతగా నొసగి ఎలా ఉద్ధరిస్తాయో, అలాగే రాజ్యలక్ష్మీమదాంధుడై దుష్టభావసంకీర్ణుడై ఆపద నొందిన ప్రభువును శిష్టులైన అమాత్యులు తమ చేతులను ఆధారంగా ఇచ్చి ఉద్ధరిస్తారు." 136

స్ఖలతః = పతితస్య, విపన్నస్య ; సంకీర్ణస్య = దుర్గుణసంకీర్ణస్య, సుశిష్టైః = శుభైః అప్రమత్తైః, అవశిష్టగజైః-శిష్టైరమాత్యైశ్చ, కరావలమ్బః = శుణ్డావలమ్బః, హస్తావలమ్బశ్చ.

మూ. అథాఽఽగత్య ప్రణమ్య మేఘవర్ణో బ్రూతే-'దేవ ! దృష్టి

ప్రసాదం కురు. ఇదానీం విపక్షో దుర్గద్వారి వర్తతే. తద్దేవపాదాఽఽ దేశాత్ బహిర్నిఃసృత్య స్వవిక్రమం దర్శయామి. యేన దేవపాదానా మానృణ్య ముపగచ్ఛామి,

చక్రవాకో బ్రూతే-"మైవమ్. యది బహిర్నిఃసృత్య యోద్ధవ్యం, తదా దుర్గాఽఽశ్రయణమేవ నిష్ప్రయోజనమ్. అపరఞ్చ,

శ్లో. విషమోఽపి యథా నక్రః సలిలా న్నిఃసృతో వశః,
వనాద్వినిర్గతః శూరః సింహోఽపి స్యాచ్ఛృగాలవత్. 137

అను. ఇంతలో మేఘవర్ణుడు-(శత్రుగు ప్తచరుడైన కాకి-దీనికి చక్ర వాకం వద్దన్నా రాజహంస ఆశ్రయం ఇచ్చింది) వచ్చాడు. ప్రణామం చేసి ఇలా చెప్పాడు-"ప్రభూ! దయయుంచి నా ప్రక్కకు చూడండి. ఇప్పుడు శత్రువు కోట ద్వారంవద్ద ఉన్నాడు. కనుక పూజ్యపాదులైన ప్రభువులు ఆజ్ఞాపిస్తే నేను కోట వెలుపలికి పోతాను. నా పరాక్రమం ప్రదర్శిస్తాను. ప్రభువుల ఋణం తీర్చు కుంటాను."

చక్రవాకం అందుకు ఇలా అంది-"అలా వద్దు. వెలుపలికి పోయి యుద్ధం చేయవలసినట్లుంటే ఇక దుర్గాన్ని ఆశ్రయించడమే వ్యర్థం. మరియూ-

మొసలి భయంకరమై ఉండికూడ నీటినుండి వెలుపలికి వచ్చినచో లోబడుతూంది. అలాగే సింహం పరాక్రమశాలి అయినా అడవిని వీడి వెలుపలికి వస్తే నక్కవలె లొంగిపోతుంది." 137

మూ. [వాయసో బ్రూతే] దేవ! స్వయం గత్వా దృశ్యతాం యుద్ధమ్. యతః-

శ్లో. పురస్కృత్య బలం రాజా యోధయే దవలోకయన్,
స్వామినాఽధిష్ఠితః శ్వాఽపి కిం న సింహాయతే ధ్రువమ్. 138

అథ తే సర్వే దుర్గద్వారం గత్వా మహాహవం కృతవన్తః.

అను. [కాకి ఇలా అంది]-ప్రభూ! తాము స్వయంగా పోయి యుద్ధం

చూడండి. ఏలనన-

ప్రభువు సేనను ముందుంచుకొని స్వయంగా దాన్ని నిరీక్షిస్తూ యుద్ధం చేయించాలి. యజమానుడు తోడుగా ఉంటే కుక్క సైతం సింహంవలె పరాక్రమిస్తుందిగదా''. 138

పిమ్మట వారంతా దుర్గద్వారం చేరి మహాయుద్ధం చేశారు.

మూ. అపరేద్యు శ్చిత్రవర్ణో రాజా గృధ్ర మువాచ-'తాత! స్వప్రతిజ్ఞాత మధునా నిర్వాహయ' ఇతి.

గృధ్రో బ్రూతే-'దేవ! శృణు తావత్-

శ్లో. అకాలసహ మత్యల్పం మూర్ఖవ్యసనినాయకమ్,
అగుప్తం భీరుయోధఞ్చ దుర్గవ్యసన ముచ్యతే. 139

తత్తావ దత్ర నాస్తి.

శ్లో. ఉపజాప శ్చిరారోధోఽవస్కన్ద స్తీవ్రపౌరుషమ్,
దుర్గస్య లఙ్ఘనోపాయా శ్చత్వారః కథితా ఇమే. 140

అత్ర యథాశక్తి క్రియతే యత్నః. ఇత్యుక్త్వా కర్ణే కథయతి-'ఏవమేవమ్' ఇతి.

అను. మరునాడు చిత్రవర్ణుడు మంత్రి అయిన గ్రద్దతో ఇలా అన్నాడు-'నాయనా! ఇప్పుడు నీ ప్రతిజ్ఞను పూర్తిచేయుము'.

అందుకు గ్రద్ద ఇలా బదులు చెప్పింది-'దేవ! అయితే వినండి—చాలకాలం ముట్టడిని సహింపలేకపోవడం, మిక్కిలి అల్పంగా సైన్యం ఉండడం, మూర్ఖులూ వ్యసనులు అయిన నాయకులచేతిలో అధికారం ఉండడం, కోటకు సరియైన రక్షణ లేకపోవడం, పిఱికివాండ్రైన సైనికులు ఉండడం అనే ఈ అయిదు చెడు లక్షణాలు కోటకు వ్యసనాలు అనబడుతాయి. 139

అది మాత్రం ఇచ్చట లేదు.

కోటలోని సైనికులలో విరోధం పుట్టించడం, చిరకాలం ముట్టడించడం,

హఠాత్తుగా ఆక్రమించడం, తీవ్రపౌరుషం ప్రదర్శించడం అనే ఈ నాలుగు విజయోపాయాలు అంటారు. 140.

ఈ విషయంలో యథాశక్తి ప్రయత్నం చేయాలి.'

ఇలా అని రాజు చెవిలో 'ఇలా' అని రహస్యంగా ఏదో సంకేతం చేసింది గ్రద్ద.

మూ. తతోఽనుదిత ఏవ భాస్కరే చతుర్ష్వపి దుర్గద్వారేషు ప్రవృత్తే యుద్ధే దుర్గాభ్యన్తరగృహే ష్వేకదా కాకేనాఽగ్నిర్నిక్షిప్తః. తతో 'గృహీతం గృహీతం దుర్గమ్'-ఇతి కోలాహలం శ్రుత్వా సర్వతః ప్రదీప్తాగ్ని మవలోక్య రాజహంససైనికా బహవో దుర్గవాసినశ్చ సత్వరం హ్రదం ప్రవిష్టాః. యతః-

శ్లో. సుమన్త్రితం సువిక్రాన్తం సుయుద్ధం సుపలాయితమ్,
కార్యకాలే యథాశక్తి కుర్యా న్నతు విచారయేత్. 141

అను. పిమ్మట సూర్యోదయానికి ముందే కోటద్వారాలు నాల్గింటిలో భీకరమైన పోరాటం ప్రారంభమైంది. ఇంతలో కాకి కోటలోని ఇండ్లకు ఒకేసారి నిప్పు పెట్టింది. అప్పుడు రాజహంససైనికులు అలాగే కోటలోనివారు పెక్కురు 'కోట లోబడింది లోబడింది'—అనే కేకలను (కోలాహలం) విన్నారు. అన్నివైపులా ప్రజ్వరిల్లే అగ్నిని చూచారు. వెంటనే మడుగులో చొఱబడ్డారు. ఏలనన-

కాలానుగుణంగా ఉత్తమమంత్రం (ఆలోచన) ప్రశస్తవిక్రమం, శ్రేష్ఠ సంగ్రామం, (విజయావకాశాలు ఏ విధంగానూ కనబడనిచో) నేర్పుగా పఱుగెత్తడం వెంటనే యథాశక్తి చేయాలి. ఇందు ఎలాటి తర్కవితర్కాలు అనుసరింపరాదు.

మూ. రాజా హంసశ్చ స్వభావా న్మన్దగతిః సారసద్వితీయ శ్చిత్ర వర్ణస్య సేనాపతినా కుక్కుటేనాఽఽగత్య వేష్టితః హిరణ్యగర్భః సారస మాహ–'సేనాపతే ! సారస ! మమా ఽనురోధా దాత్మానం కథం వ్యాపా దయసి ? (అధునాఽహం గన్తు మసమర్థః, త్వంగన్తు మధునాఽపి సమర్థః. తద్గత్వా జలం ప్రవిశ్యాఽఽత్మానం పరిరక్ష. అస్మత్పుత్రం

చూడామణినామానం సర్వజ్ఞస్య సంమత్యా రాజానం కరిష్యసి.' సారసో బ్రూతే-'దేవ! న వక్తవ్య మేవం దుఃసహం వచః. యావచ్చన్ద్రార్కౌ దివి తిష్ఠత స్తావద్విజయతాం దేవః. అహం దేవ! దుర్గాధికారీ. తన్మమ మాంసాఽసృగ్విలిప్తేన ద్వారవర్త్మనా తావత్ ప్రవిశతు శత్రుః. అపరఞ్చ. దేవ!

శ్లో. దాతా క్షమీ గుణగ్రాహీ స్వామీ దుఃఖేన లభ్యతే,
రాజాఽఽహ-'సత్య మేవై తత్. కిన్తు-
శుచి ర్దక్షోఽనురక్తశ్చ జానే భృత్యోఽపి దుర్లభః. 142

అను. రాజు అయిన హంస (హిరణ్యగర్భుడు) సహజంగా మందగమనం గలవాడు. అతడికి తోడుగా సేనాపతి అయిన సారసపక్షి (బెగ్గురుపక్షి) ఉంది. ఇంతలో చిత్రవర్ణుడి సేనాపతి అయిన కోడి వచ్చి ముట్టడించింది. అప్పుడు హిరణ్యగర్భుడు సారసపక్షితో ఇలా అంది-"ఓ సేనాపతీ! సారసపక్షీ! నాకై నీవూ ఎందుకు మరణిస్తావు. (ఇప్పుడు నేను నడువజాలను) నీవు ఇప్పుడునూ పోగలవు. కనుక పొమ్ము. నీటిలోనికి పోయి ఆత్మరక్షణ చేసికొనుము. నా పుత్రుడైన చూడామణిని మంత్రి అయిన సర్వజ్ఞుడి అంగీకారంతో రాజును చేయండి.' అది విని సారసపక్షి ఇలా అంది-'దేవా! ఇలా సహింపరాని మాటలు పల్కవద్దు. సూర్యుడు చంద్రుడు ఆకాశంలో ఉన్నంతకాలం తాము విజయంతో విరాజిల్లగలరు. ప్రభూ! నేను కోటకు అధికారిని. అందువల్ల నామాంసంచే రక్తంచే తడపబడ్డ మార్గాన్నే శత్రువు ప్రవేశించాలి. మరియూ దేవా! దాతయూ, సహనశీలుడూ, గుణజ్ఞుడూ అయిన ప్రభువు లభించడం కష్టం. అది విని రాజు (హిరణ్యగర్భుడు) ఇలా అన్నాడు-'ఇది సత్యమే. కాని పవిత్రుడూ, సమర్థుడూ, స్వామిభక్తుడూ అయిన సేవకుడు లభించడం సైతం దుర్లభంగానే తలుస్తాను'.

మూ. సారసో బ్రూతే-'శృణు దేవ!

శ్లో. యది సమర మపాస్య నాస్తి మృత్యో
ర్భయ మితి యుక్తమితోఽన్యతః ప్రయాతుమ్,
అథ మరణ మవశ్యమేవ జన్తోః
కిమితి ముధా మలినం యశః క్రియేత. 143

అన్యచ్చ-

శ్లో. భవేఽస్మిన్ పవనోద్భ్రాన్త వీచివిభ్రమభఙ్గురే,
జాయతే పుణ్యయోగేన పరార్థే జీవితవ్యయః. 144

అను. సారసపక్షి ఇలా చెప్పింది-'దేవా ! వినుము-

యుద్ధభూమిని వదలి పారిపోయినచో మరణభయం లేదేని అలా పారిపోవడం సముచితమే. కానీ పుట్టిన ప్రతిప్రాణికి మరణం తప్పదు. అలాంటి స్థితిలో పారిపోయి వ్యర్థంగా అపకీర్తిని పొందడం దేనికి ? 143

మరియూ-వాయువుచే నీటిలో పుట్టుతూ గిట్టుతూ ఉండే తరంగాలవలె క్షణికమైన ఈ సంసారంలో పరహితానికై ప్రాణాలు వీడడం అనేది పుణ్యయోగంవల్లనే సంభవిస్తుంది. 144

శ్లో. స్వామ్యమాత్యశ్చ రాష్ట్రఞ్చ దుర్గం కోశో బలం సుహృత్,
రాజ్యాఙ్గాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపి చ. 145

దేవ! త్వఞ్చ స్వామీ ; సర్వథా రక్షణీయః. యతః-

శ్లో. ప్రకృతిః స్వామినం త్యక్త్వా సమృద్ధాఽపి న జీవతి,
అపి ధన్వన్తరిర్వైద్యః కిం కరోతి గతాయుషి. 146

అపరఞ్చ-

శ్లో. నరేశే జీవలోకోఽయం నిమీలతి నిమీలతి,
ఉదేత్యుదీయమానే చ రవావివ సరోరుహమ్. 147

అత్రాఽపి ప్రధానాఙ్గం రాజా.

అను. ప్రభువు-మంత్రి-రాజ్యం-కోట - ధనాగారం - సైన్యం-మిత్రవర్గం-పౌరజనమండలం అనే ఈ ఎనిమిది రాజ్యాంగాలు అనబడుతాయి. 145

మరియూ-ప్రభువు నశిస్తే సమస్త రాష్ట్రప్రజ నశిస్తుంది. ఇక రాజు అభ్యుదయం పొందితే ఉదయించిన సూర్యుణ్ణి గాంచిన కమలంవలె సర్వప్రజ వికాసం పొందుతుంది. 147

కనుక ఇందు రాజ్యాంగాలు ఎనిమిదింటిలో రాజు ప్రధానాంగం.

మూ. అథ కుక్కుటేనాఽఽగత్య రాజహంసస్య శరీరే ఖరతర నఖాఽఽ ఘాతః కృతః. తదా సత్వర ముపసృత్య సారసేన స్వదేహా న్తరితో రాజా జలే క్షిప్తః.

అథ కుక్కుటనఖప్రహారజర్జరీకృతేనాఽపి సారసేన కుక్కుట సేనా బహుశో హతా, పశ్చాత్ సారసోఽపి బహుభిః పక్షిభిః సమేత్య చఞ్చుప్రహారేణ విభిద్య వ్యాపాదితః. అథ చిత్రవర్ణో దుర్గం ప్రవిశ్య దుర్గావస్థితం ద్రవ్యం గ్రాహయిత్వా వన్దిభి ర్జయశబ్దైః ఆనన్దితః స్వస్కన్ధావారం జగామ.

అను. అంత కోడి వచ్చింది. మిక్కిలి వాడియైన తన గోళ్ళతో రాజ హంసుణ్ణి గాయపఱచింది. ఇంతలో వేగంగా సారసపక్షి వచ్చి రాజహంసుడి (రక్షాకవచంగా) అడ్డంగా నిలిచింది. రాజును నీటిలోనికి త్రోసివేసింది.

అప్పుడు కోళ్ళ గోళ్ళదెబ్బలచే సారసపక్షి శరీరం ఛిన్నభిన్నమై పోయింది. అయినా ఆ సారసపక్షి విక్రమించి కుక్కుటసైన్యాన్ని చాలవరకు చంపింది. కాని పెక్కు పక్షులు సంఘటితంగా దాడిచేసి తమ ముక్కులతో పొడవడంతో ఒడలంతా తూట్లువడి ఆ సారసపక్షి మరణించింది. పిమ్మట చిత్రవర్ణుడు కోటలో ప్రవేశించాడు. అందలి ధనమంతా అనుచరులద్వారా గ్రహించాడు. వందిజనం జయ జయ ధ్వనులు పల్కుచుండగా ఆనందభరితుడై తన శిబిరం చేరాడు.

మూ. అథ రాజపుత్రై రుక్తమ్ - 'తస్మిన్ రాజహంసబలే పుణ్యవాన్ న సారస ఏవ, యేన స్వదేహత్యాగేన స్వామీ రక్షితః. యతః-

శ్లో. జనయన్తి సుతాన్ గావః సర్వా ఏవ గవాకృతీన్,
విషాణోల్లిఖితస్కన్ధం కాచిదేవ గవాం పతిమ్. 148

విష్ణుశర్మోవాచ-'స తావత్ సత్త్వక్రీతా నక్షయలోకాన్ విద్యాధరీ పరివృతోఽనుభవతు మహాసత్త్వః. తథా చోక్తమ్ -

శ్లో. ఆహవేషు చ యే శూరాః స్వామ్యర్థే త్యక్తజీవితాః,
భర్తృభక్తాః కృతజ్ఞాశ్చ తే నరాః స్వర్గగామినః. 149

శ్లో. యత్ర తత్ర హతః శూరః శత్రుభిః పరివేష్టితః,
అక్షయాన్ లభతే లోకాన్ యది క్లైబ్యం న గచ్ఛతి. 150

అను. అంతట రాజపుత్రులు ఇలా అన్నారు-'ఆ రాజహంసుడి సేనలో ఆ సారసపక్షి ఒక్కటియే పుణ్యాత్ముడు. అతను తన ప్రాణాన్ని అర్పించి ప్రభువును రక్షించాడు. ఏలనన-

ఆవులన్నీ కోడెదూడల రూపంలో ఎన్నిటికో జన్మ నిస్తాయి. కానీ ఒకానొక ఆవు మాత్రమే కొమ్ములచే గాయపడిన మూపురం గల వృషభ రాజానికి తల్లి అవుతుంది. 148

[అది విని] విష్ణుశర్మ ఇలా చెప్పాడు-'ఆ మహాపరాక్రముడు విద్యాధర సుందరీమణులచే పరివృతుడై స్వర్గసుఖాలు అనుభవిస్తూ ఉంటాడు. విజ్ఞులు ఇలా అన్నారు-

ఏ వీరపురుషులు యుద్ధభూములందు ప్రభువునకై ప్రాణాలు అర్పిస్తారో - అలాంటి కృతజ్ఞులూ, ప్రభుభక్తులూ అయిన పుణ్యమానవులు స్వర్గసుఖం అనుభవిస్తారు. 149

పిఱికితనం చూపక ఎచ్చటనైనా సరే శత్రువులచే చుట్టబడినవాడై మరణించే వీరుడు అక్షయస్వర్గసుఖాలను పొందుతాడు. 150

మూ. [ఏవ ముక్త్వా అథ పున ర్విష్ణుశర్మోవాచ - 'విగ్రహః శ్రుతో భవద్భిః'. రాజపుత్రై రుక్తమ్-'శ్రుత్వా సుఖినో భూతా వయమ్.'

విష్ణుశర్మాఽబ్రవీత్-'అపరమ ప్యేవమస్తు-

శ్లో. విగ్రహః కరి-తురఙ్గ-పత్తిభిః
నో కదాపి భవతా న్మహీభుజామ్,
నీతిమన్త్రపవనైః సమాహతాః
సంశ్రయన్తు గిరిగహ్వరం ద్విషః. 151

ఇతి శ్రీ నారాయణపణ్డితవిరచితే హితోపదేశే
నీతిశాస్త్రే విగ్రహో నామ తృతీయః కథాసఙ్గ్రహః.

అను. ఇలా చెప్పి మరలా విష్ణుశర్మ ఇట్లు అన్నాడు-'మీరు విగ్రహం (యుద్ధం) విన్నారు'. అంత రాజపుత్రులు ఇలా అన్నారు-'విని మేము మిక్కిలి ఆనందం పొందాము.

అంత విష్ణుశర్మ ఇలా ఆశీస్సులు పల్కాడు-'మరియు ఈ శుభం గల్గు గాక!

రాజులకు ఏనుగుల బలంతో, అశ్వబలంతో, కాల్బలంతో యుద్ధం చేసే ప ఎప్పుడూ గల్గకుండుగాక. రాజనీతి మంత్రములనే వాయువులచే కొట్టబడిన వారై శ లు పర్వతగుహలను ఆశ్రయింతురుగాక. 151

ఇది శ్రీ నారాయణ పండిత సంగృహీతమైన హితోపదేశంలో
విగ్రహం అనే మూడవదైన
కథాసంగ్రహానికి శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి
విరచితమైన ఆంధ్రానువాదం సమాప్తం.
శుభమ్.

# హితోపదేశే-సన్ధిః

[హితోపదేశంలో—సంధి]

మూ. పునః కథాఽఽ రమ్భకాలే రాజపుత్త్రై రుక్తమ్-'ఆర్య! విగ్రహః శ్రుతోఽస్మాభిః. సన్ధి రధునాఽభిధీయతామ్. విష్ణుశర్మణోక్తమ్ -'శ్రూయతామ్. సన్ధిమపి కథయామి. యస్యాఽయ మాద్యః శ్లోకః-

శ్లో. వృత్తే మహతి సఙ్గ్రామే రాజ్ఞో ర్నిహత సేనయోః,
స్థేయాభ్యాం గృధ్రచక్రాభ్యాం వాచా సన్ధిః కృతః క్షణాత్. 152

అను. మరలా కథారంభసమయంలో రాజపుత్రులు ఇలా అడిగారు -'ఆర్యా! మేము విగ్రహం (యుద్ధం) విన్నాం. ఇప్పుడు సంధిని చెప్పండి.' విష్ణుశర్మ ఇలా అన్నాడు-'వినండి. సంధిని సైతం చెప్పెదను. ఇది దానికి మొదటి శ్లోకం. (శ్లోకభావం)-

ఇరువురు రాజులకు [చిత్రవర్ణుడికి- హిరణ్యగర్భుడికి] భయంకరమైన యుద్ధం జరిగింది. ఇరుపక్కల సైనికులు అధికంగా మరణించారు. అంత ఆ రాజు లిరువురికీ మంత్రులైన గ్రద్ద, చక్రవాకం క్షణంలో మాటమాత్రంచే సంధిని చేశాయి.

మూ. రాజపుత్రా ఊచుః-'కథమేతత్?' విష్ణుశర్మా కథయతి-

"తతస్తేన రాజహంసే నోక్తమ్-'కేనాఽస్మద్దుర్గే నిక్షిప్తోఽగ్నిః?' కిం పారక్యేణ? కింవాఽస్మద్దుర్గవాసినా కేనాఽపి విపక్షప్రయుక్తేన? ఇతి. చక్రవాకో బ్రూతే-'దేవ! భవతో నిష్కారణబన్ధురసౌ మేఘవర్ణః సపరివారో న దృశ్యతే. తన్మన్యే తస్యైవ విచేష్టిత మిదమ్.

రాజా క్షణం విచిన్త్యాఽఽహ-'అస్తు న తావదేవమ్. మమ దుర్దైవ మేతత్. తథా చోక్తమ్-

శ్లో. అపరాధః స దైవస్య న పునర్మన్త్రిణామయమ్,
కార్యం సుచరితం క్వాఽపి దైవయోగా ద్వినశ్యతి. 153

అను. రాజపుత్రులు అడిగారు-'అది ఎట్లు?'

విష్ణుశర్మ ఇలా చెప్పసాగాడు-

పిమ్మట ఆ రాజహంసుడు (హిరణ్యగర్భుడు) ఇలా మంత్రిని అడిగాడు. -'మన కోటకు నిప్పు పెట్టింది ఎవరు? శత్రుపక్షంవాడా? లేక శత్రుప్రయుక్తుడై మన కోటలోనే ఉండేవాడా? చక్రవాకం ఇలా అంది-'తమచే అకారణబంధువుగా భావింపబడిన మేఘవర్ణుడూ (కాకి) అతడి కుటుంబం కనబడడం లేదు. అందుచే ఇదంతా అతడి కుతంత్రంగానే భావిస్తూ ఉన్నాను.'

రాజు క్షణకాలం ఆలోచించాడు-ఇలా అన్నాడు-'ఆఁ అలాగే అగుగాక! కాని ఇదంతా నా దురదృష్టం. విజ్ఞులు ఇలా అన్నారు-

పరాజయం దురదృష్టదోషం. ఇందు మంత్రులదోషం ఏమీ లేదు. అప్పుడప్పుడూ ఎంత జాగ్రత్తగా చేసినపని అయినా అదృష్టం లేనప్పుడు చెడిపోతుంది (నశిస్తుంది). 153

మూ. మన్త్రీ బ్రూతే-'ఉక్తమే వైతత్-

శ్లో. విషమాం హి దశాం ప్రాప్య దైవం గర్హయతే నరః,
ఆత్మనః కార్యదోషాంశ్చ నైవ జానా త్యపణ్డితః. 154

అపరఞ్చ-

శ్లో. సుహృదాం హితకామానాం యో వాక్యం నాఽభినన్దతి,
స కూర్మ ఇవ దుర్బుద్ధిః కాష్ఠాద్ భ్రష్టో భవిష్యతి. 155

అన్యచ్చ-

శ్లో. రక్షితవ్యం సదా వాక్యం వాక్యాద్భవతి నాశనమ్,
హంసాభ్యాం నీయమానస్య కూర్మస్య పతనం యథా. 156

రాజాఽఽహ-'కథమేతత్? మన్త్రీ కథయతి-

అను. మంత్రి ఇలా అన్నాడు-'ఇది సైతం చెప్పబడింది-

మానవుడు ఆపదల్లో చిక్కుకొన్నప్పుడు తన దౌర్భాగ్యాన్ని గూర్చి నిందిస్తాడు. కాని ఆ మూర్ఖమానవుడు తాను చేసిన పనుల్లోని తప్పులను మాత్రం గుర్తింపడు. 154

మరియూ-తన మేలుగోరే మిత్రులమాటను ఎవడు ఆదరింపడో-అలాంటి మూర్ఖుడు తాబేలువలె కట్టనుండి జారిపడుతాడు. (నశిస్తాడు) 155

ఇంకనూ-ప్రతివాడు నిత్యం వాక్సంయమం పాటించాలి. అలా కానిచో హంసలు తీసికొనిపోయే తాబేలువలె పడి నశిస్తాడు. 156

రాజు అడిగాడు-'అది ఎట్లు?' మంత్రి (చక్రవాకం) ఇలా చెప్పసాగాడు-

# 1 కూర్మ కథా

## [తాబేలు కథ]

మూ. అస్తి మగధదేశే ఫుల్లోత్పలాభిధానం సరః. తత్ర చిరం సఙ్కటవికటనామానౌ హంసౌ నివసతః. తయోర్మిత్రం కమ్బుగ్రీవ నామా కూర్మశ్చ ప్రతివసతి.

అథైకదా ధీవరైరాగత్య తత్రోక్తం యత్ - 'అత్రాఽస్మాభి రద్యోషిత్వా ప్రాతర్మత్స్యకూర్మాదయో వ్యాపాదయితవ్యాః.' తదాకర్ణ్య కూర్మో హంసావాహ-'సుహృదౌ! శ్రుతోఽయం ధీవరాఽఽలాపః. అధునా కిం మయా కర్తవ్యమ్? ఇతి. హంసౌ వాహతుః-'జ్ఞాయతాం తావత్, పునస్తావత్ ప్రాతర్యదుచితం తత్కర్తవ్యమ్.' కూర్మో బ్రూతే -'మైవమ్. యతో దృష్టవ్యతికరోఽహమత్ర. తథా చోక్తమ్-

శ్లో. అనాగతవిధాతా చ ప్రత్యుత్పన్నమతి స్తథా,
ద్వావేతౌ సుఖమేధేతే యద్భవిష్యో వినశ్యతి. 157

తా వాహతుః-'కథ మేతత్?' కూర్మః కథయతి-

అను. మగధదేశంలో ఫుల్లోత్పలం అనే కొలను ఉంది. అందు చాలా కాలంగా సంకటుడు, వికటుడు-అనే పేర్లు గల రెండు హంసలు నివసిస్తూన్నాయి. ఆ హంసలకు నేస్తం కంబుగ్రీవుడు అనే తాబేలు. అదీ ఆ కొలనులోనే నివసిస్తూంది.

అంత ఒకనాడు (సాయంకాలం) బేస్తవాండ్రు అచ్చటికి వచ్చారు. ఇలా [తమలో తాము] చెప్పుకున్నారు-'ఈ రాత్రికి మనం ఉందాం. రేపు వేకువనే ఇందలి చేపలు, తాబేళ్ళు మొదలైనవాటిని పట్టుకొని చంపుదాం.'

అది విని తాబేలు హంసలతో ఇలా అంది-'మిత్రులారా! ఈ బేస్తల మాటలు విన్నారా? ఇప్పుడు నే నేమి చేయాలి?' హంసలు ఇలా బదులు చెప్పాయి-'వేకువన ఏంచేయాలో విచారిద్దాం. అంత తాబేలు ఇలా అంది-'అలా వద్దు. నేను ఈ విషయంలో ఉపేక్షచే సంభవించే విపరీతఫలితాన్ని (వ్యతికరాన్ని) చూచాను. విజ్ఞులు ఇలా అన్నారు.

అనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి అనే చేపలు సుఖం పొందాయి. యద్భవిష్యుడు అనే చేప నశించింది. 157

ఆ హంసలు రెండూ అడిగాయి-'అదెట్లు? తాబేలు ఇలా చెప్పదొడగింది-

## 2. మత్స్యత్రయ కథా

[మూడు చేపల కథ]

మూ. పురాఽస్మిన్నేవ సరస్యేవంఽవిధేష్వేవ ధీవరేషూపస్థితేషు మత్స్యత్రయేణాఽఽలోచితమ్. తత్రాఽనాగతవిధాతా నామైకో మత్స్యః. తేనోక్తమ్-'అహం తావజ్జలాశయాన్తరం గచ్ఛామి'-ఇత్యుక్త్వా స హ్రదాన్తరం గతః. అపరేణ ప్రత్యుత్పన్నమతినామ్నా మత్స్యేనాభిహితమ్-'భవిష్యదర్థే ప్రమాణాభావాత్ కుత్ర మయా గన్తవ్యమ్? తదుత్పన్నే యథా కార్యం తదనుష్ఠేయమ్. తథా చోక్తమ్-

శ్లో. ఉత్పన్నా మాపదం యస్తు సమాధత్తే స బుద్ధిమాన్,
వణిజో భార్యయా జారః ప్రత్యక్షే నిహ్నుతో యథా. 158

యద్భవిష్యః పృచ్ఛతి-'కథమేతత్? ప్రత్యుత్పన్నమతిఃకథయతి-

అను. పూర్వం ఈ కొలనువద్దనే ఇలాగే బెస్తవాండ్రు వచ్చి మాట్లాడుకున్నారు. అప్పుడు కొలనులోని మూడు చేపలు కలిసి ఆలోచించాయి. వాటిలో అనాగతవిధాత అనే పేరు గల ఒక చేప ఉంది. అది ఇలా అంది-'నేను మాత్రం వేఱే కొలనుకు పోతాను.' ఇలా అని అది వేఱే చెరువునకు పోయింది. ప్రత్యుత్పన్నమతి అనే మఱియొక్క చేప ఇలా చెప్పింది-'ఎప్పుడో సంభవించేదాని విషయంలో ప్రమాణం (నమ్మకం) లేనందున నేను ఎచ్చటికైనా ఎందుకు పోవాలి? అలా అది సంభవిస్తే అప్పుడు తగినట్లు చేయవచ్చు. విజ్ఞులు ఇలా అన్నారు-

ఆపద వచ్చినప్పుడు దాన్ని తొలగించుకొనేందుకు తగినట్లు ప్రవర్తించేవాడే బుద్ధిమంతుడు అనబడుతాడు. కోమటివాడి భార్య భర్త ఎదురుగా ఉన్నా జంకు తనాన్ని దాచిపెట్టింది. 158

యదృవిష్యుడు అడిగాడు- 'అది ఎట్లు ?' ప్రత్యుత్పన్నమతి ఇలా చెప్ప సాగాడు–

(అనాగతవిధాత = భవిష్యద్విషయం చక్కబెట్టేవాడు, ప్రత్యుత్పన్నమతి = సమయోచితంగా ప్రతిభచే ప్రవర్తించేవాడు, యదృవిష్యుడు = ఏది జరుగాలో అది అగును- అని తలంచి ఏ ప్రయత్నమూ చేయనివాడు.)

## 3. వణిగ్భార్యా కథా

### (వైశ్యుని భార్య కథ)

మూ. పురా విక్రమపురే సముద్రదత్తో నామ వణిగస్తి. తస్య రత్నప్రభా నామ గృహిణీ స్వసేవకేన సహ సదా రమతే. యతః-

శ్లో. న స్త్రీణా మప్రియః కశ్చిత్ ప్రియో వాఽపి న విద్యతే,
గావ స్తృణమివాఽరణ్యే ప్రార్థయన్తే నవం నరమ్. 159

అను. పూర్వం విక్రమపురం అనే నగరంలో సముద్రదత్తుడు అనే వైశ్యుడు ఉండేవాడు. అతడి భార్యపేరు రత్నప్రభ. ఆమె నిత్యం సేవకుడితో రమిస్తుం డేది. ఏలనన–

స్త్రీలకు ఇష్టంకానివాడుగానీ, ఇష్టమైనవాడుగానీ ఎవడూ లేడు. గోవులు అడవిలో లేబచ్చికను గోరునట్లు ఈ స్త్రీలు నవయువకుడిని కాంక్షిస్తారు. 159

మూ. అథైకదా సా రత్నప్రభా స్వసేవకస్య ముఖే చుమ్బనం దదతీ సముద్రదత్తేనాఽవలోకితా. తతః సా బన్ధకీ సత్వరం భర్తుః సమీపం గత్వాఽఽహ- 'నాథ! ఏతస్య సేవకస్య మహతీ నికృతిః. యతోఽయం చౌరికాం కృత్వా కర్పూరం ఖాదతీతి మయాఽస్య ముఖ మాఘ్రాయ జ్ఞాతమ్' ఇతి. తథా చోక్తమ్-

శ్లో. ఆహారో ద్విగుణః స్త్రీణాం బుద్ధిస్తాసాం చతుర్గుణా,
షడ్గుణో వ్యవసాయశ్చ కామ శ్చాష్టగుణః స్మృతః. 160

అను. అంత ఒకనాడు ఆ రత్నప్రభ తన సేవకుడి ముఖాన్ని ముద్దు పెట్టుకుంటూ ఉండగా సముద్రగుప్తుడు చూచాడు. వెంటనే ఆ కులట మగడివద్దకు పోయింది. ఇలా అంది- 'నాథా ! ఈ సేవకుడిలో గొప్ప చెడుగుణం ఉంది. వీడు దొంగతనం చేసి కర్పూరం తింటాడు. దీన్ని నేను వీడి ముఖాన్ని (నోటిని) వాసన చూచి గ్రహించాను.'

అందుకే విజ్ఞులు ఇలా చక్కగా చెప్పారు— స్త్రీలకు (పురుషులకంటె) తిండి రెండురెట్లు, బుద్ధి నాల్గురెట్లు, ప్రయత్నం ఆరురెట్లు, కామం ఎనిమిదిరెట్లు అధికంగానూ ఉంటుంది. 160

మూ. తచ్ఛ్రుత్వా సేవకేనాఽపి ప్రకుప్యోక్తమ్- 'నాథ! యస్య స్వామినో గృహే త్వేతాదృశీ భార్యా, తత్ర సేవకేన కథం స్థాతవ్యమ్? యత్ర చ గృహిణీ ప్రతిక్షణం సేవకస్య ముఖం జిఘ్రతి' ఇతి. తతోఽసా వుత్థాయ చలితః. సోఽధునా చ యత్నాత్ ప్రబోధ్య ధృతః. అతోఽహం బ్రవీమి- 'ఉత్పన్నా మాపదమ్' ఇత్యాది.

అను. అది వినగానే సేవకుడునూ కోపం పొందాడు. ఇలా అన్నాడు- 'ప్రభూ! ఇలాంటి ఇల్లాలు ఉండే యజమానుడి ఇంట్లో సేవకుడు ఎలా ఉంటాడు? యజమానుడి భార్య (సందేహంతో) ప్రతిక్షణం సేవకుడి నోటిని వాసనచూస్తూ ఉంటే ఉండడం సాధ్యమా ? ఇలా అని ఆ సేవకుడు లేచి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు వైశ్యుడు వాడిని ఏదో విధంగా నచ్చచెప్పి (బ్రతిమిలాడి) నిల్పాడు. అందుచే నేను (ప్రత్యుత్పన్నమతిని) చెప్పుతున్నాను- 'ఆపద సంభవించినపుడు- ఇత్యాది' (చూడుడు 7వ శ్లోకభావం).

మూ. తతో యద్భవిష్యేణోక్తమ్-

శ్లో. యదభావి న తద్భావి భావిచేన్న తదన్యథా,
ఇతి చిన్తావిషఘ్నోఽయ మగదః కిం న పీయతే. 161
[అగదః = ఔషధమ్]

తతః ప్రాతర్జాలేన బద్ధః ప్రత్యుత్పన్నమతి ర్మృతవదాత్మానం సన్దర్శ్య స్థితః. తతో జాలా దపసారితో యథాశ క్త్యుత్ప్లుత్య గభీరం నీరం ప్రవిష్టః. యద్భవిష్యశ్చ ధీవరైః ప్రాప్తో వ్యాపాదితః. అతోఽహం బ్రవీమి- 'అనాగతవిధాతా చ-' ఇత్యాది.

తద్యథాఽహ మన్యం హ్రదం ప్రాప్నోమి తథా క్రియతామ్.' ఇతి-

అను. అప్పుడు యద్భవిష్యుడు ఇలా అన్నాడు-

ఏది ప్రారబ్ధంలో లేదో అది సంభవింపదు. ఏది ప్రాప్తంలో ఉందో అది తొలగింప వీలుగాదు. ఈ సూక్తియే చింత అనే విషాన్ని తొలగించే దివ్యౌషధం. దీన్ని ఎందుకు సేవింపరు? 161

(దానికి ఎవ్వరూ బదులు పల్కాలేదు.) ఉదయం బేస్తలు వలలు వేశారు. ప్రత్యుత్పన్నమతి వలలో చిక్కాడు. చచ్చినట్లుగా నటించాడు. జాలరులు వల నుండి వెలికితీసి ఒకచోట ఉంచారు. వెంటనే వారి కన్ను గప్పి అతను యథాశక్తి ఎగిరాడు. లోతైన నీటిలోనికి దుమికి తప్పించుకొన్నాడు. యద్భవిష్యుడు జాలరులకు దొరికాడు; చంపబడ్డాడు. అందువల్ల నేను (కంబుగ్రీవుడు అనే తాబేలును) చెప్పతూన్నాను- 'అనాగతవిధాత' ఇత్యాది. (6వ శ్లోకభావం చూడుడు)

కనుక నేను మరో కొలను చేరే ఉపాయం ఆలోచించండి.

మూ. హంసావాహతుః- 'జలాశయాన్తరే ప్రాప్తే తవ కుశలమ్. స్థలే గచ్ఛతస్తే కో విధిః?' ఇతి. కూర్మ ఆహ-'యథాఽహం భవద్భ్యాం సహాఽఽకాశవర్త్మనా యామి తథా విధీయతామ్.'

హంసౌ బ్రూతః- 'కథ ముపాయః సంభవతి?' కచ్ఛపో వదతి- 'యువాభ్యాం చఞ్చుధృతం కాష్ఠఖణ్డ మేకం మయా ముఖేనాఽవలమ్బితవ్యమ్. తతశ్చ యువయోః పక్షబలేన మయాఽపి సుఖేన గన్తవ్యమ్' ఇతి. హంసౌ బ్రూతః- 'సమ్భవత్యేష ఉపాయః. కిన్తు-

శ్లో. ఉపాయం చిన్తయన్ ప్రాజ్ఞో హ్యపాయమపి చిన్తయేత్,
పశ్యతో బకమూర్ఖస్య నకులై ర్భక్షితాః ప్రజాః. 162

కూర్మః పృచ్ఛతి- 'కథమేతత్ ?' తౌ కథయతః-

అను. హంసలు (రెండు) ఇలా అన్నాయి- "మరొక కొలను చేరితే నీకు శుభమే. కానీ నేలమీద పయనం చేసేటప్పుడు నీకు రక్షణ ఎలాగు ?' తాబేలు ఇలా అంది- నేను మీ ఇరువురితోబాటు ఆకాశమార్గాన ప్రయాణం చేసేటట్లు ఉపాయం చూడండి."

అందుకు హంసలు ఇలా చెప్పాయి- 'ఉపాయం ఎలా సంభవిస్తుంది ?'

మరలా తాబేలు ఇలా చెప్పింది- 'మీ రిరువురూ ఒక కఱ్ఱముక్కను ముక్కులతో ఈప్రక్కనా ఆప్రక్కనా గట్టిగా పట్టుకొనండి. నేను నడుమ (ఆ కఱ్ఱను) నా నోటితో పట్టుకుంటాను. అంత మీరు మీ ఱెక్కలబలంతో పయనిస్తే నేనూ సుఖంగా వస్తాను.' హంసలు అన్నాయి- ఈ ఉపాయం సరిగానే ఉంది. కానీ-

ప్రతిభాశాలి అయినవాడు ఉపాయంతో బాటు దానివల్ల సంభవించే అపాయాన్ని సైతం విచారించాలి. అలాకానిచో తన పిల్లలను ముంగిసలు తినేటట్లు చేసుకొన్న మూర్ఖబకం వలె (తెలివిలేని కొంగవలె) అపాయం పొందవలసి వస్తుంది. 162

తాబేలు అడిగింది- 'అది యెట్లు ?'

హంసలు ఇలా చెప్పసాగాయి-

# 4 బకనకుల కథా

[కొంగ-ముంగిసలు]

మూ. అస్త్యుత్తరాపథే గృధ్రకూటనామ్ని పర్వతే మహాన్ పిప్పలవృక్షః. తత్రానేకే బకా నివసన్తి. తస్య వృక్షస్యాధస్తా ద్వివరే సర్ప స్తిష్ఠతి. స చ బకానాం బాలాఽపత్యాని ఖాదతి. అథ శోకాఽఽర్తానాం విలాపం శ్రుత్వా కేనచిద్ వృద్ధబకేనాఽభిహితమ్-'భో ఏవం కురుత; యూయం మత్స్యానుపాదాయ నకులవివరా దారభ్య సర్పవివరం యావత్ పఙ్క్తిక్రమే ణైకైకశో వికిరత. తతస్తదాహారలుబ్ధై ర్నకులై రాగత్య సర్పో ద్రష్టవ్యః. స్వభావద్వేషా ద్వ్యాపాదయితవ్యశ్చ. తథాఽనుష్ఠితే తద్వృత్తమ్.

అను. ఉత్తరాపథంలో గృధ్రకూటం అనే పర్వతం ఉంది. అందు పెద్ద రావిచెట్టు ఒకటి కలదు. ఆ చెట్టుపై చాలా కొంగలు నివసిస్తూ ఉన్నాయి. ఆ చెట్టుక్రింద తొఱ్ఱలో ఒక పాము ఉంది. అది రెక్కలురాని కొంగల పసిపిల్లలను తింటూ ఉంటుంది. అంత ఒకనాడు సంతానమరణంచే విలపించే ఆ కొంగలను చూచి ఒక ముసలికొంగ ఇలా చెప్పింది-'ఓ కొంగలారా! మీరు ఇలా చేయండి. [ఇచ్చటికి సమీపంలో ముంగిసల తొఱ్ఱ ఉంది.] ఆ ముంగిసల తొఱ్ఱనుండి పాము తొఱ్ఱవరకు వరుసగా ఒక్కొక్క చేపను వేయండి. ఆ చేపలను తింటూ వచ్చిన ముంగిసలు పామును చూస్తాయి. సహజవిరోధంకారణంగా పామును చంపుతాయి. కొంగలు అలాగే చేశాయి-పాము చచ్చింది.

మూ. అథ నకులైః వృక్షోపరి ఒకశాబకానాం రావః శ్రుతః. పశ్చాత్ తద్వృక్ష మారుహ్య బకశాబకాః ఖాదితాః. అత అవాం బ్రూమః -'ఉపాయం చిన్తయన్-' ఇత్యాది.

ఆవాభ్యాం నీయమానం త్వా మవలోక్య లోకైః కిఞ్చిద్వక్తవ్యమేవ.

యది త్వముత్తరం దాస్యసి తదా త్వన్మరణమ్. తత్ సర్వథాఽత్రైవ స్థీయతామ్' ఇతి. కూర్మో వదతి-'కిమహ మప్రాజ్ఞః, నాఽహ ముత్తరం దాస్యామి. న కిమపి మయా వక్తవ్యమ్. తథాఽనుష్ఠితే తథావిధం కూర్మమవలోక్య సర్వే గోరక్షకాః పశ్చా ద్ధావన్తి వదన్తి చ-'అహో! మహదాశ్చర్యమ్. పక్షిభ్యాం కూర్మో నీయతే' ఇతి.

అను. పిమ్మట ముంగిసలు చెట్టు పైకి చూచాయి. కొంగపిల్లల సద్దును విన్నాయి. చెట్టుమీదికి ఎక్కాయి. ఆ పిల్లలను తినివేశాయి. అందువల్ల మేము (హంసలు రెండు) చెప్పుతున్నాం-'ఉపాయం ఆలోచిస్తూ-ఇత్యాది. (11వ పద్య భావం చూడుడు.)

మేము ఇరువురం [ఆకాశమార్గాన] నిన్ను తీసుకొని పోతూ ఉండగా చూచే జనులు ఏదో అంటారు. అందుకు నీవు సమాధానం చెప్పినచో నీకు చావు నిశ్చయం. అందుచే ఇచ్చటనే ఉండడం శుభం.

అది విని తాబేలు ఇలా అంది-'నేనేమి తెలివిలేనివాణ్ణా. నేను [ఏమీ] బదులు పల్కను. ఏదీ మాట్లాడను.

అంత హంసలు అది (తాబేలు) కోరిన విధంగా దాన్ని ఆకాశమార్గాన తీసుకొని పోతున్నాయి. క్రిందఉండే గోపాలకులు అనేకులు ఈ దృశ్యం చూచారు. వెనువెంట నేలపై పరుగెత్తుచూ ఇలా పరస్పరం చెప్పుకోసాగారు-'అహా! ఆశ్చర్యం! ఈ పక్షులు తాబేలును తీసికొని పోతున్నాయి.'

మూ. కశ్చిద్వదతి-'యద్యయం కూర్మః పతతి తదాఽత్రైవ పక్త్వా ఖాదితవ్యః'. కశ్చిద్వదతి-'సరసస్తీరే దగ్ధ్వా ఖాదితవ్యోఽయమ్'. కశ్చిద్వదతి-'గృహం నీత్వా భక్షణీయ' ఇతి. తద్వచనం శ్రుత్వా స కూర్మః కోపావిష్టో విస్మృతపూర్వసంస్కారః ప్రాహ-'యుష్మాభిర్భస్మ భక్షితవ్యమ్' ఇతి. ఏవం వదన్నేవ పతిత సైర్వ్యాపాదితశ్చ. అతోఽహం బ్రవీమి-'సుహృదాం హితకామానామ్' ఇత్యాది.

అను. ఒక డన్నాడు- 'ఈ తాబేలు క్రిందపడితే ఇక్కడే వండుకొని తినాలి.' ఇంకొకడు అన్నాడు-'చెఱువుగట్టున కాల్చి తినాలి' మఱొకడు అన్నాడు-

ఇంటికి తీసికొని (పెండ్లాం పిల్లలతో కలిసి) తినాలి.' ఈ మాటలన్నీ తాబేలు విన్నది. కోపంచే ఆవేశింపబడింది. వెనుక తలంచిన విషయాన్ని మరచిపోయింది. "మీరు బూడిద తినండి' అని అంది. ఇలా అంటూనే క్రింద పడింది. ఆ గొల్లలచే చంపబడింది.

అందుచే నేను (మంత్రి చక్రవాకాన్ని) చెప్పుతున్నాను— "హితం గోరే మంత్రులమాటను- ఇత్యాది (4వ శ్లోకభావం చూడుడు).

మూ. అథ ప్రణిధి ర్బక స్తత్రాఽఽగత్యోవాచ-"దేవ! ప్రాగేవ మయా నిగదితమ్- 'దుర్గశోధనం హి ప్రతిక్షణం కర్తవ్య' మితి. తచ్చ యుష్మాభి ర్న కృతమ్. తదనవధానస్య ఫల మనుభూతమ్. దుర్గదాహో మేఘవర్ణేన వాయసేన గృధ్రప్రయుక్తేన కృతః' ఇతి. రాజా నిశ్వస్యాఽఽహ—

శ్లో. ప్రణయా దుపకారాద్వా యో విశ్వసితి శత్రుషు,
స సుప్త ఇవ వృక్షాగ్రాత్ పతితః ప్రతిబుధ్యతే. 163

అను. ఇంతలో గుప్తచరుడైన కొంగ అచ్చటికి వచ్చింది. ఇలా విన్నవించింది-'ప్రభూ! ప్రతిక్షణం కోటను పరీక్షిస్తూ ఉండాలి'అని నేను మొదటనే చెప్పాను. కాని మీరు అలా చేయలేదు. అట్టి అజాగరూకతకు ఫలం అనుభవం అయింది. గ్రద్దప్రేరణచే మేఘవర్ణుడు అనే కాకి కోటకు నిప్పుపెట్టింది." అది విని రాజు నిట్టూర్పు విడిచాడు. ఇలా అన్నాడు-'వృక్షాగ్రాన నిద్రించేవాడు క్రింద పడిన తర్వాత మేల్కొంటాడు. అలాగే ప్రేమవల్లగానీ ఉపకారభావంవల్లగానీ శత్రువులను నమ్మేవాడు ఆపదను పొందిన తర్వాతనే జాగ్రత్త వహిస్తాడు". 163

మూ. అథ ప్రణిధి రువాచ-"ఇతో దుర్గదాహం విధాయ యదా గతో మేఘవర్ణ స్తదా చిత్రవర్ణేన ప్రసాదితే నోక్తమ్-'అయం మేఘవర్ణోఽత్ర కర్పూరద్వీపరాజ్యేఽభిషిచ్యతామ్'. తథా చోక్తమ్-

శ్లో. కృతకృత్యస్య భృత్యస్య కృతం నైవ ప్రణాశయేత్,
ఫలేన మనసా వాచా దృష్ట్యా చైనం ప్రహర్షయేత్.

అను. వేగు అయిన కొంగ ఇలా అంది–'ఇచ్చట కోటకు నిప్పుపెట్టి మేఘవర్ణుడు చిత్రవర్ణుడి వద్దకు వెళ్లాడు. సంతుష్టుడై చిత్రవర్ణుడు ఇలా అన్నాడు- ఈ మేఘవర్ణుణ్ణి ఈ కర్పూరద్వీపరాజ్యానికి ప్రభువుగా అభిషేకిస్తాం. విజ్ఞులు ఇలా అన్నారు-

కార్యం సాధించిన సేవకుడి కార్యాన్నిగూర్చి ఉపేక్ష చేయరాదు. అందు కతన్ని ధనంచే, మనస్సుచే, వాక్కుచే, ప్రసన్నదృష్టిచే సంతుష్టుడిని చేయాలి.

మూ. చక్రవాకో బ్రూతే-'దేవ! శ్రుతం యత్ప్రణిధిః కథయతి?' రాజా ప్రాహ–'తత స్తతః'. ప్రణిధి రువాచ-తతః ప్రధానమన్త్రిణా గృధ్రేణాఽభిహితమ్-'దేవ! నేదముచితమ్. ప్రసాదాన్తరం క్రియతామ్. యతః-

శ్లో. అవిచారయతో యుక్తికథనం తుషఖణ్డనమ్,
నీచేషూపకృతం రాజన్ వాలుకాస్వివ మూత్రితమ్. 164

మహతా మాస్పదే నీచః కదాపి న కర్తవ్యః. తథా చోక్తమ్ -

శ్లో. నీచః శ్లాఘ్యపదం ప్రాప్య స్వామినం హన్తుమిచ్ఛతి,
మూషికో వ్యాఘ్రతాం ప్రాప్య మునిం హన్తుం గతో యథా.165

చిత్రవర్ణః పృచ్ఛతి.'కథ మేతత్', మన్త్రీ కథయతి-

అను. చక్రవాకం (రాజహంస-హిరణ్యగర్భుడి మంత్రి) ఇలా అంది– ప్రభూ ! గుప్తచరుడు చెప్పింది విన్నారా?' రాజా (రాజహంస) ఇలా పల్కాడు- "అయితే తర్వాత ఏమైంది ?" గుప్తచరుడైన కొంగ ఇలా చెప్పింది - 'చిత్ర వర్ణుడు అలా అనగానే అతడి ప్రధానమంత్రి అయిన గ్రద్ద ఇలా వివరంగా బోధించింది-"ప్రభూ ! ఇది సముచితం గాదు. ఆ మేఘవర్ణుడికి మరొక సత్కారం ఏదేని చేయండి. ఏలనన-విచారహీనుడికి [గ్రహించే యోగ్యత లేని వాడికి] బోధించే ఉపాయం పొట్టును పిండి చేయడంవలె వ్యర్థశ్రమ. ఓ రాజా ! అలాగే నీచుడికి (అనర్హుడికి) చేసే ఉపకారం ఇసుకలో పోసిన మూత్రం మాదిరి నింద్యం అవుతుంది. (అనగా ఉపకారం ఉత్తమమైనా నీచసంబంధంచే మూత్ర తుల్యమై హేయ మగునని భావం) 164

నీచుణ్ణి గొప్పవారి చోటున ఎప్పటికినీ ఉంచరాదు. పెద్దలు ఇలా చెప్పారు-

నీచుడు ప్రశంసనీయమైన స్థలాన్ని చేరితే ప్రభువునకు ద్రోహం చేయ దలుస్తాడు. ఎలుక పులిగా చేయబడి తనను అలా చేసిన మునినే చంపడానికి పోయింది'- 165

చిత్రవర్ణుడు అడిగాడు-'అదెట్లు ?' మంత్రి ఇలా చెప్పసాగాడు-

## 5. నిః - ాషికశ్చ

### (ముని-ఎలుక)

మూ. అస్తి గౌతమస్య మహర్షే స్తపోవనే మహాతపా నామ మునిః. తత్ర తేనాశ్రమసన్నిధానే మూషికశాబకః కాకముఖాద్ భ్రష్టో దృష్టః. తతో దయాయుక్తేన తేన మునినా స నీవారకణైః సంవర్ధితః. తతో బిడాల స్తం మూషికం ఖాదితు ముపధావతి. త మవ లోక్య మూషిక స్తస్య మునేః క్రోడే ప్రవివేశ. తతో మునినోక్తమ్- "మూషిక ! త్వం మార్జారో భవ. తతః స బిడాలః కుక్కురం దృష్ట్వా పలాయతే. తతో మునినోక్తమ్-'కుక్కురాద్ బిభేషి. త్వమేవ కుక్కురో భవ. స చ కుక్కురో వ్యాఘ్రాత్ బిభేతి. తతస్తేన మునినా కుక్కురో వ్యాఘ్రః కృతః.

అథ తం వ్యాఘ్రం ముని ర్మూషికోఽయ మితి పశ్యతి- అథ తం మునిం వ్యాఘ్రఞ్చ దృష్ట్వా సర్వే వద న్తి-"అనేన మునినా మూషికో వ్యాఘ్రతాం నీతః."

అను. గౌతముడు అనే మహర్షియొక్క తపోవనంలో మహాతపుడు అనే ముని ఉండేవాడు. ఆ ముని అచ్చట ఆశ్రమసమీపంలో ఒకానొక ఎలుకపిల్లను

చూచాడు. అది కాకి నోటినుండి జారిపడింది. దాన్ని చూడగానే మునికి దయ గల్గింది. (ఆశ్రమానికి తెచ్చాడు) నీవారకణాలతో (నివ్వరిగింజలతో) పెంచాడు. అంత ఒకనాడు ఆ ఎలుకను తినడానికి పరుగెత్తుచూ పిల్లి వచ్చింది. ఆ పిల్లిని చూచి ఎలుక (భయంతో) మునిఒడిలోనికి చేరింది. అంత ముని- 'ఓ ఎలుకా! నీవు పిల్లివి కమ్ము" అన్నాడు. (అలాగే అయింది). ఆ పిల్లి కుక్కను చూచి పరుగెత్తింది. అప్పుడు ముని–"కుక్కవల్ల భయపడుతున్నావు కనుక నీవే కుక్కవు కమ్ము"అన్నాడు. అలాగే అది కుక్క అయింది. ఆ కుక్క పులి వలన భయపడింది. అంత ముని ఆ కుక్కను పులిని చేశాడు.

పిమ్మట ముని ఆ పులిని-"ఇది ఎలుక' అనే భావంతోనే చూచేవాడు. ఇక (ఆశ్రమవాసులు) అందరు మునిని, పులిని చూచి "ఇది ఎలుక, దీన్ని ముని పులిని చేశాడు"-అని చెప్పేవారు.

మూ. ఏతచ్ఛ్రుత్వా సవ్యథో వ్యాఘ్రోఽచిన్తయత్-'యావదనేన మునినా స్థీయతే, తావదిదం మే స్వరూపాఖ్యాన మకీర్తికరం న పలాయిష్యతే'ఇత్యాలోచ్య మూషిక స్తం మునిం హన్తుం గతః. తతో మునినా తత్ జ్ఞాత్వా-'పునర్మూషికో భవ'-ఇత్యుక్త్వా మూషిక ఏవ కృతః. అతోఽహం బ్రవీమి-'నీచః శ్లాఘ్యపదం ప్రాప్య'ఇత్యాది.

అపరఞ్చ దేవ! సుకర మిద మితి న మన్తవ్యమ్. శృణు-

శ్లో. భక్షయిత్వా బహూన్ మత్స్యా నుత్తమాధమమధ్యమాన్,
అతిలోభా ద్బకః పశ్చా న్మృతః కర్కటకగ్రహాత్. 16

చిత్రవర్ణః పృచ్ఛతి-'కథమేతత్'? మన్త్రీ కథయతి-

అను. ఆ పులి ఇది విన్నది. విచారం పొందింది. ఇలా ఆలోచించింది. 'ఈ ముని బ్రతికిఉన్నంతకాలం అపకీర్తికరమైన నా పూర్వస్వరూపకథనం తొలగిపోదు'–ఇలా తలంచి (పులిరూపంలో ఉండే) ఆ ఎలుక మునిని చంపడానికి పోయింది. అప్పుడు ముని దానిభావం గ్రహించాడు-"మరలా ఎలుకవు అగుదువుగాక'–అని ఎలుకగానే చేశాడు. అందువల్ల నేను (మంత్రి అయిన సర్వజ్ఞుడు అనే గ్రద్దను) చెప్పుతున్నాను-'నీచుడు ప్రశంసనీయమైన స్థలాన్ని చేరితే-ఇత్యాది. (15 శ్లోకభావం చూడుడు)

మరియూ ప్రభూ ! ఇతన్ని రాజుచేయడం తేలిక అనియూ తలంపవద్దు. ఇది వినుడు-

ఉత్తమములూ, మధ్యమములూ, అధమములూ (పెద్దవీ, సామాన్యానివీ చిన్నవీ) అయిన ఎన్నో చేపలను ఒకానొక కొంగ తినింది. పిమ్మట అత్యాశచే ఎండ్రకాయను తినగోరింది. అది మెడను కొఱుకగా చచ్చింది'. 16

చిత్రవర్ణుడు అడిగాడు-'అది ఎట్లు?" మంత్రి ఇలా చెప్పదొడగాడు-

## 6. బక కర్కటక కథా

(కొంగ - ఎండ్రకాయ)

మూ. అస్తి మాలవవిషయే పద్మగర్భాభిధానం సరః. తత్రైకో వృద్ధో బకః సామర్థ్యహీన ఉద్విగ్నమివాత్మానం దర్శయిత్వా స్థితః. స చ కేనచిత్ కులీరేణ దూరాదేవ దృష్టః పృష్టశ్చ-'కిమితి భవా నత్రాఽఽహారత్యాగేన తిష్ఠతి ?' బకేనోక్తమ్-"మత్స్యా మమ జీవనహేతవః. తే చావశ్యం 'కైవర్తై రాగత్య వ్యాపాదయితవ్యా' ఇతి వార్తా నగరోపాన్తే మయా శ్రుతా. అతో వర్తనాఽభావాదేవాఽస్మన్మరణ ముపస్థితమితి జ్ఞాత్వా ఽఽహారేఽప్యనాదరః కృత" ఇతి. తతో మత్స్యై రాలోచితమ్-'ఇహ సమయే తావ దుపకారక ఏవాఽయం లక్ష్యతే, తదయమేవ యథా కర్తవ్యం పృచ్ఛ్యతామ్. తథా చోక్తమ్-

శ్లో. ఉపకర్త్రాఽరిణా సన్ధి ర్న మిత్రేణాఽపకారిణా,
ఉపకారాఽపకారౌ హి లక్ష్యం లక్షణమేతయోః". 17

అను. మాలవదేశంలో పద్మగర్భం అనే పేరు గల ఒక కొలను ఉంది. అచ్చట ముసలికొంగ ఉంది. దానికి (చేపలు పట్టుకొనే) బలం లేదు. అందుచే

(ఉపాయంగా) విచారం నటిస్తూ కొలనులో నిలబడి ఉంది. ఒక ఎండ్రి దూరం నుండియే ఆ కొంగను చూచింది. ఇలా అడిగింది - 'మీరు ఎందుకు ఇలా తిండి వీడి ఉన్నారు?' కొంగ ఇలా బదులు చెప్పింది - "చేపలు నా జీవితానికి ఆధారాలు. బేస్తలు ఇచ్చటికి వచ్చి వాటిని అన్నిటిని చంపుతారట. ఈ మాట నేను నగరందగ్గర విన్నాను. అందువల్ల జీవనాధారం పోతుంది. చావు దాపురించింది' అని తలంచాను. ఆ దిగులుచే భోజనంపై ఆసక్తియు పోయింది." అది విని చేపలు ఇలా ఆలోచించాయి. 'ఇప్పు డితను మేలు చేసేవానివలె కనబడుతున్నాడు. అందుచే ఇతన్నే ఇందుకు ఏం చేయాలో అడుగుదాం. విజ్ఞులు ఇలా అన్నారు -

'మేలుచేసే శత్రువుతో సంధి చేసికొనాలి. కీడుచేసే మిత్రుడితో వద్దు. ఏలనన - శత్రుమిత్రుల లక్షణాలు క్రమంగా అపకారోపకారాలు అనియే గ్రహించాలి' 17

మూ. మత్స్యా ఊచుః-"భో బక! కోఽత్రాఽస్మాకం రక్షణోపాయః? ఇతి. బకో బ్రూతే - "అస్తి రక్షణోపాయో జలాశయాన్తరాశ్రయణమ్. తత్రాఽహ మేకైకశో యుష్మాన్నయామి." మత్స్యా ఆహుః! "ఏవ మస్తు" తతోఽసౌ దుష్టబక స్తాన్ మత్స్యా నేకైకశో నీత్వా ఖాదతి. అనన్తరం కులీర స్తమువాచ - "భో బక! మామపి తత్ర నయ" ఇతి. తతో బకోఽప్యపూర్వకులీరమాంసార్థీ సాదరం తం నీత్వా స్థలే ధృతవాన్. కులీరోఽపి మత్స్యకణ్టకాఽఽకీర్ణం తం స్థల మాలోక్యాఽచిన్తయత్-"హా హతోఽస్మి మన్దభాగ్యః. భవతు; ఇదానీం సమయోచితం వ్యవహరిష్యామి. యతః -

శ్లో. తావద్భయేన భేతవ్యం యావద్భయ మనాగతమ్,
ఆగతన్తు భయం దృష్ట్వా ప్రహర్తవ్య మభీతవత్. 18

అను. అంత చేపలు - 'ఓ కొంగా! ఇప్పుడు మేము బ్రతికే ఉపాయం ఏమి?' - అని అడిగాయి. అందుకు కొంగ ఇలా అంది - 'ఉంది; వేఱే చెఱువునకు పోవడమే బ్రతికే ఉపాయం. నేను మిమ్ములను ఒక్కొక్కరిగా అచ్చటికి చేరుస్తాను'. పిమ్మట చేపలు "అలాగే కానిమ్ము'' అన్నాయి. అంతట దుష్టబుద్ధి అయిన కొంగ ఆ చేపలను ఒక్కొక్కటిగా తీసుకొని పోతుంది. తినివేస్తుంది.

కొంతసేపటికి ఎండ్రి. 'ఓ కొంగా! నన్ను సైతం అచ్చట చేర్చుము' అని అడిగింది. అది వినగానే ఆ కొంగకు క్రొత్తగా ఎండ్రిమాంసం తినాలనే కోరిక పుట్టింది. అందువల్ల ఆ ఎండ్రిని ఆదరంగా నీటినుండి వెలికి తీసింది. చేపలను తిన్న చోటికి కొనిపోయింది. నేలపై ఉంచింది. ఎండ్రియూ చేపముల్లులతో నిండిన ఆ ప్రదేశాన్ని చూచింది. ఇలా ఆలోచించింది - "అయ్యో! అభాగ్యుణ్ణి; చచ్చాను. కానిమ్ము. ఇప్పుడు సమయానికి తగినట్లు ప్రవర్తిస్తాను. ఏలనన-

భయకారణం ఎదుట లేనప్పుడు అందుకై భయపడాలి. భయకారణం ఎదుట ఉండినచో నిర్భయంగా ఎదురించి యథాశక్తి దెబ్బతీయాలి". 18

మూ. కిఞ్చ-

శ్లో. అభియుక్తో యదా పశ్యేన్న కిఞ్చి ద్గతి మాత్మనః,
యుధ్యమాన స్తదా ప్రాజ్ఞో మ్రియేత రిపుణా సహ. 19

ఇత్యాలోచ్య స కులీరక స్తస్య బకస్య గ్రీవాం చిచ్ఛేద. అథ స బకః పఞ్చత్వం గతః. అతోఽహం బ్రవీమి-'భక్షయిత్వా బహూన్ మత్స్యాన్'ఇత్యాది.

అను. మరియూ-ప్రాజ్ఞుడైనవాడు భయకారణంచే (శత్రువుచే) ఆక్రాంతుడు (అభియుక్తుడు) అయి వేఱే రక్షణోపాయం తనకు కనబడనిచో శత్రువుతో యుద్ధం చేస్తూ మరణించడమే శ్రేష్ఠం." 19

ఇలా ఆ ఎండ్రకాయ తలంచింది. కొంగ మెడను కత్తిరించింది. వెంటనే కొంగ ప్రాణాలు వీడింది. అందుచే నేను (మంత్రి అయిన గ్రద్దను) చెప్పుతూన్నాను-'చిన్నా పెద్దా ఎన్నో చేపలను తిని' ఇత్యాది (16వ శ్లోకభావం చూడుడు).

మూ. తత శ్చిత్రవర్ణోఽవదత్-"శృణు తావన్మ న్త్రిన్ ! మయైత దాలోచితమ్ (అస్తి) యద్-అత్రాఽవస్థితేనాఽనేన మేఘవర్ణేన రాజ్ఞా యావన్తి వస్తూని కర్పూరద్వీపస్యోత్తమాని తావన్త్యస్మాక ముపనేతవ్యాని. తేనాఽస్మాభి ర్మహాసుఖేన విన్ధ్యాఽచలే స్థాతవ్యమ్. దూరదర్శీ విహస్యాఽఽహ-దేవ!

శ్లో. అనాగతవతీం చిన్తాం కృత్వా యస్తు ప్రహృష్యతి,
స తిరస్కార మాప్నోతి భగ్నభాణ్డో ద్విజో యథా. 20

రాజాఽఽహ-"కథమేతత్ ?" । మన్త్రీ కథయతి-

అను. అప్పుడు చిత్రవర్ణుడు ఇలా అన్నాడు-"ఓ మంత్రీ ! ఇది వినుము-ఈ మేఘవర్ణుణ్ణి ఈ కర్పూరద్వీపంలో రాజుగా నియమిస్తే ఇతను ఈ ద్వీపంలోని శ్రేష్ఠమైన వస్తువులన్నీ మనకు పంపుతాడు. వాటితో మనం వింధ్య పర్వతంలో మిక్కిలి సుఖంగా ఉండవచ్చు-అని నేను తలంచాను." అది విని దూరదర్శి (గ్రద్ద) నవ్వి ఇలా అన్నాడు-'దేవా !

కల్పితమైన భవిష్యత్సుఖభావనచే ఆనందించేవాడు పేలపిండికుండను పగులగొట్టుకొన్న బాపడు వలె అవమానం పొందుతాడు. 20

రాజు అడిగాడు-'అదెట్లు ?' మంత్రి ఇలా చెప్ప నారంభించాడు-

## 7. భగ్నభాణ్డ బ్రాహ్మణకథా

(పేలపిండికుండ-బాపడు కథ)

మూ. అస్తి దేవకోట్టనామ్ని నగరే దేవశర్మా నామ బ్రాహ్మణః. తేన మహావిషువత్సఙ్క్రాన్త్యాం సక్తుపూర్ణశరావ ఏకః ప్రాప్తః. తత స్తమాదాయాఽసౌ కుమ్భకారస్య భాణ్డపూర్ణమణ్డపైకదేశే రౌద్రేణాఽఽకులితః సుప్తః. తతః సక్తురక్షార్థం హస్తే దణ్డమేక మాదాయాఽచిన్తయత్-"యద్యహం సక్తుశరావం విక్రీయ దశ కపర్దకాన్ ప్రాప్స్యామి, తదాఽత్రైవ తైః కపర్దకై ర్ఘటశరావాదిక ముపక్రీయాఽనేకధా వృద్ధై స్తద్ధనైః పునః పునః పూగవస్త్రాదిక ముపక్రీయ విక్రీయ లక్షసంఖ్యాని ధనాని కృత్వా వివాహ

చతుష్టయం కరిష్యామి. అనన్తరం తాసు స్వపత్నీసు యా రూపయౌవన వతీ తస్యా మధికానురాగం కరిష్యామి. సపత్న్యో యదా ద్వన్ద్వం కరి ష్యన్తి. తదా కోపాకులోఽహం తాః సర్వా లగుడేన తాడయిష్యామీ" త్యభిధాయ తేన లగుడః ప్రక్షిప్తః. తేన సక్తుశరావ శ్చూర్ణితో భాణ్డాని చ బహూని భగ్నాని. తతస్తేన శబ్దేనాఽఽగతేన కుమ్భకారేణ తథావిధాని భాణ్డా న్యవలోక్య బ్రాహ్మణ స్తిరస్కృతో మణ్డపా ద్బహిష్కృతశ్చ. అతోఽహం బ్రవీమి-"అనాగతవతీం చిన్తామ్'-ఇత్యాది.

అను. దేవకోట్టం అనే నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండే వాడు. అతడికి కన్యాసంక్రమణపుణ్యదినాలలో - నవరాత్రపర్వదినాలలో (విషు వత్ సంక్రాంతి = పగలు రాత్రి సమానంగా ఉండే రాశిలో సూర్యుడు ప్రవేశించ డం, కన్యారాశి లేక మీనరాశి అలాంటివి అగును. ఇచ్చట దానలాభాన్నిబట్టి కన్యాసంక్రమణమైన నవరాత్రపర్వదినాలు గ్రహింపబడినాయి) భిక్షద్వారా పెద్ద కుండ నిండా పేలపిండి లభించింది. అతను ఆ పాత్రను తనవెంట తీసుకున్నాడు. కుండలతో నిండిన ఒక కుమ్మరివాడి ముంగిలి చేరాడు. కుమ్మరిని అర్థించి ఒక మూలన తన పేలపిండికుండను ఉంచాడు. పేలపిండి రక్షణకై ఒక కఱ్ఱను. చేతితో ధరించాడు. ఎండలో తిరుగడంవల్ల అలసినవాడై అచ్చటనే శయనించాడు. పేలపిండినిగూర్చి ఇలా ఆలోచింపసాగాడు-"ఈ పేలపిండి పాత్రను అమ్మితే పదిరూకలు లభిస్తాయి. ఆ రూకలతో మరికొన్ని పాత్రలను కొనడం అమ్మడం ద్వారా ధనాన్ని అభివృద్ధికి తెస్తాను. అలా వృద్ధిపొందిన ధనంతో వక్కలు, వస్త్రాలు మొదలైనవాటి వ్యాపారం చేస్తాను. తద్వారా లక్షలధనం సంపాదిస్తాను. ఆ మీదట నాలుగు పెండ్లిండ్లు చేసికుంటాను. ఆ భార్యలలో సొగసూ, వయసూ అధికంగా ఉండేదాన్ని ఎక్కువగా ప్రేమిస్తాను. ఆ నా భార్యలు ఎప్పు డైనా పోట్లాడితే నేను కోపంతో వారిని అందరినీ కఱ్ఱతో కొట్టుతాను".ఇలా తలంచి తన్మయతచే చేతిలోని కఱ్ఱతో అచ్చటి కుండలను కొట్టాడు. అప్పుడు అతడి పేలపిండి కుండతోబాటు ఎన్నియో పాత్రలు పగిలిపోయాయి. ఆ శబ్దం విని కుమ్మరి వచ్చాడు. అదంతా చూచాడు.ఆ బాపణ్ణి తిట్టాడు. ముంగిలినుండి వెళ్ళగొట్టాడు. అందుచే నేను (దూరదర్శి అనే పేరుగల మంత్రిని) చెప్పు

తూన్నాను - "కల్పితమైన భవిష్యత్సుఖభావనచే ఆనందించేవాడు" - ఇత్యాది (చూడుడు-20 వ శ్లోకభావం.)

మూ. తతో రాజా రహసి గృధ్ర ముదాచ-"తాత ! యథా కర్తవ్యం తథోపదిశ'. గృధ్రో బ్రూతే-

శ్లో. మదోద్ధతస్య నృపతేః ప్రకీర్ణస్యేవ దన్తినః,
గచ్ఛన్త్యున్మార్గయాతస్య నేతారః ఖలు వాచ్యతామ్. 21

శృణు దేవ ! కిమస్మాభి ర్బలదర్పాద్దుర్గం భగ్నమ్ ఉత తవ ప్రతాపాధిష్ఠితే నోపాయేన ?" ఇతి. రాజాఽఽహ-'భవతా ముపాయేన."

అను. అంత రాజు (చిత్రవర్ణుడు) రహస్యంగా మంత్రిని ఇలా అడిగాడు- "నాయనా ! ఇప్పుడు ఏమి చేయాలో బోధింపుము.' గ్రద్ద ఇలా అంది-

'ఏనుగు మదంచే గర్వించి విచ్చలవిడిగా దారి దప్పి నడిస్తే ఆ దోషం లోకనింద మావటివారికి వస్తుంది. అలాగే ప్రభువు గర్వాంధుడై చెడుదారిని ప్రవరిసే ఆ దోషం లోకనింద మంత్రులకు సంభవిస్తుంది. 21

కనుక ఓ దేవా ! వినుము-మనం కోటను సైన్యబలంచే భగ్నం చెశామా ? లేక తను ప్రతాపంతోడి ఉపాయంచేతనా?' రాజు ఇలా అన్నాడు-"తమ ఉపాయం చేత".

మూ. గృధ్రో బ్రూతే-'యద్యస్మద్వచనం క్రియతే, తదా స్వదేశే గమ్యతామ్. అన్యథా వర్షాకాలే ప్రాప్తే పునస్తుల్యబలేన విగ్రహే సత్య స్మాకం పరభూమిష్ఠానాం స్వదేశగమనమపి దుర్లభం భవిష్యతి. తత్సుఖ శోభార్థం సన్ధాయ గమ్యతామ్. దుర్గం భగ్నం, కీర్తిశ్చ లబ్ధేవ. మమ సమ్మతం తావదేతత్. యతః-

శ్లో. యో హి ధర్మం పురస్కృత్య హిత్వా భర్తుః ప్రియాప్రియే,
అప్రియాణ్యాహ పథ్యాని తేన రాజా సహాయవాన్. 22

అను. గ్రద్ద ఇలా చెప్పింది-"నా మాటను అనుసరించేటట్లైతే మన దేశం

పోవడం మంచిది. అలా చేయనిచో వర్షాకాలం వస్తే సమానబలుడైన శత్రువుతో యుద్ధం రావచ్చును. అలా వస్తే పరదేశంలో ఉండే మనకు స్వదేశం వెళ్ళడంసైతం కష్టం అవుతుంది. అందుచే సుఖం కీర్తి రెండూ లభించే విధంగా సంధి చేసికొని పోదాం. కోటను ధ్వంసం చేశాం. కీర్తియూ లభించినట్లే. ఇదే నా అభిప్రాయం. ఏలనన-

ఏ మంత్రి అయితే ధర్మం గుర్తించి, ప్రభువుయొక్క ప్రియాన్ని, అప్రియాన్ని లక్ష్యం చేయక-అప్రియంగా ఉన్నా హితమైనదానిని ప్రభువునకు బోధిస్తాడో, అతనే ప్రభువునకు సహాయకుడైన మంత్రి అనబడును. 22

మూ. అన్యచ్చ-

శ్లో. సుహృద్బలం తథా రాజ్య మాత్మానం కీర్తిమేవ చ,
యుధి సన్దేహదోలాస్థం కో హి కుర్యాదబాలిశః. 23

అపరఞ్చ-

శ్లో. సన్ధిమిచ్ఛే త్సమేనాఽపి సన్దిగ్ధో విజయో యుధి,
న హి సంశయితం కుర్యా దిత్యువాచ బృహస్పతిః. 24

అపి చ-

శ్లో. యుద్ధే వినాశో భవతి కదాచి దుభయోరపి,
సున్దోపసున్దా వన్యోన్యం నష్టౌ తుల్యబలౌ న కిమ్? 25

రాజోవాచ-"కథమేతత్ ?' మన్త్రీ కథయతి—

అను: మరియూ-తెలివిగలవా డెవ్వడూ యుద్ధంలో చిక్కుకొని మిత్రవర్గాన్నీ, సైన్యాన్నీ, రాజ్యాన్నీ, కీర్తినీ, తుదకు తన జీవితాన్నీ సంశయం అనే ఉయ్యాలలో పడవేయడు. 23

ఇంకా—"సంశయంగా ఉండే పనిని చేయరాదు"-అని బృహస్పతి చెప్పాడు. అందుచే యుద్ధంలో విజయం సందేహంగా ఉండినచో సమానబలుడితోడనూ సంధినే చేసుకొనాలి. 24

మరియూ-ఒకప్పుడు యుద్ధంలో ఇరువురికీ వినాశం సంభవిస్తుంది. సుందుడూ, ఉపసుందుడూ యుద్ధం చేసి ఇరువురూ నశించారు. వా రిరువురూ సమానబలులే గదా." 25

రాజు అడిగాడు-"అది ఎట్లు?" మంత్రి ఇలా చెప్ప నారంభించాడు-



## 8. సున్దోపసున్ద కథా



(సుందుడు-ఉపసుందుడు కథ)



మూ. పురా దైత్యౌ సహోదరౌ సున్దోపసున్దనామానౌ మహతా కాయక్లేశేన త్రైలోక్యరాజ్యకామనయా చిరా చ్చన్ద్రశేఖర మారాధిత వన్తౌ. తత స్తయో ర్భగవాన్ పరితుష్టః సన్ "వరం వరయతమ్" ఇత్యు వాచ. అనన్తరం తయోః కణ్ఠాఽధిష్ఠితాయాః సరస్వత్యాః ప్రభావా త్తావద్ యద్వక్తుకామా వన్యదభిహితవన్తౌ-'యద్యావయో ర్భవాన్ పరితుష్ట స్తదా స్వప్రియాం పార్వతీం పరమేశ్వరో దదాతు" ఇతి.

అను. పూర్వం సుందుడు, ఉపసుందుడు అనే అన్నదమ్ములైన ఇరువురు రాక్షసులు ఉండేవారు. వారికి-"మూడు లోకాలకు ప్రభువులం కావాలి" అనే కోరిక గల్గింది. అందుకై శరీరక్లెశాన్ని లెక్కసేయక మిక్కిలి దీక్షతో చిరకాలం శివుణ్ణి ఆరాధించారు. అంత భగవానుడైన శివుడు ఆ రాక్షసులయెడ సంతుష్ట డయ్యాడు. ప్రత్యక్షమైనాడు. "వరం కోరుకొనుడు" అన్నాడు. అప్పుడు వారి కంఠంలో వసించే సరస్వతీప్రభావంవల్ల తలంచినదానికి భిన్నంగా ఇలా కోరారు- "పరమేశ్వరులు అయిన తాము మా యిరువురియెడ సంతుష్టులైనచో తమ భార్య అయిన పార్వతిని మాకు అనుగ్రహించండి."

మూ. అథ భగవతా క్రుద్ధేన వరదానస్యాఽఽవశ్యకతయా విచార మూఢయోః పార్వతీ ప్రదత్తా. తత స్తస్యా రూపలావణ్యలుబ్ధాభ్యాం

జగద్ధాతిభ్యాం మనసోత్సుకాభ్యాం పాపతిమిరాభ్యాం "మమ" ఇత్య న్యోన్యం కలహాయమానాభ్యాం 'ప్రమాణపురుషః కశ్చిత్ పృచ్ఛ్యతామ్' ఇతి మతౌ కృతాయాం స ఏవ భట్టారకో వృద్ధద్విజరూపః సమాగత్య తత్రోపస్థితః. అనన్తరం తౌ-"ఆవాభ్యా మియం స్వబలలబ్ధా, కస్యేయ మావయో ర్భవతి' ఇతి బ్రాహ్మణ మపృచ్ఛతామ్. బ్రాహ్మణో బ్రూతే-

శ్లో. 'జ్ఞానశ్రేష్ఠో ద్విజః పూజ్యః క్షత్రియో బలవానపి,
ధనధాన్యాధికో వైశ్యః శూద్రస్తు ద్విజసేవయా. 26

తద్యువాం క్షాత్రధర్మానుగౌ. యుద్ధ ఏవ యువయో ర్నియమః' ఇత్యభిహితే సతి-"సాధూక్త మనేన"ఇతి కృత్వా తా వన్యోన్యతుల్య విక్రమౌ సమకాల మన్యోన్యఘాతేన వినాశ ముపగతౌ. అతోఽహం బ్రవీమి-"సన్ధిమిచ్ఛేత్ సమేనాఽపి'-ఇత్యాది.

అను అది విని భగవానుడు శివుడు క్రోధం పొందాడు. అయినా ఇచ్చిన వరం తప్పక పూర్తిచేయవలసిఉండడంతో మూర్ఖులైన ఆ రాక్షసులకు పార్వతిని ఇచ్చాడు. పిమ్మట లోకకంటకులైన ఆ రాక్షసు లిద్దరు ఆమె రూపలావణ్యాలచే మిక్కిలి ఆకర్షింపబడ్డారు. మనస్సులో రకరకాలైన చెడుకోరికలు పెల్లుబుకగా పాపం అనే చీకటిచే పూర్తిగా ఆవరింపబడినారు. "ఈమె నాది; ఈమె నాది" అంటూ పరస్పరం వాదులాడసాగారు. చివరకు-"ఒకానొక మధ్యవర్తి పురుషుణ్ణి అడిగి నిశ్చయం చేసుకుందాం' అనే అభిప్రాయానికి వచ్చారు. వెంటనే శివుడు ఒక ముసలి బాపనయ్య రూపం దాల్చాడు. వారివద్దకు వచ్చాడు. అప్పుడు వారు- "ఈ సుందరిని మేము మా బలంవల్ల సంపాదించుకున్నాం. మా ఇరువురిలో ఎవరికి చెందునో తెల్పండి" అన్నారు. ఆ బాపడు ఇలా చెప్పాడు-

"బ్రాహ్మణుడు జ్ఞానంచే, క్షత్రియుడు బలంచే, వైశ్యుడు ధనధాన్యాదికంచే, శూద్రుడు బ్రాహ్మణసేవచే శ్రేష్ఠుడూ, పూజ్యుడూ అనబడుదురు. 26

మీరు ఇరుపురూ క్షాత్రధర్మాన్ని అనుసరించేవారు. అందుచే మీ శ్రేష్ఠతను నిరూపించేందుకు యుద్ధమే సాధనం."

అంత ఆ రాక్షసులు - "ఇతడు చక్కగా చెప్పాడు"అని తలంచారు.

సమానవీరులైన వారిరువురూ యుద్ధానికి ఉపక్రమించారు. ఒకరి దెబ్బతో మరి యొకరుగా ఏకకాలంలో ఇద్దరూ చచ్చారు. అందుచే నేను చెప్పుతూన్నాను- "సమానబలుడితోడనూ సంధి చేసుకొనాలి-ఇత్యాది (24 శ్లోకభావం చూడుడు)

మూ. రాజాఽఽహ-"తత్ ప్రాగేవ కిం నేద ముపదిష్టం భవద్భిః?" మన్త్రీ బ్రూతే-'తదా మద్వచనం కిమవసానపర్యంతం శ్రుతం భవద్భిః? తదాపి మమ సమ్మత్యా నాఽయం విగ్రహోఽఽరమ్భః. యతః సాధుగుణయుక్తోఽయం హిరణ్యగర్భో, న విగ్రాహ్యః. తథా చోక్తమ్-

శ్లో. సత్యార్యౌ ధార్మికోఽనార్యో భ్రాతృసఙ్ఘాతవాన్ బలీ,
అనేకయుద్ధవిజయీ సన్ధేయాః సప్త కీర్తితాః. 27

అను. రాజు (చిత్రవర్ణుడు) ఇలా అడిగాడు-"అలా అయితే మొదటనే తాము ఈ నీతిని ఎందుకు బోధింపలేదు ?"-

మంత్రి (గ్రద్ధ) ఇలా అన్నాడు-"అప్పుడు నా మాటను చివరివరకు (పూర్తిగా) తాము విన్నారా ? మరియూ నా అంగీకారంతో ఈ యుద్ధం అప్పుడు ఆరంభింపబడలేదు. ఏలనన-ఈ రాజహంస అయిన హిరణ్యగర్భుడు సద్గుణ పూర్ణుడు. అందుచే ఇలాంటివాడితో యుద్ధం చేయడం సముచితం గాదు విజ్ఞులు ఇలా చెప్పారు-

సత్యవాది, సత్కులీనుడు, (అర్యుడు) ధర్మవర్తనుడు, నీచకులీనుడు (అనార్యుడు), బహుసోదరయుతుడు. బలవంతుడు, అనేకయుద్ధవిజయి అనే ఈ ఏడుగురితో సంధిని చేసుకోవాలి. (యుద్ధం చేయరాదు) 27

శ్లో. సత్యోఽనుపాలయన్ సత్యం సన్ధితో నైతి విక్రియామ్,
ప్రాణబాధేఽపి సువ్యక్త మార్యో నాయా త్యనార్యతామ్. 28

శ్లో. ధార్మిక స్యాభియుక్తస్య సర్వ ఏవ హి యుధ్యతే,
ప్రజానురాగా ద్ధర్మాచ్చ దుఃఖోచ్ఛేద్యో హి ధార్మికః. 29

శ్లో. సన్ధిః కార్యోఽప్యనార్యేణ వినాశే సముపస్థితే,
వినా తస్యాఽఽశ్రయేణార్యో న కుర్యాత్ కాలయాపనమ్. 30

శ్లో. సంహతత్వాద్యథా వేణు ర్నిబిడైః కణ్టకై ర్వృతః,
న శక్యతే సముచ్ఛేత్తుం భ్రాతృసఙ్ఘాతవాం స్తథా. 31

శ్లో. బలినా సహ యోద్ధవ్య మితి నాస్తి నిదర్శనమ్,
ప్రతివాతం న హి ఘనః కదాచి దుపసర్పతి. 32

శ్లో జమదగ్నేః సుతస్యేవ సర్వః సర్వత్ర సర్వదా,
అనేకయుద్ధజయినః ప్రతాపాదేవ భజ్యతే. 33

శ్లో. అనేకయుద్ధవిజయీ సన్ధానం యస్య గచ్ఛతి,
తత్ప్రతాపేన తస్యాఽఽశు వశ మాయాన్తి శత్రవః. 34

అత్ర తావద్ బహుభి ర్గుణై రుపేతః సన్ధేయోఽయం రాజా' ఇతి.

అను. (గమనిక-పై ఏడుగురు ఎందువల్ల సంధికి అర్హులో తెల్పుతున్నాడు)

1) సత్యవాది అయిన ప్రభువు సత్యాన్ని పాలించేవాడు గనుక సంధి నియమాలను ఎన్నడూ ఉల్లంఘింపడు.

2) ఆర్యుడు అనగా సత్కులీనుడు. ప్రాణసంకటపరిస్థితిలోను నియమాలను అతిక్రమింపడు. 28

3) ధార్మికుడు-ప్రజానురాగం గలవాడూ ధర్మవర్తనుడూ అవడంవలన ప్రజలంతా ఇతడి పక్షాన నిలబడి పోరాడుతారు. అందువల్ల ఇతన్ని జయించడం కష్టం. 29

4) అనార్యుడు - నీచకులీనప్రభువు. తనకు అపద సంభవించినచో దుష్టుడూ నీచవంశీయుడూ అయినప్రభువుతోనైనా సంధి చేసికొనాలి. ఏలనన-వాడి సాయం లేనిచో తనకాలం గడువదు. అనగా తాను మనుగడ సాగింపలేడు. 30

5) సోదరసంఘయుతుడు-వెదురుపొదతో సమానుడు. అనేకములైన వెదుళ్ళ ముండ్లతో ఆవరింపబడి దట్టంగా దుర్భేద్యంగా ఉంటాయి. అందువల్ల ఇలాంటివాణ్ణి జయించడం చాలా కష్టం. 31

6) బలవంతుడు-"బలవంతుడితోనే యుద్ధం చేయాలి" అనే దృష్టాంతం ఏమీ లేదు. మేఘం గాలికి ఎదురెక్కి ఎప్పుడూ పోదు. అందుచే బలవంతుడితోడి సంధి శుభదాయకం. 32

7) అనేకయుద్ధవిజయి-జమదగ్ని పుత్రుడైన పరశురాముడివలె అనేక యుద్ధాలలో విజయం సాధించినవాడితో సంధి చేసుకుంటే అతడి ప్రతాపంవల్లనే అందరూ లోబడుతారు. 33

మరియూ, అనేకయుద్ధవిజయి అయిన ప్రభువుతో సంధి చేసికొన్న ప్రభువునకు ఆ సంధానితప్రభుప్రభావంవల్లనే తక్కిన శత్రువులంతా లోబడిపోతారు.

ప్రస్తుతం రాజహంస అయిన ఈ హిరణ్యగర్భుడు బహువిధసద్గుణయుతుడు. అందువల్ల సంధికి అర్హుడు."

మూ. చక్రవాకోఽవదత్-'ప్రణిధే! సర్వ మవగతమ్. వ్రజ. పున రాగమిష్యసి.

అథ రాజా హిరణ్యగర్భ శ్చక్రవాకం పృష్టవాన్-'మన్త్రిన్! అసన్ధేయాః కతి ? తాన్ శ్రోతు మిచ్ఛామి. మన్త్రీ బ్రూతే-'దేవ! కథయామి. శృణు-

శ్లో. బాలో వృద్ధో దీర్ఘరోగీ తథా జ్ఞాతిబహిష్కృతః,
భీరుకో భీరుకజనో లుబ్ధో లుబ్ధజన స్తథా. 35

విరక్తప్రకృతిశ్చైవ విషయే ష్వతిసక్తిమాన్,
అనేకచిత్తమన్త్రిస్తు దేవ-బ్రాహ్మణ-నిన్దకః. 36

దైవోపహతకశ్చైవ తథా దైవపరాయణః,
దుర్భిక్షవ్యసనోపేతో బలవ్యసనసఙ్కులః. 37

అదేశస్థో బహురిపు ర్యుక్తః కాలేన యశ్చ న,
సత్యధర్మ వ్యపేతశ్చ వింశతిః పురుషా ఇమే. 38

ఏతైః సన్ధిం న కుర్వీత విగృహ్ణీయాత్తు కేవలమ్,
ఏతే విగృహ్యమాణా హి క్షిప్రం యాన్తి రిపో ర్వశమ్. 39

అను. ఇలా గుప్తచరుడైన కొంగ చెప్పినది విని చక్రవాకం ఇలా అంది- "ఓ గుప్తచరా! అంతా గ్రహించాను. ఇక పొమ్ము. మరల పిలిపిస్తాం".

అంత ప్రభువైన హిరణ్యగర్భుడు చక్రవాకాన్ని ఇలా అడిగాడు - "ఓ మంత్రీ! సంధికి అనర్హులు ఎందరు? వారిని వినగోరుతున్నాను.' అందుకు మంత్రి ఇలా చెప్పాడు-"దేవా! చెప్పుతున్నాను. వినుడు-

బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, కులంవారిచే వెలివేయబడినవాడు, పిఱికివాడు, పిఱికివాండ్రైన సైనికులు గలవాడు, లోభి, లోభులైన సైనికులు మంత్రులు మొదలైన పరివారం గలవాడు, ప్రేమలేని ప్రజలు గలవాడు, శబ్దాది విషయదాసుడు, చపలచిత్తులైన మంత్రులు గలవాడు, దేవతలను బ్రాహ్మణులను నిందించేవాడు, దురదృష్టవంతుడు, (అదృష్ట) అధీనుడు, కఱవు మొదలైన ఆపదలలో చిక్కుకొన్నవాడు, సైనికవ్యసనాలు అనగా సైనికుల తిరుగుబాటు మొదలైన విపత్తులలో చిక్కుకొన్నవాడూ, పరదేశంలో ఉండేవాడూ, శత్రువులు అధికంగా ఉండేవాడూ, కాలానుగుణంగా ప్రవర్తిల్లనివాడు, సత్యాన్ని ధర్మాన్ని అనుసరింపనివాడూ అనే ఈ ఇరువది విధాలైన వారు సంధికి అయోగ్యులు. వీరితో సంధిని చేసుకొనరాదు. యుద్ధం మాత్రమే చేయాలి. ఏలనన వీరు యుద్ధంద్వారా శత్రువునకు లొంగిపోతారు. (36 నుండి 39వరకు శ్లోకాల భావం)

శ్లో. బాలస్యాల్పప్రభావత్వా న్న లోకో యోద్ధు మిచ్ఛతి,
యుద్ధాయుద్ధఫలం యస్మాత్ జ్ఞాతుం శక్తో న బాలిశః. 40

ఉత్సాహశక్తిహీనత్వాద్ వృద్ధో దీర్ఘామయ స్తథా,
స్వైరేవ పరిభూయేతే ద్వావప్యేతా వసంశయమ్. 41

సుఖోచ్ఛేద్యో హి భవతి సర్వజ్ఞాతిబహిష్కృతః,
త ఏవైనం వినిఘ్నన్తి జ్ఞాతయ స్త్వాత్మసాత్కృతాః. 42

భీరు ర్యుద్ధపరిత్యాగాత్ స్వయమేవ ప్రణశ్యతి,
తథైవ భీరుపురుషః సఙ్గ్రామే తై ర్విముచ్యతే. 43

లుబ్ధస్యాఽసంవిభాగిత్వా న్న యుధ్య న్తేఽనుజీవినః,
లుబ్ధానుజీవి తై రేవ దానభిన్నై ర్నిహన్యతే. 44

స న్త్యజ్యతే ప్రకృతిభి ర్విర క్తప్రకృతి ర్యుధి,
సుఖాభియోజ్యో భవతి విషయే ష్వతిస క్తిమాన్. 45

అను. [గమనిక-పై ఇరువది రకాలవారు ఎందువల్ల సంధికి అయోగ్యులో కారణయు క్తంగా వివరిస్తూన్నాడు-

1. ప్రభువు బాలుడైతే అతడి ప్రభావం మంత్రులు. సేనానులు మొదలైన వారిపై అల్పంగా ఉంటుంది. అందువల్ల వారు సరిగా ప్రాణాలొడ్డి యుద్ధం చేయగోరరు. మరియూ, ఈ బాలుడైన ప్రభువు రాజనీతిజ్ఞానమూర్ఖుడు (బాలిశుడు) కావడంవల్ల యుద్ధఫలంగానీ, అయుద్ధఫలంగానీ చక్కగా గ్రహింపజాలడు. 40

2-3 వృద్ధుడూ మరియూ దీర్ఘరోగి అయిన ప్రభువులకు మానసికోత్సాహంగానీ శారీరకబలంగానీ అంతగా ఉండవు అందువల్ల వీరిరువురూ తమవారివల్లనే పరిభవింపబడుతారు. ఇందు సందేహం లేదు. 41

4. సోదరాదిసజాతీయు లందరిచే బహిష్కృతుడైన ప్రభువును తేలిగ్గా జయింపవచ్చును. ఏలనన అతని పక్షంలో ఉండే సజాతిబంధువులే అతణ్ణి నాశం చేస్తారు. 42

5-6. పిఱికివాడైన ప్రభువు యుద్ధం వదలి పాఱిపోవడంతో స్వయంగానే నశిస్తాడు. ఇక పిఱికివారైన మంత్రులూ, సైనికులు గల ప్రభువు అయితే తేలిగ్గా లొంగిపోతాడు. ఏలనన యుద్ధభూమిలో ఆ పిఱికివాం డ్రందరూ ప్రభువును వదలి పాఱిపోతారు. 43

7-8. ప్రభువు లోభియై సైనికులకు వారి పరాక్రమాదులకు తగినట్లు

పారితోషికాదిరూపంగా ధనాదికం పంచనిచో ఆ సైనికులు సరిగా యుద్ధం చేయరు. ఇక సేవకులు లోభులు (ఆశగలవారు) అయితే శత్రువులవల్ల లంచం పొందుతారు. తమ ప్రభువును తామే సంహరిస్తారు. 44

9-10. అమాత్య సైనిక, సేవకాది, ప్రకృతిప్రేమకు దూరమైన ప్రభువు యుద్ధంలో వారందరిచే వదలివేయబడుతాడు. ఇక విషయాతిసక్తుడు (శత్రు ప్రయుక్తకామినీజనంద్వారా) తన విషయలాంపట్యంవల్లనే శత్రువులకు లొంగి పోతాడు. 45

శ్లో. అనేకచిత్తమన్త్రిస్తు ద్వేష్యో భవతి మన్త్రిణామ్,
అనవస్థితచిత్తత్వాత్ కార్యతః స ఉపేక్ష్యతే. 46

సదాఽధర్మబలీయస్త్వా ద్దేవబ్రాహ్మణనిన్దకః,
విశీర్యతే స్వయం హ్యేష దైవోపహతకస్తథా. 47

సమ్పత్తేశ్చ విపత్తేశ్చ దైవమేవ హి కారణమ్,
ఇతి దైవపరో ధ్యాయ న్నాత్మనా న విచేష్టతే. 48

దుర్భిక్షవ్యసనీ చైవ స్వయమేవ విషీదతి,
బలవ్యసనసక్తస్య యోద్ధుం శక్తి ర్న జాయతే. 49

అదేశస్థో హి రిపుణా స్వల్పకేనాఽపి హన్యతే,
గ్రాహోఽల్పీయానపి జలే గజేన్ద్ర మవకర్షతి. 50

అను. 11. బహువిధములైన ఆలోచనలుగలవాడు అనగా చపలచిత్తుడు అయిన భూపాలుడు మంత్రులచే ద్వేషింపబడుతాడు. చాపల్యం వల్లనే యుద్ధాదులందు అతడు అమాత్యాదిప్రకృతిజనంచే ఉపేక్షితుడౌతాడు. 46

12-13. దేవతలను బ్రాహ్మణులను దూషించేవాడు తన పాపం (అధర్మం) వల్లనే స్వయంగా క్షీణిస్తాడు. ఇక దైవోపహతుడు అనగా దురదృష్టవంతుడు పూర్వదుష్కర్మఫలంగా ఏ పనీ కలిసిరానందున నశిస్తాడు. 47

14. దైవపరుడైన ప్రభువు-"సంపదలను ఆపదలను ఇచ్చేది దైవం (అదృష్టం-భాగ్యం)-అని తలుస్తూ స్వయంగా ప్రయత్నం ఏదీ సరిగా చేయడు. అందువల్ల అతనూ నశిస్తాడు. 48

15-16 కలువులో చిక్కిన ప్రభువు మిక్కిలి దుఃఖంలో ఉంటాడు. ఇక ఆపదలో ఉండే సైన్యం గల ప్రభువునకు యుద్ధం చేసే శక్తి ఉండదు. కనుక వీరిరువురినీ తేలిగ్గా జయింపవచ్చును. 49

17. చెడు ప్రదేశంలో (అదేశంలో) ఉండే ప్రభువును శత్రువులు సులభంగా జయిస్తారు. నీటిలో ఉండే గజరాజును సైతం చిన్న మొసలి లాగుతుంది.

శ్లో. బహుశత్రుస్తు సన్త్రస్తః శ్యేనమధ్యే కపోతవత్,
యేనైవ గచ్ఛతి పథా తేనైవాఽఽశు విపద్యతే. 51

అకాలయుక్తసైన్యస్తు హన్యతే కాలయోధినా,
కౌశికేన హతజ్యోతి ర్నిశీథ ఇవ వాయసః. 52

సత్యధర్మవ్యపేతేన సన్ధధ్యా న్న కదాచన,
స సన్ధితోఽప్యసాధుత్వా దచిరా ద్యాతి విక్రియామ్. 53

అను. 18. శత్రువులు అనేకులు ఉండే రాజు డేగలనడుమ చిక్కుపడ్డ పావురం వలె ఎప్పుడూ భయంతో ఉంటాడు. ఏ దిక్కుగా పయనించినా శత్రువులవల్ల ఆపద నందుతాడు. 51

19. సమయాన్ని గుర్తింపక శత్రువుపై సైన్యాన్ని నడిపే భూపాలుడు సమయజ్ఞుడై ఎదుర్కొనే శత్రువుచే, రాత్రివేళ కన్నులు కనబడని కాకి అర్ధరాత్రమున (కన్నులు కనబడే) గుడ్లగూబచే. వలె-చంపబడుతాడు. 52

20. సత్యం, ధర్మం పాటింపని భూపాలుడితో ఎప్పటికీ సంధిని చేసుకోరాదు. ఏలనన-అతను దుష్టుడు అవడంతో సంధిని చేసుకున్నా త్వరలోనే సంధి నియమాలను అతిక్రమిస్తాడు. 53

మూ. అపరమపి కథయామి.సన్ధి-విగ్రహ-యాన-ఆసన-సంశ్రయ-ద్వైధీభావాః షాడ్గుణ్యమ్. కర్మణా మారమ్భోపాయః, పురుష-ద్రవ్య

సమ్పత్, దేశకాలవిభాగః, వినిపాతప్రతీకారః, కార్యసిద్ధిశ్చ – (ఇతి) పఞ్చాఙ్గో మన్త్రః. సామ-దాన-భేద-దణ్డాశ్చత్వార ఉపాయాః. ఉత్సాహ శక్తిః, మన్త్రశక్తిః, ప్రభుశక్తిశ్చేతి శక్తిత్రయమ్. ఏతత్సర్వ మాలోచ్య నిత్యం విజిగీషవో భవన్తి మహాన్తః. యతః-

శ్లో. యా హి ప్రాణపరిత్యాగమూల్యేనాఽపి న లభ్యతే,
సా శ్రీ ర్నీతివిదం పశ్య చఞ్చలాఽపి ప్రధావతి. 54

తథా చోక్తమ్-

శ్లో. విత్తం సదా యస్య సమం విభక్తం
గూఢశ్చరః సన్నిభృతశ్చ మన్త్రః,
న చాఽప్రియం ప్రాణిషు యో బ్రవీతి
స సాగరాన్తాం పృథివీం ప్రశాస్తి. 55

అను. మరియూ చెప్పెదను వినుము. రాజనీతి ఆరు గుణాలు గలదై ఉంటుంది. వాటి లక్షణాలు ఇలా ఉంటాయి-

1. సంధి = శత్రువుతో సంధి చేసికొనడం.
2. విగ్రహం = అన్ని ప్రయత్నాలు విఫలమైతే యుద్ధం చేయడం.
3. యానం = ప్రయాణం. ఇది రెండు విధాలు. ఒకటి శత్రువుపై దాడిచేయడం, రెండు తనబలం తక్కువగా ఉన్నచో ఆత్మరక్షణకై దుర్గం విడిచి వేఱొక సురక్షితస్థానానికి పలాయన ప్రయాణం చేయడం.
4. ఆసనం = దుర్గంలో ఉండి శత్రువుపై దాడికి నిరీక్షించడం.
5. సంశ్రయం = బలవంతుణ్ణి ఆశ్రయించడం.
6. ద్వైధీభావం = రెండుభావాలతో మెలగడం, అనగా శత్రువుఎడ పైకి ఒక విధంగానూ లోపల మఱొకవిధంగానూ ప్రవర్తిల్లడం.

మంత్రాంగాలు అయిదు విధాలుగా ఉంటాయి. వాటిపేర్లు-

1. కార్యారంభోపాయం=కార్యాన్ని మొదలు పెట్టే ఉపాయం.
2. పురుష-ద్రవ్య సంపద = సహాయకపురుషసమృద్ధి. ధనాదిసమృద్ధి.
3. దేశకాలవిభాగం = ఏ స్థలంలో, ఏ సమయంలో కార్యాన్ని ఎలా చేయాలో విభజించి గుర్తించడం.
4. వినిపాతప్రతీకారం = మధ్యన ఏదేని విపత్తు సంభవిస్తే దానికి ప్రతీకారం (నివారకం) చేయడం.
5. కార్యసిద్ధి = కార్యంలో సిద్ధిని పొందడం.

నాల్గు ఉపాయాలు=సామము,-దానము-భేదము,దండము, అనేవి. మూడు శక్తులు (1) ఉత్సాహశక్తి (2) మంత్రశక్తి (3) ప్రభుశక్తి.

మహితాత్ములైన ప్రభువులు ఇదంతా ఆలోచిస్తారు. ఆ మీదట శత్రువును జయింపదలుస్తారు. ఏలనన-

ఏ రాజ్యలక్ష్మి ప్రాణపరిత్యాగరూపమైన మూల్యంవల్లనూ లభింపదో అలాంటి రాజ్యలక్ష్మి చంచలగుణం గలదైనా రాజనీతిజ్ఞుడైన ప్రభుడివద్దకు పేరుగిడుతూ వస్తుంది. 54

మరియూ విజ్ఞులు ఇలా అన్నారు-

ఏ ప్రభువు తన ధనాన్ని వారి వారి యోగ్యతలనుబట్టి మంత్రులు సైనికులు మొదలైనవారికి పంపకం చేస్తాడో, ఎవడి గుప్తచరులు (వేగులు) రహస్యం బయటికి పొక్కనీయరో, ఎవడు ఏ ప్రాణియెడను కటువుగా భాషింపడో, అలాంటి ప్రభువు సముద్రపర్యంత భూమిని పాలిస్తాడు. 55

మూ. కిన్తు దేవ ! యద్యపి మహామన్త్రిణా గృధ్రేణ సన్ధానముపన్యస్తమ్ తథాపి తేన రాజ్ఞా భూతజయదర్పాన్న మన్తవ్యమ్. దేవ! తదేవం క్రియతామ్-సింహలద్వీపస్య మహాబలో నామ సారసోఽస్మన్మిత్రం జమ్బూద్వీపే కోపం జనయతు. యతః-

శ్లో. సుగుప్తి మాధాయ సుసంహతేన
బలేన వీరో విచరన్నరాతిమ్,

సన్తాపయేద్ యేన సమం సుతప్తః
తప్తేన సన్ధాన ముపైతి తప్తః. 56

రాజ్ఞా-"ఏవ మస్తు"-ఇతి నిగద్య విచిత్రనామా బకః సుగుప్త లేఖం దత్త్వా సింహలద్వీపం ప్రహితః.

అను. కానీ ఓ ప్రభూ! మహామంత్రి అయిన గ్రద్ద మాత్రం సంధిని బోధించింది. అయినా రాజు అయిన చిత్రవర్ణుడు మాత్రం ప్రస్తుతం విజయ గర్వంవల్ల ఆ సంధిని అంగీకరించడం లేదు. అందువల్ల ఇలా చేస్తాం. ఏమన- 'మహాబలుడు అనే సారసపక్షి (నీటికోయిల) సింహలద్వీపానికి రాజు. అతను మనకు మిత్రుడు.అతను జంబూద్వీపాన్ని ముట్టడించాలి. ఏలనన-

వీరుడైన ప్రభువు సుగుప్తిని (చక్కని ఆత్మరక్షణను-ప్రచ్ఛన్నభావాన్ని) అనుసరించాలి. సైన్యాన్ని సుసంఘటితం చేసుకొనాలి. ఇటు అటు (రహస్యంగా) తిరుగుతూ శత్రువును బాగా పీడించాలి. అందుచే అతను తనవలె సంతప్తుడు అవుతాడు. అప్పుడు తేలిగ్గా సంధికి అంగీకరిస్తాడు. తప్తమైన ఇనుపముక్కలు రెండూ సంధింపబడుతాయి గదా?'' 56

అంత రాజు (హిరణ్యగర్భుడు)-'అలాగే కానిమ్ము'-అన్నాడు. అప్పుడు మంత్రి విచిత్రుడు అనే పేరు గల కొంగను పిలిపించాడు. రహస్యపత్రం ఇచ్చాడు. సింహలద్వీపం పంపాడు.

మూ. అథ ప్రణిధిః పునరాగత్యోవాచ - 'దేవ! శ్రూయతాం తావత్ తత్రత్యప్రస్తావః. ఏవం తత్ర గృధ్రేణోక్తమ్-'దేవ! మేఘవర్ణ స్తత్ర చిర ముషితః. స వేత్తి కిం సన్ధేయగుణయుక్తో హిరణ్యగర్భో రాజా న వా'ఇతి. తతోఽసౌ మేఘవర్ణ శ్చిత్రవర్ణేన రాజ్ఞా సమాహూయ పృష్టః-'వాయస! కీదృశోఽసౌ హిరణ్యగర్భో రాజా. చక్రవాకో మన్త్రీ వా కీదృశః ?-ఇతి. వాయస ఉవాచ-'దేవ! స హిరణ్యగర్భో రాజా యుధిష్ఠిరసమో మహాశయః సత్యవాక్. చక్రవాకసమో మన్త్రీ న క్వాఽప్యవలోక్యతే. రాజాఽఽహ-'యద్యేవం తదా కథమసౌ త్వయా వఞ్చితః?' ఇతి. విహస్య మేఘవర్ణః ప్రాహ-"దేవ!

శ్లో. విశ్వాసప్రతిపన్నానాం వఞ్చనే కా విదగ్ధతా,
అఙ్కమారుహ్య సుప్తం హి హత్వా కిం నామ పౌరుషమ్. 57

అను. అంతట గుప్తచరుడైన కొంగ వచ్చి హిరణ్యగర్భుడితో ఇలా అంది-''దేవా ! అచ్చట శత్రుపక్షంలో జరిగినది వినండి. అచ్చట మహామంత్రి అయిన గ్రద్ద ఇలా అంది.'ప్రభూ ! మన మేఘవర్ణుడు (కాకి) అచ్చట చాల కాలం ఉన్నాడు. హిరణ్యగర్భుడు సంధికి యోగ్యమైనవాడో కాదో అతడు చక్కగా తెలిసికొని ఉంటాడు.' అప్పుడు రాజైన చిత్రవర్ణుడు మేఘవర్ణుణ్ణి పిలిపించాడు. ఇలా అడిగాడు-'ఓ కాకీ ! అచ్చట ప్రభువైన హిరణ్యగర్భుడు మంత్రి అయిన చక్రవాకం ఎలాంటివారు ?' కాకి ఇలా చెప్పింది-'దేవా ! ఆ ప్రభువైన హిరణ్యగర్భుడు ధర్మరాజుతో సమానుడు-సత్యవచనుడు. ఇక చక్రవాకంవంటి మంత్రి ఎచ్చటను కనబడడు. (అనగా సాటిలేనివాడు). అది విని రాజు అడిగాడు- 'అలా అయితే నీవు రాజును ఎలా మోసం చేశావు?' అందుకు నవ్వి కాకి ఇలా బదులు పల్కింది-'దేవా ! నమ్మినవారిని మోసం చేయడంలో గొప్పతనం ఏముంది ? అలాగే తొడమీద నిద్రించేవారిని చంపడంలో పౌరుషం ఏముంది ?

మూ. శృణు దేవ ! తేన మన్త్రిణాఽహం ప్రథమదర్శనే ఏవ విజ్ఞాతః. కిన్తు మహాశయోఽసౌ రాజా. తేన మయా విప్రలబ్ధః. తథా చోక్తమ్-

శ్లో. ఆత్మౌపమ్యేన యో వేత్తి దుర్జనం సత్యవాదినమ్,
స తథా వఞ్చ్యతే ధూర్తైర్బ్రాహ్మణశ్ఛాగతో యథా. 58

రాజోవాచ-'కథమేతత్ ?' మేఘవర్ణః కథయతి-

అను. దేవా ! వినుము. మొదట చూడగానే నన్ను ఆ మంత్రి గ్రహించాడు. కాని గొప్పహృదయం గల రాజు నాచే మోసగించబడ్డాడు. విజ్ఞులు ఇలా అంటారు-

ఎవడు దుష్టుని తనవలె సత్యవచనునిగా తలుస్తాడో అతను-బ్రాహ్మణుడు వంచకులవలన మేకను పోగొట్టుకొన్న విధంగా మోసపోతాడు. 58

రాజు అడిగాడు-'అది ఎట్లు ?' మేఘవర్ణుడు ఇలా చెప్పసాగాడు-

# 9. ధూర్తత్రయాణాం బ్రాహ్మణస్య చ కథా

[ముగ్గురు వంచకులు—బ్రాహ్మణుడు]

మూ. అస్తి గౌతమస్యారణ్యే ప్రస్తుతయజ్ఞః కశ్చిద్ బ్రాహ్మణః. స చ యజ్ఞార్థం గ్రామాన్తరా చ్ఛాగ ముపక్రీయ స్కన్ధే నీత్వా గచ్ఛన్ ధూర్తత్రయేణాఽవలోకితః. తతస్తే ధూర్తాః- 'యద్యేషః ఛాగః కేనాఽప్యుపాయేన లభ్యతే తదా మతిప్రకర్షో భవతీతి సమాలోచ్య వృక్షత్రయతలే క్రోశాన్తరేణ తస్య బ్రాహ్మణస్యాఽఽ గమనం ప్రతీక్ష్య పథి స్థితాః.

అను. గౌతముడి అడవిలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు-అతను యజ్ఞం చేయదలచాడు-అందుకై పొరుగూరికి పోయి ఒక మేకపోతును ఖరీదు చేశాడు. దాన్ని భుజంమీద వేసికొని తీసుకొని వస్తున్నాడు. అలా ఆ బాపడు రావడం ముగ్గురు వంచకులు చూచారు.'ఇతణ్ణి మోసగించి ఏదో ఉపాయంతో ఈ మేకను అపహరిస్తే మన బుద్ధినైపుణ్యం వ్యక్తం అవుతుంది'-అని తలంచారు. ఒక్కొక్కరు ఒక్కొక్క క్రోసు ఎడంగా ఆ దారిలో చెట్లక్రింద కూర్చున్నారు. బాపడి రాకకై నిరీక్షింపసాగారు.

మూ- తత్రైకేన ధూర్తేన గచ్ఛన్ స బ్రాహ్మణోఽభిహితః- 'భో బ్రాహ్మణ! కిమితి త్వయా కుక్కురః స్కన్ధే నోహ్యతే?. విప్రేణోక్తమ్-'నాయం శ్వా. కిన్తు యజ్ఞచ్ఛాగః' ఇతి. అథాన్తరస్థితే నాన్యేన ధూర్తేన తథైవోక్తమ్. తదాకర్ణ్య బ్రాహ్మణ శ్ఛాగం భూమౌ నిధాయ ముహు ర్నిరీక్ష్య, పునః స్కన్ధే కృత్వా దోలాయమానమతి శ్చలితః. యతః-

శ్లో. మతి ర్దోలాయతే సత్యం సతామపి ఖలోక్తిభిః,
తాభి ర్విశ్వాసితశ్చాసౌ మ్రియతే చిత్రకర్ణవత్.

రాజాఽఽహ-'కథమేతత్' ? సః (మేఘవర్ణః) కథయతి-

అను. వారిలో మొదటి వంచకుడు తన సమీపానికి బాపడు రాగానే ఇలా అన్నాడు-"ఓ బ్రాహ్మణా! కుక్కను భుజంపై వేసికొని ఎందుకు ఇలా మోస్తున్నావు ?" 'అందుకు ఆ విప్రుడు ఇలా సమాధానం చెప్పాడు-"ఇది కుక్క గాదు. యజ్ఞానికి బలిపశువైన (పవిత్రమైన) మేక. పిమ్మట బాపడు మరికొంత దూరం పోయాడు. రెండవ వంచకుడునైతం అలాగే అడిగాడు. అది వినగానే బాపడు మేకపోతును క్రిందికి దింపాడు. మాటిమాటికి దాన్ని పరీక్షించి చూచాడు. మరలా భుజంమీదికి ఎత్తుకున్నాడు. సందేహంచే మనస్సు ఊగిసలాడుతుండగా నడక సాగించాడు. ఏలనన-

సజ్జనుల మనస్సునైతం నీచుల మాటలను మాటిమాటికి వినడంతో మొదట భ్రాంతిచే సందేహం పొందుతుంది. క్రమంగా ఆ మాటలను విశ్వసిస్తుంది. ఆలా విశ్వసించినవాడు చిత్రకర్ణుడు అనే ఒంటె వలె మరణిస్తాడు. 59

రాజు అడిగాడు-అది ఎట్లు ? అతడు (మేఘవర్ణుడు) ఇలా చెప్పసాగాడు-

# 10. సింహ-వ్యాఘ్ర-కాక-జమ్బుక-ఉష్ట్రి కథా

[సింహం-పులి-కాకి-నక్క-ఒంటె]

మూ. అస్తి కస్మింశ్చిద్వనోద్దేశే మదోత్కటో నామ సింహః. తస్య సేవకాస్త్రయః కాకో వ్యాఘ్రో జమ్బుకశ్చ. అథ తై ర్భ్రమద్భిః సార్థభ్రష్టః కశ్చిదుష్ట్రో దృష్టః పృష్టశ్చ-'కుతో భవా నాగతః సార్థాద్ భ్రష్టః ?' ఇతి. స చాత్మవృత్తాన్త మకథయత్. తతస్తైః నీత్వా సింహాయాసౌ సమర్పితః. తేన చాభయవాచం దత్త్వా 'చిత్రకర్ణ' ఇతి కృత్వా స్థాపితః.

అను. ఒకానొక అడవిలో మదోత్కటుడు అనే సింహం ఉంది. అతడికి కాకి, పులి, నక్క అనే ముగ్గురు సేవకులు కలరు. అవి ఒకనాడు అడవిలో తిరుగుతూ వ్యాపారుల గుంపునుండి తప్పిపోయిన ఒక ఒంటెను చూచాయి. 'నీవు ఎచ్చట గుంపునుండి తప్పి వస్తున్నావు ?-అని ఆ ఒంటెను అడిగాయి. అందుకు ఆ ఒంటె తన కథను అంతా చెప్పి వినిపించింది. పిమ్మట అవి దాన్ని తమ వెంట తోడ్కొని పోయాయి. సింహానికి సమర్పించాయి. సింహం ఆ ఒంటెకు అభయదానం చేసింది-'చిత్రకర్ణుడు'-అని పేరు పెట్టింది. తనవద్ద ఉంచుకొనింది.

మూ. అథ కదాచిత్ సింహస్య శరీరవైకల్యాద్ భూరివృష్టికారణా చ్చాహార మలభమానా స్తే వ్యగ్రా బభూవుః. తత స్తై రాలోచితమ్- 'చిత్రకర్ణమేవ యథా స్వామీ వ్యాపాదయతి తథాఽనుష్ఠీయతామ్. కిమనేన కణ్టకభుజాఽస్మాకమ్' ఇతి.

వ్యాఘ్ర ఉవాచ-"స్వామినాఽభయవాచం దత్వాఽనుగృహీతోఽయమ్. తత్కథమేవం సమ్భవతి ?''

అను. అంత ఒకసారి సింహానికి జబ్బు చేసింది. దానికి తోడుగా వాన ఎక్కువగా కురిసింది. అందువల్ల సింహం తిరుగడానికి శక్తిలేనిదై వేటాడలేక పోయింది. అప్పుడు సింహంతోపాటు కాకి మొదలైనవి అన్నీ తిండిలేక నకనకలాడాయి. అందుచే ఇలా ఆలోచించాయి-ఈ చిత్రకర్ణుణ్ణే ప్రభువు చంపేటట్లు చేస్తాం. ఈ కంప (ముండ్లు) తినేవాడివల్ల ఉపయోగం ఏముంది ?'

పులి ఇలా అంది-'ప్రభువు ఇతడికి అభయం ఇచ్చి అనుగ్రహించాడు. అలాంటప్పుడు ఇదెలా సంభవం ?'

మూ. కాకో బ్రూతే-"ఇహ సమయే పరిక్షీణః స్వామీ పాపమపి కరిష్యతి.

యతః-

శ్లో. త్యజేత్ క్షుధార్తా మహిలా స్వపుత్రం
ఖాదేత్ క్షుధార్తా భుజగీ స్వమణ్డమ్,

బుభుక్షితః కిం న కరోతి పాపం
క్షీణా నరా నిష్కరుణా భవన్తి. 60

అన్యచ్చ -

శ్లో. మత్తః ప్రమత్త శ్చోన్మత్తః శ్రాన్తః క్రుద్ధో బుభుక్షితః,
లుబ్ధో భీరు స్త్వరాయుక్తః కాముకశ్చ న ధర్మవిత్. 61

ఇతి సఞ్చిన్త్య సర్వే తే సింహాన్తికం జగ్ముః.

అను. కాకి ఇలా చెప్పింది-'ఇప్పుడు స్వామి ఆకలిచే బాధపడుతున్నాడు. అందువల్ల పాపకార్యం అయినా చేస్తాడు. ఏలననగా—

ఆకలిచే అలమటించే ఆడది తన కొడుకును వదలివేస్తుంది. పాము తన గుడ్డును తింటుంది. కనుక ఆకలిచే నకనకలాడే వాడు చేయని పాపం ఏముంది ? ఆపదలచే క్షీణించినవారు దయాహీనులై ఉంటారు. 60

మరియూ—మదించినవాడు (అహంకారి), జాగ్రత్తలేనివాడు, పిచ్చివాడు, బడిలినవాడు, క్రోధంచే ఒడలు తెలియనివాడు, ఆకలిగొన్నవాడు, లోభివాడు, పిఱికివాడు, తొందరపాటువాడు, కాముకుడు అనే ఈ పదిమంది ధర్మం గుర్తింపరు.' 61

ఇలా తలంచి అవి మూడూ సింహంవద్దకు పోయాయి.

మూ. సింహేనోక్తమ్-"ఆహారార్థం కిఞ్చిత్ ప్రాప్తమ్?'. తైరుక్తమ్-'దేవ! యత్నాదపి న ప్రాప్తం కిఞ్చిత్ ?'. సింహేనోక్తమ్-'కోఽధునా జీవనోపాయః ?'। కాకో వదతి-"దేవ! స్వాధీనాఽఽహార పరిత్యాగాత్ సర్వనాశోఽయ ముపస్థితః" సింహేనోక్తమ్-'అత్రాఽఽహారః కః స్వాధీనః ?" కాకః కర్ణే కథయతి-"చిత్రకర్ణ" ఇతి. సింహో భూమిం స్పృష్ట్వా కర్ణౌ స్పృశతి. అబ్రవీచ్చ-'అభయవాచం దత్వా ధృతోఽయ మస్మాభిః, తత్కథమేవం సమ్భవతి ? తథాహి-

శ్లో. న భూప్రదానం న సువర్ణదానం
న గోప్రదానం న తథాఽన్నదానమ్,

యథా వద న్తీహ మహాప్రదానం
సర్వేషు దానే ష్వభయప్రదానమ్. 62

అన్యచ్చ-

శ్లో. సర్వకామసమృద్ధస్య హ్యశ్వమేధస్య యత్ఫలమ్,
తత్ఫలం లభతే సమ్యగ్ రక్షితే శరణాఽఽగతే. 63

అను. సింహం ఇలా అడిగింది-'భోజనానికి ఏదేని(జంతువు)లభించిందా?' అవి ఇలా అన్నాయి-'ఎంతగా యత్నించినా ఏమీ లభింపలేదు.' సింహం మరలా అడిగింది. 'అలా అయితే ఇప్పుడు బ్రతికే ఉపాయం ఏమి ?' అందుకు కాకి-'దేవా ! స్వాధీనంలో ఉండే ఆహారాన్ని వదలుకోడంవల్ల ఈ సర్వనాశం ప్రాప్తించింది' అని చెప్పింది. అది విని సింహం ఇలా అంది-'ఇచ్చట మన అధీనంలో ఏ ఆహారం ఉంది ? అంతట కాకి సింహం చెవిదగ్గరకు పోయి మెల్లగా-'చిత్రకర్ణుడు' అని చెప్పింది. ఆ మాట వినగానే సింహం భూమిని తాకింది. చెవులు మూసికొంది. ఇలా చెప్పింది-'మనం అతనికి అభయదానం ఇచ్చి ఇక్కడ ఉంచుకున్నాం. అలాంటప్పుడు ఇది ఎలా సంభవం అవుతుంది ?' ఎందుకనగా-

భూదానం, సువర్ణదానం, గోదానం, అన్నదానం ఇలాంటివి అన్నీ అభయదానంతో సమానం గావు. అభయదానం 'సర్వదానశ్రేష్ఠం' అని అంటారు. 62

మరియూ, సర్వకామాలను అనుగ్రహించే అశ్వమేధయాగంవల్ల లభించే పుణ్యం కేవలం శరణుజొచ్చినవాణ్ణి రక్షించడంవల్ల లభిస్తుంది.' 63

మూ. కాకో బ్రూతే-'నాఽసౌ స్వామినా వ్యాపాదయితవ్యః. కి న్త్వస్మాభిరేవ తథా కర్తవ్యం యథాసౌ స్వదేహదాన మఙ్గీకరోతి. సింహ స్తచ్ఛ్రుత్వా తూష్ణీం స్థితః. తతోఽసౌ లబ్ధాఽవకాశః కూటం కృత్వా సర్వానాదాయ సింహాన్తికం గతః. అథ కాకేనోక్తమ్—'దేవ ! యత్నాద ప్యాహారో న ప్రాప్తః. అనేకోపవాసక్లిష్టశ్చ స్వామీ. తదిదానీం మదీయం మాంస ముపభుజ్యతామ్. యతః-

శ్లో. స్వామిమూలా భవ న్త్యేవ సర్వాః ప్రకృతయః ఖలు,
సమూలేష్వపి వృక్షేషు ప్రయత్నః సఫలో నృణామ్. 64

అను. అది విని కాకి ఇలా చెప్పింది-'ప్రభువులు ఆ ఒంటెను చంపవలసిన అవసరం లేదు. అతనే (ఒంటెయే) తన దేహాన్ని సమర్పించే ఉపాయం మేము ఏదేని చేస్తాం'. ఆ మాటకు సింహం మౌనం వహించింది. కాకి అలా ఉండడమే అంగీకారంగా అవకాశంగా భావించింది. తన మిత్రులైన పులితో నక్కతో కలిసింది. కపటమంత్రం నిర్మించింది. పిమ్మట అందరినీ వెంట నిడుకొని సింహం వద్దకు పోయింది. ఇలా విన్నవించింది-"దేవా! ఎంత ప్రయత్నించినా ఆహారం లభించలేదు. ఉపవాసాలు అధికంగా చేసి ప్రభువులు కృశించారు. కనుక ఇప్పుడు నా మాంసం తినండి. ఏలనన-

ప్రజల కందరికి ప్రభువే మూలం గదా. మూలం గల్గిన [వేళ్ళుగల] వృక్షాల విషయంలో చేసిన ప్రయత్నమే నరులకు ఫలితాన్నిస్తుంది. 64

మూ. సింహేనోక్తమ్-"భద్ర! వరం ప్రాణపరిత్యాగో న పునరీదృశే కర్మణి ప్రవృత్తిః. జమ్బుకేనాఽపి తథోక్తమ్. తతః సింహేనోక్తమ్-'మైవమ్'. అథ వ్యాఘ్రేణోక్తమ్-'మద్దేహేన జీవతు స్వామీ. సింహేనోక్తమ్-'న కదాచి దేవ ముచితమ్. అథ చిత్రకర్ణోఽపి జాతవిశ్వాస స్తథైవాఽఽత్మదేహదానమాహ. తత స్తద్వచనా త్తేన వ్యాఘ్రేణాసౌ కుక్షిం విదార్య వ్యాపాదితః సర్వై ర్భక్షితశ్చ. అతోఽహం బ్రవీమి-'మతి ర్దోలాయతే సత్యమ్' ఇత్యాది.

అను. అంత సింహం ఇలా అంది.'శుభమూర్తీ! ప్రాణాలు విడువడం అయినా మంచిదే కానీ ఇలాంటిపని చేయడంమాత్రం వద్దు. తర్వాత నక్కయూ అలాగే (కాకివలెనే) చెప్పింది. దానికినీ సింహం-'అలా వద్దు'-అని పల్కింది. ఆ మీదట పులియూ-'నాదేహం తిని ప్రభువులు జీవించండి'-అని విన్నవించింది. అందుకునూ సింహం-'ఎప్పటికీ ఇలా చేయడం సముచితం గాదు' అని చెప్పింది.. అప్పుడు చిత్రకర్ణుడు ఆ మూడింటిని అలా అనడంతో తనకు అపాయం లేదనే నమ్మకం పొందింది-'ప్రభూ! నన్ను భక్షించి జీవించండి' అని విన్నవించింది. అది అలా అనగానే పులి దానిమీదికి దూకింది. పొట్టను చీల్చి చంపింది. అందుచే నేను-(మేఘవర్ణుడు అనే కాకిని) చెప్పతూన్నాను-'నీచుల మాటలచే సజ్జనుల మనస్సు సైతం సందేహం పొందుతుంది." ఇత్యాది (59 వ శ్లోకభావం చూడుడు).

మూ. తత స్తృతీయధూర్తవచనం శ్రుత్వా స్వమతిభ్రమం నిశ్చిత్య ఛాగం త్యక్త్వా బ్రాహ్మణః స్నాత్వా గృహం యయౌ. ఛాగశ్చ త్రైర్ధూర్తై ర్నీత్వా భక్షితః. అతోఽహం బ్రవీమి-'ఆత్మౌపమ్యేన యో వేత్తి'- ఇత్యాది.

రాజాఽఽహ-'మేఘవర్ణ ! కథం శత్రుమధ్యే త్వయా సుచిర ముషితమ్ ? కథం వా తేషా మనునయః కృతః ?'

అను. తర్వాత కొంతదూరం రాగానే మూడవవంచకుడు వచ్చి అలాగే ('ఏమి ? కుక్కను ఎత్తుకొని పోతున్నావు' అని) అన్నాడు. అది వినగానే ఆ బాపడు-'తనకే మతిచెడి కుక్కను కొన్నాను'-అని నిశ్చయించాడు. ఆ మేక పోతును అచ్చటనే వదలివేశాడు. కుక్కను తాకిన దోషం పోయేందుకై దాపున ఉండే నదికి పోయి స్నానం చేశాడు. ఇంటికి పోయాడు. పిమ్మట ఆ మోస గాండ్రు ఆ మేకపోతును తీసికొనిపోయారు. హాయిగా భక్షించారు. అందుచే నేను (మేఘవర్ణుడను) చెప్పుతున్నాను - "తనవలె ఎవడు దుష్టుని తలుస్తాడో"- ఇత్యాది-(58 శ్లోకభావం చూడుడు)

రాజు అడిగాడు-'మేఘవర్ణా ! నీవు శత్రువుల మధ్య చాలా కాలం ఎలా ఉండగల్గావు ? ఎలా వారిని ఆత్మీయుల్ని చేసుకున్నావు ?".

మూ. మేఘవర్ణ ఉవాచ-'దేవ! స్వామికార్యార్థితయా స్వప్రయో జనవశాద్వా కిం కిం న క్రియతే ? పశ్య-

శ్లో. లోకో వహతి కిం రాజన్ న మూర్ధ్నా దగ్ధుమిన్ధనమ్,
క్షాలయ న్నపి వృక్షాఙ్ఘ్రిం నదీవేలా నికృన్తతి. 65

తథా చోక్తమ్-

శ్లో. స్కన్ధేనాఽపి వహేచ్ఛత్రూన్ కార్య మాసాద్య బుద్ధిమాన్,
యథా వృద్ధేన సర్పేణ మణ్డూకా వినిపాతితాః. 66

రాజాఽఽహ-'కథమేతత్' మేఘవర్ణః కథయతి-

అను. మేఘవర్ణుడు ఇలా సమాధానం చెప్పాడు-"దేవా! ప్రభుకార్యాన్ని నెఱవేర్చేందుకు అలాగే స్వార్థాన్ని సాధించేందుకు మానవుడు ఏ పని అయినా చేస్తాడు. చూడండి-

ఓ రాజా! కాల్చేందుకై కట్టెలను మానవుడు నెత్తిన మోస్తున్నాడు. అలాగే నదీప్రవాహం చెట్లకాళ్ళను (వ్రేళ్ళను) కడుగుతూనే దాన్ని (చెట్టు) పెళ్ళగించివేస్తూన్నది. 65

విజ్ఞులు ఇలా అన్నారు-'బుద్ధిమంతుడైనవాడు తన అవసరాన్ని బట్టి శత్రువులనైనా భుజంపై ఉంచుకొని మోయాలి. ముసలిపాము కప్పలను అలాగే మోసి భక్షించింది. 66

రాజు అడిగాడు-'అదెట్లు ?' మేఘవర్ణుడు చెప్పసాగాడు-

# 11. మన్దవిషసర్పకథా

## [మందవిషుడు అనే పాము కథ]

మూ. అస్తి జీర్ణోద్యానే మన్దవిషో నామ సర్పః. సోఽతిజీర్ణతయా స్వాహారమ ప్యన్వేష్టు మక్షమః సరస్తీరే పతిత్వా స్థితః. తతో దూరా దేవ కేనచిన్మణ్డూకేన దృష్టః పృష్టశ్చ- 'కిమితి భవా నాహారం నాఽన్విష్యతి?' సర్పోఽవదత్-'గచ్ఛ భద్ర! కిన్తే మమ మన్దభాగ్యస్య వృత్తాన్త ప్రశ్నేన?'. తతః సఞ్జాతకౌతుకః స భేకః-'సర్వథా కథ్యతామ్' ఇత్యాహ. సర్పోఽప్యాహ-'భద్ర! బ్రహ్మపురవాసినః శ్రోత్రియస్య కౌణ్డిన్యస్య పుత్రో వింశతివర్షదేశీయః సర్వగుణసమ్పన్నో దుర్దైవా న్మయా నృశంసేన దష్టః. తతస్తం సుశీలనామానం పుత్రం మృత మవలోక్య, శోకేన మూర్ఛితః కౌణ్డిన్యః పృథివ్యాం లులోఠ. అనన్తరం బ్రహ్మపుర వాసినః సర్వే బాన్ధవా స్తత్రాఽఽగత్యోపవిష్టాః. తథా చోక్తమ్-

శ్లో. ఉత్సవే వ్యసనే యుద్ధే దుర్భిక్షే రాష్ట్రవిప్లవే,
రాజద్వారే శ్మశానే చ య స్తిష్ఠతి స బాన్ధవః. 67

అను. ఒకానొక ప్రాచీనమైన తోటలో మందవిషుడు అనే పాము నివసించేది. ఆ పాము చాల ముసలిది. తన తిండినిసైతం వెదకి సంపాదించుకొనే శక్తి లేనిది. అందువల్ల కొలనుఒడ్డున నిశ్చలంగా పండుకొని ఉంది. అంత ఆ పామును దూరంనుండియే ఒకానొక కప్ప చూచింది. ఇలా అడిగింది-"తాము ఆహారాన్నిసైతం ఎందుకు వెదుకటం లేదు? పాము-"పొమ్ము. ఈ దురదృష్టవంతుడి విషయం నీ కెందుకు?" అని చెప్పింది. ఆ మాటతో ఆ కప్పకు తెలుసుకోవాలి అనే కోరిక అధికం అయింది. అందుచే-'తప్పక చెప్పండి' అని గట్టిగా అడిగింది. అంత పాము ఇలా చెప్పింది_"శుభమూర్తీ! బ్రహ్మపురంలో కౌండిన్యుడు అనే బాపడు ఉన్నాడు. అతడికి సుశీలుడు అనే పుత్రుడు ఉండేవాడు. ఆ పుత్రుడు మిక్కిలి గుణవంతుడు. వయస్సు ఇరువదియేండ్లు. అతన్ని దురదృష్టంకొద్దీ కఠినుడనై నేను కఱచాను. (అతను చచ్చాడు). మరణించిన పుత్రుణ్ణి కౌండిన్యుడు చూచాడు. వెంటనే దుఃఖంచే మూర్ఛ నందాడు. నేలపై పడి పొరలాడు. అప్పుడు బ్రహ్మపురవాసులైన అతడి బంధువులు అంతా వచ్చారు. అచ్చట కూర్చున్నారు. విజ్ఞులు ఇలా అన్నారు-వివాహాదిఉత్సవం, రోగాదియైన ఆపద, యుద్ధం, క్షామం, దేశంలో ఏదేని అరాజకస్థితి, రాజసభ, శ్మశానభూమి (శవసంస్కారం?)అనే ఈ ఏడింటిలో తోడుపడేవాడే బంధువు అనబడుతాడు. 67

మూ. తత్ర కపిలో నామ స్నాతకోఽవదత్-'అరే కౌణ్డిన్య! మూఢోఽసి, యేనైవం విలపసి. శృణు-

శ్లో. క్రోడీకరోతి ప్రథమం యదా జాత మనిత్యతా,
ధాత్రీవ జననీ పశ్చాత్ తదా శోకస్య కః క్రమః. 68

తథా చ-

శ్లో. క్వ గతాః పృథివీపాలాః ససైన్యబలవాహనాః,
వియోగసాక్షిణీ యేషాం భూమిరద్యాపి తిష్ఠతి. 69

తథా చ_

శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ,
అద్య వాఽబ్దశతాన్తే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః. 70

అను. ఆ బంధువులలో కపిలుడు అనే స్నాతకుడు (విద్య ముగించిన వాడు త్వరలో వివాహం చేసికొనే స్థితిలో ఉండేవాడు) ఇలా బోధించాడు-'ఓరీ కౌండిన్యా! ఇలా రోదిస్తున్నావు ఎంత మూర్ఖుడివిరా! వినుము-

జనింపగానే అనిత్యత (మృత్యువు) అనేది పెంపుడుతల్లి వలె శిశువును తన ఒడిలోకి తీసుకొంటుంది. ఆ తర్వాత తల్లి తీసుకొంటుంది. అలాంటప్పుడు దుఃఖింపవలసిన అవసరం ఏముంది ? 68

మరియూ-సేన, బలం, రథహయాదివాహనాలు గల ఆ ప్రభువులంతా ఎచ్చటికి పోయారు ? వారు అలా పోవడం చూచిన ఈ భూమి నేటికీ పదిలంగానే ఉంది.

మరియూ-పుట్టినవాడికి చావూ-చచ్చినవాడికి పుట్టుకా పరమసత్యాలు. నేడు గానీ లేక నూరేండ్లకుగానీ ప్రాణులకు మరణం తప్పదు. 70

మూ. అపరఞ్చ-

శ్లో. కాయః సన్నిహితాపాయః సమ్పదః పద మాపదామ్,
సమాగమాః సాపగమాః సర్వముత్పాది భఙ్గురమ్. 71

శ్లో. ప్రతిక్షణ మయం కాయః క్షీయమాణో న లక్ష్యతే,
ఆమకుమ్భ ఇవామ్భస్థో విశీర్ణః సన్ విభావ్యతే. 72

శ్లో. ఆసన్నతరతా మేతి మృత్యుర్జన్తో ర్దినే దినే,
ఆఘాతం నీయమానస్య వధ్యస్యేవ పదే పదే. 73

అను. మరియూ-శరీరం ప్రతిక్షణం అపాయోన్ముఖంగా ఉంటుంది. సంపదలు ఆపదలకు స్థానాలు. కలయికలు ఎడబాటుతో గూడినవి. పుట్టేది అంతా నశించేదే. 71

నీటితో నిండిన పచ్చి మట్టిపాత్ర పూర్తిగా కఱగిన తర్వాతనే తెలుస్తుంది. ముందుగా తెలియదు. (మరణిస్తే తెలుస్తుంది). 72

వధ్యభూమికి తీసికొని పోబడే ప్రాణికివలె ప్రతిప్రాణికి దినదినం మృత్యువు మిక్కిలి దగ్గర అవుతూనే ఉంది. 73

మూ. యతః-

శ్లో. అనిత్యం యౌవనం రూపం జీవితం ద్రవ్యసఞ్చయః,
ఐశ్వర్యం ప్రియసంవాసో ముహ్యే త్తత్ర న పణ్డితః. 74

శ్లో. యథా కాష్ఠఞ్చ కాష్ఠఞ్చ సమేయాతాం మహోదధౌ,
సమేత్య చ వ్యపేయాతాం తద్వద్భూతసమాగమః. 75

శ్లో. యథా హి పథికః కశ్చి చ్ఛాయా మాశ్రిత్య తిష్ఠతి,
విశ్రమ్య చ పునర్గచ్ఛే త్తద్వ ద్భూతసమాగమః. 76

అన్యచ్చ-

శ్లో. పఞ్చభి ర్నిర్మితే దేహే పఞ్చత్వం చ పునర్గతే,
స్వాం స్వాం యోని మనుప్రాప్తే తత్ర కా పరిదేవనా. 77

అను. ఏలనన-యవ్వనం, అందం, జీవితం, కూడబెట్టిన ధనం, ఐశ్వర్యం, ప్రియజనులతోడి సహవాసం-ఇత్యాదులు అన్నీ శాశ్వతం కాదు. అందువల్ల జ్ఞాని అయినవాడు వాటిపై ఆసక్తుడు కారాదు. 74

సముద్రంలో [అలల తాకిడిచే] ఒక కఱ్ఱ ఇంకొక కఱ్ఱా కలుస్తాయి. మరలా అదే అలల తాకిడిచే విడిపోతాయి. అలాగే ప్రాణుల కలయిక (ఎడబాటున్నూ) సంభవిస్తుంది. 75

ఒక బాటసారి (ఎండకు అలసి) ఒక చెట్టుక్రింద చేరి విశ్రమిస్తాడు. అలసట తీరగానే లేచిపోతాడు. అలాగే ప్రాణుల కలయిక అని తలంచాలి. 76

మరియూ-ఈ శరీరం పంచభూతాలచే (వాటి కలయికచే) నిర్మింపబడింది.

మరణం అంటే ఏ భూతతత్త్వం ఆ భూతతత్త్వంలో చేరడమే. అందుకై విచారించడం దేనికి ? 77

శ్లో. యావతః కురుతే జన్తుః సమ్బన్ధా న్మనసః ప్రియాన్,
తావన్తోఽస్య నిఖన్యన్తే హృదయే శోకశఙ్కవః. 78

శ్లో. నాఽయ మత్యన్తసంవాసో లభ్యతే యేన కేనచిత్,
అపి స్వేన శరీరేణ కిముతాఽన్యేన కేనచిత్. 79

అపి చ-

శ్లో. సంయోగోఽహి వియోగస్య సంసూచయతి సమ్భవమ్,
అనతిక్రమణీయస్య జన్మ మృత్యో రివాగమమ్. 80

శ్లో. ఆపాతరమణీయానాం సంయోగానాం ప్రియైః సహ,
అపథ్యానా మివాన్నానాం పరిణామోఽతిదారుణః. 81

అపరం చ-

శ్లో. వ్రజన్తి న నివర్తన్తే స్రోతాంసి సరితాం యథా,
ఆయురాదాయ మర్త్యానాం తథా రాత్ర్యహనీ సదా. 82

అను. మానవుడు తన మనస్సునకు ప్రియమైన సంబంధాలను ఎంత పరిమాణంలో చేస్తాడో, అంత పరిమాణంలో ఆ సంబంధాలు వియోగసమయంలో హృదయశల్యాలై బాధిస్తాయి. 78

ఈ ప్రపంచంలో చిరకాలసహవాసం అనేది ఎవడితోడా సంభవింపదు. తుదకు తన శరీరంతోనే అసంభవం. అలాంటి దశలో ఇతరుడితో ఏమనాలి? 79

మరియూ-సంయోగం అనేది వియోగానికి సూచన అని గ్రహించాలి. అలాగే జన్మ అనేది అవశ్యం సంభవించే మరణానికి స్మారకం అనుకొనాలి. 80

ప్రియజనుల తోడి కలయికలు అపథ్యభోజనాల వలె పైకి అందంగా

కనబడినా వాటి పరిణామాలు అనగా ఎడబాటులు మిక్కిలి దారుణంగా ఉంటాయి 81

ఇంకనూ-నదుల ప్రవాహాలు ముందుకు పోవడమే కాని ఎలా వెనుకకు రావో అలాగే అహోరాత్రాలు ప్రాణుల ఆయువును క్షీణింపజేస్తాయే గాని పెంచవు. 82

శ్లో. సుఖాస్వాదపరో యస్తు సంసారే సత్సమాగమః,
స వియోగావసానత్వాద్ దుఃఖానాం ధురి యుజ్యతే. 83

శ్లో. అత ఏవ హి నేచ్ఛన్తి సాధవః సత్సమాగమమ్,
యద్వియోగాఽసిలూనస్య మనసో నాస్తి భేషజమ్. 84

శ్లో. సుకృతాన్యపి కర్మాణి రాజభిః సగరాదిభిః,
అథ తాన్యేవ కర్మాణి తే చాఽపి ప్రలయం గతాః. 85

అను. ఈ ప్రపంచంలో సజ్జనస్నేహం సుఖమైన రుచి గలదిగా చెప్పబడుతూంది. కాని అదియూ వియోగంవల్ల నశించేది కావడంతో దుఃఖాలలో మొదటగా గణింపబడుతూంది. 83

ఇందువల్లనే సజ్జనులు సజ్జనస్నేహాన్ని సైతం కోరరు. ఏలనన-వారి ఎడబాటుచే ఖండితమైన మనస్సును చక్కదిద్దేందుకు ఔషధం ఏదీ లేదు. 84

సగరుడు మొదలైన చక్రవర్తులు ఎన్నో పుణ్యకార్యాలు చేశారు. కాని వారు నశించారు. వారి పుణ్యకార్యాలు నశించాయి. (కర్త మరియూ కర్మ రెండూ నశించాయి). 85

శ్లో. సఞ్చిన్త్య సఞ్చిన్త్య తముగ్రదణ్డం
మృత్యుం మనుష్యస్య విచక్షణస్య,
వర్షామ్బుసిక్తా ఇవ చర్మబన్ధాః
సర్వే ప్రయత్నాః శిథిలీభవన్తి. 86

శ్లో. యామేవ రాత్రిం ప్రథమా ముపైతి
గర్భే నివాసం నరవీర ! లోకః,

తతః ప్రవృ త్యస్ఖలితప్రయాణః
స ప్రత్యహం మృత్యుసమీప మేతి. 87

అను. విద్వాంసుడైన మానవుడు భయంకరశిక్షారూపమైన మరణాన్ని గూర్చి (దాన్ని జయించేందుకై) మాటిమాటికి ఆలోచించాడు. కాని అతడి ప్రయత్నాలు అన్నీ వర్షాజలంచే తడిసి ఉబ్బిన చర్మం కుట్టవలె నిరుపయోగాలు అయినాయి. అనగా మృత్యువిజయం ఎవ్వరికీ సాధ్యం గాదు-అని భావం. 86

ఓ రాజా! ఏ మొదటిరాత్రిని గర్భంలో ప్రాణి పడినాడో అప్పటినుండియే అతను ప్రతిదినం జారని గమనంతో మరణసమీపం పోతూ ఉన్నాడు. 87

మూ. అథ సంసారం విచారయ; శోకోఽయ మజ్ఞానస్య ప్రపఞ్చః. పశ్య-

శ్లో. అజ్ఞానం కారణం న స్యాద్ వియోగో యది కారణమ్,
శోకో దినేషు గచ్ఛత్సు వర్ధతా మపయాతి కిమ్. 88

తద్ భద్ర! తద్ ఆత్మాన మనుసన్ధేహి, శోకచర్చాం చ పరిహార. యతః-

శ్లో. అకాణ్డపాతజాతానాం గాత్రాణాం మర్మభేదినామ్,
గాఢశోకప్రహారాణా మచిన్తైవ మహౌషధమ్. 89

అను. ఇక సంసారవిషయం విచారింపుము. ఈ దుఃఖం అంతా అజ్ఞానం యొక్క విస్తృతియే. చూడుము-

దుఃఖానికి కారణం అజ్ఞానం కాక వియోగమే (ఎడబాటే), అయితే, దినాలు గడచినచో దుఃఖం వృద్ధి పొందవలసి ఉంటుంది. కానీ మెల్లమెల్లగా దుఃఖం తగ్గుతూనే ఉంది. అందుచే అజ్ఞానమే దుఃఖానికి కారణం. 88

కనుక ఓ శుభమూర్తీ! ఆత్మను అన్వేషింపుము. దుఃఖచర్చను వదలివేయుము. ఏలనన-

ఆకస్మికంగా వచ్చిపడేవీ, శరీరమర్మస్థలాలను భేదించేవీ అయిన గాఢ

దుఃఖాలనే గాయాలకు శ్రేష్ఠమైన ఔషధం ఏమిటంటే-ఆ దుఃఖాలను తలంచక ఉండడమే. అనగా దుఃఖాలను మాటిమాటికి తలంచడంవల్ల దుఃఖం పెరుగుతుందే గాని తగ్గదు. 89

మూ. తత స్తద్వచనం నిశమ్య ప్రబుద్ధ ఇవ కౌణ్డిన్య ఉత్థాయా ఒబ్రవీత్-'తదల మిదానీం గృహనరకవాసేన, వనమేవ గచ్ఛామి'.

కపిలః పునరాహ-

శ్లో. వనేఒపి దోషాః ప్రభవన్తి రాగిణాం
గృహేఒపి పఞ్చేన్ద్రియనిగ్రహ స్తపః,
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే
నివృత్తరాగస్య గృహం తపోవనమ్. 90

యతః-

శ్లో. దుఃఖితోఒపి చరే ద్ధర్మం యత్ర కుత్రాఒఒశ్రమే రతః,
సమః సర్వేషు భూతేషు న లిఙ్గం ధర్మకారణమ్. 91

అను. అప్పుడు కౌండిన్యుడు అతడి మాటలు వినగానే నిద్రనుండి మేల్కొన్నవాడు వలె లేచాడు. ఇలా అన్నాడు-'ఈ సంసారం అనే నరకంలో నివసించడం ఇక చాలు. అడవికే పోతాను".

అది విని కపిలుడు మరలా ఇలా చెప్పాడు-

విషయవాసన గలవారికి అడవికిపోయినా కామక్రోధాదిదోషాలు సంభవిస్తాయి. పంచేంద్రియాలను నిగ్రహించినవారికి ఇంటిలో ఉన్నా తపస్సు చేయగలరు. అనగా వారు తాపసులే. శాస్త్రంచే నిందింపబడని (శాస్త్రసమ్మతమైన) కర్మలు ఆచరిస్తూ విషయవాసనలు వదలి చరించేవాడికి ఇల్లే తపోవనం. 90

ఏలనన-ఏ ఆశ్రమంలో ఉన్నా సర్వప్రాణులయందు సమబుద్ధిగలవాడై దుఃఖావస్థలోనూ ధర్మాన్ని ఆచరించాలి. అంతేగాని సంన్యాసాదివేషాలు ధర్మకారణాలు గాజాలవు. 91

మూ. ఉక్తఞ్చ-

శ్లో. వృత్త్యర్థం భోజనం యేషాం సన్తానార్థఞ్చ మైథునమ్,
వాక్ సత్యవచనార్థాయ దుర్గాణ్యపి తర న్తి తే. 92

తథాహి-

శ్లో. ఆత్మానదీ సంయమపుణ్యతీర్థా
సత్యోదకా శీలఘటా దయోర్మిః,
తత్రాభిషేకం కురు పాణ్డుపుత్ర !
న వారిణా శుధ్యతి చాన్తరాత్మా. 93

అను. విజ్ఞులు ఇలా అన్నారు-జీవించడానికై భుజించేవారూ, సంతానం కొఱకై దాంపత్యం అనుభవించేవారూ, సత్యరక్షణకై భాషించేవారూ అయిన మహాత్ములు (మాత్రమే) కష్టాలను తరిస్తారు. 92

మరియూ మహాభారతంలో భీష్ముడు ధర్మరాజుకు ఇలా బోధించాడు-

ఓ పాండునందనా ! ఈ ఆత్మయే ఒక నది. సంయమజీవితమే ఇందలి పుణ్యతీర్థప్రదేశం. సత్యమే జలం. శీలమే తీరం. దయయే తరంగములు. ఈ విధమైన పుణ్యనదిలో స్నానం చేస్తే అంతరాత్మ పవిత్రం అవుతుంది. కేవలం బాహ్యజలంచే శుద్ధం గాదు. 93

మూ. విశేషతశ్చ-

శ్లో. జన్మ-మృత్యు-జరా-వ్యాధి-వేదనాభి రుపద్రుతమ్,
సంసార మిమ మత్యన్త మసారం త్యజతః సుఖమ్. 94

యతః-

శ్లో. దుఃఖమేవాస్తి న సుఖం యస్మాత్త దుపలక్ష్యతే,
దుఃఖార్తస్య ప్రతీకారే సుఖసంజ్ఞా విధీయతే. 95

ముఖ్యంగా పుట్టడం, చావడం, రోగం, ముసలితనం, బాధలు ఇత్యాదికంచే నిండిన ఈ సారహీనమైన ప్రపంచాన్ని విడవడమే సుఖం. 99

ఏలనన-ఈ ప్రపంచంలో దుఃఖమే ఉంది. సుఖం లేదు. అందుచే అంతటా దుఃఖమే కనబడుతుంది. దుఃఖం తొలగించుకొనేందుకు చేసే ప్రయత్నానికే సుఖం అనే పేరు పెట్టబడుతూంది''. 95

మూ. కౌణ్డిన్యో బ్రూతే-'ఏవమేవ'. తతోఽహం తేన శోకాఽఽకులేన బ్రాహ్మణేన శప్తో యద్-'అద్యాఽఽరభ్య మణ్డూకానాం వాహనం భవిష్యసి' ఇతి. కపిలో బ్రూతే-'సమ్ప్రత్యుపదేశాఽ సహిష్ణు ర్భవాన్. శోకాఽఽవిష్టం తే హృదయమ్. తథాపి కార్యం శృణు-

శ్లో. సఙ్గః సర్వాత్మనా త్యాజ్యః స చేత్ త్యక్తుం న శక్యతే,
స సద్భిః సహ కర్తవ్యః సతాం సఙ్గో హి భేషజమ్. 96

అన్యచ్చ-

శ్లో కామః సర్వాత్మనా హేయః స చే ద్ధాతుం న శక్యతే,
స్వభార్యాం ప్రతి కర్తవ్యః సైవ తస్య హి భేషజమ్. 97

అను. కౌండిన్యుడు-'అలాగే' అని అన్నాడు. పిమ్మట పుత్రశోకంచే పీడితుడైన ఆ కౌండిన్యుడు-'నీవు నేటినుండి కప్పలకు వాహనం అయ్యెదవు'' అని నన్ను శపించాడు.

అంత కపిలుడు కౌండిన్యుడితో ఇలా అన్నాడు.-'ప్రస్తుతం అశాంతితో ఉన్నావు. అందుచే ఉపదేశం గ్రహించడానికి అయోగ్యుడవు. అయినా నీకు కర్తవ్యం బోధిస్తాను. విను-

సంసర్గం (సంబంధం) ఏదైనా ఈ ప్రపంచంలో విడవదగిందే. కాని దాన్ని పూర్తిగా విడువడానికి వీలుగానిచో మంచివారితో చేయాలి. ఏలనన సజ్జన స్నేహమే సంసారరోగాలకు మంచి ఔషధం. 96

మరియూ-అలాగే కామవాసనయూ పూర్తిగా విడువదగిందే. అది పూర్తిగా విడువడానికి వీలుగానిచో భార్యద్వారా కామాన్ని తీర్చుకోవచ్చును. భార్యయే కామానికి తగిన ఔషధం. 97

మూ. ఏతచ్ఛ్రుత్వా స కౌణ్డిన్యః కపిలోపదేశామృత-ప్రశాన్త-

శోకాఽఽకులో యథావిధి దణ్డగ్రహణ మకరోత్, అతో బ్రాహ్మణ-శాపా న్మణ్డూకాన్ వోఢు మత్ర తిష్ఠామి". ఇతి. అనన్తరం తేన మణ్డూకేన గత్వా మణ్డూకనాథస్య జాలపాదనామ్నోఽగ్రే తత్ కథితమ్. తతోఽసా వత్రాఽఽగత్య మణ్డూకనాథ స్తస్య సర్పస్య పృష్ఠ మారూఢవాన్. స చ సర్ప స్తం పృష్ఠే కృత్వా చిత్రపదక్రమం బభ్రామ.

అను. కౌండిన్యుడు కపిలుడి వాక్కులను విన్నాడు. వెంటనే అమృత వర్షంవంటి ఆ వాక్కులచే అతడి హృదయతాపం చల్లారిపోయింది. అందుచే అతను సంసారం వదలి సంన్యాసం స్వీకరించాడు అంతట నేను (సర్పమును అయిన నేను) బ్రాహ్మణశాపాన్ని అనుసరించి కప్పలను మోయడానికై ఇచ్చట ఉన్నాను.'

సర్పం చెప్పిన ఈ విషయం అంతా విన్నది ఆ కప్ప. వెంటనే అది కప్పల రాజు అయిన జాలపాదుడివద్దకు పోయింది. ఈ సంగతినంతా అతడితో చెప్పింది. తోడనే జాలపాదుడు (కప్పలరాజు) సర్పంవద్దకు వచ్చాడు. సంతోషంతో ఆ పాముయొక్క పీపుమీదికి ఎక్కాడు. అప్పుడు ఆ పాము ఆ మండుకరాజును క్రిందపడకుండ సావధానంగా బహువిధచిత్రగమనాలతో త్రిప్పింది.

మూ. పరేద్యు శ్చలితు మసమర్థం తం మణ్డూకనాథోఽవదత్-'కిమద్య భవాన్ మన్దగతిః. సర్పో బ్రూతే-'దేవ! ఆహారవిరహా దస మర్థోఽస్మి

మణ్డూకనాథోఽవదత్-'అస్మదాజ్ఞయా మణ్డూకాన్ భక్షయ'. తతః స సర్పః-'గృహీతోఽయం మహాప్రసాదః'-ఇత్యుక్త్వా క్రమశో సర్వాన్ మణ్డూకాన్ ఖాదితవాన్. అథ నిర్మణ్డూకం సరో విలోక్య మణ్డూకనాథోఽపి తేన ఖాదితః. అతోఽహం బ్రవీమి-'స్కన్ధేనాఽపి వహే చ్ఛత్రుమ్'-ఇత్యాది.

అను. మరుదినం కదలే బలం లేని ఆ పామును కప్పలరాజు చూచాడు-'ఎందుకు ఇలా మెల్లమెల్లగా నడుస్తున్నావు. 'అని అడిగాడు. అందుకు పాము-'దేవ! తిండి లేక బలహీనంగా ఉన్నాను' అని చెప్పింది. అందుకు కప్పలరాజు-

'అయితే మా ఆజ్ఞచే కప్పలను తినుము' అని చెప్పాడు. 'తమ అనుగ్రహం పొందాను' అని పాము వరుసగా కప్పలను అన్నింటినీ తినివేసింది. కొలనులో కప్పలు లేకపోయేసరికి కప్పలరాజును సైతం భక్షించింది. అందుచే నేను (మేఘవర్ణుడు- అనే కాకిని) చెప్పుతున్నాను. 'శత్రువును అవసరంకొద్దీ భుజంపై ఉంచుకొని మోయాలి- ఇత్యాది (౧౧౭వ పద్యభావం చూడుడు).

మూ. దేవ! యాత్విదానీం పురావృత్తాన్తకథనమ్. సర్వథా సన్ధే యోఽయం హిరణ్యగర్భో రాజా, సన్ధీయతామ్ ఇతి మే మతిః' ఇతి.

రాజోవాచ-'కోఽయం భవతో విచారః. యతో జిత స్తావదయ మస్మాభిః. తతో యద్యస్మత్సేవయా వసతి, తదాస్తామ్. నో చే ద్విగృ హ్యతామ్".

అత్రాన్తరే జమ్బూద్వీపా దాగత్య శుకేనోక్తమ్-'దేవ! సింహల ద్వీపస్య సారసో రాజా సమ్ప్రతి జమ్బూద్వీప మాక్రమ్యావతిష్ఠతే' ఇతి. రాజా ససమ్భ్రమం బ్రూతే-'కిం కిమ్?' శుకః పూర్వోక్తం కథ యతి.

అను. ప్రభూ! గడిచిన విషయాలు చెప్పుకోడం వదలివేస్తాం. అన్ని విధాలా ఈ హిరణ్యగర్భుడు అనే రాజు సంధికి యోగ్యుడు. కనుక సంధి చేసి కొనడం మంచిది అని నా భావం'.

అది విని రాజు (చిత్రరథుడు) ఇలా అన్నాడు. 'నీకు ఈ విచారం దేనికి? ఇతణ్ణి మనం జయించాం. మనల్ని సేవిస్తూ (మన అధీనంలో) ఉండేటట్లయితే ఉండనిస్తాం, లేకుంటే యుద్ధం చేస్తాం."

ఇంతలో జంబూద్వీపంనుండి చిలుక వచ్చింది. ప్రభువుతో ఇలా విన్న వించింది. 'దేవా! సింహలద్వీపరాజైన సారసపక్షి జంబూద్వీపంపై దాడి చేసింది. కోటను ముట్టడించింది.'

రాజు చిలుక చెప్పింది విన్నాడు. సంభ్రమం (తొట్రుపాటు) పొందాడు. ఇలా అడిగాడు 'ఏమేమి చెప్పుతున్నావు?' చిలుక పూర్వం వాక్కునే మరల చెప్పింది.

గృధ్రః స్వగత మువాచ-'సాధు రే చక్రవాకమన్త్రిన్! సాధు!'
రాజా సకోప మాహ-'ఆస్తాం తావదయం, గత్వా తమేవ సమూల మున్మూలయామి.'

దీర్ఘదర్శీ విహస్యాహ-

శ్లో. న శరన్మేఘవత్కార్యం వృథైవ ఘనగర్జితమ్,
పరస్యార్థ మనర్థం వా ప్రకాశయతి నో మహాన్. 98

అపరఞ్చ-

శ్లో. ఏకదా న విగృహ్ణీయాత్ బహూన్ రాజాభిఘాతినః,
సదర్పోఽప్యురగః కీటై ర్బహుభి ర్నాశ్యతే ధ్రువమ్. 99

అను. గ్రద్ద తనలో ఇలా తలంచింది-'సెస్స షెబాష్ ఓ చక్రవాక మంత్రీ! సెబాష్! రాజు కోపంతో ఇలా అన్నాడు - 'ఇతను ఇలానే ఉండనీ, అచ్చటికి పోయి అతన్నే సమూలంగా నాశం చేస్తాం'. అది విని దీర్ఘదర్శి(మంత్రి) నవ్వి ఇలా అన్నాడు.'శరత్కాలమేఘం వలె నిష్ప్రయోజనమైన గర్జనలు చేయరాదు. గొప్పవారు ఇతరుడికి తాము చేసే మంచినిగాని చెడ్డనుగాని ముందుగ ప్రకటింపరు. 9

మరియూ- ఒకేసారి దాడిచేసే శత్రువు లందరితో ఎప్పుడూ యుద్ధం చేయరాదు. ఎంతటి బలగర్వం గల పాము అయినా పెక్కుచీమలచే చంపబడుతూంది. ఇది పరమసత్యవిషయం. 99

మూ. దేవ! కిమితి వినా సన్ధానం గమనమస్తి? యత స్తదాస్మాకం పశ్చాత్ ప్రకోపోఽనేన కర్తవ్యః.

అపరఞ్చ-

శ్లో. యోఽర్థతత్త్వ మవిజ్ఞాయ క్రోధస్యైవ వశం గతః,
స తథా తప్యతే మూఢో బ్రాహ్మణో నకులాద్యథా. 100

రాజాహ-'కథమేతత్' -దూరదర్శీ కథయతి-

అను. దేవా ! ఇచ్చట సంధిని చేసికొనకుండా అచ్చటికి పోవడం ఉచితమా ? అలా చేస్తే (సంధి చేసికొనకపోతే) ఇతను వెనుకనుండి మనపై దాడి చేయవచ్చును.

మరియూ-ఎవడు కార్యంయొక్క అవస్థను పరిస్థితిని గుర్తింపక కేవలం క్రోధానికి లొంగి ప్రవర్తిస్తాడో ఆ మూర్ఖుడు ముంగిసను చంపిన బ్రాహ్మణుడు వలె దుఃఖిస్తాడు.

రాజు అడిగాడు - 'అది ఎట్లు ?'

మంత్రి ఇలా చెప్ప నారంభించాడు-

## 12. బ్రాహ్మణ-నకులకథ

### (బ్రాహ్మణుడు-ముంగిస కథ)

మూ. అస్త్యుజ్జయిన్యాం మాధవో నామ విప్రః. తస్య బ్రాహ్మణీ ప్రసూతా సా బాలాపత్యస్య రక్షార్థం బ్రాహ్మణ మవస్థాప్య స్నాతుం గతా. అథ బ్రాహ్మణాయ రాజ్ఞః పార్వణశ్రాద్ధం దాతు మాహ్వాన మాగతమ్. తచ్ఛ్రుత్వా బ్రాహ్మణోఽపి సహజదారిద్ర్యా దచిన్తయత్-'యది సత్వరం న గచ్ఛామి తదాఽన్యః కశ్చి చ్ఛ్రుత్వా శ్రాద్ధం గ్రహీష్యతి. యతః-

శ్లో. ఆదేయస్య ప్రదేయస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్ర మక్రియమాణస్య కాలః పిబతి తద్రసమ్. 101

అను. ఉజ్జయినీనగరంలో మాధవుడు అనే బ్రాహ్మణుడు కలడు. అతడి భార్య నవప్రసూత. శిశువువద్ద భర్తను రక్షణగా ఉంచి ఆ బ్రాహ్మణి స్నానం చేయడానికి పోయింది. ఇంతలో పార్వణ (పుణ్యకాల) శ్రాద్ధం రాజు ఇవ్వదలచి

ఆహ్వానం పంపాడు. పుట్టుకతో దరిద్రుడైన ఆ బ్రాహ్మణుడు ఆ వార్త విని ఇలా తలంచాడు-'వెంటనే పోనిచో ఈ వార్త విని మఱియొకడు పోవచ్చును. ఏలనన— ఇవ్వడం తీసుకొనడం మొదలైన కర్తవ్యకార్యాలను వెంటనే చేయాలి. అలా చేయనిచో అందలి సారస్యాన్ని కాలం పానంచేస్తుంది. అనగా ఆలస్యంవల్ల ఆ కార్యంలోని అందం నశిస్తుంది. లేక ఆ కార్యమే చెడిపోతుంది' అని భావం. 101

మూ. కిం తు బాలకస్యాఽత్ర రక్షకో నాస్తి. తత్ కిం కరోమి యాతు. చిరకాలపాలిత మిమం నకులం పుత్రనిర్విశేషం బాలకరక్షా యాం వ్యవస్థాప్య గచ్ఛామి'-ఇత్యేవం మత్వా తథా కృత్వా గతః. తత స్తేన నకులేన బాలకసమీప మాగచ్ఛన్ కృష్ణసర్పో దృష్టః. వ్యాపాద్య కోపాత్ ఖణ్డం కృత్వా భక్షితశ్చ. తతోఽసౌ నకులో బ్రాహ్మణ మాయాన్త మవలోక్య రక్తవిలిప్తముఖపాదః సత్వర ముపగమ్య తచ్చ రణయో ర్లులోఠ. అథ స విప్ర స్తథావిధం తం దృష్ట్వా-'మమ బాల కోఽనేన ఖాదితః' ఇత్యవధార్య నకులం వ్యాపాదితవాన్. అనన్తరం యావ దుపసృత్యాపత్యం పశ్యతి బ్రాహ్మణ స్తావద్బాలకః సుస్థః స్వపితి. సర్పశ్చ వ్యాపాదిత స్తిష్ఠతి. తత స్త ముపకారకం నకులం నిరీక్ష్య భావితచేతాః స బ్రాహ్మణః పరం విషాద మగమత్. అతోఽహం బ్రవీమి-'యోఽర్థతత్వ మవిజ్ఞాయ'-ఇత్యాది.

కాని బాలుణ్ణి రక్షించేందుకు ఎవరూ లేరు. ఏమి చేయాలి? కానిమ్ము, చాలకాలంగా పుత్రుడితో సమానంగా పోషించబడిన ఈ ముంగిస ఉంది. పిల్ల వాణ్ణి రక్షించేందుకు ఈ ముంగిసను ఉంచి నేను పోతాను. ఇలా తలంచి అలాగే ముంగిసను రక్షణగా ఉంచాడు. తాను (పార్వణశ్రాద్ధం గ్రహించేందుకు) పోయాడు. పిమ్మట ఆ ముంగిస బాలుడివద్దకు వచ్చే నల్లత్రాచును చూచింది. కోపంతో దానిపై దుమికింది. ముక్కలుముక్కలుగా కొఱికి చంపివేసింది. దాన్ని కొంతభాగం తినివేసిందికూడ. తర్వాత వీథిప్రక్క చూచింది. బాపడు ఇంటికి వస్తూ కనబడ్డాడు. సంతోషంతో ఆ ముంగి వేగంగా పోయి ఆ బ్రాహ్మణుడి కాళ్ళపైబడి పొరలాడసాగింది. అప్పుడు బ్రాహ్మణుడు ఆ ముంగి ముఖం, పాదాలు నెత్తుటిచే ఎఱ్ఱగా ఉండడం చూచాడు-'ఇది బాలుణ్ణి తినివేసింది' అని

తలంచాడు-కోపంతో దాన్ని చంపివేశాడు. తర్వాత ఇంటిలోనికి వచ్చి చూచాడు. బాలుడు హాయిగా (ఉయ్యలలో) నిద్రపోతున్నాడు. సమీపంలో చచ్చిన పాము యొక్క అవశేషాలు ఉన్నాయి. ముంగిస చేసిన ఉపకారం అర్థం చేసుకున్నాడు ఆ బ్రాహ్మణుడు. తన తొందరపాటును గ్రహించాడు. మిక్కిలి దుఃఖించాడు. అందువల్ల నేను (దూరదర్శి-మంత్రిని) చెప్పుతూన్నాను. ఏ విషయాన్నిగాని సరిగా అర్థంచేసుకొనక క్రోధం పొందేవాడు-ఇత్యాదిగ (100వ శ్లోకభావం చూడుడు)

మూ. అపరఞ్చ-

శ్లో. కామః క్రోధ స్తథా మోహో లోభో మానో మద స్తథా,
షడ్వర్గ ముత్సృజే దేన మస్మిన్ త్యక్తే సుఖీ నృపః. 102

రాజాఽఽహ-'మన్త్రిన్ ! ఏష తే నిశ్చయః ? మన్త్రీ బ్రూతే-'ఏవ మేవ. యతః-

శ్లో. స్మృతి స్తత్పరతాఽర్థేషు వితర్కో జ్ఞాననిశ్చయః,
దృఢతా మన్త్రగుప్తిశ్చ మన్త్రిణః పరమో గుణః. 103

తథా చ-

శ్లో. సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదమ్,
వృణతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః.

తద్దేవ! యదీదానీ మస్మద్వచనం క్రియతే, తదా సన్ధాయ గమ్యతామ్. యతః-

శ్లో. యద్యప్యుపాయా శ్చత్వారో నిర్దిష్టాః సాధ్యసాధనే,
సంఖ్యామాత్రం ఫలం తేషాం సిద్ధిః సామ్ని వ్యవస్థితా. 105

అను. మరియూ - ప్రభువు అయినవాడు - కామం, క్రోధం, లోభం, మోహం, అభిమానం, మదం, అనే ఈ ఆరు దుర్గుణాలను పరిత్యజించాలి. ఇలా విడిచిననే సుఖవంతు డవుతాడు."

రాజు - 'మంత్రీ ఇదియేనా నీ నిశ్చయం" - అని అడిగాడు. అందుకు మంత్రి ఇలా చెప్పాడు - 'ఇదియే; ఏలననగా -

జ్ఞాపకశక్తి, కార్యతత్పరత, కార్యపరిశీలనాజ్ఞానం, నిశ్చయజ్ఞానం, దృఢత, మంత్రరక్షణ, అనే ఈ ఆరు మంత్రికి ఉండదగిన ఉత్తమగుణాలు. 103

మరియూ - ఏ పనినీ తొందరపడి చేయరాదు. అవివేకం (అవిచారణ) అన్ని ఆపదలకు ముఖ్యకారణం. సద్గుణములందు ఆసక్తిగల సంపదలు, ఆలోచనతో కార్యం చేసే పురుషుణ్ణి స్వయంగా వరించి వచ్చి చేరుతాయి. 103

కనుక ప్రభూ ! ఇప్పుడు నా మాటను మన్నింతురేని సంధి చేసికొనిపోవడం సముచితం. ఏలనన -

కార్యసాధనకు సామ - దాన - భేద - దండాలు అని నాల్గు ఉపాయాలు చెప్పబడినా - అందు కార్యసిద్ధిమాత్రం సామంలోనే ఉంది. తక్కినవి మూడు కేవలం సంఖ్యాపూర్తికే అనవచ్చును."

మూ. రాజాఽఽహ - "కథమేవం సత్వరం సంభావ్యతే ?
మన్త్రీ బ్రూతే - "దేవ సత్వరం సమ్భవిష్యతి. యతః -

శ్లో. మృద్ఘటవత్ సుఖభేద్యో దుఃసన్ధానస్తు దుర్జనో భవతి,
సుజనస్తు కనకఘటవద్ దుర్భేద్య శ్చాశుసన్ధేయః. 106

శ్లో. అజ్ఞః సుఖమారాధ్యః సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాఽపి నరం న రఞ్జయతి. 107

అను. అది విని రాజు అడిగాడు - 'అయితే ఇలా సంధి ఇంత తొందరగా ఎలా సంభవిస్తుంది ? అందుకు మంత్రి ఇలా సమాధానం చెప్పాడు - "ప్రభూ ! త్వరగానే సంభవిస్తుంది. ఏలనన -

దుర్జనుడి స్నేహం మట్టిపాత్రవలె తేలిగ్గా ధ్వంసం అవుతుంది. సంధించడంమాత్రం కష్టం. సజ్జనుడి స్నేహం స్వర్ణపాత్రవలె తేలిగ్గా పగలదు (చెడిపోదు). ఒకవేళ వికటించినా మరల సులభంగా సంధింపబడుతుంది. 106

మూర్ఖుణ్ణి తేలిగ్గా స్వాధీనం చేసుకోవచ్చును. వివేకవంతుణ్ణి మిక్కిలి తేలికగా స్వాధీనపఱచుకోవచ్చును. కానీ అల్పజ్ఞానంచే మిడిసిపడే అహంకారిని బ్రహ్మదేవుడుసైతం సంతోషపరచలేడు. 107

మూ. విశేషతశ్చాయం ధర్మజ్ఞో రాజా, సర్వజ్ఞో మంత్రీ చ. జ్ఞాతమేతన్మయా పూర్వం మేఘవర్ణవచనాత్ తత్కృతకార్యసందర్శనాచ్చ యితః -

శ్లో. కర్మానుమేయాః సర్వత్ర పరోక్షగుణవృత్తయః,
తస్మాత్ పరోక్షవృత్తీనాం ఫలైః కర్మానుభావ్యతే." 108

రాజాఽఽహ - "అలమల ముత్తరోత్తరేణ, యథాఽభిప్రేత మనుష్ఠీయతామ్" ఇతి. ఏతన్మన్త్రయిత్వా గృధ్రో మహామన్త్రీ - "తత్ర యథార్హం కర్తవ్యమ్" ఇత్యుక్త్వా [సన్ధివిషయకసమ్భాషణాయ] దుర్గాభ్యన్తరం చలితః.

అను. విశేషించి ఈ రాజైన హిరణ్యగర్భుడు, అతడి మంత్రి అయిన సర్వజ్ఞుడు మిక్కిలి ధర్మజ్ఞానులు. ఈ విషయాన్ని నేను మేఘవర్ణుడి వాక్కుల వల్లను వారిరువురూ చేసిన ఇతరసత్కార్యాలవల్లనూ గ్రహించాను. ఏలనన -

కన్నులకు కనబడనివారియొక్క గుణం స్వభావం వారి పనులద్వారా **అంతటా ఊహింపబడును. అందువల్ల** కనబడనివారు (పరోక్షస్థులు) చేసే పనులు **వాటి ఫలితాలచేతనే ఊహింపబడుతాయి."** అప్పుడు రాజు - "ఈవాదవివాదాలు చాలు మీకు సమ్మతమైనట్లు చేయండి" అన్నాడు.

అంతట మహామంత్రి రాజునకు తగిన సందేశం (సలహా) ఇచ్చాడు - [సంధివిషయమై సంభాషించేందుకు] హిరణ్యగర్భుడి కోటలోనికి వెళ్ళాడు.

మూ. తతః ప్రణిధిబకేనాఽఽగత్య రాజ్ఞో హిరణ్యగర్భస్య నివేదితమ్. 'దేవ! సన్ధిం కర్తుం మహామన్త్రీ గృధ్రోఽస్మత్సమీప మాగచ్ఛతి. రాజహంసో బ్రూతే-'మన్త్రిన్! పున రభిసన్ధినా కేనచిదత్రాఽఽగమనమ్' ఇతి. సర్వజ్ఞో విహస్యాఽఽహ-'దేవ! న శఙ్కాఽఽస్పద మేతత్ యతోఽసౌ మహాశయో దూరదర్శీ. అథవా స్థితిరియం మన్దమతీనామ్. కదాచిచ్ఛఙ్కైవ న క్రియతే. కదాచి త్సర్వత్ర శఙ్కా. తథాహి-

శ్లో. సరసి బహుశస్తారాచ్ఛాయే క్షణాత్ పరివఞ్చితః
కుముదవిటపాన్వేషీ హంసో నిశా స్వవిచక్షణః,
న దశతి పున స్తారాఽఽశఙ్కీ దివాఽపి సితోత్పలం
కుహకచకితో లోకః సత్యేఽప్యపాయ మపేక్షతే. 109

శ్లో. దుర్జనదూషితమనసః సుజనేష్వపి నాస్తి విశ్వాసః,
బాలః పాయసదగ్ధో దధ్యపి ఫూత్కృత్య భక్షయతి. 110

తద్దేవ! యథాశక్తి తత్పూజార్థం రత్నోపహారాదిసామగ్రీ సుసజ్జీ క్రియతామ్' ఇతి.

అను. అప్పుడు (అచ్చట) ముఖ్యగు ప్రచరుడైన కొంగ ప్రభువైన హిరణ్య గర్భుడివద్దకు వచ్చింది. ఇలా విన్నవించింది -"ప్రభూ !సంధిని చేసేందుకై మహా మంత్రి అయిన గ్రద్ద మనవద్దకు వస్తున్నాడు.

అది విని హిరణ్యగర్భుడు ఇలా అన్నాడు - "మంత్రీ ! ఈ గ్రద్ద మనలను ఏదో మోసం చేయడానికి ఇచ్చటికి వస్తూ ఉండొచ్చు". అందుకు సర్వజ్ఞుడు అనే ఆ మంత్రి నవ్వి ఇలా బదులు పల్కాడు - "ప్రభూ ! ఇందు సందేహింపవలసిన దేదీ లేదు. ఏలనన - ఈ దూరదర్శి అనే మంత్రి మిక్కిలి ఉదారబుద్ధి గలవాడ అయినా మందబుద్ధుల స్వభావం ఇలాగే ఉంటుంది. వారు కొన్నిచోట్ల సందేహమే పొందరు. కొన్నియెడల ప్రతిదాన్నీ సందేహిస్తూనే ఉంటారు.

ఏలనన - మందబుద్ధి గల హంస రాత్రులందు కలువలను వెదకుతూ అధికంగా కనబడే నక్షత్రాల నీడను చూచి (ఆ నీడను కలువలు అని భావించి) మోసపోయింది. అలా మోసపోయిన హంస పగటి కమలమును (తెల్లతామరను) చూచియూ నక్షత్రభావనచే ఆ తెల్లకమలాన్ని భక్షింపదు. ఏలనన - ఒకసారి కపటవ్యవహారంచే మోసపోయిన జనం సత్యవస్తువునందునూ అనిష్టాన్నే శంకి స్తుంది. 109

దుర్జనులవలన వంచితమైన మనస్సు సజ్జనులనుసైతం విశ్వసింపదు. వేడి పాలను త్రాగబోయి నాల్క గాల్చుకొన్న బాలుడు పెరుగునుసైతం ఊది ఊది తింటాడు. 110

కనుక ప్రభూ![సందియం విడువండి] అతణ్ణి యథాశక్తి సత్కరించేందుకై రత్నాదిసామగ్రిని సిద్ధం చేయించండి."

మూ. తథాఽనుష్ఠితే సతి స గృధ్రో మంత్రీ దుర్గద్వారా చక్రవాకేణోపగమ్య సత్కృత్వాఽఽనీయ రాజదర్శనం కారితో దత్తాసనే చోపవిష్టః. తత శ్చక్రవాక ఉవాచ - "మన్త్రిన్ ! యుష్మదాయత్తం సర్వమ్. స్వేచ్ఛయోపభుజ్యతామ్. రాజహంసో బ్రూతే - "ఏవమేవ దూరదర్శీ కథయతి-"ఏవమేవైతత్. కిన్త్విదానీం బహుప్రపఞ్చవచనం నిష్ప్రయోజనమ్. యతః-

శ్లో. లుబ్ధ మర్థేన గృహ్ణీయాత్ స్తబ్ధ మఞ్జలికర్మణా,
మూర్ఖం ఛన్దానురోధేన యాథాతథ్యేన పణ్డితమ్. 111

అన్యచ్చ -

శ్లో. సద్భావేన హరేన్మిత్రం సమ్భ్రమేణ తు బాన్ధవాన్,
స్త్రీభృత్యౌ దానమానాభ్యాం దాక్షిణ్యేనేతరాన్ జనాన్. 112

తదిదానీం స్నాతుం గమ్యతామ్. మహాప్రతాప శ్చిత్రవర్ణో రాజా' ఇతి.

అను. అంత అలాగే సన్మానసామగ్రిని సిద్ధం చేశారు. హిరణ్యగర్భుడి మంత్రి అయిన చక్రవాకం కోటద్వారంవరకు ఎదురేగింది. చిత్రవర్ణుడి మంత్రియైన గ్రద్దకు స్వాగతం పల్కి సత్కరించింది. తనవెంట తీసుకొని వచ్చి రాజదర్శనం చేయించింది. సముచితమైన ఆసనంపై కూర్చుండచేసింది. సగౌరవంగా ఇలా పల్కింది - "మంత్రివరా !" ఇదంతా మీ అధీనంలో ఉంది. స్వేచ్ఛగా అనుభవించండి. అంత రాజహంసుడునూ [మంత్రివాక్కును సమర్థిస్తూ] 'అలాగే' అన్నాడు. అప్పుడు దూరదర్శి [గ్రద్దపేరు] ఇలా పల్కాడు - "మీరు చెప్పింది సరిగానే ఉంది. కాని ఇప్పుడు అధికంగా విస్తరించి మాట్లాడడం నిరుపయోగం. ఏలనన -

లోభివాణ్ణి ధనంచేత, అభిమానిని (గర్వితుణ్ణి) చేతులు జోడించి, మూర్ఖుణ్ణి వాని కోరికప్రకారం ప్రవర్తిల్లి, పండితున్ని సత్యంచే అనుకూలుణ్ణి చేసికొనాలి.

మరియూ - మిత్రుణ్ణి మంచితనంచే, బంధువులను ఆదరసత్కారాదులచే, స్త్రీలను సేవకులనూ అభిమతవస్తుదానం సన్మానం అనే క్రియలచే, ఇతరులను ఉదారతచే (సామ్యభావంచే) ఆకర్షించి తనవారిగా చేసికొనాలి. 112

అందుచే సంధి చేసికొనేందుకు చిత్రవర్ణుడివద్దకు పోదాము. ఆ ప్రభువు మహాప్రతాపసంపన్నుడు.

మూ. చక్రవాకో బ్రూతే - "యథా సన్ధానం కార్యం తద ప్యుచ్యతామ్". రాజహంసో బ్రూతే - "కతిప్రకారాః సన్ధీనాం సమ్భవన్తి ? గృధ్రో బ్రూతే - "కథయామి. శ్రూయతామ్-

శ్లో. బలీయసాఽభియుక్తస్తు నృపో నాన్యప్రతిక్రియః,
ఆపన్నః సన్ధి మన్విచ్ఛేత్ కుర్వాణః కాలయాపనమ్. 113

అను. చక్రవాకం - "సంధిని ఎలా చేయాలో అదియూ తెల్పండి" అని అడిగింది. రాజహంసుడు - "సంధిభేదాలు వివరించండి" అని అడిగాడు.

గ్రద్ధ ఇలా చెప్పింది- "చెప్పుతున్నాడు, వినండి"
బలవంతుడైన శత్రువుచే ఆక్రమింపబడి ఆపదలో ఉండే రాజు వేఱే మార్గం తోచనప్పుడు కాలయాపనకై (ఆక్రమణకర్తఅయిన భూపాలుడితో) సంధి చేసికొనాలి. 113

శ్లో. కపాల ఉపహారశ్చ సన్తానః సఙ్గత స్తథా,
ఉపన్యాసః ప్రతీకారః సంయోగః పురుషాన్తరః. 114

శ్లో. అదృష్టనర ఆదిష్ట ఆత్మాదిష్ట ఉపగ్రహః,
పరిక్రియ స్తథోచ్ఛిన్న స్తథా చ పరభూషణః. 115

శ్లో. స్కన్ధోపనేయః సన్ధిశ్చ షోడశైతే ప్రకీర్తితాః,
ఇతి షోడశకం ప్రాహుః సన్ధిం సన్ధివిచక్షణాః. 116

అను. సంధుల లక్షణాల నెఱింగిన శాస్త్రజ్ఞులు సంధులను పదునారు విధములుగా విభజించారు. వాటి నామములు-

1 కపాలం, 2 ఉపహారం, 3 సంతానం, 4 సంగతం, 5 ఉపన్యాసం

6 ప్రతీకారం, 7 సంయోగం, 8 పురుషాంతరం, 9 అదృష్టనరం, 10 ఆదిష్టం, 11 ఆత్మాదిష్టం, 12 ఉపగ్రహం, 13 పరిక్రియ, 14 ఉచ్ఛిన్నం, 15 పరభూషణం, 16 స్కంధోపనేయం.

మూ. అథ తేషాం లక్షణాని కథ్యన్తే-

శ్లో. కపాలసన్ధి ర్విజ్ఞేయః కేవలం సమసన్ధితః,
సంప్రదానా ద్భవతి య ఉపహారః స ఉచ్యతే. 117

శ్లో. సన్తానసన్ధి ర్విజ్ఞేయో దారికాదానపూర్వకః,
సద్భిస్తు సఙ్గతః సన్ధి ర్మైత్రీపూర్వ ఉదాహృతః. 118

శ్లో. యావదాయుఃప్రమాణస్తు సమానార్థప్రయోజనః,
సమ్పత్తౌ వా విపత్తౌ వా కారణై ర్యో న భిద్యతే. 119

శ్లో. సఙ్గతః సన్ధిరేవాయం ప్రకృష్టత్వాత్ సువర్ణవత్,
తథాఽన్యైః సన్ధికుశలైః 'కాఞ్చనః' సముదాహృతః. 120

శ్లో. ఆత్మకార్యస్య సిద్ధిన్తు సముద్దిశ్య క్రియేత యః,
స ఉపన్యాసకుశలై రుపన్యాస ఉదాహృతః. 121

అను. ఇక ఆ సంధుల లక్షణాలు చెప్పబడుతూ ఉన్నాయి-

1. **కపాలసంధి**- కపాలద్వయసంయోగంచే ఘట మేర్పడినట్లు సమానబలులైన ఇరువురు రాజులకు గల్గే సంధి. 117

2. **ఉపహారసంధి**- పన్ను, కానుకలు మొదలైనవాటి ద్వారా గల్గే సంధి.

3. **సంతానసంధి**- శత్రువునకు కన్యను ఇచ్చి చేసుకొనే సంధి. 118

4. **సంగతసంధి** - సజ్జనులందు మైత్రీభావంచే గల్గే సంధి.

ఈ సంధి సమానార్థప్రయోజనాలు గలదౌటచే యావజ్జీవితం సంపదలోనూ, విపత్తులోనూ ఇంకా ఇతరమైన ఏ స్థితిలోనూ, ఏలాంటి కారణాల వల్లనూ చెడిపోదు. ఈ సంగతసంధియే బంగారంవలె (కాంచనం మాదిరి)

శ్రేష్ఠమైనది అవడంతో సంధిశాస్త్రవేత్తలచే 'కాంచనసంధి' అనే నామాంతరంచే పిలువబడుతూంది. 118-120

5. **ఉపన్యాసనంధి**- తన కార్యసిద్ధికై చేసుకొనే సంధి. 121

శ్లో. మయాఽస్యోపకృతం పూర్వం మమాఽప్యేష కరిష్యతి,
ఇతి యః క్రియతే సన్ధిః ప్రతీకారః స ఉచ్యతే. 122

శ్లో. ఉపకారం కరోమ్యస్య మమాఽప్యేష కరిష్యతి,
అయఞ్చాపి ప్రతీకారో రామసుగ్రీవయోరివ. 123

శ్లో. ఏకార్థాం సమ్య గుద్దిశ్య క్రియాం యత్ర హి గచ్ఛతి,
సుసంహితప్రయాణస్తు స చ సంయోగ ఉచ్యతే. 124

శ్లో. ఆవయో ర్యోధముఖ్యైస్తు మదర్థః సాధ్యతామితి,
యస్మిన్ పణస్తు క్రియతే స సన్ధిః పురుషాన్తరః. 125

6. **ప్రతీకారసంధి** – 'నేను ఇతడికి మేలు చేశాను. నాకూ ఇతను మేలు చేస్తాడు' అనే భావంతో చేసే సంధి. 122

లేక-'నేను ఇతడికి మేలు చేస్తున్నాను. నాకు ఇతను మేలుచేస్తాడు'. అనే భావం-రామసుగ్రీవులవలె చేసే సంధి. 123

(రెండింటికీ భేదం- భూతకాలం-వర్తమానకాలం అని గ్రహించాలి.)

7. **సంయోగసంధి**- ఏకప్రయోజనాన్ని చక్కగా లక్ష్యం చేసుకొని సంఘటితమైన జైత్రయాత్రకై గావించుకొనే సంధి. అనగా- అనేకులుగానీ లేక ఇరువురుగాని ప్రభువులు ఏకలక్ష్యసాధనకై జైత్రయాత్ర చేస్తూ గావించుకొన్న సంధి సంయోగసంధి అని భావం. 124

8. **పురుషాంతరసంధి** - 'మావారూ మీవారూ అయిన సైనికశ్రేష్ఠులు, పరస్పరం సంప్రదిస్తూ మన కార్యాలు సాధింతురు గాక'-అనే భావంతో చేసుకొనే సంధి. (ఇచ్చట ముఖ్యులైన ప్రభువులు సంధి ఒడంబడికలో లేరు. వారి ప్రతినిధులైన యోధశ్రేష్ఠులు గలరు. అందుచే పురుషాంతరసంధి అయింది.) 125

శ్లో. 'త్వయైకేన మదీయోఽర్థః సమ్ప్రసాధ్యస్త్వసా'వితి,
యత్ర శత్రుః పణం కుర్యాత్ సోఽదృష్టపురుషః స్మృతః. 126

శ్లో. యత్ర భూమ్యేకదేశేన పణే న రిపు రూర్జితః,
సన్ధీయతే సన్ధివిద్భిః స చాదృష్ట ఇతీరితః. 127

శ్లో. స్వసైన్యేన తు సన్ధాన మాత్మాదిష్ట ఉదాహృతః,
క్రియతే ప్రాణరక్షార్థం సర్వదానా దుపగ్రహః. 128

శ్లో. కోశాంశేనాఽర్ధకోశేన సర్వకోశేన వా పునః,
శిష్టస్య ప్రాణరక్షార్థం పరిక్రయ ఉదాహృతః. 129

అను.

9. **అదృష్టపురుష (అదృష్టనర) సంధి** - 'నీవు ఒక్కడవే నా యీ పనిని పూర్తి చేయాలి—అని శత్రువు షరతు ఉంచి విధించే సంధి. 126

10. **ఆదిష్టసంధి** - బలవంతుడైన శత్రువునకు రాజ్యంలో కొంతభాగం ఇచ్చి చేసుకొనే సంధి. 127

11. **ఆత్మాదిష్టసంధి** - తన సైన్యంలో కొంత సైన్యాన్ని ఇచ్చి చేసికొనే సంధి. 128

12. **ఉపగ్రహసంధి** - తన ప్రాణరక్షణకై సర్వం అర్పించి చేసుకొనే సంధి.

13. **పరిక్రియసంధి** - శత్రువు ఆక్రమించగా మిగిలిన రాజ్యాన్ని రక్షించుకొనేందుకై ధనాగారంలో కొంతభాగంగానీ, సగంగానీ, పూర్తిగా గానీ ధనాన్ని శత్రువునకు సమర్పించి చేసుకొనే సంధి.

శ్లో. భువాం సారవతీనాం తు దానా దుచ్ఛిన్న ఉచ్యతే,
భూమ్యుత్థఫలదానేన సర్వేణ పరభూషణః. 130

పరిచ్ఛిన్నం ఫలం యత్ర ప్రతిస్కన్ధేన దీయతే,
స్కన్ధోపనేయం తం ప్రాహుః సన్ధిం సన్ధివిచక్షణాః. 131

14. **ఉచ్ఛిన్నసంధి** - సారవంతమైన భూములను శత్రువునకు ఇచ్చి చేసుకొనే సంధి. 130

15. **పరభూషణసంధి**- భూమినుండి లభించే ఫలితం సర్వం అర్పించే విధంగా చేసుకొనే సంధి. 130

16. స్కంధోపనేయసంధి - కిస్తుల రూపంగా పరిమితరూపంలో ధాన్యాది ఫలితం ఇచ్చి చేసుకొనే సంధి. 131

శ్లో. పరస్పరోపకారస్తు మైత్రీ సమ్బన్ధక స్తథా,
ఉపహారశ్చ విజ్ఞేయా శ్చత్వారశ్చైవ సన్ధయః. 132

ఏక ఏవోపహారస్తు సన్ధిరేవ మతో మమ,
ఉపహారవిభేదాస్తు సర్వే మైత్రవివర్జితాః. 133

అభియోక్తా బలీయస్త్వా దలబ్ధ్వా న నివర్తతే,
ఉపహారాదృతే తస్మాత్ సన్ధిరన్యో న విద్యతే". 134

అను. మరియూ, పరస్పరోపకారం - మైత్రి - బాంధవ్యాదిసంబంధం - ధనాదిప్రదానం- అని సంధులు నాల్గువిధాలుగా ఉన్నాయి. 132

ఈ నాల్గింటిలో మైత్రికంటె భిన్నములైన మూడు సంధులు (ఉపకార-బాంధవ్య-ఉపహారాలు- అనే మూడు) ఉపహారం అనే ఒకే సంధిలోని భేదాలు అనియే నా అభిప్రాయం. 133

వివరణ- ఉపహారం అనగా కానుకగా సమర్పించడం. అది ఉపకారం కావచ్చు. కన్యాదానాది బాంధవ్యం కావచ్చు. రత్నాది ధనోపహారం కావచ్చు. కనుక, మైత్రీతరాలైన మూడు ఉపహారాన్తర్గతాలైనవి అని భావం.

దండయాత్ర చేసినవాడు బలవంతుడు అవడంతో ఏదేని ఉపహారం (ధనాదిక సమర్పణ) లేక మరలడు. అందువల్ల ఇచ్చట ఉపహారం విడిచి అన్యమైన సంధి పొసగదు." 134

మూ. రాజాహ- 'భవన్తో మహాన్తః పణ్డితాశ్చ. తదత్రాఽ

స్మాకం యథాకార్య ముపదిశ్యతామ్'. దూరదర్శీ బ్రూతే-'ఆః! కిమేవ ముచ్యతే ?

శ్లో. ఆధి-వ్యాధి-పరీతాపా దద్య శ్వో వా వినాశితే,
కో హి నామ శరీరాయ ధర్మాఽపేతం సమాచరేత్. 136

శ్లో. వాతాభ్రవిభ్రమ మిదం వసుధాధిపత్య
మాపాతమాత్రమధురో విషయోపభోగః,
ప్రాణాస్తృణాగ్ర జలబిన్దు సమానలోలా
ధర్మః సఖా పరమహో పరలోకయానే. 137

అను. రాజు (హిరణ్యగర్భుడు) ఇలా అన్నాడు- 'తాము మహాత్ములు, పండితులుగూడ. అందువల్ల ఈ విషయంలో ఎలా చేయాలో ఉపదేశించండి.' అందుకు దూరదర్శి ఇలా చెప్పాడు-

'ఆఁ! ఎందుకు ఇలా అంటున్నారు? మానసిక దుఃఖాలవల్లా శారీరక రోగాది బాధలవల్లా నేడో రేపో నశించే ఈ శరీరానికై ధర్మవిరుద్ధమైన కార్యాన్ని ఎవరు చేస్తారు ? 135

రాజ్యాధికారం గాలిచే చెదరగొట్టబడిన మేఘం వలె క్షణికవిలాసం గలది. విషయసుఖాలు తాత్కాలికమైన ఆనందాన్ని గల్గిస్తాయి. ప్రాణాలు గడ్డిపఱకపై బడిన మంచుబొట్లవలె చంచలమైనవి. పరలోకప్రయాణంలో ధర్మమే తోడుగా ఉండే మిత్రుడు. ఆహా ఏమి అద్భుతం! 136

శ్లో. జలాన్తశ్చన్ద్రచపలం జీవితం ఖలు దేహినామ్,
తథావిధ మితి జ్ఞాత్వా శశ్వ త్కల్యాణ మాచరేత్. 137

శ్లో. మృగతృష్ణాసమం వీక్ష్య సంసారం క్షణభఙ్గురమ్,
సజ్జనైః సఙ్గతం కుర్యాద్ ధర్మాయ చ సుఖాయ చ. 138

తన్మమ సమ్మతేన తదేవ క్రియతామ్. యతః-

శ్లో. అశ్వమేధసహస్రాణి సత్యఞ్చ తులయా ధృతమ్,
అశ్వమేధసహస్రాద్ధి సత్యమేవాతిరిచ్యతే. 139

అతః సత్యాభిదానదివ్యపురస్సర మనయో ర్భూపాలయోః కాఞ్చనాభిధానః సన్ధి ర్విధీయతామ్" ఇతి.

అను. ప్రాణుల జీవితం నీటిలో ప్రతిఫలించిన చంద్రబింబంవలె చంచలమైంది గదా. అది గుర్తించి నిత్యం మంచిపనులనే చేయాలి. 137

ఈ ప్రపంచం ఎండమావివలె క్షణికం అని తలంచి నిత్యసుఖాన్ని గుర్తించి ధర్మోపార్జనకై సజ్జనులతో మైత్రి చేయాలి. 138

అందుచే దానినే (సత్యమైన ధార్మికసంధినే) చేయడం మంచిది. ఇదియే నాకు సమ్మతం. ఏలనన-

త్రాసులో వెయ్యి అశ్వమేధయాగాల పుణ్యఫలాన్ని ఒక ప్రక్కనూ, సత్యాన్ని (సత్యపుణ్యఫలాన్ని) వేఱొక ప్రక్కను ఉంచి తూకం వేసినచో సత్యం ప్రక్కనే ముల్లు మూపును. 139

కనుక సత్యాన్ని ప్రమాణంగా (సాక్షిగా) శపథం చేసి ఈ ప్రభువులకు ఇరువురకు 'కాంచనం' (సంగతం) అనే పేరుగల సంధిని చేయాలి."

మూ. సర్వజ్ఞో బ్రూతే- 'ఏవమస్తు.' తతో రాజహంసేన రాజ్ఞా వస్త్రాలఙ్కారోపహారైః స మన్త్రీ దూరదర్శీ పూజితః ప్రహృష్టమనా శ్చక్రవాకం గృహీత్వా రాజ్ఞో మయూరస్య సంనిధానం గతః. తత్ర చిత్రవర్ణేన రాజ్ఞా సర్వజ్ఞో గృధ్రవచనాద్ బహుమానపురస్సరం సమ్పూజిత స్తథావిధం సన్ధిం స్వీకృత్య రాజహంససమీపం ప్రస్థాపితః.

దూరదర్శీ బ్రూతే- 'దేవ! సిద్ధం నః సమీహితమ్. ఇదానీం స్వస్థానమేవ విన్ధ్యాచలం వ్యావృత్య ప్రతిగమ్యతామ్' ఇతి.

అథ సర్వే స్వస్థానం ప్రాప్య మనోఽభిలషితం ఫలం ప్రాప్నువ న్నితి.

**అను.** సర్వజ్ఞుడు- 'అలాగే కానిమ్ము' అన్నాడు. పిమ్మట ప్రభువైన **రాజహంసుడు వస్త్రభూషణాదు**లైన కానుకలచే మంత్రి అయిన **దూరదర్శి**ని సన్మానించాడు. అందులకు దూరదర్శి సంతుష్టుడై, రాజహంసుడి మంత్రి అయిన చక్రవాకమును తన వెంట తీసుకొని తనప్రభువైన చిత్రవర్ణుడి (మయూరం) వద్దకు

పోయాడు. జరిగిన విషయం తెల్పాడు. అంతట చిత్రవర్ణుడు తన మంత్రి వాక్కును అనుసరించి ఆ విధమైన సంధికి సమ్మతించాడు. సర్వజ్ఞుణ్ణి (రాజ హంసుడి మంత్రి అయిన చక్రవాకాన్ని) బహుమానాదికంచేతనూ సముచితసంభా షణచేతను సంతోషపఱచాడు. సాదరంగా రాజహంసుడివద్దకు పంపాడు.

పిమ్మట దూరదర్శి తన ప్రభువైన చిత్రవర్ణుడితో ఇలా అన్నాడు- 'దేవా! మన కోరిక సిద్ధించింది. ఇప్పుడు మనదేశమైన వింధ్యపర్వతానికి పోవడం శుభం'.

తర్వాత అందరు తమ తమ నెలవులకు పోయారు. అభీష్టసిద్ధిని పొంది సుఖంగా ఉండసాగారు.

మూ. విష్ణుశర్మణోక్తమ్-'అపరం కిం కథయామి తదుచ్యతామ్' రాజపుత్రా ఊచుః- 'ఆర్య! తవ ప్రసాదాత్ సకలరాజ్యవ్యవహారాఙ్గం జ్ఞాతమ్. తతః సుఖినో భూతా వయమ్.' విష్ణుశర్మోవాచ- 'యద్యప్యేవం తథాప్యపర మపీద మస్తు-

శ్లో. సన్ధిః సర్వమహీభుజాం విజయినా మస్తు ప్రమోదః సదా
సన్తః సన్తు నిరాపదః, సుకృతినాం కీర్తిశ్చిరం వర్ధతామ్,
నీతి ర్వారవిలాసినీవ సతతం వక్షఃస్థలే సంస్థితా
వక్త్రం చుమ్బతు మన్త్రిణా మహ రహ ర్భూయా న్మహానుత్సవః.

అను. విష్ణుశర్మ ఇలా అడిగాడు- 'ఇక ఏమి చెప్పాలో తెలుపండి'. అందుకు రాజపుత్రులు- 'ఆర్యా! తమ అనుగ్రహంచే రాజ్యవ్యవహారానికి సంబం ధించిన అన్ని అంగాలను గ్రహించాము. అందువల్ల సంతోషసుఖాలు పొందాము' అన్నారు.

అంతట విష్ణుశర్మ మరల ఇలా చెప్పాడు- 'అది అంతే. అయినా ఈ క్రింది శుభం సైతం గల్గుగాక-

'విజయం పొందిన ప్రభువులు అందరు సంధిని పొందుదురుగాక. నిత్యం ఆనందం వరలుగాక. సజ్జనులు ఆపదలు లేనివారై ఉందురుగాక. సుకృతులు (పుణ్యులు-సత్కార్యకర్తలు) శాశ్వతకీర్తిచే వర్ధిల్లుదురుగాక. మంత్రుల హృద యంలో నిత్యం వారకాంతవలె విరాజిల్లే రాజనీతి వారి వాక్కున వసించుగాక.

(వారి మోమును చుంబించుగాక. మరియు ప్రతిదినం మహత్తరమైన ఉత్సవం గల్గుగాక. 140

మూ. అన్యచ్చాఽస్తు-

శ్లో. ప్రాలేయాద్రేస్సుతాయాః ప్రణయనివసతిశ్చన్ద్రమౌలిస్స యావద్
యావల్లక్ష్మీ ర్మురారే ర్జలద ఇవ తటిన్మానసే విస్ఫురన్తి,
యావత్ స్వర్ణాచలోఽయం దవదహనసమో యస్య సూర్యః స్ఫులిఙ్గ
స్తావన్నారాయణేన ప్రచరతు రచితస్సఙ్గ్రహోఽయం కథానామ్.

అను. మరియూ ఇలా అగుగాక. పార్వతీదేవి ప్రేమకు నివాసభూమియైన చంద్రశేఖరుడు ఉండినంతకాలం, మేఘంలో మెఱుపుతీగవలె శ్రీమహావిష్ణుమానసంలో లక్ష్మీదేవి విరాజిల్లునంతకాలం, సూర్యభగవానుడు విస్ఫులింగంగా భాసిల్లే దావాగ్నివంటి మేరుపర్వతం ఉన్నంతకాలం నారాయణపండితుడు రచించిన ఈ కథాసంగ్రహం ప్రచారంలో ఉండుగాక !

మూ. కిఞ్చ-

శ్లో. ఉర్వీ ముద్దామసస్యాం జనయతు విసృజన్ వాసవో వృష్టిమిష్టా
మిష్టైస్త్రై ర్విష్టపానాం విదధతు విధివత్ప్రీణనం విప్రముఖ్యాః,
ఆ కల్పాన్తఞ్చ భూయాత్ సముపచితసుఖః సఙ్గమః సజ్జనానాం
నిశ్శేషం యాన్తు శాన్తిం పిశునజనగిరో దుర్జయా వజ్రలేపాః.142

అను. ఇంద్రుడు అనుకూలవర్షదాతయై భూమాతను సమృద్ధసస్యయుతను జేయుగాక ! విప్రులు ఆ యా యాగాదులను చేసి దేవతలను సంతుష్టులను జేతురుగాక. సజ్జనమైత్రి కల్పాంతంవరకు సమృద్ధ సుఖాల నిచ్చుగాక. అదమ్యాలూ, వజ్రలేపనం మాదిరి కఠోరాలు అయిన దుష్టుల వాక్కులు నిశ్శేషంగా శాంతించుగాక. 142

మూ. అపరఞ్చ-

శ్లో. శ్రీమాన్ ధవలచన్ద్రోఽసౌ జీయాన్మాణ్డలికో రిపూన్,
యేనాఽయం సఙ్గ్రహో యత్నా ల్లేఖయిత్వా ప్రచారితః. 143

ఇతి శ్రీహితోపదేశే సన్ధి ర్నామ చతుర్థః
కథాసఙ్గ్రహః.

సమాప్తశ్చాయం హితోపదేశః.

అను. మరియూ, గుజరాతులోని మాండలికరాజు అయిన ధవలచంద్ర భూపాలుడు శత్రువులను జయించుగాక. ఆ ప్రభువు మిక్కిలి ప్రయత్నపూర్వకంగా ఈ కథాసంగ్రహం వ్రాయించి ప్రచారం చేశాడు. 143

ఇది హితోపదేశంలో సంధి అనే నాల్గవ కథాసంగ్రహం
శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి రచితమైన ఆంధ్రానువాదయుతం సమాప్తం.
శుభం భూయాత్.



# అకారాది క్రమ శ్లోక సూచిక